రేకు: 0101-1 సామంతం సంపుటం: 07-001

పల్లవి: అతివ నీయంగములె అతను తాపపు మాటు
తతినొకటికొకటికని దైవమే సేసె

చ. 1: నిట్టూర్పుగాలికిని నీలాహివేణికిని
నెట్టనను విరహంపునెగులేఁటికే
చుట్టుఁ గన్నీటికిని చూపుఁజాతకములవె
తొట్టి యిఁక మీఁదనవి తుదమీఱఁ గలవా

చ. 2: చిగిరింత పులకలకు జిగిఁబలుకుఁగోవిలదె
పగటు మరుఘాతలకు వెగటేఁటికే
ఆగడుఁ దాపపురవికి నారనే రాహువదె
తెగి యిందుమీఁదనది దిష్టించఁగలదా

చ. 3: రతి మనసు మఱపులకు రమణి నీ గోరదివొ
ప్రతిమరునియుద్ధముల భ్రమతేఁటికే
యితవైన శ్రీవేంకటేశ్వరుఁడు నినుఁగూడె
చతురతల యివి నిన్ను సాధించఁగలవా

రేకు: 0101-2 రామక్రియ సంపుటం: 07-002

పల్లవి: ఎఱఁగనా నీగుణాలు యింతక తొల్లి
విఱుగని నామనసే వెట్టిఁజేసెఁ గాక

చ. 1: సేసపాల పెండ్లివారు సేనలుండఁగాను
ఆసపడి నాతో నవ్వేవంతే కాదా
యీ సుద్దులకెకా నే నీయింటికి రాను వెఱతు
దోసకారి చెలికత్తె తోడితెచ్చెఁ గాని

చ. 2: తఱితో వరుసవారు దగ్గరి కాచుకుండఁగా
నఱిముఱిఁ జేయివట్టేవంతె కాదా
యెఱిఁగుండి మానక నేనిట్టె మాటాడఁదగునా
పఱచుగూఁటి చిలుక పలికించెఁ గాని

చ. 3: కప్పురపుఁబళ్ళవారు కాచుకిట్టే వుండఁగాను
అప్పుడే నన్నుఁ గూడితివంతె కాదా
నెప్పున శ్రీ వేంకటేశ నేనూ నీవూ నొక్కటే
యిప్పుడే వీరిడి మరుఁడింత సేసెఁ గాని

రేకు: 0101-3 నాదరామక్రియ సంపుటం: 07-003

పల్లవి: దేవరవైతివిన్నిటా దేవులాయనాపె నీకు
ఆవల మిమ్మిద్దరినేమని పొగడేమయ్యా

చ. 1: పున్నమ వెన్నెలజోడు పూవులలోని వాసన
ఉన్నతిమీరి నీ వురమెక్కెను
మన్నన సంపద రాశి మదనుని పుట్టినిల్లు
వన్నెతో నీకు రాణివాసమాయను

చ. 2: పాల జలనిధి తేట బంగారు లోపలి కళ
కీలితముగా నీకెంగేలు వట్టెను
మేలులో సాకారము మించులోకము భాగ్యము
తాలిమితో నీకు మూలధనమాయను

చ. 3: అందరిని గన్నతల్లి ఆదిమూలమైన లక్ష్మి
కందువ నీ ముంజేతి కంకణమాయను
యిందునె శ్రీవేంకటేశ యీపె సర్వ మోహనము
కందు వాయ నిన్నుఁగూడె కలిమెల్లా మెరసె

రేకు: 0101-4 సామంతం సంపుటం: 07-004

పల్లవి: నీవెట్టితనమెంతునో నిన్నుఁ బుత్తెంచినట్టి
ఆవెట్టితనమెంతునో అమ్మరో నేఁడు

చ. 1: అక్క విలిచీనంటా నాతఁడూ కొలువుండఁగా
ఇక్కడఁ బిలువ వచ్చేవింత యేఁటికే
చిక్కించుక యింటిలోనే చెల్లినట్లు శేసుఁగాక
తక్కి మీయేలికసాని తగవేఁటి తగవే

చ. 2: అప్పటిఁ బోదుపుగాని అందాఁకా విచ్చేయుమంటా
దుప్పటి కొంగు వట్టేవు దొడ్డదానవే
చెప్పి తన వూడిగెపు చెలిచే నింత సేయించె
తప్పని మీయాపె దొరతనమేఁటితనమే

చ. 3: ఆసలు చూపి మాటాడి ఆనవెట్టి సన్నసేసి
బేసబెల్లితనమునఁ బెనఁగేవవునే
యీసుల శ్రీ వేంకటేశు నింత సేయించి తాఁగూడె
వాసితో మీదొరసాని వరుసేఁటి వరుసే

రేకు: 0101-5 శ్రీరాగం సంపుటం: 07-005

పల్లవి: ఆదట దయదలఁచి యాదరించినంతె చాలు
సోదించి యాతని నంత జోలిఁబెట్టఁ జాలను

చ. 1: చనవు మెఱయఁబోతే స్వతంత్రము చూపవలె
మనవి చెప్పఁగఁబోతే మారు మాట్లాడవలె
ననుపు నడపఁబోతే నగి మందెమేళమౌను
ఘనుఁడాతనికి నేనింత గాసిఁబెట్టు నోపను

చ. 2: బలిమి సేయఁగఁబోతే పట్టి పెనఁగఁగవలె
చలము సాధించఁబోతే జంకించవలె
అలిగి సొలయఁబోతే అన్నియునుఁ దలఁపౌను
చెలువుఁడాతనినంత చిమ్మిరేఁచనోపను

చ. 3: మేలములాడఁగఁబోతే మీఁదఁ జెయివేయవలె
నాలిమొగదాకిరైతే నాయంత నేనుండవలె
ఈలీల శ్రీ వేంకటేశుఁడింతలోనే నన్నుఁగూడె
ఆలరి యాతనినంత అలయించనోపను

రేకు: 0101-6 గౌళ సంపుటం: 07-006

పల్లవి: అందుకే వేగిరమయ్యీనప్పటినుండి
గొందికిట్టే రాఁడుసుమ్మీ కొంకు విడిపింతును

చ. 1: తప్పక చూచినవాఁడు దగ్గరి రాఁడు సుమ్మీ
కప్పురము నోరికిచ్చి కౌఁగిలింతును
అప్పుడె నవ్వేటివాఁడు ఆయములంటఁడు సుమ్మీ
చిప్పిల మెయి చెమరించఁ జేతును

చ. 2: చేకొని మాటాడేవాఁడు చెఱఁగు వట్టఁడు సుమ్మీ
దాకొనఁ బెదవిని ముద్రలు వేతును
యీకడ నింతటివాఁడు యెదురుపడఁడు సుమ్మీ
లోకమెల్లా మెచ్చనిట్టే లోఁగొందును

చ. 3: కాఁకలు చల్లేటివాఁడు కందువ దీర్చఁడు సుమ్మీ
మాఁకువలె మేనెల్లా మఱపింతును
యేఁకటతో శ్రీవేంకటేశుఁడిట్టె నన్నుఁ గూడె
పూఁకొనఁడు సుమ్మీ పంతాలొప్పగింతును

రేకు: 0102-1 మంగళకౌశిక సంపుటం: 07-007

పల్లవి: ఏల తలవంచుకొనేరిద్దరును నన్నుఁ జూచి
తాలిమినద్దరిపాటు తగదు నావల్ల

చ. 1: ఇక్కడ నీ వేళ చూడనింతి నంపి మఱికాక
గక్కన నేవచ్చినదే కల్ల నావల్ల
మక్కువ నదియుఁగాక మంచముపై సోదించక
మొక్కళానఁ గూచుండుటె మోసము నావల్ల

చ. 2: అందంద మాటలాడే అలబలము చూడక
కందువఁ దెరదీసుటే కల్ల నావల్ల
దిందుపడూరకుండక దీపమెగసన దొబ్బి
ముందు నేనే నవ్వినది మోసము నావల్ల

చ. 3: ఇన్నాళ్ళువలెనె యంటా నీపెకు వరుసియ్యక
కన్నళవిఁ గూడినదె కల్ల నావల్ల
యిన్నిటా శ్రీవేంకటేశ యిఁకనేల నే నిన్న
మొన్ననే రానిదియెల్లా మోసము నావల్ల

రేకు: 0102-2 సామంతం సంపుటం: 07-008

పల్లవి: ఇంత సేయఁగఁగదా యీడ వెల వెట్టితివి
కాంతుఁడవు నీవు మాణిక్యమువంటివాఁడవు

చ. 1: మచ్చరించఁగఁ గదా మనసు పట్టఁ దిరిగే
విచ్చకములాడుకంటె యిదె మేలు
కచ్చుపెట్టి బంగారము కరఁగక వన్నెలేదు
అచ్చముగ వోరి నీవు అటువంటివాఁడవు

చ. 2: రాకుండఁగ నీవే నన్ను రతికిఁ బిలిచితివి
యేకమై వుండుటకంటె యిదె మేలు
మేకొని కస్తూరైనా మేదించక యెనయదు
ఆకడ నీవు వోరి అటువంటివాఁడవు

చ. 3: గుట్టుననుండఁగఁ గదా కూడితి శ్రీ వేంకటేశ
యిట్టునట్టు దూరుకంటె యిదె మేలు
చెట్టుమీఁది విరులైనా చేతులఁ గోయకరావు
అట్టెవోరి నీవు అటువంటివాఁడవు

రేకు: 0102-3 వరాళి సంపుటం: 07-009

పల్లవి: ఎరవా నీవు నాకు యిందుకే కాక
సరవితో నుండనా యీచలాలకే కాక

చ. 1: పంతమా నే నీకు బాగాలిచ్చేయందుకు
అంతలో నీవాపెకిచ్చేవని కాక
చెంతల నీకేమి సేవ చేసినాను దోసమా
కొంత నీతోఁగూడి యాపె కూచుండఁగాఁగాక

చ. 2: నలువంక నేనీతో నవ్వకుండేదాననా
సొలసి యాపె యీదిక్కు చూడఁగాఁ గాక
మలసి యప్పటి నీతో మాటాడఁ దగదా
వెలయ నీవద్దనాపె వినఁగాఁ గాక

చ. 3: యేమాయ నీపాదములిటు నేము పిసికితే
దోమటినాపెకాలు దొక్కఁగాఁ గాక
నేమాన శ్రీ వేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
మోముచూతునా యాపెను మొక్కించఁగాఁ గాక

రేకు: 0102-4 ముఖారి సంపుటం: 07-010

పల్లవి: నిండనానలు వెట్టుకు నీ వంతాను
అండనితశత్రుఁడ నీయాఁటిఁ జిక్కితిరా

చ. 1: కప్పురపు ధూళిదెచ్చి కన్నులనిండాఁ జల్లి
అప్పుడే యాపెఁ గూడితివౌరా నీవు
తప్పులే కూడైనట్టి తాటోటుకాఁడవు నీతో
యిప్పుడు నమ్మి నీ పొందులెట్టు నేఁజేసితిరా

చ. 2: చేరెఁడు తట్టుపుణుఁగు చెవులనిండాఁ బోసి
యీరీతి మాటలాడితి వింతితోడను
తీరువడ్డ పెనులోకదిమ్మరివి నీకు నేను
ఆరితేరి నేఁడు నీకు నాలనెట్లైతిరా

చ. 3: కౌఁగిట నన్నుబిగించి కళ వట్టించి యాపెతో
చేఁగదేర నవ్వితివి శ్రీ వేంకటేశ
దాఁగిలి ముచ్చిములాడే దాయగాఁడవైన నిన్ను
తోఁగి చూచెట్టు నీరతిదొమ్మికి లోనైతిరా

రేకు: 0102-5 రామక్రియ సంపుటం: 07-011

పల్లవి: అంగన యెట్టుండినా నమరుఁగాక
సంగతే నీకు నాపె సాటికిఁ బెనఁగను

చ. 1: తనకుఁ బోఁదైనచోట తగిలి మాటాడకున్న
మనుజుఁడా వాఁడు పెద్దమాకు గాక
చనవునఁ బెనఁగఁగా సమ్మతించకుండితేను
ఘనత యేది? చులకఁదనమే కాక

చ. 2: చెల్లుబడి గలచోట సిగ్గులు విడువకున్న
బల్లిదుఁడా వాఁడు కడు పందగాక
వెల్లివిరి నవ్వఁగాను వీడుదోళ్ళాడకున్న
చల్లేటి వలపులేవి? సటలింతే కాక

చ. 3: తారుకాణలైనచోట తమకించి కూడకున్న
చేరఁగ జాణఁడా గోడచేరుపు గాక
యీరీతి శ్రీ వేంకటేశ యిట్టె రఘునాథుఁడవై
కూరిమిఁ గూడితివిది కొత్తలింతే కాక

రేకు: 0102-6 ముఖారి సంపుటం: 07-012

పల్లవి: అంది వాదులకు వచ్చేవదేమోపే
మంద పసులు దవ్వేఁగె మమ్ము విడవోపే

చ. 1: పేయ చొరఁగానె యిల్లు బెంబడిఁ జొచ్చితిఁగాక
ఆయెడ నన్నేల తిట్టేవదే మోపె
చాయలనా పుట్టుచెండు చవి నేనంటితిఁగాక
మాయల నీ చన్నులంట మాకేలవోపే

చ. 2: బచ్చెన మంచము దాఁకి పైఁబడితి నీ వుండేది
యచ్చట నెవ్వఁడెఱుఁగునదేమోపే
పెచ్చుఁబిల్లఁగోవెనుచుఁ బెదవిమోఁపితిఁగాక
పచ్చి నీమోవనెఱిఁగే పని మాకేలోపే

చ. 3: ముందర నీతొడదాఁకి మొలగంట వాఁగెఁగాక
అందుకు నన్నంటఁబట్టేవదేమోపే
అంది శ్రీ వేంకటపతి ననక తోదోపులనె
సందడిఁ బెనఁగితివి చాలదా వోపే

రేకు: 0103-1 ఆహిరి సంపుటం: 07-013

పల్లవి: ఏల మమ్ము గేలిసేసేరింతులాల
మేలుమీఁది దాననింత మెచ్చఁగదరమ్మా

చ. 1: చలము సాదించఁబోతే జవ్వన మాఁపఁగరాదు
పలుకకుండేనంటే ఫలము లేదు
చెలువుఁడెదుట వచ్చి చెయి వట్టుకున్నవాఁడు
తొలఁగఁదోయఁగరాక తూర నవ్వేనమ్మా

చ. 2: కోపగించుకొనఁబోతే కొసరఁగఁ జోటులేదు
చూపుల జంకించేనంటే సొగయదది
యేపున నితఁడు వీరెమిందమనుచున్నవాఁడు
పై పై నొదుగలేక భావించేనమ్మా

చ. 3: పంతములాడేనంటే పతితో బలము లేదు
వింత సేసుకుండేనంటే వేడుక లేదు
యింతలో శ్రీ వేంకటేశుఁడెమ్మెచూపినన్నుఁగూడె
చింతదీర వెరగుతోడి సిగ్గుపడేనమ్మా

రేకు: 0103-2 పాడి సంపుటం: 07-014

పల్లవి: ఎవ్వరెవ్వరి చిత్తాలు యెట్టుండునో
యివ్వల నీకు మొక్కేది యెట్టుండునో

చ. 1: పగట్ల నీతోఁ బలుమారు నవ్వఁగాను
యెగసెక్కెమని నీకు నెట్టుండునో
తగిలి నీవొద్దనట్టె దాయక పాయకుండఁగ
అగడుగ నేమడిగేనని వుండునో

చ. 2: చెంతల నీ చెక్కు నొక్కి సేవలు నేఁజేయఁబోతే
ఎంత బట్టడిది యని యెట్టుండునో
పొంతనే యాటపాటల పొద్దులు గడపితేను
యింత మాయదారి యని యెట్టుండునో

చ. 3: కాతరాన మాయింటికి గక్కనఁ బిలిచితేను
యేతులెంత సేసేనని యెట్టుండునో
ఆతుమై శ్రీ వేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యీాతగుమన్నన నాపై నెట్టుండునో

రేకు: 0103-3 వరాళి సంపుటం: 07-015

పల్లవి: ఏకతంబాయనిదె యిద్దరికి నొకచోట
యేకొలఁదిఁ బడునొ వలుపేమందునే

చ. 1: ననుపు గలవారికిని నవ్వకుండఁగరాదు
మనసులెనసిన తగులు మానరాదు
చనవు వెగ్గళమైన సరసముల కొదలేదు
తనివి దీరఁడు విభుఁడు తనకు నే నెదురా

చ. 2: మగలకును సతులకును మాటలాడక పోదు
మొగమోట గలచోట మొరఁగ రాదు
పగలేని తావుకును పంతంబు పనిలేదు
తగవులెంచీనతఁడు తనకు నే నెదురా

చ. 3: కూటములు గలయపుడు కొంకు గొసరే లేదు
పాటించి మొక్కఁగాఁ బదరఁదగదు
యీటుతో శ్రీ వేంక టేశుఁడిటు ననుఁ గలసి
తాటించి పొగడీని తనకు నే నెదురా

రేకు: 0103-4 సాళంగనాట సంపుటం: 07-016

పల్లవి: మాతోడి నవ్వులు మఱి యాల చే
చేత నెందురు చూచీనదె చెలియ

చ. 1: వలసిన యెడలకు వచ్చేదే మేలు
వలవని జోలికి వాదె మేలు
బలిమి సేయమిఁక పడఁతికడకు మ
మ్మెలమి నంపినా యెట్టైనా మేలు

చ. 2: మనసు వచ్చితే మాటాడుటే మేలు
ననుచకున్న మోనము మేలు
అనలేము నిన్నునాసపడినచెలిఁ
జెనకక నీవేమి సేసినా మేలు

చ. 3: పొందే కలిగిన భోగించుటే మేలు
కందిన యెడ నలుకలు మేలు
యిందులో శ్రీ వేంకటేశ కూడితివి
యిందుముఖికి నీకిదియే మేలు

రేకు: 0103-5 గౌళ సంపుటం: 07-017

పల్లవి: వేటే నేమూరకుండిన వెంగెమే కాదా
నీటుపైఁ గోపాలు చూప నీయంతవారమా

చ. 1: కొంగువట్టి నిన్నుఁ బేరుకొననైతినని దూరే
వెంగిలి నోరఁ బిలిచేదెగ్గు గాదా
కుంగని కుచాలు దాఁచుకొంటినంట నాడేవు
నింగిమోవఁ బెరుగఁగ నీ యంతవారమా

చ. 2: అంచ నీవొద్దఁ గూచుండనని యలిగేవు నీ
మంచము కాళ్ళుఁ దొక్కేది మదము గాదా
అంచు మోవనోరఁగఁగ ఆనుకోనైతిననేవు
నించిన కొండలు మోవ నీయంతవారమా

చ. 3: అమర నీతోఁ బెనఁగనైతినంటా గొణగేవు
చెమటమెయి నీపైమోవ సిబ్బితి గాదా
తమితో శ్రీ వేంకటేశ దక్కి నన్నుఁ గూడితివి
నెమకిప్రేమఁ గూడఁగ నీయంతవారమా

రేకు: 0103-6 రామక్రియ సంపుటం: 07-018

పల్లవి: వేడుక పడేముగాక వెంగెమాడేమా నిన్ను
వాడలో నాపెతో నేము వాదడిచేమా

చ. 1: ఏయింతికి వలతువు యిట్టె నిజమాడుమంటే
మాయలు సేసి మాటలు మఱపించేవు
ఆయము లెఱఁగ నేము అరుహులము గామా
చాయల నిన్నంతలోనే సాదించేమా

చ. 2: ఎంత చక్కనిది యాపె యిట్టె నేఁజూచేనంటే
దంతపు నవ్వుల జాణతనమాడేవు
ఇంతటి నీ మేలుచూడ యిందుకును దగమా
అంతలోనే నిన్ను పెద్ద ఆరడిఁ బెట్టేమా

చ. 3: ఏమని యడుగు నిన్ను యిట్టె నీ ప్రియురాలంటే
కామించి పరాకుసేసి కౌఁగిలించేవు
చేముంచి శ్రీ వేంకటేశ చేకొంటివిదె నన్ను
ఆమగువఁ దెచ్చుకొంటే అడ్డమాడేమా

రేకు: 0104-1 దేసాళం సంపుటం: 07-019

పల్లవి: అట్టె మీఁదనైనట్టులయ్యీఁ గాని
పట్టినదె పంతమై బలియఁగఁ జొచ్చును

చ. 1: మగవారిచేఁతలకు మానినులైనవారు
వెగట్లాడకుండరు వేయైనాను
అగపడి యెవ్వరైనా నారిచి తీరిచేమంటే
చిగురుఁ గొమ్మునుఁ చాఁగై చిమ్మిరేఁగఁజొచ్చును

చ. 2: వసమైనవారిమాట వలచి వచ్చినవారు
పిసరు మందెమేళాల పెంచకుండరు
అసమున నండవారు అందాలు సేసేమంటే
పిసికితే పసురై పిప్పిరేఁగఁజొచ్చును

చ. 3: సరసుల పొందులకు జాణలైన సతులెల్లా
ఒరసి సాదించకుండరొకమాటైనా
యిరవై శ్రీ వేంకటేశ యిదె నన్నుఁ గూడితివి
పెరరేఁగిన రతులు పెంటలుగాఁ జొచ్చును

రేకు: 0104-2 శ్రీరాగం సంపుటం: 07-020

పల్లవి: ఇచ్చకములాడరే యింతులాల
పచ్చి జవ్వన మింతలో పదను దీసీనా

చ. 1: ఏఁటికి విభుఁడు రాఁడొ యింటనట్టేవుండనీ
మాటలైనా నాడి రారె మగువలాల
తాఁట తూఁటలూనేల తావచ్చినట్టే వత్తము
పాటించిన నావలపు పండి పొల్లవొయ్యీనా

చ. 2: సొగిసి యెంతపరాకో జూజాలట్టే ఆడీని
మొగమైనాఁ జూచి రారె ముదితలాల
యెగసక్కేలిఁకనేల యేకమౌదమీతనితో
నగఁగానే సరసాలు నాని విరిసీనా

చ. 3: కాయమెంత యలసెనో కడుదప్పిదేరనీ
చేయెత్తి మొక్కియిన రారె చెలియలాల
యీయెడ శ్రీవేంకటేశుఁడేతెంచి తా నన్నుఁగూడె
కోయరాని కోరికలు కొలఁదినుండీనా

రేకు: 0104-3 సామంతం సంపుటం: 07-021

పల్లవి: మిక్కిలి నేర్పరి యలమేలుమంగ
అక్కర దీరిచి పతినల మేలుమంగ

చ. 1: కన్నులనె నవ్వునవ్వి కాంతునిఁ దప్పక చూచి
మిన్నక మాటాడీనలమేలుమంగ
సన్నలనె యాస రేఁచి జంకెన బొమ్మలు వంచి
అన్నువతోఁ గొసరీని యలమేలుమంగ

చ. 2: సారెకుఁ జెక్కులు నొక్కి సరుసనె కూచుండి
మేరలు మీరీ నలమేలుమంగ
గారవించి విభునికిఁ గప్పురవిడెమిచ్చి
యారతులెత్తీనదె యలమేలుమంగ

చ. 3: ఇచ్చకాలు సేసి సేసి యిక్కువలంటి యంటి
మెచ్చీనతని నలమేలుమంగ
చెచ్చెర కౌఁగిటఁ గూడి శ్రీ వేంకటేశ్వరుని
అచ్చముగానురమెక్కీ నలమేలుమంగ

రేకు: 0104-4 ఆహిరి సంపుటం: 07-022

పల్లవి: ఏమి భాగ్యముననో యిటు విచ్చేసితిగాక
వోమి నీయవసరము వొకరికినబ్బునా

చ. 1: కడు విరహినై నిన్నుఁ గన్నులఁ జూచేమంటేను
వడదేరి కొలువు చావడినుందువు
తడవి అక్కడికైన దగ్గరేనంటే నిన్ను
యెడసి నావంటివారు ఎందరైనా వత్తురు

చ. 2: పక్కన నే నీకు విన్నపము సేసుకొనేనంటే
యెక్కడ లేని పరాకు యెప్పుడు నీకు
చెక్కు వట్టి తీసి నిన్ను చేతనెచ్చరించేనంటే
వెక్కసాన నట్టివారు వేవేలు గలరు

చ. 3: పొరితెంచి నే నిన్ను బలిమిఁ గూడేనంటే
నేరుతు రందుకుఁ దగు నెపములెల్లా
కోరి శ్రీ వేంకటేశుఁడ కూడితివి నన్ను నిట్టె
యీరీతి నలమేల్మంగను యిందరుఁ జుట్టాలే

రేకు: 0104-5 సాళంగనాట సంపుటం: 07-023

పల్లవి: ఆతఁడు నీవు నొక్కటైతే నౌదురుగాక
యేతున మమ్మంటకు నేమెవ్వరిలోవారము

చ. 1: వంతులకుఁ బెనఁగేవు వద్దు సుమీ నీవు నాతో
యింత పోరితే నీవే యెఱుఁగుదువు
రంతుల నేనేమన్నా రాఁగఁజేసి దూరవద్దు
యెంతకెంత సేసేవు నే మెవ్వరిలో వారము

చ. 2: నేనున్నాడనే వుండేవు నీకిదేమే చలమా
కానీ లేవే మీఁదటెత్తు గనుకొనేవు
పూని మమ్ముురేఁచి వట్టి బూమెలు సేయవద్దు
యీ నేరుపులేఁటికి నే మెవ్వరిలోవారము

చ. 3: నన్నుఁ బేరుకొనకుమీ నాయముగాదు నీకు
చిన్నదానవు నేఁజాటి చెప్పితి నీకు
యెన్నికెతో శ్రీ వేంకటేశుఁడు నన్నుఁ గలనె
ఇన్నాళ్ళుదాఁకాను నే మెవ్వరిలోవారము

రేకు: 0104-6 సాళంగనాట సంపుటం: 07-024

పల్లవి: ఔలే విరహుల జాడలటు వలెనే
తాలిమి లేక తామే తమకింతురు

చ. 1: మాటకు మునుపనే మగువలఁ దిట్టేవు
పాటించి వినఁగరాదా పనులెల్లాను
సూటిగా నీ పతిమోము చూచిన యంతటిలోనే
కాటుక కన్నుల నీరు కడు నించేవు

చ. 2: చేయివట్టి తీయఁగానే చిమ్ముచు విదిలించేవు
ఆయెడ నోరుచ రాదా అయినదాఁకాను
దాయికొని రమణుఁడు దగ్గరఁ గూచుండితేనే
పాయక అవ్వలిమోమై పవ్వళించేవు

చ. 3: వీడెము నేనియ్యఁగానే వేసరి వొల్లనవేవు
యీడనె మీ నేరుపులెంచుకోరాదా
పాడిగాఁ గానట్టే పక్కన శ్రీవేంకటేశ
కూడితి వింతటిలోనే కొల్లున నవ్వేవు

రేకు: 0105-1 సాళంగనాట సంపుటం: 07-025

పల్లవి: మేకులు నావద్దనే మెరసీనా
యీకతలెఱుఁగుదు నన్నేల పిలిచీనే

చ. 1: సంగడిఁ గూచుండి సరసములాడి యాపె
అంగము కస్తూరి పూఁతలంటించుకొనె
ఎంగిలి దేహము తోనే యీడకు విచ్చేసినాఁడు
యింగిత మెఱిఁగితి నన్నేల పిలిచీనే

చ. 2: నమ్మిక లాపెకు నిచ్చి నయగారమున నాపె
సొమ్ములు దాఁబెట్టుకొనెఁ జూడఁగానే
అమ్మరో నా మంచముపై నాపెఁదానునున్నవాఁడు
యెమ్మెలెల్లాఁ గంటి నన్నునేల పిలిచీనే

చ. 3: చేరి యాపె వాసన చూచిన చెంగలువ బంతి
మేరతోఁ దాఁబట్టుకుండి మీఁదవేసెను
యీరీతి శ్రీ వేంకటేశుఁ డిప్పుడిట్టె నన్నుఁగూడి
యీరానిచనవులిచ్చె నేల పిలిచీనే

రేకు: 0105-2 మాళవిగౌళ సంపుటం: 07-026

పల్లవి: మరిగేమి నెఱఁగను మంకు గొల్లదాన నేను
సరిలేని నవ్వులతో సరసమాడుదును

చ. 1: బలిమి నేఁ జేయఁ గాని పంతమాడి నిన్నునిట్టె
వలపించి నీ మోము వాడు దేర్తును
చలము సాదించఁ గాని చనవు చేసుక నీ
వెలలేని మోవెల్లా వేడుకల నింతును

చ. 2: బొమ్మల జంకించఁ గాని పొద్దు పొద్దుఁ గాచుకుండి
సమ్మతించ నీ మనసు జట్టిగొందును
చిమ్ముచుఁ గొసరఁ గాని చేతులు నీపైఁ జాచి
ఉమ్మడి నా గోరి కొనలొడలెల్ల నింతును

చ. 3: నేరమెంచఁ గాని నేను నీతోనే మాఁటలాడి
చేరువ నీ మన్ననలు చేకొందును
యీరీతి శ్రీ వేకంటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పేరుకొని యిఁక నిన్ను ప్రియాన మెప్పింతును

రేకు: 0105-3 ముఖారి సంపుటం: 07-027

పల్లవి: ఇన్నాళ్ళు నెఱఁగనైతి నెచ్చుకుందులాడితి నీ
వన్నెదీయ మెరసేది వనితా భూమిని

చ. 1: యెందరు సతులు నీకు యెట్టైనానుందురుగాక
ముందరి వీడెము నాది మోహము నాది
పొందులఁ దొలుత నిన్ను భోగించిన నా యెంగిలి
అందుక చేయొగ్గినది ఆఁటదా భూమిని

చ. 2: అవ్వల నీవారమని ఆడుకోనీ యెవ్వరైనా
నవ్వులు నీవు నాతోనే ననుపు నాదే
రవ్వల నే నిన్ను నిట్టె రతిసేసిన వలపు
తవ్వి తలకెత్తుకొంటే తరుణే భూమిని

చ. 3: పైకొని నిన్నెవ్వరాస పడేది పడుట గాక
కైకొన్న కౌఁగిలి నాది ఘనత నాది
యీకడ శ్రీ వెంకటేశ యిట్టు నన్నుఁ గూడితివి
వాకు కసివుచ్చుకుంటే వనితా భూమిని

రేకు: 0105-4 ముఖారి సంపుటం: 07-028

పల్లవి: చెల్లఁబో యింకానేల సిగ్గుగాదా
యెల్లవారునెరిఁగిరి యిఁకనేడ సుద్దులు

చ. 1: సిరులతోఁ జెఱఁగు మాసినదానిఁ జేరరాకు
సారిది నల్లంతనుండి చూతువు గాని
వరుస దప్పితే నాడవారిమీఁది యానే సుమ్మీ
యెరవులవారమైతి మిఁకనేడ సుద్దులు

చ. 2: మాఁటుననున్న దానితో మాటాడకువయ్య నీవు
ఆఁటాదానిచేతనే చెప్పంపుదు గాని,
కూటమికిఁ బెనఁగితే కుచ్చి అట్టు సేతు సుమ్మీ
యేఁటికి నవ్వులు నవ్వేవిఁకనేడ సుద్దులు

చ. 3: చిందువందైనదానిఁ జెనకకువయ్య నీవు
కందువ చెప్పంపి మీఁదఁ గలతు గాని
పొందితి వింతలో నన్నుఁ బోనీక శ్రీ వేంకటేశ
యిందులో నన్నియుఁ గంటిమిఁకనేడ సుద్దులు

రేకు: 0105-5 గౌళ సంపుటం: 07-029

పల్లవి: ఎంతకెంత నా దిక్కు యేమి చూచేవు
కాంతుఁడవు నాకు ఆపె గలయంత కాలము

చ. 1: మఱి వరుస దప్పని మగువవంక గాక నీ
పఱచు గుణాల కెల్లపాటి వున్నదా
యెఱఁగనా నీ సుద్దులు యేల నవ్వే వెన్నటికి
మఱచేవే యాకెఁజూచి మఱచితిఁ గాక

చ. 2: అంగవించి మాటాడేవు ఆపెకు వెఱచే కాక
ముంగిటి నీయంత నీకు మోహమున్నదే
యింగితానఁ గానరాదా యేల మొరఁగేవు నాకు
కంగవద్దా ఆపెఁ జూచే కంగనైతిఁ గాక

చ. 3: కౌఁగిటఁ గూడితి వాపె కనుసన్నలనె కాక
వీఁగి శ్రీ వేంకటాద్రి గోవిందరాజా
చేఁగదేరనింకేల నీ చేఁతలకు గడెవెట్టి
ఆఁగవద్దా ఆపెఁ జూచే ఆఁగనైతిఁ గాక

రేకు: 0105-6 రామక్రియ సంపుటం: 07-030

పల్లవి: ఏల మమ్ము రట్టు సేసేవింతటిలోనే పెను
వేలనే గడెవెట్టితి వెళ్ళునియ్య నిన్నును

చ. 1: వొద్దనఁగాఁ బొయ్యేవు వొంటిఁ జిక్కించుక యాపె
అద్దలించి యేమైనాననకుండీనా
అద్దో నాతో నీవు అలిగి యందు చేరిన
పొద్దుగాని పొద్దనక పొందులు సేసేరా

చ. 2: తుమ్మఁగానే లేచేవు తొయ్యలి యెవ్వతెయైనా
దిమ్మరేఁచి వాదుదీసి తిట్టకుండీనా
యెమ్మెల నాతో మేకులకెవ్వతెఁ బలిపించినా
నమ్మరాదనక నీతో నవ్వవచ్చేరా

చ. 3: మొక్కఁగా నడుగిడేవు ముందటనెవ్వతెయైనా
చిక్కించుక చేఁతలెల్లాఁ జేయకుండీనా
మక్కువ శ్రీ వేంకటేశ మగిడి నన్నుఁ గూడితివి
తక్కిన వారు నవ్వక తాము లోనయ్యేరా

రేకు: 0106-1 సామంతం సంపుటం: 07-031

పల్లవి: మగువలతోడిదేల మందెమేళాలు
తగినయంతే కాక తమకమేలయ్యా

చ. 1: పెక్కుమాటలాడితేను ప్రియమెల్లాఁ జవుకౌను
యెక్కుడు సుద్దులు నన్నునేలడిగేవు
మొక్కులే సారెకునైనా మోపులై వేసటవుట్టు
యెక్కసక్యాలకుఁ బాదమేల పట్టేవయ్యా

చ. 2: విడువక నవ్వితేను వెస మొగచాటగును
అడరి మాతో సరసాలంత యేలయ్యా
యెడయక చూచితేను యెదిరికి సిగ్గువుట్టు
కడు నీయెదుటనేల కమ్ముకొనేవయ్యా

చ. 3: బలువై కౌఁగలించితే పరవశములు మించు
నెలకొని మమ్మునెంత నెట్టుకొనేవు
వెలయ శ్రీ వేంకటేశ వేమారు నన్నుఁ గూడితి
వలపులజడి యంత వంచితివో అయ్యా

రేకు: 0106-2 పాడి సంపుటం: 07-032

పల్లవి: ఇంకనేల సుద్దులు యెదురూఁ గుదురుగాను
సుంకు మోచిన కళలు సూట్లాయను

చ. 1: సరస నిలుచుండఁగా సతి తురుము విరులు
పరిమళముతో నీపై రాలెను
ధరనవే నేసలాయ తగ మరునమ్ములాయ
మరిగితీమరఁగేల మంచిదాయను

చ. 2: చేతికి విడెమియ్యఁగ చెలియకుచాలు నీకు
నాతల యీతలను ఆయాలు మోచెను
ఘాత నిమ్మపండ్లాయ కానికలవే ఆయ
యీతల మాయలేఁటికి నియ్యకోలే ఆయను

చ. 3: ఇదె శ్రీ వేంకటేశ నేఁడింతి నీతో మాటాడఁగా
పెదవి పెదవి దాకి ప్రేమము రేఁగె
అదన నన్నుఁ గూడితి వనువాయఁ దనివాయ
కొదలెల్లాఁ దీరెనిదే గుఱులాయను

రేకు: 0106-3 ముఖారి సంపుటం: 07-033

పల్లవి: ఏల నాతో బొంకవచ్చే వెఱఁగనా నేఁదొల్లి
వాలాయించి మాకు మంచివాఁడవే యెప్పుడును

చ. 1: దవ్వులనే మొక్కుమని దయ నాపైఁ బెట్టుమని
యెవ్వతె చెప్పెనో కాక యీబుద్ధులు
నివ్వటిల్ల నీ యంత నీవెఱఁగవింతేసి
చివ్వన నొకరి పెట్టుఁజెట్టవే యెప్పుడును

చ. 2: చేచేత వేఁడుకొమ్మని చెక్కునాకు నొక్కుమని
యే చదువులోనుండెనో యీవోజలు
నీ చందములివి గావు నేఁడు గొత్తలా నాకు
సూచింప నొకరాడించే సూత్రమవెప్పుడును

చ. 3: అక్కర నిచ్చలాడేవు ఆయము గరఁగించేవు
యెక్కడ నేరిచితివి యీరతులు
నిక్కి శ్రీ వేంకటేశుఁడ నేఁడు గూడితివిగాక
గుక్కకొకని పెంపుడుగున్నవే యెప్పుడును

రేకు: 0106-4 శంకరాభరణం సంపుటం: 07-034

పల్లవి: ఇందులోపలఁ దనకు నెందువారమె నేము
అందంబుగానతని నడుగరే చెలులు

చ. 1: తగులు గలిగిన యడల తమకమింతయు నమరు
నగినయడలను మిగుల నటనలమరు
తెగువ గలిగిన యడల తేఁకువలు గడునమరు
మొగమోట గల యెడల మోహంబులమరు

చ. 2: మనసు లెనసిన యెడల మాటలన్నియునమరు
ననుపు గలిగినయడల నయములమరు
చనవు గలిగిన యడల సరసమంతయునమరు
పెనకువలు గల యడల ప్రియములునునమరు

చ. 3: కూడియుండెటియడల గుఱుతులిన్నియునమరు
వాడికలు గలయడల వలపులమరు
యీడనే శ్రీ వేంకటేశుఁడిటు ననుఁ గూడె
వేడుకలు యీయెడల వేవేలునమరు

రేకు:	0106-5 శ్రీరాగం  సంపుటం:	07-035

పల్లవి:	మాపుదాఁకా వట్టిమాటలేమిటికి నిఁక
	తీపులకుఁ గుఱి మోవిదిష్టంబులే

చ. 1:	తలపోఁతలకును గుఱి తమకంబులే చెలియ
	వలపులకు గుఱి నిండు వయసు మదమే
	చలములకు గుఱి తగిన సమరతుల నిబ్బరము
	పిలుపులకు గుఱి మంచి ప్రియములివియే

చ. 2:	యెనయు నాసలకు గుఱి యెడతాఁకులే చెలియ
	ననుపులకు గుఱి సెలవినవ్వులివియే
	చనవులకు గుఱి మిగుల సలిగెలు మెరయుటలు
	మొనయ పొందులకు గుఱి మొగమోటలే

చ. 3:	జిగిఁ గలయికలకు గుఱి సిగ్గు విడుచుటె చెలియ
	తగులమికి గుఱి యేకతములవునికే
	తగిన శ్రీ వేంకటోత్తముఁడు ననునిటు గూడె
	పొగరుమన్ననకు గుఱి భోగంబులే

రేకు: 0106-6 గౌళ సంపుటం: 07-036

పల్లవి: ఓసరించి యేమిటికి నోపినట్టి దానఁ గాను
ఆసల రక్షించు పుణ్యమదే సుమ్మీ యిఁకను

చ. 1: ఊరకున్న నన్నుఁదెచ్చి వొకటొకటే నేరిపి
యీరీతినె చనవిచ్చి యింత సేసితి
నేరుపు నేరాలెంచవు నీవు గాచేవాఁడవే
గోరపెట్టి విరహానఁ గుమ్మకుమీ నన్నును

చ. 2: చిన్ననాఁడే నన్నుఁ దెచ్చి సేవలు సేయించుకొని
యిన్నిటాఁ బెద్దరికాన యింత సేసితి
వన్నెలు యెప్పుడు సేసేవే వలపు నే నెరుఁగుదు
వున్నమాయలకు నన్ను వొడ్డకుమీ యిఁకను

చ. 3: మాయింటికి విచ్చేసి మంతనాన నమ్మికిచ్చి
యీా యెడనే నన్నుఁ గూడి యింతసేసితి
పాయపు శ్రీ వేంకటేశ బదికించేదెఱఁగనా
చాయల అపకీర్తికి చాల సుమ్మీ యిఁకను

రేకు: 0107-1 మధ్యమావతి సంపుటం: 07-037

పల్లవి: ఏల వేగిరించేవీపె నిట్టెమాటలాడుమని
నాలినాపె మోము చూచి నవ్వులేఁటికయ్యా

చ. 1: వేగినంతా నీ తోడ వెలఁది మాటలాడి
భోగించీ నిద్దురలిదె పొద్దెక్కినంతా
చేగదేరినట్టి పెక్కుచింతలు గలవాఁడవు
యీగతి నిద్దురలు నీకేల వచ్చీనయ్యా

చ. 2: పెక్కుదడవు నీతోడఁ బెనఁగినది గనక
వుక్కుననలసి కొంత వూరకున్నది
అక్కడ సాములు చేసే యలవాటు గలవాఁడ
విక్కడ నీ కింతయలపేల వచ్చె (చ్చీ ?) నయ్యా

చ. 3: తతిగొన్న నీరతులఁ దనిసినది గనుక
మతిపరవశముల మఱచున్నది
యితవై శ్రీ వేంకటేశ యీపెఁ గూడితివి నీకు
నితరకాంతలవలె నేలవుండీనయ్యా

రేకు: 0107-2 ముఖారి సంపుటం: 07-038

పల్లవి: మొక్కేలేవే యిందులకు మొదల నేను
మొక్కితే దీవెనలు ముందుముందే రావా

చ. 1: చిగురుఁ జేతులకేలే చిమ్మువాఁడి కొనగోళ్ళు
చిగురుఁగొమ్మున వోరి చేఁగలే కావా
తగు తీఁగెవంటి నీకు దంటతనమింతయేలే
వెగటుతీఁగెలే కావా విఱ్ఱవీఁగఁ గాచును

చ. 2: ఇంచుకంత మోమునకు యింతలేసి కన్నులేలే
యించుకంత అద్దమేరా యిన్నీఁ జూచేది
కొంచెపు నీనోరికేలే కొండలంతలు మాటలు
కొంచపు నడుమే కాదా కుచగిరులానును

చ. 3: పండువంటి మోవికేలే పచ్చిలక్కముద్రలివి
పండినపంటకే కావా బలుముద్రలు
నిండు శ్రీ వేంకటేశుఁడ నిన్నునేఁ గూడితిఁగదే
నిండు నీపురము నాకు నెలవు గాదా

రేకు: 0107-3 శ్రీరాగం సంపుటం: 07-039

పల్లవి: ఈపాటి వలపులు యెఱఁగనివా
పోపో ఆతనికేల బుద్ధి చెప్పేరే

చ. 1: మనసు ముట్టినఁ గాని మాటలూనుఁ జవిగావు
తనువు సోఁకినఁ గాని తనివి లేదు
చనవులిచ్చినఁ గాని సరసములు చెల్లవు
పెనఁగి యాతనినేల పెరరేఁచేరే

చ. 2: తప్పక చూచినఁగాని దగ్గరి రాఁగొలుపదు
చెప్పుడు సుద్దులఁ గాని చింత దీరదు
చొప్పుగా నవ్వినఁ గాని చుట్టరికము నిండదు
యిప్పుడే యాతనినేల యేసపెట్టేరే

చ. 3: ఏకతమయ్యినఁ గాని యెరవులు విడువవు
రాకలఁ బోకలఁ గాని రతిపుట్టదు
కైకొని శ్రీ వేంకటాద్రి ఘనుఁడిట్టె నన్నుఁ గూడె
యీకడ యాతనినేల యియ్యకొలిపేరే

రేకు: 0107-4 సాళంగనాట సంపుటం: 07-040

పల్లవి: నవ్వితినే నీమాటకు నాలో నేను
నవ్వులలోనున్నదిరా నాఁటుకొన్న వలపు

చ. 1: కప్పురము వంటి మాట కారము వంటి చూపులు
చొప్పులు రెండువంకలాఁ జూపేవిదేమే
దెప్పరపు మదముతోఁ దెలుసుకోవేర నీవు
కప్పురపు విడెములోఁ గారమే కాదా

చ. 2: విందువంటి వినయాలు వేఁడివంటి జంకెనలు
అందుక రెండు నడుపేవౌనే నీవు
అందరినీ వారి వీరినడుగవేమో కాని
విందువెట్టినందులోనే వేఁడి చవిగాదా

చ. 3: మెత్తని పరవశాలు మిక్కిలి గట్టి చన్నుల
నొత్తి కూడిన కూటాల నొద్దికైతివే
యిత్తల శ్రీ వేంకటేశ యిప్పుడెటిఁగితివేమో
మెత్తనినేలనుండవా మేటియైన కొండలు

రేకు: 0107-5 హిందోళవసంతం సంపుటం: 07-041

పల్లవి: ఏమనేవే యీతగవులిందరూ నెఱఁగరా
కోమలపు మగవాఁడు కొలఁదులెఱుఁగునా

చ. 1: వరుసలంతా సరే వలపే యెక్కుడు గాని
గరిమెల నీవేల కాఁతాళించేవే
పురుషుఁడు నాతఁడే భోగించే వారి భాగ్యము
మరిగించి కలిసితే మఱి చలివాయదా

చ. 2: సవతులంతా సరే చనవే యెక్కుడు గాని
వివరించుకొనకేలే వేగిరింపులు
కవగూడి (డే?) వాఁడొకఁడే కలసే వారి నేరుపు
చివురు బలిసితేనే చేఁగలై నిలువవా

చ. 3: కళలూనంతా సరే కరఁగేదెక్కుడు గాని
పలుమారు నీవేల పంతమాడేవే
అలమె శ్రీ వేంకటేశుఁడంటిన మావొడఁబాటు
తొలుత మీనవ్వులెల్లా దొతులకునెక్కవా

రేకు: 0107-6 శంకరాభరణం సంపుటం: 07-042

పల్లవి: ఎవ్వరికిఁ గలదమ్మ యింతభాగ్యము
ఇవ్వల నీతోసరి యెంచరాదే వొరుల

చ. 1: వీడిన తురుము తోడ విరులు పై పైరాల
వాడిన కన్నుల తోడ వచ్చేవేమే
యేడనుంటి విందాఁకా యెవ్వఁడు నిన్ను భోగించె
చేడె నీ సొబగులిదే చెప్పరాదె నేఁడు

చ. 2: పడియుఁ జెమటల తోడ వత్తివంటి మోవి తోడ
నడపు మురిపెముతో నవ్వేవేమే
యెడచొచ్చి నీ జవ్వన మెవ్వఁడు కొల్లలుగొనె
పడఁతి నీ చెలువము పట్టురాదె యిపుడు

చ. 3: నిద్దుర కన్నుల తోడ నిండుఁ బులకల తోడ
ముద్దుగారే మోము తోడ మురిసేవేమే
వొద్దనె శ్రీ వేంకటేశుఁడొగిఁ గూడుతె (టె?) అఁగమే
ముద్దరాల నేఁడు నీమోహమెంచరాదే

రేకు: 0108-1 కేదారగౌళ సంపుటం: 07-043

పల్లవి: మాఋమోమిదేఁటికి మందకుఁదనమేఁటికి
జాఋవడ నేనవ్వితే సంతసించవలదా

చ. 1: వడి నీకెమ్మోవిమీఁది వన్నెదీసినది చూచి
తొడరి వీడెమిచ్చితే దోసమాయిది
కడుచెమటల నీపై గందవొడి చల్లి తేను
జడియక నీవిందుకు సంతసించవలదా

చ. 2: కులికి నీ కన్నులపై కుంకుమవన్నెలు చూచి
బలిమిఁ బన్నీరిచ్చితే పాపమా యిది
కలసిన వేఁడి వేఁడి కాఁకలమేనటు చూచి
చలిగా నే విసరితే సంతసించవలదా

చ. 3: పిప్పియైన నీమేని పెక్కులాగులటు చూచి
ముప్పిరిఁ గళలంటితే మోసమా యిది
అప్పటి శ్రీ వేంకటేశ అలమితివిటు నన్ను
చప్పుడుగాకియ్యకొంటే సంతసించవలదా

రేకు: 0108-2 ఆహిరి సంపుటం: 07-044

పల్లవి: సిగ్గువడఁ బోతేను చింతలెక్కీని
వెగ్గళించితే వెన్నెల వేఁడులయ్యీని

చ. 1: చెలువవు నీమోము చెక్కిటనేల మోపేవే
వలపు వెసురు (?) దాఁకి వాడఁబారీని
నిలువునఁ దలవంచి నేలలేల వ్రాసేవే
చలివాసి మదనుఁడు చదివించీని

చ. 2: మూలనున్న నిట్టూర్పు ముంగిటనేల వేసేవే
గాలిగొట్టె యధరము గరివడీని
జాలిఁబడ్డ చెమటల సరితెప్పలేలెక్కేవే
వేళతోనే చల్లగాలి వేఁటలాడీని

చ. 3: నంటు మీఱి నెలవుల నవ్వులేల వుమిసేవే
గెంటు లేని కన్నులను కెంపులెక్కీని
యింటిలోనే శ్రీ వేంకటేశుఁడఁ గూడితి నేను
పంటలై పులకపైరు పాలలెక్కీని

రేకు: 0108-3 రామక్రియ సంపుటం: 07-045

పల్లవి: పోపో నీకిదియేమి పొద్దువోదా
తీపులు చూపి మమ్ముఁ దియ్యకురా యింకను

చ. 1: ఒల్లనివాఁడవు మమ్ము నూరకేల పిలిచేవు
మల్లాడి మాపై మనసు మఱవరాదా
బల్లిదురాలాకె గొన్న బాస దప్పినాఁ దప్పని
పల్లదాననిఁక నీవు పట్టకురా నన్నును

చ. 2: ఇంటికి రానివాఁడవు యేడనైనా నవ్వనేల
వెంటనే మాతో తగులు విడువరాదా
గొంటరై యిందుకు నాపె కోపగించినాఁ గోపించీ
అంటి ముట్టి సరసములాడకురా యిఁకను

చ. 3: పంతపు వాఁడవు మమ్ము పట్టి కౌఁగిలించనేలా
అంతయు నాపెనేపో అడుగరాదా
చెంతనే శ్రీ వేంకటేశ చేకొని నన్నుఁ గూడితి
వింతకంటె రతినలయించకురా నీవు

రేకు: 0108-4 భైరవి సంపుటం: 07-046

పల్లవి: ఇందరి సాకిరి వెట్టేవిందుకే నీవు
అందిన చెలులతోడ నాడుకోరాదా

చ. 1: కోపగించి నిన్నునింత కొసరఁగరాదు గాక
మోపుగట్టి వొక్కచేత మొక్కరాదా
తీపుల పెదవి వంచి తిట్టరాదు గాక నిన్ను
చూపులఁ దప్పకయైనాఁ జూడరాదా

చ. 2: వాసికెక్కించి నీతో వాదులెల్లా మానేఁగాక
వూసగుచ్చి నీగుణాలు పొగడరాదా
వేసరించి నీగుట్టు వెళ్ళవేయరాదు గాక
వేసాలకు నిన్ను నేదీవించరాదా

చ. 3: నీవు గాఁగలించఁగాను నిన్నేమనరాదు గాక
నావలపు చూచి నన్ను నవ్వుకోరాదా
శ్రీ వేంకటేశ యిట్టె చేరి కూడితివి నేఁడు
తావుల నాకొనగోరు తాఁకించరాదా

రేకు: 0105-5 రామక్రియ సంపుటం: 07-047

పల్లవి: ఇంత సేసెఁగా నేఁడు యింతి నీగుణములెల్లా
చెంతలనాకె పసలఁ జిక్కితిగా నీవు

చ. 1: కోపగించుకొన్నవేళ కోరి నీవు మోహించిన
ఆపెపైనాన వెట్టితే నట్టె మానేవు
పైపై నాపెమీఁది పదములు వాడితేను
మాపుదాఁకా పరాకెల్ల మానుదుగా నీవు

చ. 2: అనవసరపువేళ నాపెవారు వచ్చిరంటే
వెనుకొని యెదురుగా వెళ్ళి వచ్చేవు
పనివడి యాపె అప్పణగల మగువల
వినయపు విన్నపాలు విందువుగా నీవు

చ. 3: అలసి నిద్రించేవేళ నాపె నీవొద్దఁ గూచుంటే
పలురతులకు లోనై భ్రమతువుగా
వొలిసి శ్రీ వేంకటాద్రినుండి వచ్చి మాడుపూర
మలసి నన్నుఁగూడి మన్నించితిగా

రేకు: 0108-6 సామంతం సంపుటం: 07-048

పల్లవి: అంగనలేమన్నా నన్నునంటిరి గాని
కుంగని కుచాలఁ దన్ను కుమ్మవద్దాయిఁకను

చ. 1: అల్లవిగో తనమేననప్పటి పెంజెమటలు
మల్లాడి నామేనఁ జమరవచ్చీని
పల్లదాన నేఁదన్ను పట్టుక యిందుకుఁదగ
వెల్లవిరిఁ దమలాన వేయవద్దా యిఁకను

చ. 2: ఇదిగదే తనమేన యెరవులకంటమాల
బెదరక నామెడఁ బెట్టవచ్చీని
కుదియించి యిందుకుఁ దనకురులు నాపదమున
నదిమి యేమైనాఁ జేసి ఆఁగవద్దా యిఁకను

చ. 3: కట్టుకవున్నాఁడదె కానెగా యెవ్వతో చీర
వెట్టికి నాపైఁ గొంగు వేయవచ్చీని
ఇట్టె శ్రీ వేంకటేశుఁడు యెమ్మెతోఁగూడినందుకు
తిట్టురాని తిట్లెల్లాఁ దిట్టవద్దా యిఁకను

రేకు: 0109-1 ముఖారి సంపుటం: 07-049

పల్లవి: అప్పటినాతనినేమి యనేవు సుమ్మీ
కుప్పలైన వలపుల గుణమిది సుమ్మీ

చ. 1: పాసిన కూటమి చవి భావించు(వించి) లోలో రెప్ప
మూసి యెత్తి చూచినట్టి మోహము చవి
యీసున సాదించేనంటా యింటికి వచ్చుట చవి
వేసరి యాతనినేమి వెంగెములాడకువే

చ. 2: తగవులఁ బెట్టినట్టి తరితీపులు చవి
అగపడకున్నఁ బెట్టేయానలు చవి
జగడపువేళల సరియాఁకలు చవి
తగదనాతనినేమి తప్పులెంచవలదే

చ. 3: తెర మాటున నుండే తేటల మాటలు చవి
సురతపు వేళ గోరిసోఁకులు చవి
ఇరవై శ్రీ వేంకటేశుఁడింతలో నిన్నుఁగూడె
తరవాతి పనులెల్లా దక్కె నీకుఁ గదవే

రేకు: 0109-2 నాదరామక్రియ సంపుటం: 07-050

పల్లవి: నీతలనే వేఁగెనా నిన్ను దూరఁ బనిలేదు
జాతిఁ బుల్లఁదీఁగెలకు సారెనలుగుదురు

చ. 1: తియ్యని మాటలెపో తెలువ మోవినాడేది
కయ్యమడిచి వూరకే కారమనేవు
అయ్యరో నీవేకాదు ఆలినొల్లనివారు
వొయ్యనె యీలకూరకు వుప్పు చాలదందురు

చ. 2: చల్లని చూపులేపో సతికన్నులఁ జల్లేవి
వొల్లనివాఁడవై అవే వుడుకనేవు
మెల్లనె నీవేకాదు మేలుమేలు అంటే నీళ్ళు
బల్లిదులైనవారు పాటిగంపదెత్తురు

చ. 3: కూరిమి కౌఁగిలేకా కొమ్మనిన్నుఁ గూడినది
బీరాన నీవేమిటికో బిగువనేవు
యీరీతి శ్రీ వేంకటేశ యేకమైతివితరులు
మేరమీరేవారిఁగంటే మిక్కిలి లోనౌదురు

రేకు: 0109-3 రామక్రియ సంపుటం: 07-051

పల్లవి: ఇటమీఁద నాకు బుద్ధియేదే చెలియ నీవు
తటుకన నెటిఁగించు తడవు సేయకువే

చ. 1: కంటివటె వానిని కాంతరో నేనన్న ట్టె
అంటివా యించుకించుక ఆయాలు సోఁక
వొంటినున్నాఁడో వేరెవొకరు వద్దనున్నారో
యింటికి నేనే వత్తునో యేమనెనే వాఁడు

చ. 2: తెచ్చితివా వానిని తివిరి నే నిమ్మన్నవి
యిచ్చితివా ముందుముందే యియ్యకొనెనా
వెచ్చపెట్టఁడు గదా వేడుకనెవ్వరికైనా
అచ్చలాన నేనాసుద్ది యడుగుదునా

చ. 3: నగితివా వానిని నా మనసులోనున్నట్టే
అగడుగా నా సంగడి నట్టే నిలిపి
పగటు శ్రీ వేంకటపతి నన్నునిదె కూడి
తగులాయ నన్నియును తారుకాణలాయెనే

రేకు: 0109-4 సామంతం సంపుటం: 07-052

పల్లవి: ఎగ్గు సిగ్గు దలఁచవు యేరా నీవు
వొగ్గుచు నిద్దరు సతులొద్దనె వుండఁగను

చ. 1: కొనవేలు వట్టి యాకెఁ గూచుండఁబెట్టుకోఁగా
తనువిందువంకఁ గొంత తనిసెనా
పెనఁగి పాదాలు నాచేఁ బిసికించుకొనేవిదె
వనిత నీవద్దనుండి వలపు చల్లఁగను

చ. 2: అప్పుడే వీఁపునఁ జన్నులానుకొంటా నాపెచేత
కొప్పు వెట్టించుకొనేవు కోరికాయనా
యిప్పుడే నాచెక్కు మోవనేకతములాడేవు
చిక్కించుక సతి నీపైఁ జేతులు చాఁచఁగను

చ. 3: సంగతిగా నాపె తోడ జాణతనాలాడేవు
అంగవించి నేఁడు నీకు నాసవుట్టెనా
ముంగిట శ్రీ వేంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
కంగక మగువ నీకుఁ గాచుకవుండఁగను

రేకు: 0109-5 బౌళి సంపుటం: 07-053

పల్లవి: చెప్పకున్న దోసము చెంగటఁ గన్నంతవట్టు
యిప్పుడె యాతని చిత్తమేమైనాఁ జేయని

చ. 1: మంతనపు విచారాలు మాటల పచారాలు
కాంతకు విభునిఁ బాసి కలిగె నేఁడు
యింతయును గంటిరిగా యింతులార మీరైనా
వింతగానిట్టే విన్నవించరే యాతనికి

చ. 2: మంచముపై ముసుగులు మనసులో విసుగులు
అంచగమనకిదివో అమరె నేఁడు
మించినవో చెలులాల మీరే తెలిసితిరిగా
ముంచి మీరాతనిపై మోపుగట్టి వేయరే

చ. 3: కన్నుల తెలినిగ్గులు కాఁకలలో సిగ్గులు (ను)
పన్నిన యీసతిపైనే పైకొనె నేఁడు
యిన్నిట శ్రీ వేంకటేశుఁడింతలో విచ్చేసి కూడె
కన్నెతపము ఫలించె ఘనునిట్టే మెచ్చరే

రేకు: 0109-6 సామంతం సంపుటం: 07-054

పల్లవి: ఇంతట విచ్చేయవయ్యా యింతి విలిచీనిదివో
ఎంతలేదిదెంచుకొంటే నిద్దరునూనొక్కటే

చ. 1: జవ్వన గర్వముతోడి సతులు దమకోపాన
రవ్వలుగానాడుదురు రమణులను
నవ్వులు సేసుకొనక నాతులతో జగడించి
పువ్వుమొన వాఁడిసేసే పురుషుడూఁ గలఁడా

చ. 2: సరసమాడేటి వేళ సతులట్టే చనవున
సిరులతో వెగ్గళించి చేయి ముంతురు
సరుస గురుతు మా యించకికెను రట్టు సేసి
బిరుగాలి ముడిగట్టే ప్రియుఁడూఁ గలఁడా

చ. 3: రానీ పోనీ తమకాన రాములు తమచూపుల
సానలఁ బట్టుచుఁ బగ చాటుదురు
దీనికే శ్రీ వేంకటేశ తెలిపఁ గూడితివిట్టె
మైనము సూలము సేసే మగవాఁడూఁ గలఁడా

రేకు: 0110-1 సామంతం సంపుటం: 07-055

పల్లవి: ఇట్టె నిన్ను రమ్మనె నేమమ్మ
నెట్టుకొన్న తమమేలు నేఁజూడవలెనా

చ. 1: కప్పురమింద కోవమ్మ కాంతుఁడు నీకుఁ బెట్టెంపె
అప్పుడే పెండ్లి దనకాయనటరే
ముప్పిరి పువ్వులు నీకు ముడుచుకోనంపెనమ్మ
చెప్పరే యాపెయుఁ దానుఁ జేకొని మిగిలెనా

చ. 2: గందము నీకుఁబెట్టెంపెఁ గైకొనఁ గదవమ్మ
అందుతోనే సోబనపుటక్షఁతలివా
చందనకాపులు నీకు సరిగట్టునంపెనమ్మ
యిందు నాగవెల్లికట్నాలింతలోనే వచ్చెనా

చ. 3: పై పై నీకిదివో పల్లకి వెట్టెంపె నమ్మ
యీపొద్దే తమకు నేఁడేఁగుఁబెండ్లా
చేపట్టె నిన్నిదె కూడె శ్రీ వేంకటేశుఁడోయమ్మ
కోపులఁ దోడఁబెండ్లికూఁతురనా నేను

రేకు: 0110-2 ముఖారి సంపుటం: 07-056

పల్లవి: ఏఁటికే యీదోసము మీరెఱఁగరటే
ఆఁటదాననింతే నన్ను ఆఱడిఁబెట్టకురే

చ. 1: తామరమొగ్గలవంటి తగిన నాచన్నులివి
కామునియమ్ములనేరు కాంతలిదేమే
నామగనికౌఁగిటిలో ననిచే జక్కవలవి
ప్రేమమున మారుఁబేరు పెట్టుదురటే

చ. 2: చందురునిఁ బోలేటి సరసపు నా మోము
అందపుఁబూబంతియంటానాడుకోకురే
ముందు నారమణునికి మోము చూచేటద్దమిది
కందువలేని నిందలు గడింతురటే

చ. 3: తీగెవంటి నామేను దిక్కుల మెఱుఁగనుచు
పోగులుగా సారెసారెఁ బొగడకురే
బాగుగ శ్రీ వేంకటేశు పానుపుపై చిగురిది
యోగము గూడెను వేరే వుప్పటించనేఁటికే

రేకు: 0110-3 రామక్రియ సంపుటం: 07-057

పల్లవి: ఎంతచెప్పినా నెఱఁగవేలే చలము
పంతగాఁడు నేఁడువాని పనులెల్లా దక్కెను

చ. 1: ఆతఁడు నీతో మాటలాడఁడంటా నిలుచుంటే
యేతులకే పాటవాడేవేమే చలము
కాతరించి యాఁటదింత కక్కూరితిపడితేను
చేతులార మగవాఁడు చేసినట్టే చెల్లదా

చ. 2: చుట్టి చుట్టాతఁడు నన్నుఁ జూడవలెనంటానే
యిట్టే జోలి మొక్కు మొక్కేవేలే చలము
గుట్టు తోడి మగువలు కోరి తామె పైకొంటే
బెట్టుగాఁ దన విభుఁడు బిగియక మానఁడు

చ. 3: పై పై శ్రీ వేంకటేశుఁడు పరాకై వున్నాఁడంటే
యేపు మీఱి నవ్వు నవ్వేవేలే చలము
రాఁపుగాని యాఁటదింత రతికిఁ బెనఁగితేను
యీపొద్దాతఁడిట్టె కూడె నెదురాడఁగలనా

రేకు: 0110-4 సాళంగనాట సంపుటం: 07-058

పల్లవి: చొల్లెపుఁ జట్టుతోడి చుంగుల రాజసముతో
వెల్లవిరిగానేఁగీ వెలఁదులు గొలువ

చ. 1: వీఁపునఁ గుచాలు మోపి వెలఁది కౌఁగిలించఁగా
నేపున నేనుగనెక్కెనిదె దేవుఁడు
చేపట్టి యాపెచేతులు చేతులఁ బిగ్గెఁ బట్టుక
పైపై వీధులవెంటఁ బరువుదోలీని

చ. 2: అంగనకుఁ దన పాదాలంకె వన్నెలు సేసుక
రంగుగాఁ దొడఁదొడము రాయఁగాను
సింగారపు సొమ్ములతో చెంగావి ముసుఁగుతోడ
అంగవించి యాపె దనకాసలు రేఁచఁగను

చ. 3: కలకల నవ్వుతోడ కస్తూరి నామముతోడ
అలమేలుమంగ దన్నునట్టె మెచ్చఁగా
యెలమి శ్రీ వేంకటేశుఁడేతులు నెరపుతాను
బలిమి నంకుశమునఁ బట్టె వొ త్తీనదివో

రేకు: 0110-5 రామక్రియ సంపుటం: 07-059

పల్లవి: ఉండనీరా యీపాటి వూరకే నన్ను
కొండెగోడితనాలకుఁ గోపమెల్లా వచ్చును

చ. 1: చుట్టుమవుతానెఱఁగము సూడుబంటవో యెఱఁగ
మట్టె నాతో నాపె సుద్దులాడుకొనేవు
ముట్టి ముట్టి నేము నీతో ముచ్చటలు చెప్పుకోఁగా
యెట్టు వచ్చునో యెఱఁగమేమీననొల్లము

చ. 2: నగవవుతా నెఱఁగము నాటకమో యెఱఁగము
తగవు నన్నడిగేవాతరుణిమాట
నిగిడి పోపో చాలు నిన్నునెవ్వఁడెఱుఁగును
యెగసక్కేఁడవు తొల్లే యేమీననోపము

చ. 3: నెపమవుతా నెఱఁగము నెయ్యమవుతానెఱఁగము
యిపుడు వచ్చితిరి మాయింటికి మీరు
అపుడె శ్రీ వేంకటేశ అలమేలుమంగ నేను
చపలతఁ గూడితిని సాదించ నేనోపను

రేకు: 0110-6 గౌళ సంపుటం: 07-060

పల్లవి: పూవుఁబోణుల కొలువే పుష్పయాగము
పూవక పూచె నీకిట్టె పుష్పయాగము

చ. 1: కలువ రేకుల వంటి ఘనమైన కన్నుల
పొలఁతుల చూపులె నీ పుష్పయాగము
తలఁచి తలఁచి నిన్నుఁ దమమేనులఁ బొడమే
పులకజొంపములె నీ పుష్పయాగము

చ. 2: కరకమలములను కందువ గోపికలెల్లా
పొరసి నినుఁ జూపుటే పుష్పయాగము
సరసపు మాటలే సారెనాడి తమనవ్వు
పొరి నీపైఁ జల్లుటే పుష్పయాగము

చ. 3: గాఁట్టపుఁ గొలనిదండఁ గాంతలు సిగ్గున నిన్ను
బూటకానకుఁ దిట్టుటే పుష్పయాగము
యీటున శ్రీ వేంకటేశ యిట్టె యలమేలుమంగ
పూఁటపూఁటరతులివి పుష్పయాగము

రేకు: 0111-1 లలిత సంపుటం: 07-061

పల్లవి: దక్కె నీకుఁ బంతము తగిలినప్పుడె నేము
మొక్కితిమిట్టె నీతో మొక్కలములొల్లము

చ. 1: కూరిమినైనాఁ గాని కోపాననైనాఁ గాని
వూరకే నీమోము చూడకుండలేమురా
చేరి యిట్టె పట్టరాని చిత్తమువారము నేము
యేరీతినైనాఁ జేయుమిఁకనేల మాటలు

చ. 2: తత్తరానకైనాఁ గాని తగవునకైనాఁ గాని
వొత్తి నిన్నుఁ బిలువక వుండలేమురా
చిత్తిణిగుణాన నీకే చిక్కినవారము నేము
వుత్తరువు నీకునిదె వొద్దనే వున్నారము

చ. 3: నగవునకైనాఁ గాని నాటకానకైనాఁ గాని
వొగి నిన్నుఁగూడక వుండలేమురా
చిగురుఁబాయమునాఁడే సేసవెట్టితిమి నేము
మిగుల శ్రీ వేంకటేశ మెచ్చితి నిన్నిపుడు

రేకు: 0111-2 కాంబోది సంపుటం: 07-062

పల్లవి: తారుకాణలై యుండఁగ దాఁచనేల
కూరిమెల్ల నీమీఁద గుంపులైన యట్లు

చ. 1: కలువ పువ్వుల బంతి కన్నులనదుముకొని
బలువుగ నిన్ను వేసెఁ బడఁతి యిదె
సొలసి తాఁజూచినట్టి చూపులు నీకుఁ దెలిపి
సళుపు మరునమ్ములు సాక్షివెట్టినట్లు

చ. 2: తుంచి తమలపాకుల తొడమెలు నీమీఁద
ఇంచుకించుకె వేసెనిందరుఁ జూడ
ముంచి చిగురుమోవినీమోవి మోఁపెనని చెప్పి
పొంచి వసంతుని నీకుఁ బూఁటవెట్టినట్లు

చ. 3: మొగలిరేకుల లేఁతముంటికొన నీమేను
వగగా రేకలు దీసె వంకలుగాను
తగు శ్రీ వేంకటేశుఁడ తరుణి దనపెండ్లికి
మొగిఁ జందురులనెల్ల మూఁకగూర్చినట్లు

రేకు: 0111-3 సామంతం సంపుటం: 07-063

పల్లవి: నీవంటి సతులతో నెయ్యమాతఁడు చూపఁగా
ఆవలిమోమై యుందానవారడింత గలదా

చ. 1: సిగ్గున నుందానవో చింతతోనుందానవో
సిగ్గుకుఁ జింతకు సాక్షి చెక్కిటిచేయే
దగ్గరి నీరమణుఁడు తమకించి పిలువఁగ
అగ్గలమయ్యేవదేమే ఆఱడింత గలదా

చ. 2: మాయలు సేసేవో మంతనాననుందానవో
మాయకు మంతనానకు మంచమే సాక్షి
చేయివట్టి యాతఁడు నీచింతదీరఁ దియ్యఁగాను
ఆయాలు దాఁక దొబ్బేవు ఆఱడింత గలదా

చ. 3: కరుణ నీకుఁ బుట్టెనో కాఁకలు నీకు ముంచెనో
కరుణకుఁ గాఁకలకు కాఁగిలే సాక్షి
అరుదై శ్రీ వేంకటేశుఁడట్టె నిన్నుఁ గలసెను
అరమరచేవు మేను ఆఱడింత గలదా

రేకు: 0111-4 ముఖారి సంపుటం: 07-064

పల్లవి: అదివో నిన్నంటిఁగా అప్పుడే నిన్ను వోసి
తుదమొదలెఱఁగక దోసమేలాడేవే

చ. 1: అట్టె కోపించకుమీ అడిగే నేనొకమాట
యెట్టునెదుర వున్నాపె యేమౌరా నీకు
ఉట్టిపడి వోసిపోవె వొకటికొకటి గట్టేవు
చుట్టపు వరుస వారి సోఁకనాడవచ్చునా

చ. 2: సిగ్గువడకుమీ వోరి చెప్పేరా నేనొకమాట
దగ్గరి కూచుండనాపె తనకేలరా
వొగ్గి మాటలాడితే వూరకే నిందవేసేవు
నిగ్గులవారితో వాదు నీకింత వలెనా

చ. 3: నవ్వకు శ్రీ వేంకటేశ నమ్మించే నేనొకమాట
యివ్వలఁ బండుండ ఆమె యేమౌరా నీకు
పువ్వక పూచెననేవు పొరుగిరుగులవారి
రవ్వసేయకువే యింత రతి నిన్నుఁ గూడనా

రేకు: 0111-5 శ్రీరాగం సంపుటం: 07-065

పల్లవి: ఇంతమోహించిన పతివిన్నియును నీకుఁ జవి
యెంతలేదు నేమెల్లా నిటువంటివారము

చ. 1: కోమలులు మీఁదమీఁద కోపగించినాఁ జవి
దీమసానఁ బెదవులఁ దిట్టినాఁ జవి
నేమమున మాటాడఁగా నేరకుండినాఁ జవి
వోముచును ముద్దరాలైవుండినాఁ జవి

చ. 2: చనవుల బొమ్మలను జంకించినాఁ జవి
చెనకి గబ్బితనాలు చేసినాఁ జవి
వనజము వంటి మోము వంచుకొనినాఁ జవి
గునిసి కొప్పుభారాన కొంకినాఁ జవి

చ. 3: చెక్కు చేతి తోడుత సిగ్గువడినాఁ జవి
మొక్కలపు నవ్వులెల్లా ముంచినాఁ జవి
యెక్కువతో శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
వొక్క మనసున నిట్టే వుండుటే చవి

రేకు: 0111-6 శంకరాభరణం సంపుటం: 07-066

పల్లవి: ఔదువే దొడ్డదానవందరిలోన
సాదువలెనే యితని సాదించను

చ. 1: తపము సేసితివే తరుణి నీరమణుఁడు
యెపుడు నీవద్దనుండి యిచ్చలాడును
వుపమనేరుతువె వొద్దికతోనాతఁడు
కపురుగా నవ్వు నవ్వి కరఁగించను

చ. 2: అన్నిటా జాణవె నీవు అంగవించి నాయకుని
పన్నిన మాటలఁ బెట్టి భ్రమయించను
సన్నల గెలిచితివే చాయల చూపులు చూచి
వన్నెల నీతని నింత వలపించను

చ. 3: చెల్లునె యెప్పటివలె శ్రీ వేంకటేశ్వరుని
మెల్లనె కౌఁగిటఁగూడి మెప్పించను
తల్లివె మాకెల్ల నీవు తగు నీకు చెలులము
అల్లిదామెరలై నీవాతనిఁ జొక్కించను

రేకు: 0112-1 శుద్ధవసంతం సంపుటం: 07-067

పల్లవి: ఎఱుఁగుదుమిఁక మమ్ము నేల రేఁచీనే
మఱవమెపుడునివి మనసులోననవే

చ. 1: తన నగవులె కావా తరుణులకెల్లాను
చెనకేవేళ ముత్యాల నేసలైనవి
పనివడి తనచేతి పచ్చిచేఁతలె కావా
ఘనమై మరుచావడికళలు దించేవి

చ. 2: నేటిమాటలె కావా నెలఁతులకెల్లాను
మాటులేని వలపుల మందులైనవి
కోటి సేయ తానడచే గుణములివె కావా
పాటించి రతియాసల బంతి సాగించినవి

చ. 3: చూపులివియె కావా సూటులై మాబోంట్లకు
రేపుమాపు కడుఁబెరరేఁపులైనవి
యేపున శ్రీ వెంకటేశుఁడిదె తానె మమ్ముఁగూడె
తీపుల మోవికెంపుల తిద్దుబడియైనవి

రేకు: 0112-2 శ్రీరాగం సంపుటం: 07-068

పల్లవి: చెప్పినట్టు సేయవే చెలువునికి
కప్పురము దిన్ననోటఁ గడు దప్పిగలదా

చ. 1: చలమెంత గలిగినా సతులకుఁ బతితోడ
కొలచి కూరిమి చల్లి కొసరేదే
బలిమి సేసీనతఁడు పట్టిపెనఁగనేల
యెలమినీఁతకు మిక్కిలిఁకలోఁతు గలదా

చ. 2: బింకమెంత గలిగినా ప్రియురాండ్లు విభునితో
వంకలొత్తి మరిఁగొంత వలపించేదే
లంకెలకుఁ బొదిగితే లావులు చూపఁగనేల
వుంకువపట్టినమీఁద నొడఁబాట్లున్నవా

చ. 3: సిగ్గులెంత గలిగినా శ్రీ వేంకటేశుతో నీవు
బిగ్గఁ జన్నులొత్తి కూడి బిగియించేదే
దిగ్గనఁ గలసె నింక దేవునికి మరఁగేల
దగ్గరి మోములుచూచి తలపోఁతలున్నవా

రేకు: 0112-3 సామంతం సంపుటం: 07-069

పల్లవి: నేము నీవారమె యిందు నెరుసులేవి
చేమీఁదయిన మీఁద చెప్పనేల పనులు

చ. 1: కందువ పనులు సేయఁ గలవు నీవేమైనా
అందాలు సేసుకరాను ఆపె గలదు
పొందులు చూచి మిమ్ము పొగడనేము గలము
మందలించి నగవయ్య మఱి యాల కడమ

చ. 2: వన్నెలనెవ్వరినైనా వలపించ నీకుఁ జెల్లు
అన్నిటాను దొరతనమాపెకుఁ జెల్లు
కన్నచోటనెల్లా వూడిగానకు నేము గలము
యిన్నిటా మెరయవయ్య యిఁకనేల మరఁగు

చ. 3: నెలఁతల మర్మములు నీకొక్కనికె పాలు
అలరిన నీరతులు ఆపెపాలు
యెలమి శ్రీ వేంకటేశ యిద్దరిసేవా మాపాలు
నిలువునఁ జొక్కవయ్యా నీకేల వెఱపు

రేకు: 0112-4 ముఖారి సంపుటం: 07-070

పల్లవి: ఇద్దరికీ వచ్చె దూరులేఁటికే నీకు
తిద్దుకొంటే నీవంకనే తేరుఁగదవే

చ. 1: మాటలాడే విభునితో మారువలుకక వుంటే
ఆఁటదానికెంత గర్వమనరటవే
చీటికి మాటికి నీవు సిగ్గువడేదెఱఁగరు
నీటున నాతని మీఁద నిందలెంచరా

చ. 2: నవ్వు నవ్వే పతి తోడ నగుతా నీవుండకున్న
జవ్వనమదములు రచ్చఁ బడవటే
రవ్వగా నీవు ముద్దరాలవౌట యెఱఁగరు
నివ్వటిల్ల నాతనినే నిష్టూరి యనరా

చ. 3: కలసే శ్రీ వేంకటేశు కౌఁగిటఁ గూడకుండితే
కలికితనమునకు కందు గాదటే
చెలిమి సేసి యాతని సెలవిచ్చు టెఱఁగరు
నెలవై కళలాతని నిండుకొనవా

రేకు: 0112-5 భైరవి సంపుటం: 07-071

పల్లవి: జాణఁడవు నీకునిదే చద్దివలపు
రాణించె నింకెన్నఁడు నీరసమాయ వలపు

చ. 1: చెక్కు నొక్కి తనివోక చెలి నీపై మోహాన
మొక్కులు మొక్కీనూరకే మోము చూచీని
చిక్కని నవ్వులు నవ్వి చిదిమినా నెఱఁగదు
వెక్కసములాయఁ బట్టు వేఁడి వేఁడి వలపు

చ. 2: మమత నీపైఁ బెంచి మనసు పట్టఁగ లేక
భ్రమసి నీలోఁచి (?) లోలో బయలీఁదీవి
కొమెరమదానఁ జొక్కి కోపంచినా నెఱఁగదు
తమితోడఁ బట్టుమీ పదను వచ్చేవలపు

చ. 3: పవళించి సన్నచేసి భావము నిలుపలేక
చెవిలోన మాటచెప్పి చెమరించీని
తివిరి శ్రీ వేంకటేశ తెరవేసి నిన్నుఁ గూడె
నవకానఁ బట్టుమీ కొన్నదికోలు వలపు

రేకు: 0112-6 నాదరామక్రియ సంపుటం: 07-072

పల్లవి: ఇయ్యకొంటి గానీవే యిందుకేమి
నెయ్యపు మాటలకెల్లా నెరవాది తాను

చ. 1: చాయ నేనుక వుండితే సంతోషమే కదవే
చేయి మీఁదైన తన చేఁతలకును
మాయలకు లోనైతే మంచి దానవే కదవే
పాయపు మదముతోడి పంతగాఁడు తాను

చ. 2: ఎదురు మాటాడకున్న నింతా మేలే కదవే
కదిసి తానాడేటి కల్లలకును
చెదరక నేనవ్వితే చిత్తము వచ్చుఁగదవే
వెదచల్లే వలపుల వేసదారి తాను

చ. 3: చెప్పినట్టు సేసితేను సెలవాయఁ గదవే
యిప్పుడు గూడె శ్రీ వేంకటేశుఁడు నన్ను
చిప్పిలు మోవి చేకొంటే చింతదీరెఁ గదవే
దప్పికి నెయ్యిదాగేటి తగవరి తాను

రేకు: 0113-1 పాడి సంపుటం: 07-073

పల్లవి: ఎరవులేని రమణుఁడితఁడే కదే
ఆరుదై నాకే మోహించునంటిఁ గదరే

చ. 1: ఏతులకు వనితలు యెవ్వరేమి యాడుకొన్నా
నాతఁడు నేనునొక్కటే అంటిఁ గదరే
యీతల రమణుఁడు వారింట నుంటే నుండెఁ గాని
ఆతుమ నాతోఁ జెప్పెనంటిఁ గదరే

చ. 2: వాసికిఁ గొలువులో నెవ్వరిదిక్కు చూచినాను
ఆసలెల్లా నామీఁదివంటిఁ గదరే
బాస యెందో సేసెనంటా భామలు నాతోఁ జెప్పితే
ఆ సుద్ది నేనెఱిఁగినదంటిఁ గదరే

చ. 3: పదరి యాతని మేను పచ్చియై వున్నదంటే
అదియెల్లా నాచేఁతలంటిఁ గదరే
యెదుట శ్రీ వేంకటేశుఁడిదివో నన్నుఁగూడె
అది మీరే తెలుసుకొమ్మంటిఁ గదరే

రేకు: 0113-2 దేసాళం సంపుటం: 07-074

పల్లవి: మీఱి వచ్చిన పనికి మీరె సాక్షి
వీఱిడితనము నాకు వీసమంతానున్నదా

చ. 1: తగులనాడినవాఁడు దాపిరపు మాటలేలే
నగవులు నగి నాతో ననుచుఁ గాక
బిగిసితేనిఁక నాకు పెలుచుఁ గోపము రాదా
మగువలాల నా యందు మఱి తప్పులున్నవా

చ. 2: తప్పక చూచిన వాఁడు తమకించకుండనేలే
కప్పుర విడెమిచ్చి కలసుఁ గాక
వుప్పతించితే నను వోరుచుకుండఁ గలనా
కప్పుర గందులాల కపటములున్నవా

చ. 3: చేయి పట్టుకున్నవాఁడు సిగ్గులు వడఁగనేలే
యీా యెడనే నాకు మనసిచ్చుఁ గాక
పాయపు శ్రీ వేంకటపతి నన్ను నిటు గూడె
చాయల మగువలాల చలము నాకున్నదా

రేకు: 0113-3 సామంతం సంపుటం: 07-075

పల్లవి: మాటలు నేరుతువే మాపుదాఁకాను వోరి
మాటలాడినట్టే వుండు మంతనపుఁ జేఁతలు

చ. 1: ఇంతలోనే నవ్వేవు యేమే చెలి అవురా
యెంత కెంత కోపగించేనెందాఁకాను
పంతములాడవదేమే పలుమారును నీవు
అంతేసి పాడినదుపేవందుమీఁదఁ గలదా

చ. 2: ఇచ్చకమేల సేసేవే యింతిరో నాకు
మచ్చరించితే నీవు మాట వినేవా
వొచ్చెములెంచవదేమే వొక్కమాటును నిన్ను
మెచ్చినందుమీఁదటను మెరమెర గలదా

చ. 3: కన్నులనేల మొక్కేవే కలికి నాకు నిన్ను
యెన్నికె తిట్లు దిట్టి యేమి గనేరా
నన్నెఱిఁగి కూడితివి జవరాలవే
మన్నన శ్రీ వేంకటేశ మనసిచ్చితివిరా

రేకు: 0113-4 మంగళకౌశిక సంపుటం: 07-076

పల్లవి: నిండుమోహమున నాపె నిలుచున్నదిమేలు
వండ వండనట్లాయ వచ్చేవో రావో

చ. 1: పిలువఁగఁ బిలువఁగ బిగిసేవు సారెసారె
చలము సాదింతురా సతులతోను
తలఁపు గడుమెత్తన దంటతనమే గాని
వలవని సటలేల వచ్చేవో రావో

చ. 2: తడవఁగఁ దడవఁగఁ దప్పించుకోఁ జూచేవు
నిడివిఁ బెట్టుదురా నెలఁతలను
వడిసీఁ జెమటలు నీకు వట్టి దీమసమె కాని
వడచల్లీ విరహము వచ్చేవో రావో

చ. 3: కూడఁగఁ గూడఁగఁ గొసరేవు మీఁద మీఁద
తోడనె యలయింతురా తొయ్యలులను
వేడుకతో దగ్గరి శ్రీ వేంకటేశ కూడితివి
వాడికెగా నిట్లనే వచ్చేవో రావో

రేకు: 0113-5 రామక్రియ సంపుటం: 07-077

పల్లవి: పొద్దువోదా నీక దేమి పోరులేలే
పెద్దరికెము సేసితే బిగిసేవేమే

చ. 1: బల్లిదురాలవైతే భ్రమయించవే పతిని
పల్లదపు మాటలకుఁ బనిలేదే
వెల్లవిరి నాతనికి వేడుక మీఁది వారము
తల్లడించి మమ్ము దూరఁ దగవేదే

చ. 2: కలిమి గలిగితేను గడు సింగారించుకోవే
చులుకఁదనానఁ జూడఁ జోటులేదే
వలపులు చవిగాఁగా వాసికెక్కిన వారము
చలివాసి వాదించ సంగతేదే

చ. 3: చేయి మీఁదైనదానవు చేఁతలు సేయించుకోవే
మాయలు మాతో నింకా మఱి యేలే
యీయెడ శ్రీ వేంకటేశుఁడెనసె నన్నిన్నిటను
నీయిచ్చ నేరములెంచ నెపమేదే

రేకు: 0113-6 శంకరాభరణం సంపుటం: 07-078

పల్లవి: అదియు నాపెద్దరికమన్నిటాఁ గాదా
పదరినా యిందరును బలఁగమే కదవే

చ. 1: మన్నించే యాతనికిని మఱిఁగొందరు రానీవే
కన్నులెంత పెద్దవైనా కలిమే కదే
మున్నిటి వారి కతఁడు మొక్కులెల్లా మొక్కనీవే
చన్నులెంత పెద్దలయినా జవ్వనమే కదవే

చ. 2: అడఁగి మడఁగి వారికట్టే తా నడచీని
నడుమెంత కొంచెమైనా నయమే కదే
బడిబడిఁ గన్నచోట బాసలెల్లాఁ జేసీని
కడు గొప్ప పిఱుఁదు సింగారమే కదవే

చ. 3: సరికి బేసికిఁ దాను జాణతనాలాడీని
కురులు గూడితేఁ గొప్పు గొప్పాఁగదే
యిరవై శ్రీవేంకటేశుఁ డిందరిలో నన్నుఁ గూడె
వొరసితే మోవితేనెలూరేవే కదవే

రేకు: 0114-1 ఆహిరి సంపుటం: 07-079
పల్లవి: నమ్మవా యింకా నీవు నామనసు
చిమ్ముఁ బలుకుఁ దేనెల సేద దేర్తుఁ గాక
చ. 1: ఇయ్యకొన్నదాన నీకు నెదురాడేనా నేను
నెయ్యపుటిచ్చకములే నెరుపేఁ గాక
పయ్యెదకొంగు వట్టేవు బలిమికత్తెనా యింత
వొయ్యన నీప్రియములకొడిగట్టేఁ గాక
చ. 2: వలచినదాన నీకు వసము గాకుండేనా
పలుమారు నీచిత్తము పట్టదుఁ గాక
తలఁపు నాతోఁ జెప్పేవు తగిలి వింతదాననా
కలిసినట్టే కలసి కైకొనేఁ గాక
చ. 3: నీవే నేనైనదాన నెరుసులు వెదకేనా
చేవమీరి నీరతులఁ జెలఁగేఁ గాక
శ్రీవేంకటేశ నన్నుఁ జిత్తగించి కూడితివి
పూవులు వాసన వలెఁ బొంది వుందుఁ గాక

రేకు: 0114-2 పాడి సంపుటం: 07-080

పల్లవి: ఆతఁడు నీవును నేకమైనట్టే వుందురుగాక
యీతల నాతలా బింకాలేల దూసేరే

చ. 1: మచ్చిక చేసినవారు మాటలఁ గొసరుదురు
పచ్చిగా నవ్వేటివారు పైకొందురు
విచ్చిన విడైనవారు వెఱపు లేకుండుదురు
యెచ్చుకుందులు మీలోనేల పట్టేరే

చ. 2: పొద్దువోని యట్టివారు బొమ్మల జంకింతురు
వద్దనున్నవారు లోలో వాసి రేఁతురు
కొద్దిమీరినట్టివారు గురులు దాఁకింతురు
యిద్దరూను పంతాలకు యేల పెనఁగేరే

చ. 3: చనవులు గలవారు సరసాలు చూపుదురు
తనియఁ గూడెడివారు తమకింతురు
యెనసితిరి శ్రీ వేంకటేశుఁడు నీవును నిట్టే
యినుమడించెఁ దగవులేల పెట్టేరే

రేకు: 0114-3 రామక్రియ సంపుటం: 07-081

పల్లవి: ఏల నీకు నీవే పతినింత సేసేవే
మేలు మీఁదనుండితేనే మెచ్చువచ్చుఁగాక

చ. 1: మచ్చిక చుట్టాలైతే మర్మాలెత్తుదురా
యిచ్చకములాడితేనే యింపులుగాక
తచ్చి నీరు వేఁడైతే తామర వోరుచునా
చెచ్చెరఁ జల్లనైవుంటేఁ జెంగలించుఁ గాక

చ. 2: వొడఁబాటు గలవారు వొచ్చము పట్టుదురా
ఆడరి సరసమాడేదందముగాక
బెడసి కూడు వేఁడైతే పెదవులోరుచునా
జడిసీ దగు పాటైతేఁ జవి పుట్టఁ గాక

చ. 3: కౌఁగిటఁ గడినవారు కడమ వెట్టుదురా
వీఁగక పెనఁగితేనే వేడుక గాక
ఆఁగెను నిన్నురముపైనట్టె శ్రీ వేంకటేశుఁడు
వేఁగా తీగెకుఁగాయ వినోదమేకాక

రేకు: 0114-4 ముఖారి సంపుటం: 07-082

పల్లవి: అటువంటి సతిఁ గాని యాదరించవు
మటుమాయముల మాటుమందులే నీకు

చ. 1: కాటుక కన్నుల యింతి కందువ చూపులు దాఁకి
నాటుకొని నీ తనువు నల్లనాయను
మేటియై యాపెచెక్కుల మెఱుఁగు కళలు దాఁకి
పాటించి నీకోకయెల్లాఁ బచ్చనాయను

చ. 2: జలజవదనమేని జవ్వనభావాలు సోఁకి
పొలుపొంద నీబొడ్డు పూవక పూచెను
అలర జఘన చక్ర మాపె పొందుసేయఁగాను
తిలకింపఁ జక్రము చేతికి వచ్చెను

చ. 3: పాల వెల్లి కూఁతురుఁ జేపట్టి పెండ్లాడఁగాను
పాల సముద్రము నీకుఁ బడుకాయను
యీలీల శ్రీ వేంకటేశ యిందర మాపె వారమే
వేల సంఖ్యల సతుల విటతనమబ్బెను

రేకు: 0114-5 నాదరామక్రియ సంపుటం: 07-083

పల్లవి: నీవల్లనె కొత్తగాదు నిండుజవ్వనము గల
కావరపు వారి కెల్లా కలదిదే చాలు

చ. 1: ఏమని మాటలాడెనో యింతి నీతోనల్లప్పుడే
మోమునఁ గళలు దేరీ ముదము తోడ
చేముట్టి నాతోనప్పటి చేరి సరస మాడేవు
ఆమని కాలముగాఁగా నగ్గువాయ వలపు

చ. 2: సన్నలేమి సేసెనో జలజాక్షి నీ కప్పుడు
పన్నిన నీ చిత్తమెల్లా పరాకైనది
మన్నించి అప్పటి నాతో మాటలూనాడేవు
నున్నగానుప్పొలికి యినుమడాయ వలపు

చ. 3: కలసిన రతి యెట్టో కౌఁగిటను మదిరాక్షి
నిలువెల్లాఁ బులకలై నిగ్గుదేరెను
అలరి శ్రీవేంకటేశ అప్పటి నన్నుఁ గూడితి
బలిమిఁ బయిరు సేయఁగ పంటవండె వలపు

రేకు: 0114-6 వరాళి సంపుటం: 07-084

పల్లవి: ఎంతయినా మీలోన యెరవున్నదా
చెంతనున్న తీగెలెకా చిగిరించేవి

చ. 1: జగడాలు మానరాదా సరసమాడేటి వేళ
యెగదిగనాడితే యెగ్గులున్నవా
పొగరు మాఁకుల మీఁది పువ్వుల వొగ రేకాదా
తెగడి పెరఁ బెట్టితే తెనెలయ్యీవి

చ. 2: పెనఁగక వుండరాదా ప్రియముతో నాపె నిన్ను
చనవున ముట్టితేనే సడివచ్చెనా
పనివడి వోరుచుక పలుమారు సాదించితే
తినఁదిన వేములేకా తీపులయ్యీవి

చ. 3: పిలిచి శ్రీ వేంకటేశ బిగియఁగనేల యాపె
బలిమిఁ గూడితేనే పంతమాయనా
చలువగాఁ దూరుపున చంద్రోదయమైతే
వెలయఁ జీఁకటేకాదా వెన్నెలయ్యీది

రేకు: 0115-1 శంకరాభరణం సంపుటం: 07-085

పల్లవి: చేయి మీఁదాయను నీకుఁ జెల్లదా మఱి
మాయింటనే వుండఁగాను మావంకదే చలము

చ. 1: దూరినదాన నేనింతే తొల్లి నీవు శాంతుఁడవే
వూరకున్న వారి తోడ నూరోపదు
మారాడవన్నీఁ జేసి మంచివాఁడ వౌదువు
మేరతో నుండి మిమ్మాడేమేమే మంకులము

చ. 2: సన్నల నేఁ దిట్టేదాన సాదించవెన్నఁడూ నీవు
కన్నులు మూసితేనే లోకము మఱఁగు
యెన్నిటికైనా నోర్చేవు యెందుండో వచ్చి దొరవు
చన్నుల మోచి నిన్నొత్తి చపలపువారము

చ. 3: సేవకురాల నేనింతే శ్రీ వేంకటేశుఁడ నీవు
దేవరవంటివాఁడవే దిట్టువిన్నిటా
చేవనలమేల్ మంగనై చెలఁగే నీవేలితివి
కైవశమైవుండి నేమే కాతరపువారము

రేకు: 0115-2 సామంతం సంపుటం: 07-086

పల్లవి: ఇందరినే మడిగే విందాఁకాను
సందడి మీకిద్దరికి జవ్వనమే సాక్షి

చ. 1: సెలవి నవ్వులకును సిగ్గులే దాపు
కలికి చూపులకును కన్నులు దాపు
నిలుచున్న యాపెకును నీవు దాపు
మలసిన నీకు నాపె మంతనాలు దాపు

చ. 2: చెక్కిటి మెఱుఁగులకు చేయి మాటు
పెక్కుల మాటలకు పెదవి మాటు
చక్కని యాపెకు నీ సన్నలు మాటు
మొక్కలపు నీకు నాపె మొక్కులు మాటు

చ. 3: భారపు గుబ్బలకును పయ్యెద కాపు
పేరిన వలపులకు బింకము గాపు
ఆరయ శ్రీ వేంకటేశ అలమేల్మంగకు నీకు
యీరీతినొనగూడిన యింపులే కాపు

రేకు: 0115-3 కాంబోది సంపుటం: 07-087

పల్లవి: చవి గంటి విడువఁడు సారె సారె నేపనులు
యివల నీతని పొందులెట్టు సేసేదే

చ. 1: పాలమీఁదఁ బవ్వళించి పాల వారి యింటఁ బుట్టి
పాలు దొంగిలించినట్టి బాలుఁడీతఁడు
గాలికూటివాని మెట్టి గాలి రాకాసునిఁ గొట్టి
గాలిబిడ్డ తమ్ముని సంగడి నాడె నీతఁడు

చ. 2: పసుల యేలిక నేలి పసులకు మారు దెచ్చి
పసులఁ గాచిన యట్టి బాలుఁడీతఁడు
వసుధ భారము దించి వసుధ కొడుకుఁ గొట్టి
వసుధ యేలిన యట్టి వాఁడు గదె వీఁడు

చ. 3: బండి బోయుఁడైవచ్చి బండి గాలి కత్తి వట్టి
బండి విఱిచినయట్టి బాలుఁడీతఁడు
కొండ యెత్తి కొండ దచ్చి గురుతై శ్రీ వేంకటాద్రి
కొండపై నలమేల్ మంగఁ గూడినాఁడితడు

రేకు: 0115-4 కాంబోది సంపుటం: 07-088

పల్లవి: ఇటువంటివారి పొందులింపులాయ నీకు
అటమటాలు నేమైతేనంతేసి నేరముగా

చ. 1: బిగువుఁగొనగోళ్ళను బిరుదులే తొలఁకీని
మొగమిచ్చకుఁ జేతులు మొక్కీఁ గాని
తెగువలు కన్నులను తేరి కెంపులెక్కీని
నగవులే సెలవుల నయమిచ్చీఁ గాని

చ. 2: గట్టి చను మొనలైతే కరసానఁ బట్టీని
వొట్టుక మాటలె తేనెలూరీఁ గాని
జట్టిగొన్న బొమ్మలైతే జంకెనలే చూపీని
దట్టపుఁ జక్కఁదనమే తమిరేఁచీఁ గాని

చ. 3: మచ్చిక జవ్వనమైతే మనసెల్లాఁ గరఁచీని
కొచ్చి కోరికలే ఆస కొలిపీఁ గాని
అచ్చపు శ్రీ వేంకటేశ అలమేల్మంగను నేను
నిచ్చలుఁ గూడితి నాపె నిన్నుఁ గూడెఁ గాని

రేకు: 0115-5 గౌళ సంపుటం: 07-089

పల్లవి: మఱి యేఁటి సుద్దులు మాపు దాఁకాను
గుఱియైన చేఁతలివె కొల్లలాయను

చ. 1: కాటుక కన్నుల నిన్ను కలికి చూడఁగానే
నాటనుండి నీమేను నల్లనాయను
చీటికి మాటికి నాపె సిగ్గులు పైఁజల్లఁగానె
తేటలుగా నీకన్నులు తెల్లనాయను

చ. 2: బలిమినే వలపుల పదను చల్లఁగానే
పలుమారు నీ మేను పచ్చియాయను
యెలిమి నీతో నాపె యిచ్చకములాడఁగాను
వెలయ నీమాట వెచ్చి వేవదాయను

చ. 3: అండనుండి పానుపుపైనలిగి కూడినదెల్లా
యెండలాయ నీడలాయనింతలోననే
దండి గోవిందరాజవై దగ్గరి శ్రీ వేంకటాద్రి
కొండపై నన్నుఁగూడఁగా కోరినట్టేయాయను

రేకు: 0115-6 భైరవి సంపుటం: 07-090
పల్లవి: పంతమునేనాడుకొన్నాఁ బలుమారు మెచ్చేవు
యెంతవాఁడ వింత సేసే విట్టిదివో వలపు
చ. 1: పచ్చిమాటలాడితేను భావమెల్లాఁ గరఁగేవు
హెచ్చుకుందులాడినా యియ్యకొనేవు
కచ్చుపెట్టి జంకించితే కాఁగిటనే పొదిగేవు
యిచ్చితివి చనవులు యిట్టిదివో వలపు
చ. 2: చెక్కు నొక్కి పలికితే చెమరించేవు మేనెల్లా
వొక్కటై గోరనూఁదినా నోరిచేవు
మొక్కలాననలిగితే మోహము పైఁజల్లేవు
యెక్కడాను నన్నుఁ బాయవిట్టిదివో వలపు
చ. 3: మొగము నేఁజూచితేనే ముచ్చటతో భ్రమసేవు
అగడుగా నేఁగూడినా నందుకోపేవు
తగిలి శ్రీ వేంకటేశ తమితో మన్నించితివి
యిగిరించేవు పై పై నె యిట్టిదివో వలపు

రేకు: 0116-1 సాళంగనాట సంపుటం: 07-091

పల్లవి: ఏమి చెప్పేది నీనేర్పు యెంతవాఁడవు
వామి వలపొక్కమాటే వారవట్టేవా

చ. 1: దగ్గరి రాదంటాను తరుణినేల తిట్టేవు
సిగ్గులు వడఁగవద్దా చిన్నదానికి
వెగ్గళించే అట్టుడుల వేమారుఁ బొంది పొంది
యెగ్గులు నెమ్మెలు నేఁడు యీడఁజూపేవా

చ. 2: ఉరుటుగాఁ జూడదంటానువిదనేల జంకించేవు
శిరసు వంచఁగవద్దా చిన్నదానికి
వెరవైన సతులతో వేమారు నవ్వి నవ్వి
యిరవైన అలవాట్లీడఁ జేసేవా

చ. 3: చన్నులవొత్తదంటాను సతినేల జరసేవు
చెన్నుమీర మొక్కవద్దా చిన్నదానికి
యిన్నిటా శ్రీ వేంకటేశ యీపెఁగూడి పురముపై
యెన్నికమీరఁ బెట్టుక యింపుచల్లేవా

రేకు: 0116-2 శంకరాభరణం సంపుటం: 07-092

పల్లవి: ఎరవై దూరితిమి యిన్నాళ్ళదాఁకా నిన్ను
సరసములాడఁగాను సాదించేమా

చ. 1: వల్లెవేసి కోడెలను వంచుకొనేయట్టి నీకు
చెల్లునెంత నీవు చేఁత చేసినా మమ్ము
వెల్లవిరిగా దొంగిలి వెన్నలు దినినచోట
పల్లదాలేమాడినాను పాటివట్టేమా

చ. 2: మెండుగఁ జీరలుదీసి మెరసిన చేతుల
దుండగాలెంత నించినా దోసమనేమా
అండనే పదారువేల ఆయాలు మోచిన నీమై
వొండె మాచన్నులు మోవనోపదనీనా

చ. 3: గోవుల చన్నులు నోర గుమ్మలాడిన నీమోవి
యీవల మాకియ్యఁగాను యెంగిలనేమా
శ్రీ వేంకటేశ నన్నుఁజేరి యిట్టె కూడితి
వావిరినెంతమెచ్చినా వలదనేనా

రేకు: 0116-3 ఆహిరి సంపుటం: 07-093
పల్లవి: ఏల పురుఁడు వెట్టుక యింత సేసేవు నన్ను
మేలిమివాఁడవు నీవు మెంగదాన నేను
చ. 1: విరహానఁ గాఁకరేఁగి వేసాలకుఁ జలిగాసి
దొరతనాలు సేసేటి దొడ్డవాఁడవు
గురువింద పూవులు కోరి మనసునఁ గోసి
వరుస నిన్నుఁ బూజించే వనితను నేను
చ. 2: నారలు నాలివొలిచి నమ్మికలఁ దాడు వేఁడి
పోరచిని వల్లెవేసే పొట్టివాఁడవు
గారవపు నవ్వులనే కప్పురాలు నూరి నూరి
సారెకు నీపైనఁ బూసే జలజాక్షిని నేను
చ. 3: కలలోనుంకువవెట్టి కౌఁగిటిలో నన్నుఁ గూడి
సొలసేటి శ్రీ వేంకటేశుఁడవు నీవు
పలచని చెమటల పన్నీటికాలువదెచ్చి
జలకములార్చేటి సకియ నేను

రేకు: 0116-4 దేసాళం సంపుటం: 07-094

పల్లవి: ఇరవైన సరసుఁడు యించుకంతలోఁ దెలుసు
సొరిదిఁదప్పక యిట్టె చూచితేనే చాలదా

చ. 1: నగవులే నయమైతే నాటుకోవా ప్రియములు
తగవులఁ బెట్టఁగానే దాఁగీఁ గాక
అగడు సేయకరావె ఆతనినేల దూరేవే
మొగము చూచి చూచి మొక్కితేనే చాలదా

చ. 2: కోరికలే కుప్పలైతే కొండంత గాదా వయసు
ఆరితేరఁగా వెగటయ్యీఁ గాక
పేరఁబెట్టకిఁక రావే పెనఁగనంతేశాలే
మేరతోనే వొకమాట మెచ్చితేనే చాలదా

చ. 3: మాటలెల్లా మూటలైతే మనసులొక్కంత గాదా
పాటిసేయకుండఁగానే భ్రమసీఁ గాక
యీటులేక శ్రీ వేంకటేశుఁ డింతి నిట్టే కూడె
నీటుతో డనిఁకరావే నిలిచితేఁ జాలదా

రేకు: 0116-5 గౌళ సంపుటం: 07-095

పల్లవి: వనితల తలఁపులు వడ్డికిఁ బారీ నీమీఁద
యెనయుమెక్కడనైనా యేదుగాను సతుల

చ. 1: చేతి నేసవడ్డవారు చేరియున్నారు నీవారె
ఆతల మరిఁ జెనకుమదిలాభము
లాతుగాఁ బదారువేలు లాయాలు నీనగరెల్లా
యీతలనింకాఁ గూర్చుమేదుగాను సతుల

చ. 2: కలయఁ గొనినవారు కలరూరెల్లా నీవారే
అలరి మరిఁ గలయుమదిలాభము
తొలఁకే నందవ్రజపుదొడ్లే నీయందలాలు
యెలమినింకానుఁ దెమ్మా యేదుగాను సతుల

చ. 3: ఉరము శిరసు వీఁపందున్నవారు నీవారె
అరయుమష్టమహిషులది లాభము
ధర శ్రీ వేంకటేశ నీతావెల్లా రాణివాసాలే
యిరవై మమ్మానేలితివేదుగాను సతుల

రేకు: 0116-6 బౌళి సంపుటం: 07-096

పల్లవి: నేనింత సేసితినంటా నేరమెంచేవు గనక
తానే నన్నంటెఁ జుమ్మీ తప్పులేదు నాయందు

చ. 1: పొద్దున నీయింటికి నీపొందులు సేయవచ్చితే
సుద్దులు చెప్పఁగ వచ్చీఁ జూడవె తాను
బుద్ధులెఱుఁగుదునంటా పొరుగుపొరచి యంటా
ఉద్దండానఁ జన్నులంటీ నోయక్కరో వీఁడు

చ. 2: నీమగఁడు బావంటా నే వద్దఁ గూరుచుండితేను
కామించి కొఁగలించెను కానీవే తాను
నేమము వట్టితినంటా నేనే వేరటాలనంటా
ప్రేమమున మోవితేనె పెట్టెఁగదే వీఁడు

చ. 3: మాటాడఁ బనిగలిగి మరి నిన్ను లేపరాఁగా
యీటుగాఁ గూడె శ్రీ వేంకటేశుఁడే తాను
నీటు నీ చెల్లెలనంటా నీమారు నేనంటా
గీఁటుచుఁ దమ్ములము పుక్కిట నించె వీఁడు

రేకు: 0117-1 ముఖారి సంపుటం: 07-097

పల్లవి: ఇల్లురికి పేరటములేల చెప్ప వచ్చేవే
పల్లదాన నీవుఁ గొంత పైకొసరా

చ. 1: వలపులు చవియంటా వంతులకుఁ గొసరేవు
చెలి యీ విభుఁడు పెట్టుఁజెట్టా నీకు
కలికి నీ కొద్దివారా కాచుకున్నారిక్కడను
నెలకొని భోగించ నీయంత నేరరా

చ. 2: నవ్వులే కలవంటా నంటునఁ దొడెక్కేవు
పవ్వళించి యీ విభుఁడు బాడిగెవాఁడా
జవ్వనులిక్కడివారు జాలిరొప్పనున్నారా
చివ్వన నీవలె సేవ నేయనోపరా

చ. 3: కావరాన నీవు గూడి కౌఁగిటనే పిసికేవు
శ్రీ వేంకటవిభుఁడు చిమ్మిలిబొమ్మా
యీవేళనే మమ్మిందరి నితఁడిట్టే కూడినాఁడు
వేవేలకు నీవంటివేడుకలే కావా

రేకు: 0117-2 ఆహిరి సంపుటం: 07-098

పల్లవి: చెప్ప వేఁగు వచ్చెనా చేరి మీకెల్లా బుద్ధులు
చిప్పిలుచు వినివిని చిల్లులాయ మనసు

చ. 1: పలుకులే వాఁడైతే పట్టవచ్చునా మఱి
అలుగులైనా వొరల నట్టుండుఁ గాక
యెలమినాతఁడాడఁగా నెట్టోరువ వచ్చునే
చెలులార వినివిని చిల్లులాయ మనసు

చ. 2: చేరి వలపు వేఁడైతే చేతనంటవచ్చునా
సూరియుఁడైనా మొయిలు చొచ్చుఁగాక
కోరి యాతఁడు దిట్టఁగా గుట్టున నెట్టుండుటే
చేరువలు వినివిని చిల్లులాయ మనసు

చ. 3: నవ్వులే నయములైతే నారొలువవచ్చునా
పువ్వులందే పిందెలును బుట్టుఁగాక
యివ్వల శ్రీ వేంకటేశుఁడెనసె నేమందునే
చివ్వన బూతులు విని చిల్లులాయ మనసు

రేకు: 0117-3 దేసాళం సంపుటం: 07-099

పల్లవి: ఇప్పుడేమి కడమా యెన్నాళ్ళకైనాను
అప్పులిచ్చే రమ్మనవే అల్లనాఁటి నవ్వులు

చ. 1: చిత్తమెఱిఁగినదాన చేరి కోపగించేనా
యెత్తి యిచ్చలాడఁగాక యింకా నేను
తత్తరమింతటిలోనే తనకేల రమణుఁడు
హత్తుకొను రమ్మనవే అల్లనాటి పొందులు

చ. 2: మొగము చూచినదాన ముంచి నేరాలెంచేనా
జిగిఁ దాను చెప్పినట్టు సేసేఁ గాక
తనగి సిగ్గులదేలే తానాకుమేలువాఁడు
అగపడె రమ్మనవే అల్లనాఁటి వలపు

చ. 3: ఇంటికి వచ్చినదాననెగసక్కెము సేసేనా
పెంటలుగాఁ గాఁగిటిలోఁ బెనఁగేఁ గాక
దంట శ్రీ వేంకటేశుఁడు తానే నన్నుఁగూడినాఁడు
అంటీననే రమ్మనవే అల్లనాటి మాఁటలు

రేకు: 0117-4 రామక్రియ సంపుటం: 07-100

పల్లవి: ఆడినట్టే ఆడీ వీఁడు అద్దములో నీడవలె
జాడతోడ కన్నులనే సన్న సేసీనే

చ. 1: కోరి జలకము కేళాకూళిలో నేనాడఁగాను
ఆరసి తానీఁద వచ్చీనాడకే తాను
తారసిలి సిగ్గుతో నేఁ దామరమొగ్గలంటితే
సారపుఁగమలాలంటాఁ జన్నులంటీనే

చ. 2: చెంది పొదరింటి లోన చీర నేఁగట్టుకోఁగాను
అందిమ్మనీఁ బచ్చడము ఆడనే తాను
కందువ సిగ్గుతో నేను కమ్మఁజిగురు వట్టితే
ముందే నాచిగురుమోవి మోవిఁ బట్టీనే

చ. 3: అలసి నేనొకచోటనారగించఁ గూచుండితే
వలెనంటా నాపొత్తుకు వచ్చీనే తాను
అలరి సిగ్గుతోడ నేనట్టె చేయెత్తి మొక్కితే
యెలమి శ్రీ వేంకటేశుఁడిటుగూడి మొక్కెనే

రేకు: 0117-5 మధ్యమావతి సంపుటం: 07-101

పల్లవి: వేగునంతానేల జాలి వెలుమజోలి
సోగకన్నుల నాతనిఁ జూడఁగరాదా

చ. 1: చలమే నీకు బలమా సరసములాడరాదా
వలచిన రమణుఁడు వద్దనుండఁగా
అలిగితేనేమాయ నప్పటికపుడె పోయ
చెలులు చెప్పఁగా సందుచేకొనరాదా

చ. 2: పట్టినదే పంతమా పైకొని మాటాడరాదా
గుట్టుతో నీపతి చెంతఁ గూచుండఁగా
వొట్టుక దోసములేదు వొగి నీకుఁ బొద్దువోదు
పెట్టే గిలిగింతలకే బెట్టి నవ్వరాదా

చ. 3: సిగ్గులే మూలధనమా చేరి పైకొనఁగ రాదా
అగ్గమై శ్రీ వేంకటేశుఁడలమఁగాను
యెగ్గులెల్లా నేఁడె జారె యెదుటఁ బ్రియములూరె
వెగ్గళించె నాస వెల్లవిరులు గారాదా

రేకు: 0117-6 నాదరామక్రియ సంపుటం: 07-102

పల్లవి: వేగిరమా యిప్పుడేమి వేఁడి వలపు
చేఁగదేరఁగా నీవే చేరి మన్నించేవు

చ. 1: మాటలు నీతోనాడి మనసులు సోదించ
అఁటది నేరుచునా అంతేసి
పాటించి పూఁడిగాలుసేసే బల్లిదురాలనైతేను
నీటున నీగుట్టెల్లా నీవే ఆనతిచ్చేవు

చ. 2: సన్నలు నీతోడినాడి చాయకు నిన్ను దిద్దుకో
కన్నెలు నేరుతురా కపటాలను
అన్నిటా యిచ్చలాడీ సుద్దాత్మురాలనైతేను
వున్నతి వోజకు వచ్చి వుబ్బున మెచ్చేవు

చ. 3: మెల్లనే నిన్నుఁ బొగడి మేరలు మాజీ నవ్వఁగా
యిల్లాండ్రతరమా యెందునైనాను
యిల్లిదె శ్రీవేంకటేశ యెనలుతి విట్లయితే
పల్లదాన నెప్పుడూనుఁ బాయకవుండేవు

రేకు: 0118-1 పాడి సంపుటం: 07-103

పల్లవి: అన్నిటాఁ గలికివైతే నౌదువు గాని
యెన్నరాదాతని ప్రియమియ్యకొనవే

చ. 1: వసముగాని పతితో వాసులేల నెరపేవే
కసుగాటు వలపుల కాయవు నీవు
రసములు చిందీనదె రమణుఁడు మాటలనే
విసువక ఆదరించి వినఁగదవే

చ. 2: మేటియైన విభునితో మేకులు చూపకువే
తేట వయసుల పూవుఁదీగెవు నీవు
మాటులేని మందు నూరీ మగఁడు నవ్వులనే
చాటుకుఁ బోకందుకొని సమ్మతించవే

చ. 3: శ్రీ వేంకటేశ్వరునితో సిగ్గులు వడకువే
దేవరవంటి పట్టపుదేవివి నీవు
చేవదేర మన్నించి చేఁతల నిన్నీతఁడు
పూవువలె నిట్లనే భోగించవే

రేకు: 0118-2 శ్రీరాగం సంపుటం: 07-104

పల్లవి: ఏల దాఁచేవింతలోనే యిందరిముందరా నేఁడు
చాల మెచ్చేఁగాని యాసతిఁ జూపరాదా

చ. 1: చెంతల నేఁబిలిచితే చేరి వూరకున్నాఁడవు
పంతము దప్పినా పలికితేను
యింతలో నేమస్తునిగా నెవ్వతె సేసెనో నిన్ను
సంతోసించేఁ గాని ఆసతిఁ జూపరాదా

చ. 2: అంకెలఁ జెక్కు నొక్కితే నట్టే తల వంచేవు
సుంకము వచ్చినా చూచితేను
పంకించకెవ్వతె నిన్ను బమ్మచారిఁ జేసెనో
సంకెదేరిచేఁ గాని ఆసతిఁ జూపరాదా

చ. 3: తనువు చేతనంటితే దాఁగి నన్నుఁ గూడితివి
అనువు నిన్నుఁ గొనేరా అట్టే వచ్చితే
యెనసి శ్రీ వేంకటేశ యెవ్వతె నీకు నేర్పెనో
చనవు చూచేఁగాని యాసతిఁ జూపరాదా

రేకు: 0118-3 కేదారగౌళ సంపుటం: 07-105

పల్లవి: ఎన్నఁడూ నలుగకుమీ యెదురుమాటాడకుమీ
పన్ని యీతని మనసు పట్టదే చెలియా

చ. 1: మంచితనములకే మగలు లోనౌదురు
వంచనచేఁతలకే వలతురు
చంచులఁ బాడినందుకే సతమై కరఁగుదురు
అంచల నింతులకివి అందములే చెలియా

చ. 2: ఇచ్చకపు మాటలకే యెన్నఁడును బాయరు
పచ్చిమోవితేనెలకే పైకొందురు
యిచ్చినచనవులకే యీడుజోడై చిక్కుదురు
నిచ్చలుఁ గామినులకు నేరుపులే చెలియా

చ. 3: తగులాయమైనందుకే తమకింతురెప్పుడును
నగవులతేటలకే ననుపొదురు
నిగిడి శ్రీ వేంకటాద్రి నిలయునిఁ గూడితివి
తగిన సతులకివే తగవులే చెలియా

రేకు: 0118-4 ముఖారి సంపుటం: 07-106

పల్లవి: చెలులము నేమెందాఁకా చేరి విన్నవించేము
సొలసి నిన్నుఁ జూడఁగ చుఱుకనె మనసు

చ. 1: ఈడనేకతమాడఁగా నింతి నన్నుఁ గోపగించె
ఆడరాదా అందు గొంత ఆపెతోడను
వాడుమోవి వంచుకొనె వత్తివలెనాయ మేను
చూడరాదా ఆపెదిక్కు చుఱుకనె మనసు

చ. 2: చెంగలించి నీవు రచ్చసేయఁగా నీతోనలిగె
అంగవించి వుండరాదా ఆకింటాఁ గొంత
కుంగి చేతిపైనొరగి గొబ్బున మెయి చెమరించె
చుంగుపయ్యదెత్తరాదా చుఱుకనె మనసు

చ. 3: వలపంతటాఁ జల్లఁగా వనిత నిన్ను దూరీని
కలయఁ జల్లఁగరాదా కామినిమీఁద
యెలమి శ్రీ వేంకటేశ యిప్పుడాకెఁ గూడితివి
సళువు దెలుపరాదా చుఱుకనె మనసు

రేకు: 0118-5 శుద్ధవసంతం సంపుటం: 07-107

పల్లవి: నీకేమయ్యా నీకు నీవే దొడ్డవాఁడవు
చేకొని చెట్టడిచితే చేటఁడేసి వావులు

చ. 1: తలపోఁతలొక్కటైతే తమక మినుమడాయ
నిలువుకు నిలువే నీబేరము
కొలిచినందే కొలిచి గోపికలకెల్లాను
వలవఁదీసితివిగా వలపులు నీవు

చ. 2: నగవులు మానెడైతే ననుపులడ్డెఁడేశాయ
నిగిడె నన్నచోట్లా నీబేరము
అగడుగా నాఁగిచ్చి (?) అంగనలకెల్లాను
జిగి వడ్డిగొంటివి సిగ్గులెల్లా నీవు

చ. 3: మోవితేనగ్గువలైతే ముదములు లాభమాయ
నీవు నన్నుఁ గూడినదే నీబేరము
భావించి శ్రీ వేంకటేశ పడఁతులకెల్లాను
వావాత నమ్మితివిగా వయసులు నీవు

రేకు: 0118-6 సౌరాష్ట్రం సంపుటం: 07-108

పల్లవి: నయగారి మీ సుద్దులు నాకుఁ గొత్తలా
ప్రియములన్నియు దాఁచి పెట్టెఁ బెట్టవయ్యా

చ. 1: మిక్కిలి నీవు మెచ్చఁగా మేనికి వెంగెమై తోఁచీ
దిక్కులవారు నవ్వేరంతేశాలయ్యా
చక్కెర యేదుగానైతే చవి మొగచాటు గాదా
వొక్కమారే యింతగద్దా వూరకుండవయ్యా

చ. 2: పూని సారెఁ బొగడఁగా పొందులకు వేఁగయ్యా
తేనె గారీఁ దీపుల నంతేశాలయ్యా
నూనె గొలచే కుంచము నునుపెక్కు మీఁద మీఁద
ఆనక మై దిగువారీనాయనాయనయ్యా

చ. 3: నగవులేదు గాఁగా నాము గడువేసీని
తెగరానిచోట్లు అంతేశాలయ్యా
పగటు శ్రీ వేంకటేశ పైకొంటివి కడపలో
అగపడె రతులు నీయాసలెంతేశయ్యా

రేకు: 0119-1 వరాళి సంపుటం: 07-109

పల్లవి: సరికి బేసికి మీఁచదురుఁదనాలు మించె
ఇరుగుపొరుగులను యిద్దరును జాణలే

చ. 1: కలువల వేసితేను కమలాన వేసెనాపె
మలసి యెడమాటలు మఱియేఁటికి
పలువరుస చూపితే తలయెత్తి నిక్కెనాపె
యెలమిఁ దెలుసుకొంటిరిద్దరూను జాణలే

చ. 2: పరగ చేత మొక్కితే పాపట దువ్వెనాపె
అరసి లేకలు వా సి అంపనేఁటికి
పొరిఁ గస్తూరి చల్లితే పొంచి కుంకుమాపె చల్లె
యిరవు దెలుసుకొంటిరిద్దరూను జాణలే

చ. 3: పచ్చడము గప్పుకుంటే పయ్యెద దెఱచెనాపె
ఇచ్చట సన్నలుసేయనిఁకనేఁటికి
మెచ్చితే శ్రీ వేంకటేశ మెయిలచ్చన చూపెనాపె
యెచ్చి లోలోనే కూడితిరిద్దరూను జాణలే

రేకు: 0119-2 శుద్ధవసంతం సంపుటం: 07-110

పల్లవి: ఇప్పుడుగాక మఱి యిఁకనెన్నఁడు
గుప్పేటి కానుకలందుకొనవయ్య

చ. 1: పాలితి నీవద్దనుండి బుద్దులెల్లాఁ జెప్పఁగాను
చెలఁగి పారుపత్యాలు సేయవయ్యా
పలుమారునాకె రాయబారాలకు నడవఁగ
కొలువులు సేయించుకొనవయ్యా

చ. 2: అంగనలిందరని నీకతివ లెక్క చెప్పఁగ
చెంగటఁ గళ దింపుచుఁ జెన్నొందవయ్యా
సంగతిగా నాపె యవసరములు చెప్పఁగాను
అంగీకరించి యట్టె ఆదరించవయ్యా

చ. 3: అక్కజమై సతి నీకు నడపము పట్టఁగాను
పెక్కు వీడేలింతులకుఁ బెట్టవయ్యా
యిక్కువతో శ్రీ వేంకటేశ నన్నుఁ గూడితివి
మక్కువ తోడుతనిట్టే మన్నించవయ్యా

రేకు: 0119-3 ఆహిరి సంపుటం: 07-111

పల్లవి: నీతోడి విరహాసను నెలఁతమై నిన్నియును
కాతరించి బెదరీ సంగతి సేయవయ్యా

చ. 1: కందువలఁ బొదివి జక్కవలను దువ్వుదువు
ముందు ముందె తుమ్మిదల మూఁక గూర్తువు
విందుగా చకోరాలకు వెన్నెలలావటింతువు
యిందుముఖి పిలిచీని యిట్టె రావయ్యా

చ. 2: కలయ మాటాడి చిలుకలఁ బలికింతువు
పలుమారుఁ గోవిలలఁ బాడింతువు
అలర ముంగిటను రాయంచలనాడింతువు
యెలమినంగన విల్చీ నిట్టె రావయ్యా

చ. 3: నెయ్యము మీఱఁగ తేనియ పెరరేఁతువు
చెయ్యంటి మయూరముఁ జెలఁగింతువు
వొయ్యనె శ్రీ వేంకటేశ వొనగూడితివింతలో
యియ్యెడఁ గామిని విల్చీ నిట్టె రావయ్యా

రేకు: 0119-4 శ్రీరాగం సంపుటం: 07-112

పల్లవి: ఆకెఱుఁగు నీవూ నెఱుఁగుదదియె మాట
చేకానిక నీకిమ్మనె చెలియ నన్నిపుడు

చ. 1: వెన్నెల బాయిటనుండి వెలఁదిపాట వింటాను
చన్నులపైనొత్తితివి చంద్రవంకలు
అన్నిటా నీపై వలపులవె తలఁపించునని
విన్నపము సేయుమనె వింతగా నన్నిపుడు

చ. 2: చవికెలోపలనుండి చదురంగమాడుతాను
వువిదకిచ్చితివి నీవుంగరము
జవళినదే నిన్ను సారెఁ దలఁపించునని
తవిలి నీకెచ్చరించఁ దరవిచ్చెనిపుడు

చ. 3: పానుపు మీఁదట నుండి పడఁతికౌఁగిటఁ గూడి
పూని మోవిమీఁదఁ గెంపులు నించితి
నాని శ్రీ వేంకటేశుఁడ ననుపవే రేఁచునని
మోనాన మఱవకుండా మొక్కుమనెనిపుడు

రేకు: 0119-5 భైరవి సంపుటం: 07-113

పల్లవి: ఎంత వేగిరపడే వింతటిలోనే
చెంతనుండి యిప్పుడేల చెనకేవు నీవు

చ. 1: మనసు లోపలి మాట మంతనానఁ జెప్పీఁగాక
యెనసి యిందరిలోననేలడిగేవు
పనులేమి గలిగినా పానుపుపైఁ జెప్పీఁ గాక
వొనర యాల వొరసేవు నీవు

చ. 2: వేడుకైన ముచ్చటలు వెనకఁ జెప్పీఁ గాక
ఆడుమని మఱియేల ఆనవెట్టేవు
వీడెమిచ్చినప్పుడే వినయాలు చెప్పీఁ గాక
జాడెఱఁగకిప్పుడేల జరసేవు నీవు

చ. 3: కందువైన ముచ్చటలు కౌఁగిటిలోఁ జెప్పీఁ గాక
గందమియ్యఁగానే యేల గరిసించేవు
ఇందునే శ్రీ వెంకటేశ యేలితివి చెలినిట్టే
పొందులట్టే యిప్పుడేల బోధించేవు నీవు

రేకు: 0119-6 మంగళకౌశిక సంపుటం: 07-114

పల్లవి: ఎందాఁకఁ దెరలోన నేమి సేసేవు
చందమాయఁ బనులెల్ల చనవియ్యఁగదవే

చ. 1: చిలుకలకొలికి సిగ్గులు వడనేఁటికి
పలుకఁగదవే నీపతితోను
పిలిచి యాతఁడు నీకుఁ బ్రియములు చెప్పీని
అలుకలు దేరినిఁక నండకు రాఁగదవే

చ. 2: వనముకోగిలా వట్టిజాగులేఁటికే
కనుఁగొనవే నీకాంతునిని
చనవిచ్చి యాతఁడు సరసములాడీని
మనసులు గలిసెను మంతనమాడఁగదే

చ. 3: కొలని రాయంచా కొంక నీకేఁటికే
కలయఁగదే శ్రీవేంకటేశ్వరుని
లలినేలి నిన్నాతఁడు లాలించి కాఁగిలించి
వలపుల మితిమీరె వడదేర్చఁ గదవే

రేకు: 0120-1 ఆహిరి సంపుటం: 07-115

పల్లవి: ఏమి గట్టుకొనేవయ్య యిందువంకను
కామినులనింతసేయఁ గడు దోసమనరా

చ. 1: కమ్మి నీకు మోహించి కానుకియ్యఁగాని వట్టి
కొమ్మల నిమ్మపండ్లందుకొమ్మందురా
వుమ్మడిఁ జూచినవారు వొల్లనాలు గాఁగాను
యెమ్మెలకిప్పుడితఁడింత సేసెననరా

చ. 2: అప్పటినుండియు నేనాకు మడిచియ్యఁగాను
దెప్పరమీతమ్మ వొక్కతెకిడుదురా
కప్పితోడివారిపెపై చప్పని వలపు గాఁగా
చిప్పిలి యింతేసి కాకు సేసెనితఁడనరా

చ. 3: కైకొని శ్రీ వేంకటేశ కౌఁగిటఁ గూడుండఁగా
ఆకడనొక్కతె మాటలాలకింతురా
ఈకడ విన్నవారెల్లా నిది మేలుదిగాఁగాను
దీకొని యీతఁడు తరితీపు సేసెననరా

రేకు: 0120-2 నాట సంపుటం: 07-116

పల్లవి: వాఁడివో కంటిరటరే వన్నెలవాఁడు
పైడి మోలముకటారుపరుజులవాఁడు

చ. 1: పెద్ద కిరీటము వాఁడు పీతాంబరమువాఁడు
వొద్దికఁ గౌస్తుభ మణిపురము వాఁడు
ముద్దుల మొగమువాఁడు ముత్తేల నామమువాఁడు
అద్దిగో శంఖచక్రాల హస్తాలవాఁడు

చ. 2: అందిన కటిహస్తము నభయహస్తమువాఁడు
అందెల గజ్జలఁ బాదాల మరువాఁడు
కుందణంపు యీా మకరకుండలంబులవాఁడు
కందువ బాహుపురుల కడియాలవాఁడు

చ. 3: నగవుఁజూపులవాఁడు నాభికమలమువాఁడు
మొగపుల మొలనూళ్ళ మొలవాఁడు
చిగురుమోము వాఁడు శ్రీ వేంకటేశుఁడు
తగు నలమేలుమంగ తాళిమెడవాఁడు

రేకు: 0120-3 గౌళ సంపుటం: 07-117

పల్లవి: ఔనయ్యా మంచివాఁడవన్నిటా నీవు
వేనలి ముట్టి చెలిని వేడుక చేసేవు

చ. 1: అందలమెక్కిన నిన్ను ఆకె గొలిచి రాఁగాను
పొందుగాఁ జన్నులొత్తేవు బొట్టనవేల
అందుకుఁగా వేరొక్కతె అట్టె నిన్ను సాదించితే
విందువలె నాపె చెక్కు వేలనొత్తేవు

చ. 2: కుంచె వేసే యట్టి యాపె కుచ్చులమీఁద మోచేత
అంచలనూఁదుకొనేవు ఆయాలు సోఁక
పొంచి వేరొక్కతె నిన్ను బొమ్మల జంకించితే
చంచుల మోవి చూపి సన్నచేసేవు

చ. 3: కాళాంజివట్టే సతికైదండ వట్టుకొని
గోలవై శ్రీ వేంకటేశ గోరనూదేవు
మేలుతో నలమేలుమంగ మెచ్చికౌఁగలించుకొంటే
యీలీల నురముమీఁద నెక్కించుకొనేవు

రేకు: 0120-4 సాళంగనాట సంపుటం: 07-118

పల్లవి: ఇట్టుండవలదా యిరవైన మోహము
వొట్టుకొనీఁ జెమటలు ఉవ్విళ్ళూరను

చ. 1: తలపోసి తలపోసి తనువెల్లాఁ బులకించి
వలపులఁ బొద్దువుచ్చీ వనిత
నెలకొని పానుపుపై నిద్దిరించి నిద్దిరించి
కలలోన నిన్నుఁ గూడీఁ గామిని

చ. 2: నీ పదాలు పాడీ పాడి నెయ్యమునఁ గరఁగుచు
రాపుగానానందించీ రమణి
చూపుల నెదురు చూచి చూచి యంతలోనె తరి
తీపులనే తనిసీని తెఱవ

చ. 3: వచ్చివచ్చి నీతోడ వన్నెగా సరసమాడి
మెచ్చీనిదివో యలమేలుమంగ
యిచ్చకుఁడ శ్రీ వేంకటేశ నిన్నిపుడు గూడి
నిచ్చలు నిన్నుభోగించీ నీ పట్టపుదేవి

రేకు: 0120-5 రామక్రియ సంపుటం: 07-119

పల్లవి: రసికుఁడ తిరుపతి రఘువీరా
కొసరుగాదు నాలోని కూరిములు గాని

చ. 1: వెలయ నీవిఱిచిన విల్లువంటిది గాదు
విలసిల్లు నాబొమ్మలవిండ్లు గాని
చెలఁగి తపసుచేసే చిత్రకూటగిరి గాదు
గిలుకొట్టు నాకుచగిరులు గాని

చ. 2: మేటియై నీవు వేసిన మెకముచూపు గాదు
సూటిదప్పని నా కనుచూపులు గాని
గాఁటమై నీవు సేతువు గట్టిన జలధి గాదు
చాటువ నాచెమటల జలధులు గాని

చ. 3: తగ నీవు గెలిచిన దనుజయుద్ధము గాదు
దగతోడి నా మదన యుద్ధము గాని
నగు శ్రీ వేంకటేశ కనక సతి పొందు గాదు
పొగడే సీతనైన నాపొందులు గాని

రేకు: 0120-6 నాదరామక్రియ సంపుటం: 07-120

పల్లవి: రాఁగదవే యిఁకనేల రాపు బీరాలు
మూఁగిన మోవి తేనెకు మరిగిన దానవు

చ. 1: సిగ్గులువడ్డవారె పో చేతికి లోనౌదురు
యెగ్గులు వట్టేవారె పో యియ్యకొందురు
నిగ్గుల నెంచి చూచితే నీ కొలఁదివారా భువి
తగ్గక మరుతంత్రాల తగిలేటివారు

చ. 2: పట్టి పెనఁగే వారె పో పంతములెల్లా నిత్తురు
గుట్టు తోడనుండే వారే కూడుదురు
నెట్టన నెందరులేరు నీవలె పెచ్చురేఁగి
గట్టిగా మనసులు కరఁగేటివారలు

చ. 3: అనుమానించేవారె పో ఆసలకు లోనౌదురు
తనిసినవారె పో తమకింతురు
చెనకి యలమేలుమంగ శ్రీ వేంకటేశుఁడ నేను
మనవలెఁ గూడేవారే మచ్చికైనవారలు

రేకు: 0121-1 దేసాళం సంపుటం: 07-121

పల్లవి: ఆలికి మగనికి నాఅడేఁటికే
తాలిమితోడ లోలో తనివందరాదా

చ. 1: దొంతిఁబెట్ట వలపులు తోరపు బూజగుండలా
పంతాలు సంగడిఁ బార బండికండ్లా
యింతేసి మీరిద్దరును యేఁటికిఁ బెచ్చు రేఁగేరు
యెంతకెంత సేసేరు యెనసి వుండరాదా

చ. 2: మమతలు పేరఁబెట్ట మందలపాలా యేమి
తమకము తులదూఁచ తాసుచిప్పలా
జమళినిద్దరూనెంత సరులకుఁ బెనఁగేరు
తిమురనేఁటికి మీలో దిందుపడరాదా

చ. 3: సరిబేసి మాటలాడ జంట జూజాలా యివి
సిరులతోఁ బెనఁగఁగ జెట్టిసాదనా
గరిమె శ్రీ వేంకటేశ కాంతా నీవుఁ గూడితిరి
గరువాలేఁటికి నింకాఁ గలయఁగ రాదా

రేకు: 0121-2 సామంతం సంపుటం: 07-122

పల్లవి: దవ్వుల వీఁగక దండకుఁ జేరరె
పువ్విళ్ళూరుచు నొొదుగరె మీరు

చ. 1: చెలువులు రాతిరి చేసిన చేఁతలు
చెలితో వేగిటు చెప్పె సతి
జల జల నంతలో జడివట్టెఁ జెమట
వెలఁదులు సురటి విసరరె మీరు

చ. 2: కాంతుఁడే కాంతముగాఁ జెప్పిన కత
సంతోసమునఁ జెప్పె సకితోను
పొంతనె దొంతర పులకలు వొొడమెను
వింతలుగాఁ దెరవేయరె మీరు

చ. 3: శ్రీ వేంకటేశుఁడు చెందిన కలయిక
వావిరిఁ జెప్పం సవతితోను
చేవల నవ్వులు సెలవులఁ బొడమెను
భావించి మొక్కరె పలుమరు మీరు

రేకు: 0121-3 హిందోళవసంతం సంపుటం: 07-123

పల్లవి: చెప్పవట్టి నీ సుద్దులు చెంగట నేనుండఁగానె
కొప్పువట్టి తీయవా ఆకొమ్మను నీవిపుడు

చ. 1: చేరి తూఁగు మంచమూఁచే చెలియ చనుమొనలు
తారుచు బొట్టనవేలఁ దాఁకించవా
కోరి సిగ్గువడి యాపె కుంచెవేయ వచ్చితేను
సారెకుఁ బోఁకముడి జారించవా యపుడు

చ. 2: వీడెమియ్య రాఁగాను వెలఁదిని సన్నచేసి
కూడఁగూడ మీఁజేతులు గోరనొత్తవా
తోడనే వొడ్డించుకుంటా దోసిటఁ బువ్వులియ్యఁగా
వేడుకనుంగరమాకెవేలఁ బెట్టవా

చ. 3: కంటసరి వెట్టఁగాను కామినిఁ గాఁగిట నించి
గెంటక యాకెమోవి యెంగిలిసేయవా
యింటిలోన నన్నుఁగూడి యిదివో శ్రీ వేంకటేశ
అంటి పాదాలొత్తఁగా నీవాకెమర్మాలంటవా

రేకు: 0121-4 శ్రీరాగం సంపుటం: 07-124

పల్లవి: సూడువట్టేనని మిమ్ము సుదతి గాచుకున్నది
ఆడరాదీతగవు మిమ్మడిగేమయ్యా

చ. 1: ఉవిదచన్నులు నీవు వుంట వింట వేసితేను
తవిలి పూబంతిఁ గొప్పు తరుణి వేసె
జవళి నీరెండు వద్దిసతిమీఁదఁ బడెనదే
తివిరి పంతమెవ్వరు దిద్దవలెనయ్యా

చ. 2: కైరవడినాళమునఁ గాంతపై నీవూదితేను
వూరక నీపైఁ దమ్ములమువిసెనాపె
యీరెండు మిట్టించి యాయింతిమీఁదనె తాఁకె
తీరుగా నీచిక్కెవ్వరు తీర్చవలెనయ్యా

చ. 3: శ్రీ వేంకటేశ్వర గోరఁజిమ్మి యాపె గూడితేను
చేవ మీరఁ బాదమునఁ జిమ్మె నిన్నాపె
ఆవల రెండును వచ్చి అండనాపెకె తగిలె
కోవరపు పాందెవ్వరు గూర్చవలెనయ్యా

రేకు: 0121-5 రామక్రియ సంపుటం: 07-125

పల్లవి: నీవే జాణవైతే నిన్ను మెచ్చేను
ఆవలనెమ్మెలూరక ఆడుకోకువే

చ. 1: చలువయినదెయ్యది చవులలోనేది చవి
తలఁపులోననేది దగిలియుండు
చెలఁగు మోమేమిట చిఱునవ్వెప్పుడు వచ్చు
వలపెరిఁగితే నిది వర్ణించవే

చ. 2: ఆసలేమిట నిండు ఆయమేమిటఁ గరఁగు
బాలెందాఁకాను పనికి వచ్చు
యీసులేరీతిఁ దీరు యింపులేగతిఁబుట్టు
వాసి నేర్పులు గలితే వర్ణించవే

చ. 3: చింతలేమిటఁ బాయు సిగ్గులేవల్లఁ దీరు
పంతమెందుల వచ్చు పనిగొంటేను
యింతలో శ్రీ వేంకటేశుఁడిటు నన్ను నిన్నుఁ గూడె
వంతుదానవై తేను వర్ణించవే

రేకు: 0121-6 ఆహిరి సంపుటం: 07-126

పల్లవి: ఇంత మాయకాఁడవౌత యెఱఁగనైతి నేను
పొంతల నాచే గందము పూయించుకొంటివి

చ. 1: సారెకు నావలపు రచ్చలఁ బట్టేనని కా
పోరుచు నాచీర కాసె పోయుమంటిమి
వారి వీరిచేత నన్ను దూరించేనని కా
కేరుచు నాకొనగోర గీరించుకొంటివి

చ. 2: ఆడుకో నన్నునింత అలయించేనని కా
వేడుకతోఁ గమలాన వేయుమంటివి
జాడతోనింతేసి దోసాలు గట్టేనని కా
వీడక తొడపైఁ దొడ వేయించుకొంటివి

చ. 3: పందెమాడి నన్నునింత పచ్చి చేసేనని కా
చెంది నీమోవి యెంగిలి సేయుమంటివి
అంది శ్రీ వేంకటేశ నన్నంటి పాయనని కా
ముందరనే నన్నుఁగూడి మొక్కింపించుకొంటివి

రేకు: 0122-1 పాడి సంపుటం: 07-127

పల్లవి: చుట్టమవో మఱి నీవు సూడుబంటవో
గుట్టుతోడనుండఁగానే గోరసేతురా

చ. 1: సెలవుల నవ్వుతానే చేతిగోరఁ జిమ్ముదురా
పలువినయాలు చేసే పడఁతిని
కొలువు సేయించుకొంటాఁ గొప్పువట్టి తీతురా
వలపులు నెరుపే నీవద్దిదానిని

చ. 2: చల్లని మాటాడుతా చన్నులు విసుకుదురా
మెల్లనే పాదాలొత్తే మెలుఁతను
కొల్లగా నాకందుకొంటాఁ గొంగువట్టి తీతురా
వుల్లము నీకొప్పగించి వుండేటిదానిని

చ. 3: కన్నులను మొక్కుతానే కౌఁగిట బిగింతురా
సన్నలఁ బ్రియము చెప్పే జవరాలిని
యెన్నఁగ శ్రీ వేంకటేశ యేలితివి చెలినిట్టే
మన్ననల విబ్బవీఁగి మలసేటిదానిని

రేకు: 0122-2 ముఖారి సంపుటం: 07-128

పల్లవి: నేనూ నీదేవులనే నిందుకవుండుట మేలు
పేని పట్టి యిందుకేల పిలిచేవు నీవు

చ. 1: మగువలకు నీకును మాపుదాఁకాఁ గొచ్చి కొచ్చి
తగవులు చెప్పనేల తడవనేల
వెగటుగా మీలోమీరు వేసాలకునలిగితే
పగటుతోనింతవొడఁబరచఁగనేలా

చ. 2: పోసరించి వూరివారి పొందులు నేయించి నీచే
బాసలు సేయించనేల పరచనేల
బేసబెల్లితనముల పెనఁగులాడఁగ మిమ్ము
తోసుకవచ్చి యడ్డము తూర నాకేలా

చ. 3: అవ్వలిమోమైన మిమ్ము నాఁకలి గొంటిరంటా
బువ్వానఁ బెట్టఁగనేల పొదుగనేల
యివ్వల శ్రీ వేంకటేశ యేలితివి నన్నునిట్టే
రవ్వల మీరతులెల్లా రాఁపు సేయనేలా

రేకు: 0122-3 నాదరామక్రియ సంపుటం: 07-129

పల్లవి: చెప్పరాదు నీవుండేటి చెలువములు
చిప్పిలీ నీమేననెల్లా సింగారాలు

చ. 1: కతలుగాఁ బానుపుపై కాఁగిటఁ బెనఁగేవేళ
సతిచెమటే పన్నీటి జలకములు
యితవుగా లోలోన యెనసి వుండేటివేళ
గతిగూడ నవ్వేనవ్వు కప్పురకాపు

చ. 2: సొలసి సొలసి నీతో జోడైవుండేటివేళ
తలిరుఁబోడిచూపులే తట్టుపుణుఁగు
పులుకనితమకాన పురమెక్కినట్టివేళ
నిలువుమేనికాంతి నీమేని సొమ్ములు

చ. 3: అంగపురతులఁ గూడి అలసివుండేటివేళ
అంగనమోవితీపులే యారగింపులు
చెంగటనలమేల్మంగ శ్రీ వేంకటేశ నిన్ను
నంగవించి కూడె నీవే యఖిలభోగాలు

రేకు: 0122-4 హిజ్జిజి సంపుటం: 07-130

పల్లవి: ఎప్పుడును దొరలతో యేలాటములైనా మేలు
చప్పనైన నీచులతో సంగాతాలకంటెను

చ. 1: జక్కవపులుగులు నీచన్నులకు నోడినాను
పెక్కుదేశములనెల్లాఁ బేరుపడెఁగా
నిక్కి తుమ్మిదలు నీనెరులకెన రాకున్నా
మిక్కిలి మొరసెననే మేకులైనాఁ గల్గెఁగా

చ. 2: చందురుఁడు నీమొగముతో సరిరాకున్నా లోలో
కుందుచునుపమలకు గుఱుతాయఁగా
నిందతోడ సింహము నీనడుముఁ బోలకున్నా
యెందుఁ దలఁపించుకొని యీడువెట్టుకొనెఁగా

చ. 3: అంచలు నీనడపుల అందములు రాకున్నా
యెంచి కవితలలోన నిరవాయఁగా
నించి శ్రీ వేంకటేశుఁడు నీకౌఁగిటఁ గూడినాను
పెంచెపుటురాన నిన్నుఁ బెట్టుకొనెఁగా

రేకు: 0122-5 శ్రీరాగం సంపుటం: 07-131

పల్లవి: కంటిమి నేమీభాగ్యము కన్నుల తుదలను నీఁడిదె
జంటలు నీకీవిద్దెలు సాజమె కదవయ్యా

చ. 1: విందులమోవులయీవులు వీఁపుననానినకుచములు
పొందులకొనగోరొత్తులు పొలఁతికి నీకమరె
చిందేటి నెలవుల నవ్వులు సిగ్గుల మోముల వంపులు
కందుననుండెడి యీచెలికత్తియలకు నమరె

చ. 2: తొడఁదొడ మోచినమేలముదోమటివీడెపుటుదుటులు
జడిగొను చూపుల ననుపులు సతికిని నీకమరె
యెడనెడఁ బయ్యెదమరఁగులు యెఱుఁగమి సేయు పరాకులు
ఆడియాలపుమీకొలువులయంగనలకు నమరె

చ. 3: ఆయములంటినమఱపులు నడఁచియు నడఁచని వూర్పులు
యీయెడ శ్రీ వేంకటేశ యిద్దరికిదె యమరె
చాయల సన్నలపదరులు సరిఁదెరవాల్చిన నేర్పులు
పాయని నీవూడిగముల పడఁతుకలకునమరె

రేకు: 0122-6 ఆహిరి సంపుటం: 07-132

పల్లవి: బాపురే నేమచ్చితిని భాగ్యమాయను
ఆపె భోగించినవి నీకందమాయను

చ. 1: వనిత చెక్కులవెంట వడిసే జవ్వాదినే
మినుకై నీమేనెల్లా మెఱుఁగాయను
పెనఁగులాడేటివేళ బెరసిన చెమటల
పనుపడి నీతమికిఁ బదనాయను

చ. 2: రమణి కొప్పువిరులు రాలి నీపైఁ జిందఁగాను
సమరతివెట్ట దీరి చల్లనాయను
జమళి సరసమాడ చన్నుల కస్తూరిపూఁత
అమరి నీవురమున కడియాలమాయను

చ. 3: పడఁతిమోవితేనెలు పలుమారు నీకియ్యఁగా
విడువని నీపొందుకు విందులాయను
అడరి శ్రీ వేంకటేశ అట్టె నన్నునేలితివి
బడిబడినే మేలు పైకొసరాయను

రేకు: 0123-1 సామంతం సంపుటం: 07-133

పల్లవి: దయ దలఁచేదికఁ దనచిత్తము
నయముగా మాటాడితే నాభాగ్యము

చ. 1: మొగము చూచి నేను మొక్కి నిలుచుండఁగానే
తగవులు నడపినాఁ దనచిత్తము
జిగితోఁ దనపాదాలసేవలు నేఁ జేయఁగాను
నగి యెంత మన్నించినా నాభాగ్యము

చ. 2: కలిమితోఁ దనకు నే కాపురము సేయఁగాను
తలఁ పెంత గలిగినాఁ దనచిత్తము
పిలిచి యప్పటి నేనే ప్రియములు చెప్పఁగాను
నలిరేఁగి మెచ్చేది నాభాగ్యము

చ. 3: కనుఁగొని నేఁ దన్ను కాఁగలించి కూడఁగాను
తనివెంత సేసినానుఁ దనచిత్తము
యెనసె శ్రీ వేంకటేశుఁడిచ్చకము నేనాడఁగా
ననుపై యిట్టేవుండేది నాభాగ్యము

రేకు: 0123-2 రామక్రియ సంపుటం: 07-134

పల్లవి: ఊరకున్నా నెఱఁగఁడు వొడులు సోదించ వచ్చీ
కేరి వొక్కరొక్కరమే గెలువఁగలేమా

చ. 1: అంకులచేతులు వట్టి యానలేల పెట్టీని
సంకెలేని కొయ్యకాఁడు జాజరకాఁడు
మంకుల గొల్లెతలము మందవారమెల్లాఁ గూడి
కుంకుమగుబ్బలనే కుచ్చి యెత్తలేమా

చ. 2: చల్లచాడెలంటుకొని జాణతనాలాడీని
పల్లదపు గద్దరీఁడు బయకాఁడు
కల్లరి దొడ్డివారము కన్నెలమెల్లాఁ గదిసి
పల్లుసోఁకులనె మోవి పచ్చిసేయ లేమా

చ. 3: తోడనె వెన్నదుబ్బలు తొడుకనేల వచ్చీని
వేడుకకాఁడు శ్రీ వేంకటేశుఁడు
కూడె మమ్ము రేపల్లెకొమ్మలెల్లానిఁక
వీడెపుఁ దమ్ములు వెట్టి వింతసేయలేమా

రేకు: 0123-3 కేదారగౌళ సంపుటం: 07-135

పల్లవి: ఓరుచుకోవే యెట్టయినా వువిద నీవు
నేరుపరి నీవిభుఁడు నేఁడే వచ్చీనీడకు

చ. 1: కలువల వేసితేలే కాముఁడు చుట్టము గాఁడా
వెలయు విరహులకు వెగటుగాక
చలివెన్నెల గాసితే చందురుఁడు పగవాఁడా
పొలయలుకలవారే పొగడరుగాక

చ. 2: కొసరుచుఁ బాడితేనే కోయిలగుండెబెదరా
అసు (స?) దు విరహులు కాదందురుగాక
ముసరితేఁ దుమ్మిదమూఁకలు దయలేనివా
విసిగిన కాముకులే వినలేరుగాక

చ. 3: వనము సింగారించితే వసంతుఁడు క్రూరుఁడా
వొనరని విరహులకొంటదుగాక
యెనసి శ్రీ వెంకటేశుఁడేలె నిన్ను చిలుకలు
కినిసేవా పాంథులకు కేరడముగాక

రేకు: 0123-4 మధ్యమావతి సంపుటం: 07-136

పల్లవి: ఆతఁడిచ్చిన చనవే అన్నిటా నీకు
గాతసేయకింతట మొక్కఁగరాదా నీవు

చ. 1: సన్నచేసి రమణుఁడు సలిగె నీకిచ్చెనంటా
యెన్నిమాటలాడేవే యేమే నీవు
ఉన్నతినెందుకైనాను వోరిచీనాతఁడంటా
మిన్నక నేఁడెంత మేరమీరేవే నీవు

చ. 2: దొరతనమిచ్చి నీపొందులకు లోనాయనంటా
కెరలి యేమిటికి జంకించేవే నీవు
సిరుల నీచేఁతలెల్లాఁ జెల్లించీనంటాను
వొరసి గోరనేల వూఁదేవు నీవు

చ. 3: కదిసి యాతఁడు మెచ్చి కాఁగలించుకొనెనంటా
వుదుటుఁ జన్నులనేల వొత్తేవే నీవు
వెదకి యిటువంటి శ్రీ వేంకటేశుఁడేలెనంటా
ముదమున రతినెంత ముంచేవే నీవు

రేకు: 0123-5 శంకరాభరణం సంపుటం: 07-137

పల్లవి: దేవ నీవునికి తేటతెల్లమాయను
భావించ మాకుఁ గన్నులపండుగాయను

చ. 1: పన్నీటిజలకములు భామకనుచూపులును
యెన్నికెఁ గూడుక నీమైనేరులై పారె
తిన్ననిచెమటలెల్లా తిరుమేననెల్లా నిండి
అన్నిటా ముత్యాలపెనుహారములాయ

చ. 2: తెల్లని కప్పురకాపుతెలవనవ్వులు గూడి
పొల్లుగాని పుప్పొళ్ళపోగులాయను
మెల్లనె నీవురూపుల మించుల రవలురేఁగి
వొల్లనె తడిసూళ్ళవొత్తులాయను

చ. 3: అంగంపుఁ బుళుగుకాపు అలమేలుమంగఁ గూడి
సింగారాలాయను మంచిసిరులాయను
ముంగిట శ్రీ వేంకటేశ మోహనపుమీకూటమి
సంగతిఁ బువ్వుదండల జాడలాయను

రేకు: 0123-6 ముఖారి సంపుటం: 07-138

పల్లవి: నీవే యింత సేతువట సేనియ్యకొనలేనా
పోవులై నీకే చింత పుట్టునని కాక

చ. 1: తాపానఁ బొందింతువట తగనేఁబొరలలేనా
పాపముఁ నీకంటుననే భయముగాక
కోపగింతువట నీవు కోరి నేనోరువలేనా
దీపించనన్నిటా నీకుఁ దిట్టువాటని కాక

చ. 2: ఆసకొలుపుదువట అలఁతకోఁగలేనా
దాసులు నిన్ను నమ్మరింతానని కాక
మోసపుత్తువట నీమొరఁగుకు లోఁగాలేనా
వీసమంత నీదయకు వెలితని కాక

చ. 3: కొఁగలింతువట నిన్నుఁ గరఁగించ నేలేనా
చేఁగ నీచిత్తము దెలిసేనని కాక
దాఁగక శ్రీ వేంకటేశ దక్క నన్నుఁ గూడితివి
తూఁగలేనా నీకు సరి దొరవని కాక

రేకు: 0124-1 నాదరామక్రియ సంపుటం: 07-139

పల్లవి: చిత్తగించవయ్యా చెలియసింగారాలు
కొత్తకొత్తబాగులై గుంపులు గట్టీని

చ. 1: వలిపెపయ్యదలోన వడివెట్టు వలపులు
కలికి చన్నులై మించెఁ గాంతకును
కులుకుఁజూపులెల్లాను కూడపోయఁగానె కాదా
తలరాశై చీఁకటి దట్టపుఁ గొప్పాయెను

చ. 2: మనసులో కోరికలు మట్టుమీరి దైవారి
పెనుఁబులకలై నిండి పెరిగె మేన
పెనపరిమాటలెల్లా పెదవిపై నూరి వూరి
తనివోని యధరామృతములై నిలిచెను

చ. 3: జిగిమించు రతులలో చిమ్మిరేఁగి వేడుకలు
మొగమునఁ గళలై ముంచుకొనెను
తగిలి శ్రీ వేంకటేశ తతినీకెఁ గూడితివి
నగవులు సెలవుల నారుకొనఁ జొచ్చెను

రేకు: 0124-2 భైరవి సంపుటం: 07-140
పల్లవి: ఎంతవాఁడవయ్య నీవు యేమని పొగడుదును
పొంతనే నీమేలక్కునఁ బోసి చూపవచ్చును
చ. 1: గొంటరిసతులు నిన్నుఁ గొసరుదురింతెకాని
నంటున నీబాసలన్నీ నమ్మవచ్చును
వొంటిఁ జిక్కించుక నిన్నునొరయుదురింతెకాని
జంట నీమంచితనాలు చాటించవచ్చును
చ. 2: నాలికత్తెలు నీమాఁట నవ్వుదురింతెకాని
వాలాయించి మంత్రముగా వ్రాయవచ్చును
పోలించి మంచిగుణాలు బోధించవత్తురుగాని
మేలిమి నీకీర్తెల్లా మెఱయించవచ్చును
చ. 3: తక్కరికాంతలు నీతో తమకింతురింతె కాని
పెక్కు నీరతులు దొంతిఁ బెట్టవచ్చును
అక్కరతో శ్రీ వెంకటాధిప నన్నేలితివి
వెక్కసపు నీమహిమ వెలయించవచ్చును

రేకు: 0124-3 ముఖారి సంపుటం: 07-141

పల్లవి: ఇంకనేల దాఁచేవు యిన్నియు నెరుంగుదుము
కొంకు గొసరెల్లాఁ దీరె కోడెకాఁడా

చ. 1: మచ్చికైన యీయింతిమాఁటలచవులఁ జొక్కి
వచ్చినదెరఁగమా వన్నెకాఁడ
యిచ్చగించి యేపొద్దు యీపెచన్నుఁగవకే
పచ్చారేది యెఱఁగమా పంతగాఁడా

చ. 2: నంటున యీపె సెలవి నవ్వుల పసఁ దగిలి
యింటనుండేదెఱఁగమా యెమ్మెకాఁడ
జంటల నప్పటిఁ గన్నుసన్నలకు లోనై
వెంట వచ్చేదెఱఁగమా వేడుకకాఁడా

చ. 3: దినదినమీ పె మోవితేనెలకాసపడేవు
మనసు నేమెరఁగమా మాయకాఁడ
యెనసితి విటు నన్ను యిప్పుడె శ్రీ వేంకటేశ
ఘనుఁడ నిన్నెరఁగమా కతలకాఁడా

రేకు: 0124-4 హిజ్జిజి సంపుటం: 07-142

పల్లవి: నీవే విచారించుకొమ్మా నెఱజాణవు
యీవేళఁ జెలియమోహమిచ్చగించవచ్చును

చ. 1: చెంతనుండి కొలువులు సేసేటిరమణితో
పంతమాడవద్దుగాని పనిగొనవచ్చును
మంతనాన నీతో మనవి చేప్పేవేళను
వింతసేయవద్దుగాని వీనులొగ్గవచ్చును

చ. 2: కోరి నిన్ను వేఁడుకొంటా గుట్టుతోనున్న చెలిని
జేరఁదీయవద్దుగాని చెక్కునొక్కవచ్చును
వూరకైన వట్టితేనెలూర మాటలాడి చప్పు
చారు సేయవద్దుగాని చవిగొనవచ్చును

చ. 3: తాలిమితో కౌఁగిటికి తమకించే వనితను
జాలిఁబెట్టవద్దుగాని చన్నులంటవచ్చును
యేలితివి శ్రీ వేంకటేశ యిన్నిటానీకెను
బేలుఁజేయవద్దుగాని ప్రేమ నించవచ్చును

రేకు: 0124-5 వరాళి సంపుటం: 07-143

పల్లవి: ఇప్పుడే యేల పెనఁగేవీకెతో నీవు
లప్పలకప్రమచ్చి యలపు దీర్చవయ్యా

చ. 1: కలకల నవ్వుతాను కాంత పరువున వచ్చి
బలిమిఁ గాఁగిట నిన్ను నలమఁగాను
వెలయంగఁ గొప్పు విడి విరులు జల్లున రాలె
ములువాడిగోళ్ళదువ్విముడువవయ్యా

చ. 2: వొట్టువెట్టి పోకుమని వొడివట్టుకొని నిన్ను
దిట్టయై తెరలోనికిఁ దియ్యఁగాను
గుట్టునఁ బయ్యదెడలి కుచములు గానవచ్చె
జట్టిగొని పూరడించి చక్కఁబెట్టవయ్యా

చ. 3: గయ్యాళితనముచూపి కళలంటి రతిసేసి
నెయ్యపుమోవితేనెలు నించఁగాను
చయ్యన శ్రీ వెంకటేశ సరులెల్లాఁ బెనగొనె
యియ్యెడఁ జిక్కుదీరిచి యేలుకొనవయ్యా

రేకు: 0124-6 ఆహిరి సంపుటం: 07-144

పల్లవి: సిగ్గరి పెండ్లికూఁతురు చెలియనింతసేతురా
తగ్గక సెలవి నవ్వు తతిగొనెను

చ. 1: పువ్వుల వేసినవేటు పుప్పొడి నిండాఁ జింది
జవ్వని చన్నులమీఁద జాజుకొనెను
చివ్వన మైచెమరించి చిత్తడిచెమటతోడ
దువ్వటపుఁ బయ్యదెల్లాఁ దొప్పఁదోఁగెను

చ. 2: పన్నీటఁ జిమ్మిన చిమ్ము పదను పైపైఁ గప్పి
కన్నెచెక్కులమీఁద కారుకమ్మెను
వున్నతితోఁ బులకించి వొగిఁ బోకముడి జారి
తన్నుఁదానె నిట్టూర్పులఁ దడఁబడెను

చ. 3: గందానఁ బూసినపూఁత కడగి లప్పలు గట్టి
యిందుముఖిలమేల్మంగకింపులాయను
కందువ శ్రీ వేంకటేశు కౌఁగిటఁ బేంట్లు రాలి
సందడిరతులలోన సంగతాయను

రేకు: 0125-1 శ్రీరాగం సంపుటం: 07-145

పల్లవి: బొమ్మల జంకించెనంటా పొలఁతిని దూరేవు
క్రమ్మరనిందుకుఁగానె కరఁగీ లోలోపలను

చ. 1: జక్కన పిట్టలవంటి చన్నులమీఁద నీవు
వుక్కువంటి కొనగోరనూఁదవచ్చునా
లక్కవంటి మనసిది లలన యిందుకుఁగానె
వొక్కరీతి సిగ్గువడి వున్నది లోపలను

చ. 2: తలిరాకువంటి మెత్తనిమోవిమీఁదను
ములువాడిదంతములు మోపవచ్చునా
కలువకామవంటి కామిని యిందుకుఁగానే
వులువచ్చి (?) చేఁతలతో వున్నది లోపలను

చ. 3: కడులేఁతతీగెవంటి కాయముమీఁద నిట్టే
అడరి నీగట్టియురమదిమితివి
యెడయక శ్రీ వేంకటేశ యిందుకుఁగాఁ జెలి
వుడివోని రతులతో నున్నది లోపలను

రేకు: 0125-2 శంకరాభరణం సంపుటం: 07-146

పల్లవి: మరగి నాపొందె నీకు మాటుమందు
సరుసనిద్దరమును సతులమె కామా

చ. 1: వెన్నెలబాయిట నీవు వెలఁదిఁ దలఁచుకొని
వన్నెకాఁడ విరహాన వడదాఁకేవు
నన్ను నాకెమారుగా మనసున నిలుపుకొని
చెన్నుమీరఁ గాఁక చల్లఁజేసుకొనరాదా

చ. 2: సింగారపుఁదోఁటలోన చెలిని దవ్వులఁ జూచి
అంగపుఁజెమటనుస్సురస్సురనేవు
చెంగట నన్ను నాకె చెల్లెలిఁగా భావించుక
సంగడినలపార్చుక సంతోసించరాదా

చ. 3: ఇందుకాంతవేదిపైనింతితోడ మాఁటలాడి
కందువలు గరఁగుచుఁ గాఁగలించేవు
పొందితివి నన్ను నాకె పోలికలకే నీవు
అందపు శ్రీ వేంకటేశ అట్టే కానీరాదా

రేకు: 0125-3 పాడి సంపుటం: 07-147

పల్లవి: ఇంతటి నీ నోముఫలమేమి చెప్పేది
కాంతరో యిదె నిచ్చకల్యాణముగాదా

చ. 1: మాట జవదాఁటని మగవాఁడు గలిగితే
ఆఁటదాని భాగ్యమేమని చెప్పేదే
యీటునఁనాతఁడుఁదాను యేకచిత్తమైవుండితే
చాటువకెక్కిన జన్మసాఫల్యము గాదా

చ. 2: వెంటవెంటఁ దిరిగేటి విభుఁడు గలిగితేను
యింటిలోనిల్లాలిపుణ్యమేమి చెప్పేదే
బంటువలెఁ బనిసేసి పాయకాతఁడుండితే
అంటి మనోరథఫలమబ్బుటది గాదా

చ. 3: పక్కవాయకుండేటి ప్రాణేశుఁడు గలిగితే
యెక్కువైన సతిసౌఖ్యమేమి చెప్పేదే
ఇక్కడ శ్రీ వేంకటేశుఁడిటు నిన్నూ నన్నుఁ గూడె
తక్కక మనకుఁ దాఁ బ్రత్యక్షమవుటగాదా

రేకు: 0125-4 సాళంగనాట సంపుటం: 07-148

పల్లవి: తనకు బుద్ధిచెప్పేటి దాననా నేను
చనవున విన్నవించే సమ్మతించుమనవే

చ. 1: బడివాయకుండితేను పాయమే కామధేనువు
యెడయని పతులకు నింతులకును
చిడిముడి మానితేను చిత్తమే తనచుట్టము
తడయక రమణునిఁ దలఁచుకొమ్మనవే

చ. 2: వదలక కూడుండితే వలుపే సామ్రాజ్యము
సదరానఁ బైకొనేటి జాణలకును
కదిసి వెత మానితే కాయమే నిధానము
యెదలోన తన్నుఁదానె యెరుఁగుకొమ్మనవే

చ. 3: కందువలొనఁగూడితే కాఁగిలే కల్పతరువు
సందడిఁ బెనఁగ నేర్చే సరసులకు
యిందరిలో శ్రీ వేంకటేశుఁడు నన్నేలినాఁడు
మందలించి యిట్లానే మన్నించుమనవే

రేకు: 0125-5 కాంబోది సంపుటం: 07-149

పల్లవి: వేసాలు వేయఁగనేలే వేడుకకాఁడు
రాసులు వోసున్నవవే రచ్చలఁ దనబాసలు

చ. 1: మంతనములేలాడీనే మగువలతో నెల్లాను
సంతలోని వలపుల జాజరకాఁడు
వింతలెవ్వరితోఁ జేసీ విద్యలన్నీ నెఱుఁగుదు
దొంతిఁ బెట్టుకున్నదాన తొంటితనసుద్దులు

చ. 2: ప్రియముతో వావులేల పెనచీనే చెలులతో
బయలీఁతనగవుల బచ్చెనకాఁడు
నయములెంత చూపీనే నాకుఁదెలుసునన్నియు
క్రయముగాఁ గొంటిఁ దనకందువమర్మములు

చ. 3: జాడనింతులకు మోవిచవులేల చూపీనే
గాడిఁగట్టుకూటముల కతలకాఁడు
యీడనే శ్రీ వేంకటేశుఁడేలినాఁడు నన్నునిట్టే
కూడపెట్టుకొంటిఁ దనగురుతైన చేఁతలు

రేకు: 0125-6 బౌళి సంపుటం: 07-150

పల్లవి: ఏమని చెపఁగవచ్చు యింతా నీభాగ్యమే
వేమారునెంచి చూచితే వింతలై నిలుచును

చ. 1: ధరలోఁ గప్పురమందరికిఁ జల్లనైయుండు
విరహులకైతేను వేఁడై యుండును
తరుణులకు నవ్వులు తగవినోదమైయుండు
కెరలించ నీకవే వెంగెములై పరగును

చ. 2: ఇమ్ముల సంపంగిపూవులిందరికితవై యుండు
తుమ్మిదలకైతేనే దొరయకుండు
కొమ్మలకు జంకెనలు కోరి సింగారాలై యుండు
వుమ్మడి నీకైతే మర్మాలొరయుచుండును

చ. 3: భూమికెల్లాఁ జందమామ పొసఁగించు వేడుకలు
తామరలకైతేనే తలవంపులు
కామించి శ్రీ వేంకటేశ గక్కన నన్నేలితివి
యీమేలు నీకైతేను యియ్యకోలై యుండను

రేకు: 0126-1 శంకరాభరణం సంపుటం: 07-151

పల్లవి: దొరవైతేనేమాయ దోసమా మీలో మీకు
యెరవులేనిచోటికి యితవులే కావా

చ. 1: పలుమారునాపెనిట్టే పాటలు వాడుమనేవు
మెలుపున నీవు దండె మీటరాదా
చెలువుఁడవీమాటకు సిగ్గువడేవదియేమీ
కలుపుకోలైన మేళగాఁడవు గావా

చ. 2: అంతలోనే పగడసాలాడుమనేవాకెను
యింతి యలసెఁ బాసికలెత్తియ్యరాదా
పంతాన నామోము తప్పక చూచేవదియేమీ
వంతుకుఁ బాగకాఁడవీవల నీవేకావా

చ. 3: పొందుగా పరిమళము పూయమని పెనఁగేవు
గందము దీసిచ్చి పొదుగఁగరాదా
చెంది నన్నుఁ గూడితివి శ్రీ వేంకటేశ యేమీ
యిందుకునందుకు నీవే హితుఁడవు గావా

రేకు: 0126-2 గుజ్జరి సంపుటం: 07-152

పల్లవి: తనిసినదాఁకా తానే తగులుఁ గాక
కనుఁగొన్నవారికేల కాఁతాళించఁగను

చ. 1: యేడలేని సతులఁ దానెందరిఁ బెండ్లాడినాను
వాడవారికేమి వోదు వద్దనఁగను
జాడతోడ జవ్వనుల చన్నులాతఁడు మోచితే
వేడుకకత్తెలకేల వేఁగు వచ్చెనే

చ. 2: నారుకొన నెన్నికంకణాలు దాఁగట్టుకొనినా
వూరివారికేమిటికే వుప్పతించను
కోరి కొమ్మలచే మోవిగురుతులు సేయించుకొంటే
పేరటాండ్లకేమిటికే పెదవులు విరుచ

చ. 3: వరుసలు వెట్టుకొని వనితలఁ గూడఁగాను
పొరుగువారికినేలే బుద్ధిచెప్పను
యిరవై శ్రీ వేంకటేశుఁడితఁడిట్టే నన్నునేలె
యెరవులవారికేలే యేఁకట చూపఁగను

రేకు: 0126-3 గౌళ సంపుటం: 07-153

పల్లవి: ఇద్దరికి మీకుఁ దగునింతలేసి
బద్దులేల నెరపేవు బారెఁడేసి

చ. 1: నెలకొన్న సేఁతలు నీవేమి సేసితివొ
సెలవుల నవ్వినాపె చేటఁడేసి
మలసి మలసి నీవు మర్మములెట్టంటితివో
కులికీని సిగ్గులెల్లా గుంపెఁడేసి

చ. 2: సందడి మీ కెటువలె సమ్మతులైనవొ కాని
కందువమాఁటలాడీని గాదెఁడేసి
మందలించి నీవెంత మరిగించితివొ నేఁడు
పొందులు చూపీనిట్టే పుట్టెఁడేసి

చ. 3: మంచముపై రతినెంత మనసు గరఁగించితివొ
వంచీఁ జూపులు నీపై వామెఁడేసి
యెంచఁగ శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నించి వలపులెల్లా నిలివెఁడేసి

రేకు: 0126-4 బౌళి సంపుటం: 07-154

పల్లవి: నేనెఱంగనా నీనేరుపులివి
నానాగతుల లాలించి నవ్వింతువు

చ. 1: వెలి నీవేడనుండినా వెసనేఁదలఁచితే నా
తలఁపులోననెయుండి దయసేతువు
లలినెంతపరాకైనా లక్షించి నిన్నుఁ జూచితే
చలువమోవియొసగి చనవిత్తువు

చ. 2: పాటించి నీపేరుకుచ్చి బయలుమాఁటలాడితే
మాటలోనుగానే వచ్చి మన్నింతువు
నీటునఁ గొలువులోన నీకు నేనిట్టె మొక్కితే
చోటు చూపి నాతోనే సుద్దులు చెప్పుదువు

చ. 3: ఆతలిమోమైవుండఁగానట్టే చేతులు చాఁచితే
చేతులనే సన్నసేసి చెనకుదువు
యీతల శ్రీ వేంకటేశ యిటు నన్నుఁ బెండ్లాడితి
రాతిరిఁ బగలు నన్ను రతులఁ జొక్కింతువు

రేకు: 0126-5 రామక్రియ సంపుటం: 07-155

పల్లవి: ఎదుటనేవుండి యాల యెలయించేవే
అదనఁ జేకొనఁగాను అలయకువే

చ. 1: కలికి నీకన్నులు కడు సోగలు
మొలక చన్నులె ములుచేఁగలు
వెలయ వలచె నీవిభుఁడిందుకే
పిలిచీ సారెకునిఁకఁ బెనఁగకువే

చ. 2: నీలాలవంటివి నీకప్పునెఱిఁగురులు
తాలిమి నీనడపులు తగుఁగరులు
కాలమందె మోహించె నీకాంతుఁడిందుకే
కేలుచాఁచీ నీమీఁద జంకించకువే

చ. 3: ముంచిన నీచెక్కులద్దముల మించులు
పంచ మోవిచుంచులు బింబపుటంచులు
యెంచఁగ శ్రీ వేంకటేశుఁడేలె నిందుకే
కంచపురతి యొసఁగె కదుమకువే

రేకు: 0126-6 సాళంగనాట సంపుటం: 07-156

పల్లవి: ఎగసక్కెడవు నిన్నునేమి చెప్పేము
నగితేనే సెలవుల నానఁబాలు చూపేవు

చ. 1: చిల్లరలయ్యిన నీచేఁతలే కొత్తలుగాక
తొల్లిటివాఁడవేకావా దొరవు నీవు
గొల్లదాననైతేనేమి కొలువుకు వచ్చితేను
చల్లకుండలంటాను నాచన్నులంటేవు

చ. 2: అప్పటప్పటికిఁ బెట్టే ఆనలే వేరుగాక
యెప్పటిగుణాలేకావా యెంచితే నీకు
కప్పి దొడ్డివారమైతే కన్నులమొక్కినంతలో
పిప్పి మీఁగడున్నదంటా పెదవులానేవు

చ. 3: మత్తిలి నన్నేలితివి మన్ననలెన్నిచ్చినాను
పొత్తులకాఁగిలేకాదా భోగించేది
హత్తి శ్రీ వేంకటేశ ఆలవారమైతేఁ జూచి
కొత్తపేయల గూడంటా కొప్పంటేవు

రేకు: 0127-1 గుండక్రియ సంపుటం: 07-157

పల్లవి: భావమెరఁగనివారు పచ్చెందురుగాని గోరు
తావులెరిఁగితే సురతపుసొమ్ము గోరు

చ. 1: అలిగినవేళలనంటకుండాఁ జిమ్ము గోరు
వలపు నిలుపరాక వడిఁజాఁచేదొక గోరు
చలపట్టి వేరొకతె జగడము దీసే గోరు
బలిమి పంతానకుపచరించేది గోరు

చ. 2: శిరసువంపులలోని సిగ్గులు వాపేది గోరు
సరిఁ బరవశములెచ్చరించు గోరు
వొరసితే గురిసేను నుబ్బుఁగవణపు గోరు
సరసమాడేవేళ చవిరేఁచు గోరు

చ. 3: సమ్మతించకుంటేఁ దాఁకి జంటకు లోఁజేసు గోరు
పమ్మి మనసుకుఁ జలివాపు గోరు
దిమ్ముల వయోమదము తెలియని సాక్షి గోరు
కొమ్మ శ్రీ వేంకటేశుతోఁ గూడే యిక్కువ గోరు

రేకు: 0127-2 పాడి సంపుటం: 07-158

పల్లవి: నేనెఱఁగనా వోయి నీజాడలు
లేని మరుఁగులు వెట్టి కాననీవు వలపు

చ. 1: యింతిఁజూచి యారూపే యదలోనఁ బెట్టుకొని
చెంతనున్న సతులనుఁ జిత్తగించవు
మంతనాననాడిన మాటలు దలఁచుకొని
వింతవారిమాటలు వీనులఁబెట్టవు

చ. 2: యెదుటనే ఆపెనవ్వు యెగపోసి దిగపోసి
కదిసెందరు నవ్వినాఁ గనుఁగొనవు
మొదలఁ గూడినభావములకు లోలోఁ జిక్కి
సుదతులెందరంటినా సోంపులఁ గరఁగవు

చ. 3: ఘనమైన చన్నుల కాఁగిలి యిట్టే మరిగి
పనిగొన్న తమకాన భ్రమసితివి
యెనసితివిటు నన్ను యింతలో శ్రీ వేంకటేశ
ననుపుసతుల సన్నలకిచ్చగించవు

రేకు: 0127-3 దేసాక్షి సంపుటం: 07-159

పల్లవి: ఏమని వుండునొకో యీతని మనసులోన
వేమరుఁ జెలులు విన్నవించరె మీరైనను

చ. 1: పంతమునఁ దనుఁ జూచే పరాకున నేను
మంతనానఁ గాఁగిలించ మఱచితిని
సంతసాన మాఁటలాడే సంబురముతోడనే
యింతలో ముత్యాలఆరతెత్త మఱచితిని

చ. 2: ననుపునఁ దనతోడ నవ్వేటివేడుకనే
మనవిఁ బ్రియము చెప్ప మఱచితిని
చెనకి పెండ్లిపీటపై నేసచల్లే సందడినె
పెనఁగి మోవివిందు పెట్టమఱచితిని

చ. 3: వొఱగి తనవద్దఁ గూచున్న మందెమేళాననే
మఱఁగుగఁ దెరవేయ మఱచితిని
యెఱిఁగి శ్రీ వేంకటేశుఁడేలె నన్ను మన్నించి
నెఱవైన గురుతులు నించ మఱచితిని

రేకు: 0127-4 ధన్నాశి సంపుటం: 07-160

పల్లవి: ఒక్కటి విన్నపమే వున్నమాటఁలికనేల
యిక్కువతో రమణునికెరుఁగించఁ గదవే

చ. 1: యెడమాటలాడేనంటే యోందాఁకఁ దిరుగవచ్చు
నడుమఁ దనచిత్తము నాభాగ్యము
తడయక చూచెనంటే తనివి యెంతటఁ గల్గు
చిడిముడి నాచనవు చెల్లించుమనఁగదే

చ. 2: యెలమిఁ బెనఁగేనంటే యెంతటఁ దీరీనాస
బలిమికాఁడు తాను భావను నేను
వెలయఁ బిలిచేనంటే వేళయెట్టుగాఁ దెలిసు
తలకొని ననునిట్టే దయఁజూడమనుమీ

చ. 3: వెస బెండ్లాయాడేనంటే వేడుకకు విలువేది
వనమాయఁ దా నాకు వలపు నాది
యెసగి శ్రీవేంకటేశుఁడేలే నన్ను దూరనేల
పొసఁగ నన్నికనిట్టే భోగించు మనవే

రేకు: 0127-5 సామంతం సంపుటం: 07-161

పల్లవి: సందు సుడివలపుల జాజరకాఁడ
యిందరిపైనడియాసలేల చూపేవయ్యా

చ. 1: వరుసకు వచ్చినాపె వద్దనే వుండఁగాను
యిరుగు పొరుగులాపె యేఁకారఁగాను
సరిఁ గానుకిచ్చినాపె సారెకుఁ జూడఁగాను
గొరబుగ నన్నునేల కొంగువట్టేవయ్యా

చ. 2: సన్నలు సేసినయాపె సముకాననుండఁగాను
కన్నుల మొక్కినయాపె కాచుకుండఁగా
కిన్నరమీంట్లయాపె గిలిగింతలు సేయఁగా
చిన్నదాన నాపైనేల చేయిచాఁచేవయ్యా

చ. 3: ఇంటిలోననున్నయాపె యెదురులు చూడఁగాను
జంటయై పెండ్లాడినాపె సాదించఁగాను
నంటున శ్రీ వేంకటేశ నన్ను నీకాఁగిటఁ గూడి
అంటి ముట్టి నన్నునెంత ఆదరించేవయ్యా

రేకు: 0127-6 పాడి సంపుటం: 07-162

పల్లవి: ఔనే ఇది జాణతనమందుకు నేమెచ్చితిని
నానోరఁ బలికేనంటే నవ్వు వచ్చీఁ గాని

చ. 1: కానుకగా తనకు నేఁగప్పురమంపితినని
ఆనవాలు చెప్పిపంపీనందుకేమే
పూని తా వలచినట్టి పొలఁతిఁ దోడితెమ్మంటే
దీనికి నేనియ్యకొని తేరాదు గాని

చ. 2: అడరి సొమ్ములిద్దరమట్టే మార్చుకొంటిమని
అడియాలమిచ్చి పంపీనందుకేమే
తడవి యేమైనాను తనకును నాపెకును
యెడనెడఁ బండుండఁ జోటియ్యరాదు గాని

చ. 3: రంగుగ నేఁ గూడినట్టి రహస్యపు వేళదని
అంగపుగురుతు చూపీనందుకేమే
యింగితాన శ్రీ వేంకటేశుఁడాకె తన పొందు
కంగవించి సాకిరై తనకనరాదు గాని

రేకు: 0128-1 సామంతం సంపుటం: 07-163

పల్లవి: తనతో పంతములాడేదాననా నేను
పనులు పదిమారులు పచరించేవాఁడు

చ. 1: వాడికమాటలఁ జొక్కి వలకు లోనైనవాఁడు
వోడక రాళ్ళుదేలించనోపినవాఁడు
జాడతో భూమెల్లా ముకుచాయనె యేలినవాఁడు
వేడుకఁ గంబసూత్రపువేసాలవాఁడు

చ. 2: పసలేని యాసలకు బయలువాఁకేవాఁడు
ముసరుకొన్న చలాల మునిఁగేవాఁడు
సుసరాన నమ్మలేక సొంట్లు సోదించేవాఁడు
ముసలిఁ గన్యకఁజేసి మోహించినవాఁడు

చ. 3: వెనక ముందరసేసి వెలఁదులఁ గూడేవాఁడు
కనుసన్నలఁ దిరిగే కలికి వాఁడు
అనిశము శ్రీ వేంకటాద్రిమీఁదటివాఁడు
ననుఁ గూడి నెలకొన్న నయగారివాఁడు

రేకు: 0128-2 శ్రీరాగం సంపుటం: 07-164

పల్లవి: అందమాయనయ్యనేఁడు అన్నిటా నీవిభవాలు
చందపుతరులైనవి సంబంధాలు

చ. 1: కోరి నీమోహపుసతి గుబ్బలవలెనున్నవి
పోరచి నీపెండ్లిలోని బూజగుండలు
చేరి యాపె కుమ్మరించే సిగ్గువలెనున్నది
వేరె యిద్దరినడుమ వేసిన తెర

చ. 2: ననిచిన యీలేమనవ్వువలెనున్నది
మునుకొని నీశిరసుముత్యాల సేస
చొనిపి యెదురుచూచే చూపులవలెనున్నవి
ఘనముగా వేసుకొన్న కలువలదండలు

చ. 3: జోడుగాఁ జెలియిచ్చిన సొమ్ములవలెనున్నవి
కూడినవేళ నీమేని గోరొత్తులు
యీడుగా శ్రీ వేంకటేశ యేలితివి నన్నునిట్టె
వేడుకవలెనున్నది విందుల నీమోవి

రేకు: 0128-3 బౌళి సంపుటం: 07-165

పల్లవి: ఇందాఁకానెరఁగనైతి నీవుపాయము
కందువలంటినప్పుడు గాక లోనౌనటవే

చ. 1: అడరి యెవ్వతోయింటికరిగేవేళ విభుని
వడిఁ జేపట్టి తీసితే నచ్చీనటే
బడినే యరిగి యాకెఁ బచారించి యానవెట్టి
కడుబలిమిఁ గూడినఁగాక వీఁడబ్బునటే

చ. 2: నలువంక సతులతో నవ్వులు నవ్వేటివేళ
పలుమారుఁ బిలిచినఁ బలికీనటే
యెలయించి వొక్కనినె యేకతమునకుఁ దీసి
యెలమిఁ జన్నులనొత్తకితఁడు చిక్కునటే

చ. 3: అత్తలవిందియ్యకొన్నయట్టి శ్రీ వేంకటేశుఁడు
పొత్తులకుఁ బిలిచితే భుజించీనటే
బత్తితోఁ గూడితిఁ దనపచ్చడము ముసుఁగిడి
కొత్తయింతసేయకతానేకొంకుదేరునటవే

రేకు: 0128-4 ముఖారి సంపుటం: 07-166

పల్లవి: సుదతి సింగారాలు చూడరమ్మ చెలులాల
మదనుబలాల మారుమలయవలసెను

చ. 1: జక్కవలె చన్నులై జంటవాయకుండఁగాను
పక్కనఁ గొండలతోడి పంగెమేఁటికే
నిక్కిచందురుఁడే మోమై నిండుఁగళలుదేరఁగ
పుక్కటనద్దముతోడి పురుడేఁటికే

చ. 2: తుమ్మిదలే తురుమై తోదోపులాడఁగాను
సమ్మతిఁ జీఁకటితోడి సడ్డయేఁటికే
నెమ్మదిని సింహమే నెన్నడుమై వుండఁగాను
వుమ్మిడినాకసముతో వుపమేఁటికే

చ. 3: చిగురులే పాదములై చెలువములు చూపఁగా
పొగరుఁదామరలతో పొందులేఁటికే
జిగి నేఁడీయింతితోడ శ్రీ వేంకటేశుఁడు గూడె
తగునంటానెన్నైనానందాలు చెప్పనేఁటికే

రేకు: 0128-5 పాడి సంపుటం: 07-167

పల్లవి: ఏల కొంగువట్టేవు యెమ్మెకాఁడా
నీలాగులిట్లానా నీటుకాఁడా

చ. 1: గొల్లచల్ల నెత్తిఁబెట్టుకొని నీకునమ్మరాఁగా
చల్లులాడేవేమోయి జాజరకాఁడా
పుల్లలనొత్తిన పచ్చి పునుఁగు గని తేఁగాను
వొళ్ళ (ల్ల?) నాకేల పూసేవు వుదుటుకాఁడా

చ. 2: పదిలానఁ బాలపండ్లు పయ్యెదలోఁ గొంటా రాఁగా
అదేల పిసికేవోయి ఆగడీఁడ
పొదల పువ్వులుగోసి పొత్తరగట్టుకుండఁగా
వెదచల్లుదురా నాపై వేసాలవాఁడా

చ. 3: వొలిసి పులిజూజము వొడిఁగట్టుకొని రాఁగా
అలరి నన్నాడించేవు అందగాఁడా
యెలమి శ్రీ వేంకటేశ యేలితివి నే మొక్కఁగా
అలమేవు కమ్మటినాసోదకాఁడా

రేకు: 0128-6 బౌళి సంపుటం: 07-168

పల్లవి: అన్నిటా భాగ్యవంతుఁడవవుదువయ్యా
పన్నినందుకల్లా వచ్చు భామ నీకునిపుడు

చ. 1: పడఁతి మోహరసము పన్నీటిమజ్జనము
కడలేని యాపెసిగ్గు కప్పురకాపు
నిడుదకన్నుచూపులు నించినతట్టుపునుఁగు
తొడిఁబడ సులభాన దొరకె నీకిపుడు

చ. 2: కామినికెమ్మోవికాంతి కట్టుకొనే చంద్రగావి
ఆముకొన్న మోహకళలాభరణాలు
దోమటిమాటలవిందు ధూపదీపనైవేద్యాలు
కామించినటువలెనె కలిగె నీకిపుడు

చ. 3: అలమేలుమంగనవ్వులంగవు పువ్వుదండలు
కలసి వురాన నీకే కట్టినతాళి
చలపట్టి యీకెరతి సకలసంపదలు
యిలనబ్బె శ్రీ వేంకటేశ నీకు నిపుడు

రేకు: 0129-1 శ్రీరాగం సంపుటం: 07-169

పల్లవి: ఇట్టి నిన్ను నుతియించ యెవ్వరితరములయ్యా
నెట్టున పెక్కురూపాల నెలవై నీవుంటివి

చ. 1: నిక్కి దేవుళ్ళు ముత్యాల నీపై వసంతమాడఁగా
చుక్కలలో చంద్రుఁడవై చూపట్టితివి
గక్కన మఱియు వడగండ్లవానలతోడి
మిక్కుటపు తొలుకరి మేఘమవై యుంటివి

చ. 2: నిగ్గుగల ముత్యాలు నెలఁతలు చల్లఁగాను
బుగ్గలతో వారాశిఁ బోలితివి
అగ్గమై అప్పటినీఅంగములనంటితేను
తగ్గక బ్రహ్మాండాలు ధరించినట్టుంటివి

చ. 3: తడవెలమేల్మంగ ముత్యాలసేస చల్లఁగాను
పొడము మొగ్గల సురపొన్నఁ బోలితి
కడఁగి శ్రీ వేంకటేశ క్రమ్మరనెంచి చూచితే
వడియు నురుగుల కవ్వపుఁగొండఁ బోలితి

రేకు: 0129-2 కన్నడగౌళ సంపుటం: 07-170

పల్లవి: ఎట్టు నమ్మి పొందులు సేసేరింతులు నీతోను
మట్టెరిఁగి నీవె యిట్టే మన్నించవలెఁ గాక

చ. 1: తొల్లిటిమాటలకుఁగా తొడరి సూడువట్టేవు
మల్లాడి రాతికి మారుమలసేవు
చల్లరీఁడవై యెందైనా జొరఁబారేవు కెరలి
పల్లటీఁడవై పడుచుపనులఁ దిరిగేవు

చ. 2: పిన్నవాఁడవై యుండి పెచ్చు పెరిగేవు సారె
కన్నవారితోనెల్లా కలహించేవు
పన్నియాఁటదానిచేత బాససేయించుకొనేవు
సన్నలఁ బక్షపాతాన సాముసేయించేవు

చ. 3: బతిమాలించి మతులు భ్రమయించఁ జేసేవు
రతికేళినే కడుఁగరాళించేవు
ఇతవై శ్రీ వేంకటేశ యేలితివి నన్నునిట్టె
చతురతల వలపు సాదించేవు

రేకు: 0129-3 వరాళి సంపుటం: 07-171

పల్లవి: మేరమీరి నడచితే మెలుఁతలేల మానేరు
నేరుపులు కన్నవారె నెరపకుండుదురా

చ. 1: వుద్దాలు వెట్టే యాపె వూడిగము సేయఁగాను
వొద్దఁ గూచుండుమనుచు వొడివట్టేవు
కొద్దిమీరనదిచూచి కుంచెవేసే ఆపెవచ్చి
వుద్దండానఁ గూడుమంటే వోపననవచ్చునా

చ. 2: గొడుగువట్టేయాపె కోరి బత్తిసేయఁగాను
కడుఁ బాదాలొత్తుమని కాఁగలించేవు
అడరి యీసుద్దివిని అడపముసతి వచ్చి
తడవి మోవడిగితే దాఁచుకొనవచ్చునా

చ. 3: సురటి విసరేయాపె చొచ్చి కొలువుసేయఁగా
తెరవేయి మని కూడి మరిగించేవు
ఇరవై శ్రీ వేంకటేశ యిందుకే నేనిటు వచ్చి
గరిమఁ బెండ్లాడితి కాదనవచ్చునా

రేకు: 0129-4 శంకరాభరణం సంపుటం: 07-172

పల్లవి: ఏఁటికింకా నీవిభునినేల దూరేవే
గాఁటపు మదమునను గరిసించనేఁటికే

చ. 1: కగ్గులేని జక్కవలు ఘనాలని పొగడితే
సిగ్గువడనేమిటికే చెలియ నీకు
నిగ్గుల తుమ్మిదలను నెట్టుకొని మెచ్చితేను
తగ్గి బొమ్మజంకెనల తాటించనేఁటికే

చ. 2: అడవిలోని సింహమును అట్టె చేతఁబట్టితేను
గుడిగొన నాయకునిఁ గొసరనేలే
తడవి లేఁదీగెల మొదళ్ళు గోరనొత్తితేను
వుడిగుడిగి నీపెదవులఁ దిట్టునేఁటికే

చ. 3: ఆరఁటులుఁ జిగురులునాసపడి చూచితేను
నెరవుతోడుతఁ దెరవేయనేఁటికే
అరిది శ్రీ వేంకటేశుఁడలమేల్మంగవు నిన్ను
సరవిఁ గూడెను యింకా సాదించనేఁటికే

రేకు: 0129-5 నాదరామక్రియ సంపుటం: 07-173

పల్లవి: చూడనొక్కఁడవుగాని సుద్దులెన్నైనాఁ గలవు
వేడుకలు దైవారె వెలఁదులిందరికి

చ. 1: ఒక్క నీ రూపమేకాదా వూరివారెల్లాఁ జూచితే
పెక్కులై మనసులోఁ బెనగొనేది
వుక్కున నీవాడినమాటొక్కటే కాదా యిందరి
వెక్కసపువీనులలో వింత వింతలైనవి

చ. 2: చేసిన నీసన్నేకాదా చెలులమర్మములకు
ఆసకొలిపి మోహాలంటించినది
పోసరించి నీమోవితీపులేకావా గొల్లెతల
వాసుల నోరూరించి వలలఁ బెట్టినవి

చ. 3: సెలవి నీనవ్వేకాదా చిమ్మిరేఁచి యింతులకు
పులకలు మేనులఁ బొడమించేది
వెలయ నన్నేలితివి శ్రీ వేంకటేశ యిదె కాదా
కలయికలిందరికి కాంక్షలురేఁచినది

రేకు: 0129-6 హిజ్జిజ్జి సంపుటం: 07-174

పల్లవి: ఎంత చనవిచ్చితివి యీపెకు నీవు
వంతులకు వట్టివళావళ్ళు సేసీనిపుడు

చ. 1: పవళించి నీవుండఁగా పడఁతికొలువులోన
చెవిలోన విన్నపాలు సేసీనీకె
తవిలి యొకతెపై పాదము నీవు చాఁచఁగాను
తివిరి వేళ్ళ చిటికె దియ్యవచ్చీ నీకును

చ. 2: వెలఁదులచే నీవు వీణె వాయించుకోఁగా
కిలకిల నవ్వు నవ్వి కెలసీనీపె
నెలవుగాఁ గప్పురము నీవొకతెకియ్యఁగాను
తొలుత నడుముదూరి దోసిలొగ్గీనిపుడు

చ. 3: అడపపుటింతిచేత ఆకు నీవందుకోఁగాను
వెడఁగుఁదనాన తెర వేసీనీపె
అడరి శ్రీ వేంకటేశ అంతలో నన్నేలితివి
బడివాయక తాను నీపానుపెక్కేనిపుడు

రేకు: 0130-1 శంకరాభరణం సంపుటం: 07-175

పల్లవి: కానవచ్చె నీసుద్దులు కడలనున్నవారికి
ఆనతియ్యవయ్యా మేమునందుకు మెచ్చేము

చ. 1: చిలుకపలుకులకు చెవులొగ్గియాలించేవు
జలజాక్షిమాటలతో సరివచ్చెనా
తలుకొత్త తుమ్మిదలఁ దప్పక చూచేవిట్టె
యెలమినాకెకొప్పుతో యీడువచ్చెనా

చ. 2: చెంది జక్కవలమీఁదఁ జేతులు చాఁచేవు నీవు
యిందుముఖిచన్నులతో నీడువచ్చునా
విందువలె హంసలవెంటవెంటఁ దిరిగేవు
పొంది ఆకెనడపుల పోలికాయనా

చ. 3: బంతిఁ జెకోరములఁ దప్పక చూచేవీరీతి
కాంతకన్నులతోఁ దారుకాణ వచ్చెనా
యింతలో శ్రీ వేంకటేశ యేలితివి నన్నునిట్టె
వింతై నావలెనాకె గోవిలపాట వాడెనా

రేకు: 0130-2 మాళవి సంపుటం: 07-176

పల్లవి: వట్టి దీమసములేలే వనిత నీకు
గుట్టుతోడి నీగుణమక్కునఁ బోసి చూపేనా

చ. 1: అగ్గలపుఁదమకాన ఆతఁడు వీడెమిచ్చితే
వొగ్గి పిడికిటఁ బట్టుకుం దానవేమే
సిగ్గులీవేళనేఁటికే సెలవుల నవ్వులేలే
కగ్గి యీతనిమాఁటకుఁ గాదనఁగలవా

చ. 2: కడఁగి నీవేలనుంగరమాతఁడు వెట్టితే
వొడిలోనఁ జెయివెట్టుకుందానవేమే
వెడవెడమోనాలేలే వేసాలు చూపుఁగనేలే
తొడరి యీతనియాన తోయంగఁ గలవా

చ. 3: శ్రీ వేంకటేశుఁడు సేస శిరసుపైఁ జల్లితేను
కూవగాఁ గొప్పులో దాఁచుకొనేవేమే
యీవేళ నన్నేలి మఱి యీతఁడే నిన్నునేలె
సోవలనీతనిమోవిఁ జొక్కకుండఁగలవా

రేకు: 0130-3 పాడి సంపుటం: 07-177

పల్లవి: ఇదిగో నీతగవెల్లానిందులోనే కానవచ్చె
పుదుటు కోడెకాని వోజ యిట్టిదయ్యా

చ. 1: భూములెల్లాఁ జాటించి పూవుదండ మెడవేసి
ప్రేమముతో నిన్నొకాపె పెండ్లాడెను
ఆమేలెరఁగవద్దా అప్పటిఁ బెండ్లాడితివి
యేమయ్యా మగవానికేడ పాటెయ్యా

చ. 2: నయానఁ బందెమువేసి నడుమ మేనపడుచు
ప్రియపడి నిన్ను నిట్టె పెండ్లాడెను
క్రియ దెలియక వేరే కెలనఁ బెండ్లాడితివి
నయగారిపతినెట్టు నమ్మవచ్చునయ్యా

చ. 3: వున్నతిఁ బుట్టినప్పుడే వురముపై నెలకొని
పిన్ననాఁడె నిన్నొకాపె పెండ్లాడెను
నన్నుఁ బెండ్లాడితివి నంటున శ్రీ వేంకటేశ
యిన్నిటా వేడుకకానికేడ నేమమయ్యా

రేకు: 0130-4 గుండక్రియ సంపుటం: 07-178

పల్లవి: తొలుతనే వలచిన తొయ్యలి నేను
మలసి నిన్నుఁ గాదని మారుకొనవచ్చునా

చ. 1: వేడుకతో నీమాటలు వినేదే మేలుగాక
జోడుగూడ నందుఁ గొంత సోదించనేలా
వీడెము చేతికిచ్చితే వేసుకొనుటే కాక
వూడిగము సేసే చెలివొడిఁ బెట్టనేలా

చ. 2: నవిచి నీసేఁతలకు నవ్వేదే మేలుగాక
చెనకి యింతేసి గరిసించఁగనేలా
మొనసాదము చాఁచితే మొక్కేదే తగవుగాక
పెనఁగి అట్టె బటువుబిల్లవెట్టనేలా

చ. 3: గుట్టుతో నీసన్నలకుఁ గూడేదే మేలుగాక
వట్టి సిగ్గుతోఁ దలవంచఁగనేలా
యిట్టె శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
బెట్టి మోవితేనిచ్చితే పెరఁబెట్టనేలా

రేకు: 0130-5 శుద్ధవసంతం సంపుటం: 07-179

పల్లవి: ఇంతిఁ గరుణించవయ్యా యేల యేఁచేవు
చెంతనుండి నీకు బుద్ధి చెప్పేటివారమా

చ. 1: చన్నుగుబ్బల మదము సమరతినైతేఁ గాక
కన్నులఁ జూచినంతనే కాంక్షదీరునా
కన్నెపాయపు సిగ్గులు కలయికలనుగాక
విన్న వినుకలినే విడిపంచవశమా

చ. 2: జవ్వనములో బిగువు సాములుసేసినఁ గాక
నివ్వటిల్లు మాటలఁ దనివి దీరునా
మవ్వపుమాయలగుట్టు మచ్చికెచేఁతలఁ గాక
నవ్వినమాత్రములోనె నలి మాన్పవశమా

చ. 3: గరిమ చేతులకసి కాఁగిటఁ గూడినఁ గాక
సరసములాడితే నాసలు దీరునా
సరి నిట్టే యేలితివి సతిని శ్రీ వేంకటేశ
తెరవేసికొన్నంతనే తెలియఁగవశమా

రేకు: 0130-6 నాదరామక్రియ సంపుటం: 07-180

పల్లవి: ఇంతబాఁతిపడేవానినేల మాకుఁ దక్కరించ
చెంతనిదే వెన్నచిట్టిఁ జిట్టెఁడేసి వలపు

చ. 1: చేలకొంగువట్టితి సిగ్గువడఁగా మానము
వాలుకరెప్పలు వంచి వంచి చూచేవు
ఆలదొడ్డివారము నేమంతేసి యెఱఁగము
పాలదుత్త దుత్తెఁడేసి పట్టవయ్య వలపు

చ. 2: పెల్లుగ జేతులువాపి పెనఁగగానె గుబ్బలు
కొల్లలుగాఁ జేతఁబట్టి గోర గీరేవు
గొల్లెతలమెఱఁగము గొప్పజాణతనములు
చల్లదుబ్బ దుబ్బెఁడేసి చల్లేము వలపు

చ. 3: కాయపుమదము గారఁగానె శ్రీ వేంకటేశ
సోయఁగానఁ గూడి మరి సోదించేవు
నేయమ్మేవారము నవ్వనేరము పోసేమిదె
చేయిచాఁచు పెరుగుచిప్పఁ జప్పెఁడేసి వలపు

రేకు: 0131-1 భూపాళం సంపుటం: 07-181

పల్లవి: ఏబాసకియ్యకొనేవే యిప్పుడు నీవు
వాబలిమిమాటల వాదుకోపఁ గాని

చ. 1: నెట్టన నీవు నన్నాడే నిందలెల్లాఁ దప్పదని
చుట్టి మరుగుడి వాసి చొచ్చి వెళ్ళేవా
నట్టనడుమ నేనైనా ననలయలుగులను
కిట్టి నానిజము మించ గెలిచేఁ గాని

చ. 2: ఆలాగువాఁడ నేనని చిలుకజోదుల
వాలు తిరుమిక్కిళ్ళకు (?) వడి నిల్చేవా
వాలాయించి నేనైనా నావల్లఁ గల్లలేకుండా
బాలకోవిలభ్రతముఁ బలికించేఁ గాని

చ. 3: ఇలనేఁ గపటినని యీపూవుఁ దేనెనీటను
నెలకొని నీవు మునిఁగి లేచేవా
కలసితి నేను శ్రీ వేంకటపతినిపుడని
తొలుత నీచన్నుదిబ్బాలు దొడికేఁ గాని

రేకు: 0131-2 మలహరి సంపుటం: 07-182

పల్లవి: ఏమి సేసెనే విభుఁడు యేఁటికి వేగిరించేవే
భామిని మీలపిల్లలఁ బాలువోసి పెంతురా

చ. 1: ఇంతేసి జక్కవలను యేల గూఁట వేసేవే
పంతపు వాఁడమ్ములేల పారాడించేవే
కాంతుల యద్దములను కవిసెనఁబెట్టనేలే
వింతగాఁ దుమ్మిదపిండు విరియించ నేఁటికే

చ. 2: చిగురుటాకుల తేనె చిందనేల పోసేవే
మొగిచి పట్టఁగనేలే ముంపుఁదీగెలు
యెగసక్కేనకు బయలేల ముడివేసేవే
జగతిఁ గరికుంభాలు సారెకునూఁదుదురా

చ. 3: బలిమినరంట్లను పక్కనఁ బైఁ దోయనేలే
అలమి యంచులఁ బాతురాడింతురా
అలమేలుమంగవు నీ వాతఁడు శ్రీ వేంకటేశుఁ
డెలమిఁ గూడితిరి మిక్కిలియే వేడుకలా

రేకు: 0131-3 దేవగాంధారి సంపుటం: 07-183

పల్లవి: కొత్తలు నీ చేఁతలు గోవిందరాజ
పొత్తుల మగఁడవై భోగించే విపుడు

చ. 1: పాదము లిద్దరి మీఁదఁ బంచివేసి చాఁచుకొని
సోదించి నీవిరుమొన సూదివైతివి
సాదించి యిద్దరు చేతి సన్నల నిన్నునొత్తఁగా
దాదాత వలపు దూఁచే తాసు వలెనైతివి

చ. 2: కన్ను సన్నల నిద్దరి కళలు రేఁచి రేఁచి
వన్నెసరసముల కావడివైతివి
అన్నిటా సెలవుల నవ్వాపెకు నీపెకు నిచ్చి
పన్ని రెండు చక్రముల బండివైతివి

చ. 3: అండనె శ్రీ వేంకటేశ అదె గోవిందరాజవై
చండిదీర సిరికి భూసతికి నీవు
రెండు చేతుల యిద్దరికిఁ గాఁగిలిచ్చియిచ్చి
కొండుక జమళి పెండ్లి కొడుకవునైతివి

రేకు: 0131-4 శ్రీరాగం సంపుటం: 07-184

పల్లవి: రమణుఁడు చూచుఁగాని రమ్మనరె యీవేళ
తమితోనిట్టే దయ దలఁచుమీ యనరే

చ. 1: వదన చందురునిపై వాసన కస్తూరి బొట్టు
చెదరుచున్నది చూడరే చెలులాల
పదరి రాహువు దన్నుఁ బట్టినట్టి పగదీర
పదిలాన తా మగుడఁ బట్టిన యట్లుండె

చ. 2: చల్లఁగాఁ జెలి చెక్కులఁ జల్లిన కప్పురధూళి
జల్లన రాలీఁ జూడరే సతులాల
కొల్లలుగా నయనచకోరములు వెన్నెలలు
వొల్లనె తనిసి వెళ్ళను మిసినట్లుండె

చ. 3: తుమ్మిఁద గుంపువంటి తొయ్యలినెరుల రాలె
కమ్మవిరులు చూడరే కాంతలాల
కొమ్మ శ్రీ వేంకటేశునిఁ గూడిన రతికి మెచ్చి
తమ్మిఁదామె నిండు వసంతమాడినట్లుండె

రేకు: 0131-5 శంకరాభరణం సంపుటం: 07-185

పల్లవి: పొంచి నా చన్నులంటేవు పోకముడి జారించేవు
నించే నీ పోందులకు నేనూఁ బైకొసరా

చ. 1: ఇందరు సతులలో నాయెచ్చుకుందులు చూడవు
సందడిఁ గాలుదొక్కేవు సారెసారెకు
చందమైన నీ పాదము సంతముద్రకోలాయ
యిందుకు నేనూ లోనై యిరవుకోవలెనా

చ. 2: జంగిలి కాంతల నెల్లా సంగతులెంచక నీవు
యెంగిలి సేసేవు మోవి యేకముగాను
పంగించ నీనోరు బందెయెద్దుమోరాయ
కంగులేక కదుపునఁ గలపఁగవలెనా

చ. 3: కొలువుకాంతలనెల్లా కొంకక శ్రీ వేంకటేశ
కలగొన నీవురానఁ గాఁగిలించేవు
వలపుల నీ మేను చలివందిలినీడాయ
చెలరేఁగి నిన్నుఁగూడి సేస చల్లవలెనా

రేకు: 0131-6 సామంతం సంపుటం: 07-186

పల్లవి: ఏఁటికి గేలిసేసేవు యింతినింతలోననే
తేటల నీమోహానకు తేఁకువగాదా

చ. 1: తియ్యని మాఁటలకు తేఁకువతోఁ జొక్కి చొక్కి
పయ్యెద వెట్టమరచి భ్రమసెఁ గాక
నెయ్యపు నీ చేఁతలకు నీతోఁ బెనఁగఁగాను
చయ్యన గొప్పతురుము జారెనిట్టె కాక

చ. 2: నంటున నీవు నవ్వే ననుపైన నవ్వులకు
అంటి చెక్కుచేత వెరఁగందెఁ గాక
దంటతనమున నిన్నుఁ దప్పక చూచినందుకు
వొంటుచు నిట్టూర్పుల వుసురనెఁ గాక

చ. 3: కందువ నిన్నింతలోనె కాఁగిలించుకొన్నందుకు
మందలించి యిట్టె మారుమలసెఁ గాక
అందుకొని శ్రీ వేంకటాధిప కూడినందుకు
ముందు ముందు నీ కిదిగో మొక్కుమొక్కెఁ గాక

రేకు: 0132-1 భైరవి సంపుటం: 07-187

పల్లవి: ఆడనుండేమి తగవులట్టె చెప్పేవు
నీడల నిన్నియునాయ నీకడయే యిఁకను

చ. 1: పలుకఁగ నేర్తువు పాదాలు గుద్దనేర్తువు
సొలసి వాకిలి దెరచుక రాఁగదే
అలుక దీర్చఁ గలవు ఆయములంటఁగలవు
బలిమి నీపతితొడపైఁ గూచుండఁగదే

చ. 2: పగడసాలాడుదువు పక్కన నవ్వింతువు
మొగము చూపీతనికి మొక్కఁగదవే
పొగడుదు విచ్చేరిఁగే పొద్దులు గొంతవుత్తువు
మగని ముసుఁ గుదీసి మంతనమాడఁగదే

చ. 3: వీడెము చేతికిత్తువు వెరపులు వాపుదువు
తోడఁ బెండ్లి కూఁతురవై తొక్కవే కాలు
యీడనె శ్రీ వేంకటేశుఁడింతలోనె నన్నుఁగూడె
జాడనేనంతెరఁగను సరసమాడఁగదే

రేకు: 0132-2 గుండక్రియ సంపుటం: 07-188

పల్లవి: అందరు సంతోసించేరు యశోదమ్మ వినవమ్మ
కందువైన బిడ్డనిఁ గంటివోయమ్మా

చ. 1: వనకేలి సేయఁబోతే వచ్చి మాఁకులెక్కీని
యెనసి జలకేలిలో యీఁదులాడీని
మునుపె మాకంటె మంచముపైఁదానె పండుండీని
ఘనుఁడైన యీకృష్ణునిఁ గంటివోయమ్మా

చ. 2: అంగడి బేరము గొంటే అమ్మవచ్చీఁ దానె మాకు
ముంగిటనాలఁ బిండితే ముంతవట్టీని
సింగారించు కొనఁబోతే చీర గట్ట వచ్చీఁదానె
కంగుదేరిన బిడ్డనిఁ గంటివోయమ్మా

చ. 3: కంచము మొదలనుంటేఁ గడియెత్తిపొత్తునను
కొంచి కన్నుమూసితేను కూడీఁ గాఁగిట
యెంచఁగ శ్రీ వేంకటాద్రినిరవై యాడేయట్టి
కాంచనమువంటి బిడ్డఁ గంటివోయమ్మా

రేకు: 0132-3 నాట సంపుటం: 07-189

పల్లవి: పతిఁ బాసి విరహాన భ్రమయకువే నిన్ను
మతకానఁ దమిరేఁచి మన్నించె నితఁడు

చ. 1: నిండుఁబున్నమగదే నీ మోము - నేఁడు
యెండలేఁటికి నాయ యీవెన్నెల
కొండలే కదవె బాగుల చన్నులు - యీ
గండుఁ గోవిల కూఁత కారించీనటవే

చ. 2: కలికి బింబఫలముగదె నీమోవి
పలుకుఁ జిలుకలకేల పగలాయనే
అలులే తురుముగదే అదె నీకు
వలరాజు విలునారి వడిఁబెట్టీనటవే

చ. 3: మెఱుఁగుఁదీగె గదే మేను నీది
నెఱిఁబూవుటమ్ములేల నెగులాయనే
గుఱి శ్రీ వేంకటేశుఁడు కూడె నిన్ను
తఱితో మున్నిటి సుద్ది దలఁపించీనటవే

రేకు: 0132-4 సామంతం సంపుటం: 07-190

పల్లవి: అప్పటి నుండి సిగ్గుతో నవ్వలి మోమైవున్నది
చెప్పరాని ప్రియమెల్ల జెప్పఁగదవయ్యా

చ. 1: వోపననఁగానె నీవు వొడివట్టి తీసితివి
పూప చన్నులు విసికి పొదిగితివి
కోపగించుకొనఁగానే కొనగోర నూఁదితివి
ఆపడఁతినిఁకనైనా నాదరించవయ్యా

చ. 2: చేతులెత్తి మొక్కఁగానె చెనకితివి మర్మము
యేతునఁ బెనఁగి అలయించితివి
కాతరించి తిట్టఁగానే కాఁగిట బిగించితివి
ఆతుమగా మాటలాడి ఆదరించవయ్యా

చ. 3: చాలుఁ జాలుననఁగానె సంగడిఁ బెట్టుకొంటివి
యీలీల శ్రీ వేంకటేశ యేలుకొంటివి
మూలనున్న యాపె నింత ముంగిటను వేసితివి
ఆలినేల రట్టుసేసేవాదరించవయ్యా

రేకు: 0132-5 పాడి సంపుటం: 07-191

పల్లవి: నేరుచుకొంటివే మేలు నేఁడే యింతేసి
మేరమీరి సేసినదే మేలుబంతిగాదా

చ. 1: నేనాతనితో నవ్వితే నీవేమనేవే వోసి
కానీవే అన్నియునిఁకఁ గనుకొనేవు
దానికేమే మాటలేల దగ్గరి రావే వోసి
మైనము సూలమౌనటే మాపుదాఁకాను

చ. 2: కాంతునికి నేమొక్కితే కాదనేవటే వోసి
యింత బలవంతురాలవెందు వొయ్యేవే
పంతములన్నియునేరుపరచేలేవే వోసి
యెంత తొండమున్నా దోమ యేనుగవునటే

చ. 3: శ్రీ వేంకటేశుఁడు గూడే చింత నీకేలే వోసి
కైవశము తొల్లేనాకుఁ గదే ఇతఁడు
రావే అక్కచెల్లెండ్లము రవ్వయైతిమే వోసి
నీవు నీరడిచితేను నేఁడు రెండౌనటవే

రేకు: 0132-6 శ్రీరాగం సంపుటం: 07-192

పల్లవి: తిరు వీధుల మెరసీ దేవదేవుఁడు
గరిమల మించిన సింగారముల తోడను

చ. 1: తిరు దండెల పై నేగీ దేవుఁడిదే తొలునాఁడు
సిరుల రెండవ నాఁడు శేషుని మీఁద
మురిపేన మూఁడోనాఁడు ముత్యాల పందిరి క్రింద
పోరి నాలుగోనాఁడు పువ్వుఁ గోవిలలోను

చ. 2: గక్కన నయిదవనాఁడు గరుడుని మీఁదను
యెక్కెను ఆరవనాఁడు యేనుగమీఁద
చొక్కమై యేడవనాఁడు సూర్యప్రభ లోనను
యిక్కువఁ దేరును గుఱ్ఱమెనిమిదోనాఁడు

చ. 3: కనకపుటందలము కదిసి తొమ్మిదోనాఁడు
పెనచి పదోనాఁడు పెండ్లిపీఁట
యెనసి శ్రీ వేకంటేశుఁడింతి యలమేల్మంగతో
వనితల నడుమను వాహనాలమీఁదను

రేకు: 0133-1 మలహరి సంపుటం: 07-193

పల్లవి: ఇరుగుపొరుగువారు యేమందురే
అరసి నీపై వలపు అందిరపై బూతురా

చ. 1: నిగ్గుల నీ రమణుఁడు నీతో మాటలాడితేను
యెగ్గులు వేరొకతెపై నేలపెట్టేవే
వొగ్గుచు నిన్నాతఁడు వొడివట్టి తీసితేను
బగ్గన నాపె కొంగు పట్టించేవదేమే

చ. 2: తమకించి నిన్నాతఁడు తప్పక చూచితే నెడో
రమణిని దెచ్చి ముందరను దోసేవే
సముకాన కొనగోర సారెనొత్త వచ్చితేను
అమర వేరొకతె మేనటు దాఁకించేవే

చ. 3: శ్రీ వేంకటేశ్వరుఁడు చేరి నిన్నుఁ గూడితేను
వావిరి నాపెకు నేల వంతువెట్టేవే
నీ వలమేలుమంగవు నిన్నుర మెక్కించుకొంటే
భూవనితఁ దెచ్చి అట్టే బుజమెక్కించేవే

రేకు: 0133-2 బౌళి సంపుటం: 07-194

పల్లవి: ఓరుపు గలవారికి వోరుచుకొంటేనే మేలు
యేరితేను మలిగండ్లు యెందులోను లేవే

చ. 1: నారమణునిపైఁ జాడి నాతోనేమి చెప్పేరే
తేరకొన నాచేనేల తిట్టించేరే
గోరుమేననుండదంటా గురుతులేమి చూపేరే
తారి బియ్యము దంచితే తవుడు వెళ్ళకుండునా

చ. 2: భావమిద్దరికొక్కటే పగలేల పుట్టించేరే
ఆవేళ నాచే వెంగెములాడించనేలే
మోవనాడె తని మర్మము లేల తలఁపించేరే
భావించ రత్నాకరానఁ బచ్చి గుల్లలుండవా

చ. 3: గక్కన శ్రీ వేంకటేశుఁ గడునేల నవ్వించేరే
వొక్కటైతేఁ జన్నులచే నొత్తించేరేలే
పెక్కురతులలోనేల పిరివీకు సేయించేరే
గక్కన నీళ్ళ నీడ గానరాక మానునా

రేకు: 0133-3 శ్రీరాగం సంపుటం: 07-195

పల్లవి: తనకే తెలుసునమ్మ తమకపు వేడుకలు
కొనచూపుల నవ్వీని గోవిందరాజు

చ. 1: పడఁతులిద్దరు తన పాదములొత్తఁగాను
నడుమఁ గొడుకుఁగనె నగుతాఁ దాను
పొడమి కాంతలకుఁగా పురుషుఁడు బిడ్డఁగన్న
కొడిమెలు గట్టుకొనె గోవిందరాజు

చ. 2: సేదదేరి యీచెలుల చేతి చెమటలఁ దోఁగి
పాదాలఁ గూఁతురుఁగనెఁ బైపైఁ దాను
ఆదిగొని మగవాఁడు ఆఁడువారికి వేఁకటై
సొదుఁదనము మోచెనిచ్చట గోవిందరాజు

చ. 3: పెనఁగి లక్ష్మీ భూముల ప్రేమపుటంగాలు సోఁకి
మనసున బిడ్డఁగనె మరిగి తాను
వనితలకు మగఁడు వరుసకానుపుగనె
కొనబు శ్రీ వేంకటాద్రి గోవిందరాజు

రేకు: 0133-4 హిందోళవసంతం సంపుటం: 07-196

పల్లవి: చేసినట్టు తాఁజేసె చేరి నేనూరకుందాన
యీసులెల్లా మానెనిఁక యేమనీనే తాను

చ. 1: తనువుమీఁదటిరేక తప్పులు దిద్దఁగరాదు
మనసులోని నొప్పికి మందులేదు
కనుచూపుఁబోట్లకు గంట్లు చూపఁగరాదు
యెనసి యింకా నాతో యేమనీనే తాను

చ. 2: మొగము లోపలి కళ మూసి దాఁచిపెట్టరాదు
చిగురుఁ గోరికలలో చేఁగలేదు
నగవుల వెన్నెలలు నాములు చూపకపోవు
యెగసక్యములు గావు యేమనీనే తాను

చ. 3: చిత్తము లోపలి సిగ్గు చేతఁబెట్టి చూపరాదు
కొత్త జవ్వనమునకు గురుతులేదు
హత్తి శ్రీ వెంకటేశుఁడు అందుకే తా నన్నుఁగూడె
యిత్తల యీవలపులకేమనీనే తాను

రేకు: 0133-5 పాడి సంపుటం: 07-197

పల్లవి: ఏల నీవు సిగ్గువడే వింతలోనను
మేలిమి యిల్లాల నీకు మించి నేనేకాదా

చ. 1: ఎక్కడఁ దిరిగినా మాయింటికే వత్తువు నీవు
తొక్కుమెట్టాడి నిన్ను దూరనేఁటికి
పుక్కట తుమ్మెదకును పువ్వులెన్ని కలిగినా
తక్కిన చుట్టుపు పొందు తామరే కాదా

చ. 2: తలఁపు నీకేడనున్న తనువు నాపై వేతువు
చెలరేఁగి నిన్ను రట్టుసేయనేఁటికి
సొలసి చల్లగాలికి చోట్లెన్ని గలిగినా
మలయఁ బేరైనచోటు మలయాద్రిగాదా

చ. 3: నింద నీకెంత మోచినా నీవె నన్నుఁ గూడితివి
కందువ నీ గుణాలు పొగడనేఁటికి
యెందరు శ్రీ వెంకటేశ యింతులు గలిగినాను
యిందిరను నీయిల్లు నా యెదలోనె కాదా

రేకు: 0133-6 సౌరాష్ట్రం సంపుటం: 07-198

పల్లవి: శ్రీ వేంకటేశ్వరునికి చెలి యలమేలుమంగ
వోవరిగా నెలకొని వురముపైనున్నది

చ. 1: పొంచి మచ్చ మైననాఁటి పొలసు కంపులు వాయ
సంచులఁ బన్నీట మజ్జన మార్పరే
అంచెఁ గూర్మ వరహములైనట్టి సొగటుదీర
మించఁ గప్పుర ధూళి మెత్తరే మేనను

చ. 2: నరసింహపు గదరు నాఁటి వామనపు జిడ్డు
పరశురామునిగబ్బు పచ్చివీడను
పరిమళముగట్టిన బంగారుగిన్నెఁ దెచ్చి
పొరిఁ దిరుమేనఁ దట్టుపునుఁగిట్టె నించరే

చ. 3: గొల్లముంజురాచజడ్డు కోరి బుద్ధుడైన సిగ్గు
చొల్లుగుట్టుపు నూఁగురొచ్చులు మానునా
ఇల్లిదె శ్రీ వేంకటేశుఁడీరూపై తానున్నవాఁడు
యెల్లపూదండలు సొమ్ములెక్కించరే

రేకు: 0134-1 భైరవి సంపుటం: 07-199

పల్లవి: వారిధివంటిది యీవలపే కాదా
వారకము నీకు నాకు వలపే కాదా

చ. 1: సుద్దులెల్లా విని నన్ను సోదించక తొలుతే నీ
వద్దికి రప్పించినది వలపేకాదా
పొద్దువొద్దునకు నీ భోగములే మరిపించి
వద్దన్నాఁ బోనియ్యదు యీ వలపేకాదా

చ. 2: మేడెపు రతుల నిన్ను మెప్పించే అంతలోనే
వాడికె నవ్వు నవ్వించె వలపేకాదా
వీడెము చేతికిప్పించి వెంట వెంట నీపొందుల
వాడలెల్లఁ దిరిగించె వలపే కాదా

చ. 3: కలసి శ్రీ వెంకటేశ కౌఁగిట నీ మనసెల్లా
వలవ దీసినది యీ వలపేకాదా
సులభమై లోలోని చూపుల తీగెలనే
వలలొడ్డించినది యీవలపేకాదా

రేకు: 0134-2 శంకరాభరణం సంపుటం: 07-200

పల్లవి: ఆతఁడే యెరుఁగును అంకెలైన తగులు
చేతిలోనే వున్నదిది చెప్పరాని తగులు

చ. 1: మలసి చూచిన చూపు మనసులో తగులు
తలఁపు లోపలి చింత తనువుకుఁ దగులు
వెలయుమేని సోఁకులు వేడుకకుఁ దగులు
అలరు వేడుకలే అన్నిటికిఁ దగులు

చ. 2: చిమ్ముచు నవ్విన నవ్వు సిగ్గులకుఁ దగులు
కుమ్మరించు సిగ్గులే తక్కుల తగులు
వుమ్మడి తక్కులెల్లా వొక్కటికిఁ దగులు
యిమ్ముల నొక్కటైతేనే యిరవాయఁ దగులు

చ. 3: మచ్చిక మాటలన్నియు మంతనాల తగులు
నిచ్చలు మంతనములు నిండురతి తగులు
చెచ్చెర నీ తగులు నా శ్రీ వేంకటేశుఁ గూడె
పచ్చి దోఁచిన కూటమి పంతముల తగులు

రేకు: 0134-3 కాంబోది సంపుటం: 07-201

పల్లవి: ఎగసక్కేలు నేర్చిన యింతులము
తగవెరిఁగిన మంచితనమే మేలును

చ. 1: పందేలకు నీవు నాతో పగడసాలాడఁగాను
మందెమేళాన నేమైనా మాటాడుదుము
అందుకుఁగా నీవప్పుడారడిఁ బెట్టఁగవద్దు
ముందు ముందె దొరతనముననుంటే మేలును

చ. 2: తెగడి నీతోఁ బిల్లదీపులాడఁ బిలిచేవు
జిగిమించనేమైనాఁ జేతుము నిన్ను
వెగటుగా నీవప్పుడు వేసాలు సేయవద్దు
వొగి గుట్టు తోడ నూరకుండుటే మేలును

చ. 3: వడి సరసాన నాతో వానగుంటలాడఁగాను
బెడిదమై చెయివట్టి పెనఁగుదుము
కడఁగి శ్రీ వేంకటేశ కలిసితివి మాటకే
విడువక మాతోడి వేడుకలే మేలును

రేకు: 0134-4 గుజ్జరి సంపుటం: 07-202

పల్లవి: సారిది మీసరితెలు చూతుముగాక
అరిది మమ్మేల సాకిరడిగేరు మీరు

చ. 1: చెలిమికాఁడవు గాన చెలి నీకుఁ బెట్టెఁ దమ్మ
మలసి నవ్వులు నవ్వ మాకేలా
బలిమికాఁడవుగాన పట్టి నిన్నుఁ దియ్యఁగాను
అలరి యడ్డాలు రానంతమాకేలా

చ. 2: చేకొద్దివాఁడవుగాన చెప్పె నీకుఁ బనులెల్లా
మాకు నిన్ను గేలిసేయ మరియేలా
పైకొన్నవాఁడవుగాన పడఁతి రాకొట్టుగొట్టె
కైకొని మీ మాటల వంకలు దిద్దనేలా

చ. 3: మేనవాఁడవటుగాన మెడగట్టుకొనిపించె
తానె అలమేలుమంగ తమకమేలా
పూని శ్రీ వేంకటేశుఁడ పొందుగా మమ్మేలితివి
కానిలే మిమ్మెరిఁగితి కడమలింకేలా

రేకు: 0134-5 కన్నడగౌళ సంపుటం: 07-203

పల్లవి: వెలఁది నిన్నీడకే విచ్చేయి మనె
బలిమి సేసినది యప్పటి యానవాలు

చ. 1: కొంగువట్టి నిన్నుఁదీసి కొనగోరు మేననూఁది
అంగన సన్నసేసినదానవాలు
వుంగరాలవేళ్ళ నీవొడిగట్టుకొని మోవి
యెంగిలిగాఁ జేసినది యిదియానవాలు

చ. 2: గుబ్బలురమున నూఁది కొల్లునను నవ్వు నవ్వి
అబ్బురము సేసినది ఆనవాలు
వుబ్బు నీకుఁ బొడమించి వొగి బొమ్మల జంకించి
నిబ్బరము చూపినది నీకు నానవాలు

చ. 3: కాయజకేలిని నిన్ను కన్నులనె మెచ్చిమెచ్చి
ఆయములు సోఁకించినదానవాలు
చాయల శ్రీ వేంకటేశ సతిఁ గూడితివి నీవు
యేయెడనెన్నటికి నిదే యానవాలు

రేకు: 0134-6 సౌరాష్ట్రం సంపుటం: 07-204

పల్లవి: తెలిసిన వారికిదె తేనెకంటెఁ దీపులు
వలసితేఁ జేకొనవే వనితరో నీవు

చ. 1: నేరిచినవారికి నీడవంటిది మోహము
నేరనివారికి నెండ వెన్నెలవంటిది
కూరిమి గొసరితేను కోపము చెల్లదిందుకు
మేరమీరినఁ దమలో మెచ్చవలెఁ గాని

చ. 2: వోపనవారికి వయసోడబేరము వంటిది
వోపినివారికి వేఁటవుచ్చువంటిది
చేపట్టి తీసితేను సిగ్గులువడఁ దగదు
పై పైఁ గూడిన బాఁతిపడవలెఁ గాని

చ. 3: కూడినవారికి రతి కొట్టిన పిండివంటిది
కూడనివారికి కలగూరవంటిది
యీడుజోడై శ్రీ వేంకటేశుఁడిదె నిన్నుఁగూడీ
వేడుకతోఁ జెప్పినట్టు వినవలెఁగాని

రేకు: 0135-1 శ్రీరాగం సంపుటం: 07-205

పల్లవి: ఎవ్వరు నేమి చెప్పిన యేఁటిమాట
వువ్విళ్ళూరఁ జిత్తగించుటొక్కటేమాట

చ. 1: చేయి చాఁచి మీఁద సిగ్గువడేయట్టుగాను
ఆయము సోఁకనాడినదదివో మాట
పాయపు వయసు నీది పచ్చివెచ్చిగాఁజేసి
యీయకోలు సేసినది యిదివోమాట

చ. 2: మంకుఁదనము దీరిచి మనసెల్లఁ జొక్కించి
అంకెకు రప్పించినది అదివోమాట
లంకెల సరివెనఁగి లాగులెల్లఁ జూపి నిన్ను
నింకాఁ గొసరుచున్నదిదివో మాట

చ. 3: చిప్పిలఁ గాఁగిటఁగూడి శ్రీ వెంకటేశ్వర నిన్ను
అప్పటినాస రేఁచినదదివో మాట
దప్పిదేరఁ గూడితిమి దాయక పాయక మన
మెప్పుడు నిట్లానుండేదిదివో మాట

రేకు: 0135-2 భైరవి సంపుటం: 07-206

పల్లవి: వద్దనేమా నేము వలసిన వనులకు
యిద్దరునేకమై మాకు యేల లోఁగేవే

చ. 1: ముచ్చట నేమడిగితే మొఱఁగు మాటలాడేవు
బచ్చించి యాల నేరెడుఁబండులమ్మేవే
యిచ్చకానకాతనితో యిన్నినియ్యకొని వచ్చి
తచ్చనకు మాముందర తగవులాడేవే

చ. 2: మొగము నేము చూచితే మోసులువార నవ్వేవు
తగు వసంతపు నీట దైలు వోసేవే
అగపడి నీ విభుని కంకెలెల్లాఁ జెప్పి వచ్చి
పగటుతో మాముందర బయలీఁదించెవే

చ. 3: అందాలు నేమెరిఁగితే ఆయములు దాఁచేవు
గొందినే చెరువుకు మూకుడు మూసేవే
విందువలెనట్టై శ్రీ వేంకటేశుఁగూడి వచ్చి
చెంది మాముందరనేల సిగ్గులు వడేవే

రేకు: 0135-3 బౌళి సంపుటం: 07-207

పల్లవి: ఏల చెప్పేవు నీసుద్దులు యెందాఁకా మాతోను
పాలుమాలకింతలోనే బమ్మచారివైతివి

చ. 1: ఎలమి గొల్లెతలను యిన్నాళ్ళు పొంది పొంది
తొలఁగి మధురలోన దొరవైతివి
కొలఁది ఆవులఁగాచి గొల్లవాఁడవై యుండి
వలవంత నేఁడు రాచవాఁడవైతివి

చ. 2: వేడుకలకింటింట వెన్నదొంగిలి నేఁడు
ఆడ ద్వారకలో సోమయాజివైతివి
వోడక రుక్మిణీ దేవి నూరకే యెత్తుకవచ్చి
పాడితోనగ్రపూజకు పాత్రుఁడవైతివి

చ. 3: రక్కసుల కాఁపురాలు రచ్చలకెక్కఁ జెరిచి
పెక్కుధర్మాలు నిలిపి పెద్దవైతివి
చిక్కువాసి నన్నుఁగూడి శ్రీ వేంకటాద్రి మీఁద
దిక్కుల నిందరిపాలి దేవరవునైతివి

రేకు: 0135-4 వరాళి సంపుటం: 07-208

పల్లవి: మేలే జాణవౌదువు మెస్తినే నిన్ను
మేలు వాని వలపుల మేడలోనే వున్నది

చ. 1: పలుకవే పతి తోను పదవే సకినలే
పలికీనతఁడు పండే పట్టె మంచాన
చిలుకవే నవ్వులు నెలవుల నదియేలే
బలిమిఁ జిలుక తనిపంజరాననున్నది

చ. 2: రూపుఁజూపవే నీవు రొచ్చులుగఁ జేరి తొల్లే
రూపులెల్లా నద్దములో రూడినున్నవి
తీపుల మోవియ్యవే తెలుసుకోవే నీవు
కోపులఁ దరి తీపులు కొంగుపైఁడైవున్నది

చ. 3: మొక్కవే ఆతనికి మోహము రెట్టించ నేఁడు
మొక్కఁబోయిన దేవర మొదలే తాను
యిక్కువ శ్రీ వేంకటేశుఁడిట్టే కలసెఁగదే
యెక్కువ కాఁగిటిలోన యిరవాయఁ గదవే

రేకు: 0135-5 ఆహిరి సంపుటం: 07-209

పల్లవి: సంతలోని జాణవు జాజరలో వాఁడవు
వింతలేదు నాకు నీకు విన్నపమిదయ్యా

చ. 1: గొల్ల చల్ల పుల్లన గున్నచింత చల్లన
వొల్లనె మా పొందులకు నోపుదువా
చల్లదుబ్బదుబ్బెడు సాదించితే వలపులు
తెల్లవారె మా గుట్టు తెలుసుకోవయ్యా

చ. 2: దొడ్డిగంపలప్పెడు తొలిపాలు చిప్పెడు
వొడ్డారపు మాతో పొందుకోపుదువా
జిడ్డుదేరి దుత్తెఁడు చిత్తములోని రతులు
తెడ్డెఁడేసి మోవితీపు తెలుసుకోవయ్యా

చ. 3: మందావులు కల్లలు మాకులెల్లా మొల్లలు
వొందిలి మాతోడి పొందుకోపుదువా
కందువ శ్రీ వేంకటేశ కలసితివిదే నన్ను
దిందుపడే మా నవ్వులు తెలుసుకోవయ్యా

రేకు: 0135-6 కన్నడగౌళ సంపుటం: 07-210

పల్లవి: నవ్వవయ్య యిఁకను నయగారాలు సేసేను
యివ్వలఁ బంతమిచ్చితి నిఁకనేల అలుక

చ. 1: చెక్కుచేతనూఁదితేనే చేరి కోపగించేవు
మొక్కేమయ్య యింతనుండి ముందరికిని
చక్కగుణమెరఁగక సరసమాడితి నీతో
యిక్కువలు దెలిసితి మిఁకనేల అలుక

చ. 2: చన్నులు దాఁకించితేనే సాదించ వచ్చేవు
యెన్నఁ బాదాలొత్తేమయ్య యింతనుండి
సన్నదెలియక నీకు జవ్వనము చూపితివి
యిన్నియు నేరుచుకొంటిమిఁకనేల అలుక

చ. 3: అంది కాఁగలించుకొంటే ఆసలకుఁ బెనఁగేవు
పొందేనయ్య యింతనుండి భోగమెరిఁగి
అందపు శ్రీ వేంకటేశ అలమేలుమంగ నేను
యింద విడెమొక్కటైతిమిఁకనేల అలుక

రేకు: 0136-1 దేసాళం సంపుటం: 07-211

పల్లవి: రట్టైతిమన్నిటాను దిట్టవు నీవు
గుట్టు తోడ నుండఁగాను కొసరకు నీవు

చ. 1: తగని నీచేఁతకు నేఁ దలవంచుకుండఁగాను
నగకుమీ సారె సారె నాతో నీవు
అగడై తొల్లే నేను ఆలనైవుండఁగాను
మొగము చూచి అప్పటి మొక్కకుమీ నీవు

చ. 2: అంతటా నేనీతో పాలయలుకతో నుండఁగాను
అంతలోఁ గొంగువట్టి తియ్యకుమీ నీవు
చెంతలనిట్టే నేను సిగ్గువడి వుండఁగాను
బంతినెడమాటాడి అంపకుమీ నీవు

చ. 3: పైకొని యేపొద్దు నేఁ బానుపుపైనుండఁగాను
వాకుచ్చి పేరునఁ బిలువకుమీ నీవు
చేకొని కూడితివిదె శ్రీ వెంకటేశ నన్ను
యీ కొలఁది మన్ననలే యిమ్మీ నీవు

రేకు: 0136-2 నాదరామక్రియ సంపుటం: 07-212

పల్లవి: ఎరఁగవా వోయి నీవు యేల నన్ననడిగేవు
తరితారుకాణైవుండు తరితీపు వలపు

చ. 1: వచ్చీరాని పదము వంటిదివో వలపు
తచ్చన మాటలవంటి తమి వలపు
పచ్చని తీగెవలెఁ బారేది వలపు
యిచ్చకపు చల్లగాలి యీడువచ్చు వలపు

చ. 2: వలరాయని గరిడి వంటిదివో వలపు
పిలిచి బిడ్డనిచ్చిన ప్రియమిది వలపు
చెలరేఁగే ముంజేతి చిలుకవో వలపు
నిలువు నూరువండేటి మొలకవో వలపు

చ. 3: వనములో వసంతమువంటిదివో వలపు
మనసులో నెలకొన్న మర్మమువో వలపు
యెనసితివి శ్రీ వేంకటేశ నీవు నన్నునిట్టె
కనుఁగొంటిమిద్దరికిఁ గాణాచి వలపు

రేకు: 0136-3 హిజ్జిజి సంపుటం: 07-213

పల్లవి: ఏమని వొడఁబరచేవింకా నన్ను
ఆముక రెంటదెప్పరాలాయఁబో వలపులు

చ. 1: ఆరమణికి నీవు అంపిన సొమ్ములీడకుఁ
జేరెను తబ్బిబ్బుగాను చీట్లతోనే
పోరుకుఁ జాలకిందుకుఁ బుత్తెంచిన విడెమిదే
కూరాకువలెనాయ కోపపు నాచేతను

చ. 2: ఆయింతిని దాఁగివుండుమంటే నెరఁగక తానే
మాయింటికి వచ్చి చెప్పె మతకమెల్లా
మాయలకనుచరించ మరి నావద్దికి రాఁగా
యీయెడఁ బాయిటఁబడెనిదివో నీతరుణి

చ. 3: ఆపెను సన్న సేయఁగా నండనున్న నన్ను సోఁకె
యేపున నీ కొనగోరు యెచ్చరికగా
పై పై నన్నుఁగూడితివి బాపురె శ్రీ వేంకటేశ
చూపులఁ దనిసి యాకె చుట్టమాయ నీకును

రేకు: 0136-4 పాడి సంపుటం: 07-214

పల్లవి: నీ వలె నింత గర్వించనేరనే నేను
యీవలనావలఁ దానే యిందుకేమిసేసేవే

చ. 1: ఉద్దండాన నిన్నాతఁడు వొడివట్టి తీసెనంటా
పెద్దరిక మెందాఁకఁ జెప్పేవే నీవు
వొద్దికతో నాకైతే వుంగర మిచ్చినాఁడు
యిద్దరము నిద్దరమే యిందుకేమి సేసేవే

చ. 2: జక్కవ కుచాలమీఁద చందురుల నించెనంటా
చొక్కుచుఁ జెలులకేల చూపేవే నీవు
అక్కరతో నాకైతే అచ్చువేసి యేలినాఁడు
యెక్కుడు మన పంతాలు యిందుకేమి సేసేవే

చ. 3: కప్పి నిన్నునింతలోనే కౌఁగలించుకొనెనంటా
చిప్పిలుఁ జెమటలనేల చిమ్మిరేఁగేవే
వొప్పుగ యీ శ్రీ వేంకటోత్తముఁడు నన్నుఁగూడె
యెప్పుడు మనసొక్కటే యిందుకేమి సేసేవే

రేకు: 0136-5 కేదారగౌళ సంపుటం: 07-215

పల్లవి: తానె తలఁచుకొని తగిలి మన్నించీఁ గాని
మోనముతో మోము చూపి మొత్తమున రావే

చ. 1: మున్నిటి తన మాటలు ముదులకించి రావే
అన్నిటా తన సన్నలు అడిగి రావే
చన్నులు నేలమోవ సాగిలి మొక్కి రావే
వున్నతిని చేకానికె వొద్దఁబెట్టి రావే

చ. 2: అప్పుడు నేఁగన్నకల ఆతనితోఁ జెప్పి రావే
వొప్పుగాను మనసంతయు నొరసి రావే
విప్పుచుఁ బెదవులను వినయము చూపి రావే
అప్పటి గోడ గురుతు నటు వ్రాసి రావే

చ. 3: సంగడి నుండిన వారి సాకిరివెట్టి రావే
కంగులేక తనబుద్ధి కైకొని రావే
చెంగటికి తానే వచ్చి శ్రీవేంకటేశుఁడు గూడె
సంగతాయననిమెచ్చి సరసకు రావే

రేకు: 0136-6 భైరవి సంపుటం: 07-216

పల్లవి: సిగ్గులేల లోనికి విచ్చేయవయ్య
అగ్గమాయ నావంటిదే ఆపెయు నీకిపుడు

చ. 1: మఱఁగుకు రావయ్య మంచిమేలు సుద్దిచెప్పే
మెఱసి నీవెంత మెచ్చు మెచ్చేవో కాని
తఱి తెరమరఁగింతే తారుకాణించఁగవచ్చు
యెఱిఁగి వలచి వచ్చెనేమౌనో కాని

చ. 2: చేయిచాఁచఁగదవయ్య చేకానుకొకటి ఇచ్చే
ఆయమెరిఁగెంతముదమందేవో కాని
పాయని చుట్టురికాలు పడితళించఁగ వచ్చు
చాయల నీ గురుతులు సరివచ్చివున్నవి

చ. 3: పెనఁగక వుండవయ్య పేరు నీవీఁపున వ్రాసే
ననిచి నీవందుకెంత నవ్వేవో కాని
ఘనుఁడ శ్రీ వేంకటేశ కలసితివిటు నన్ను
యెనసిన నానీడే యిందాఁకా నేనన్నది

రేకు: 0137-1 రామక్రియ సంపుటం: 07-217

పల్లవి: నీవెరఁగవటవయ్యా నెలఁతకు గర్వమని
ఆవల నీ వలనట్టే ఆడేవు గాక

చ. 1: ఆఁటదానికిని సిగ్గే అంతటా నిండినసొమ్ము
నాఁటుకోఁజూచే చూపే నమ్మినసొమ్ము
మేఁటి మురిపెములే మిక్కిలి దాఁచినసొమ్ము
వాఁటపు సెలవినవ్వే వన్నెలసొమ్ము

చ. 2: కాంతకును గుట్టు తోడి గంభీరమే సొమ్ము
యెంతైనాఁ బదరకుండుటెక్కువసొమ్ము
పంతపు మాటలాడుటె భావము నిండిన సొమ్ము
మంతుకెక్కే సణఁగులు మాయని సొమ్ము

చ. 3: తరుణికిఁ బతితోడి తరితీపులే సొమ్ము
బిరుదురతులె చాలాఁ బెట్టిన సొమ్ము
నిరతి శ్రీ వేంకటేశ నీతోఁ బెనఁగుటే సొమ్ము
సరుస మంచముపై రాజసమే సొమ్ము

రేకు: 0137-2 ఆహిరి సంపుటం: 07-218

పల్లవి: ఆపోలికౌనో కాదో అట్టే నీవు చూచుకొమ్మా
పూఁపలై వలపు లెల్లా పూచినట్లున్నది

చ. 1: తగులు కొనెనో మెడఁ దరుణి చూపులెల్లా
అగపడి కల్వదండలై వున్నవి
చిగురుఁబాదాల నిగ్గు జెడగట్టెనో అప్పటి
తగి యల్లదె తులసి దండ వలె నున్నది

చ. 2: చిక్కుకొనెనో నొసలఁ జెలియ నగవులెల్లా
అక్కర ముత్తెపు నామమై నీకున్నది
జక్కవ చన్నుల నీడ సరి నీ యందునంటెనో
నిక్కి నీ చేతుల సంకుఁ జక్కురాలైవున్నవి

చ. 3: మొలచెనో నీవు రాన ముంచి యలమేలుమంగ
మలసి తానే కౌస్తుభమణి యైనది
అలరి శ్రీ వేంకటేశ కలసెనో తా భూసతై
నిలిచి శ్యామ వర్ణము నీమేనైవున్నది

రేకు: 0137-3 ముఖారి సంపుటం: 07-219

పల్లవి: అంతటఁ దనవుడుకారును అయినట్టయ్యాఁ బంతము
చెంతల నావిన్నపమిది చేకొనుమనఁగదవే

చ. 1: పొందులుసేసేదెల్లా పోరాటముకొరకేనా
యిందుకునేమీననఁ దను నింటికి రమ్మనవే
కొందరు సతులను జూపుచు కోపము రేఁచఁగనప్పుడు
ముందుగనేమని యంటినో మొక్కితి నేననవే

చ. 2: యెనయుచు నవ్వినదెల్లా యెగ్గులు పట్టుటకేనా
వెనకటివీఁకఁ దడపేనా వీడెము గొమ్మనవే
వనితలయిండ్ల వాకిట వడిఁ దా రచ్చలుసేయఁగ
మొనగోరటు సోఁకించితి మొక్కితి నేననవే

చ. 3: సొలసిన కౌఁగిటి రతులివి సూడులు పట్టుటకేనా
అలమేల్మంగను నేనే అలను తనకనవే
యెలమిని శ్రీ వేంకటేశుఁడుయెవ్వతె సుద్దులొ తలచఁగ
మొలనూలునఁ దనువేసితి మొక్కితి నేననవే

రేకు: 0137-4 నాదరామక్రియ సంపుటం: 07-220

పల్లవి: ఏమని నుతించవచ్చు యీతని ప్రతాపము
కామించి యీరేడు లోకములెల్లా నిండెను

చ. 1: యీవల దేవుఁడు రథమెక్కితేను దైత్యులెల్ల
కావిరిఁ జక్రవాళాద్రికడకెక్కిరి
భావించి చక్ర మీతఁడు పట్టితే నసురలెల్ల
ధావతితోఁడుతను పాతాళమువట్టిరి

చ. 2: గరుడ ధ్వజము హరి కట్టెదుర నెత్తించితే
పరువెత్తిరి దానవ బలమెల్లను
గరిమ నీ తేరి బండికండ్లు గదలితేను
ఖరమైన దైత్యసేన క్రక్కదలి విరిగె

చ. 3: ధృతి శ్రీ వేంకటేశుఁడు తిరువీధులేఁగితేను
కుతిలాన శత్రులు దిక్కులకేఁగిరి
తతి నలమేల్మంగతో తన నగరు చొచ్చితే
సతమై బలి ముఖ్యులు శరణము చొచ్చిరి

రేకు: 0137-5 శ్రీరాగం సంపుటం: 07-221

పల్లవి: రమణి నూరడింతువు రావయ్య నీవు
తమకించి తన్నుఁదానె తల్లడించీ నిదివో

చ. 1: అప్పుడు నిన్ను సొలసి యాడి యాలాడితినంటా
దప్పిదేరే మోవితోడఁ దలఁకించీఁ జెలి
కొప్పువట్టి తియ్యఁగాను గోరు నిన్నుఁ దాఁకెనంటా
అప్పటి లోలోనె వుస్సురనీ నిదివో

చ. 2: వెంగేన నిమ్మపంటను వేసేలవేసితినంటా
కంగి మనికితపడి కరఁగీఁ జెలి
ముంగిటఁ బెనఁగఁగాను యెంగిలి మోవంటె నంటె
పొంగుఁ జెమటలతోఁ దాఁ బొగిలీనిదివో

చ. 3: వుబ్బునఁ జనుమొనల నొత్తేల వొత్తితినంటా
అబ్బురానఁ జిన్నఁబోయి అలసీఁ జెలి
గబ్బి శ్రీ వేంకటేశుఁడ కాఁగిట నిన్నుటుగూడి
గుబ్బలొత్తెనంటా నీకుఁ గొంకి మొక్కీనిదివో

రేకు: 0137-6 వరాళి సంపుటం: 07-222

పల్లవి: ఇసుక పాతర యిందుకేది కడగురుతు
రసికుఁడ నన్నునింత రవ్వశాయనేఁటికి

చ. 1: బయలు వలెనుండును పట్టరాదు వలపు
మొయిలువలెనుండును ముద్దశాయరాదు
నియతములేదించుకు నేరిచినవారిసొమ్ము
క్రియ యెరుంగుతా నన్నుఁ గెరలించనేఁటికి

చ. 2: గాలివలెఁ బారుచుండు కానరాదు మనసు
పాలవలెఁ బొంగుచుండు పక్కననణఁగదు
యేలీలా గెలువరాదు యెక్కితే యేనుగగుజ్జు
లోలోనె మమ్మునింత లోఁచి చూడనేఁటికి

చ. 3: వెన్నెలే కాయుచునుండు వింతగాదు వయసు
అన్నిటా వసంతరుతువై యుండుఁ బోదు
వున్నతి శ్రీ వేంకటేశుఁడుండనుండఁ జవి వుట్టు
మన్నించె యింక మారుమాటలాడనేఁటికి

రేకు: 0138-1 యాలపదాలు - దేసాళం సం: 07-223
చ. 1: మేడలెక్కి నిన్నుఁజూచి - కూడేననే యాస తోడ
వాడు దేరి వుస్సురందురా-వేంకటేశ యాడనుంటి విందాకానురా
పిక్కటిల్లు చన్నులపై - చొక్కపు నీ వుంగరము
గక్కన నేనద్దుకొందురా- వేంకటేశ లక్కవలె ముద్రలంటెరా
దప్పిగొంటివని నీకుఁ- గప్పురము పారమిచ్చి
ముప్పిరి నీవిరహానను - వేంకటేశ నిప్పనుచు భ్రమసితిరా
నిండఁబూచిన మావిపై- గండుఁగోవిల గూయఁగా
నిండిన నీయెలుఁగంటాను వేంకటేశ అండకు నిన్ను రమ్మంటిరా
వుదయచందురుఁ జూచి- అదె నీపంజని సవి
యెదురుకేనే వచ్చితిరా - వేంకటేశ బెదరి మారుమోమైతిరా
మిన్నక కేళాకూళిలో వున్న తమ్మివిరులు నీ
కన్నులంటా జేరఁబోఁగాను - వేంకటేశ పన్ని మరునమ్మలాయరా
అనిన తుమ్మెదలు నీ - మేనికాంతిఁ బోలునని
పూనిచేతఁ బట్టఁబోఁగాను వేంకటేశసునాస్తుని వేగులాయరా
కందువ మై చమరించి గందవొడి చల్లుకొని పొంద
నిన్ను దలఁచితిరా వేంకటేశా అంద చొక్కుమందులాయరా
బొండుమల్లె పానుపుపై నుండి నిన్నుఁ బాడి పాడి
నిండుజాగరములంటిరా -వేంకటేశ యెండలాయ వెన్నెలలురా
నిద్దిరించి నీవు నాకు - వొద్దునుండఁ గలగంటి
చద్దివేఁడి వలపాయరా- వేంకటేశ సుద్దులింకా నేమి సేసేరా
మల్లెపూవు కొనదాఁకి ఝల్లనను బులకించి
వుల్లము నీకొప్పించితిరా-వేంకటేశ కల్లగాదు మమ్ముఁ గావరా
జోడుగూడి నీవు నేను- నాడు కొన్న మాటలెల్లా
గోడలేని చిత్తరువులై- వేంకటేశ యాడా నామతిఁ బాయవురా
అద్దము నీడలు చూచి ముద్దు మోవి గంటుండఁగా కొద్దిలేని కాఁకతోడను - వేంకటేశ పొద్దువోకతమకింతురా

పావురమురెక్కఁ జీటి- నీవొద్దికిఁ గట్టియంపి
దేవరకే మొక్కుకొందురా - వేంకటేశ నీవిందు రా వలెనంటాను
బంగారు పీఁటపైనుండి- ముంగిటకి నీవురాఁగా
తొంగిచూచి నిలుచుండఁగా - వేంకటేశ యెంగిలిమోవేలడిగేవు
దంతపుఁ బావాలు మెట్టి- పంతాన నేను రాఁగాను
యింతలో బలిమిఁ బట్టేవు - వేంకటేశ అంత నీకుఁ బ్రియమైతినా
పట్టు చీర కొంగు జారి- గుట్టు తో నేనుండఁగాను
వట్టి నవ్వు లేల నవ్వేవు - వేంకటేశ దిట్టవు నీ యంతవారమా
కొప్పుపట్టి తీసి నీవు -చెప్పరాని సేఁత సేసి
తప్పక నేఁ జూచినంతలో - వేంకటేశ చిప్పిలేల చెమరించేవు
బొమ్మల జంకించి నిన్ను- తమ్మిపూవున వేసితే
కమ్మియేల తిట్టు దిట్టేవు - వేంకటేశ నిమ్మపంట వేతునటరా
నెత్తమాడేనంటా రతి- పొత్తుల పందేలు వేసి
వొత్తి నీవే వోడే వేలరా - వేంకటేశ కొత్తలైన జాణవౌదువు
వున్నతి శ్రీవెంకటేశ మన్నించి కూడితివిదే
నన్నునెంత మెచ్చు మెచ్చేవు - వేంకటేశ కన్నులపండువలాయరా
చిలుకలు మనలోన- కలిసిన యట్టివేళ
పలుకు రతిరహస్యాలు - వేంకటేశ తలఁచినేఁ దలపూఁతరా
నీకు వలచిన వలపు- లాకలెత్తె నామతిని
వాకున నేఁ జెప్పఁ జాలరా - వేంకటేశ లోకమెల్లా నెరిఁగినదే

పాయము నీకొక్కనికే- చాయగా మీఁదెత్తితిని
యీయెడఁ గైవాలకుండను - వేంకటేశ మాయింటినే పాయకుండరా
ముమ్మాటికి నీబాసలే- నమ్మివున్నదాన నేను
కుమ్మరించరా నీ కరుణ - వేంకటేశ చిమ్ముఁజీకటెల్ల బాయను

రేకు: 0138-2 కేదారగౌళ సంపుటం: 07-224

పల్లవి: నీవింత యలుగుదురా నివ్వెరగుతోనుందురా
మూవంక వీఁగీ వాఁడె మొక్కుదువో యంటాను

చ. 1: వాకిటనున్నాఁడు వాఁడె వనిత నీరమణుఁడు
తూకొని నీవెదురువత్తువో యంటాను
చేకొని చాఁచీ వాఁడె చేయి నీమీఁదనతఁడు
యీకడఁ గైదండ నీవిత్తువో యంటాను

చ. 2: తప్పక చూచీ వాఁడె తరుణి నీమోముదిక్కు
చొప్పుగా మారుకుమారు చూతువంటాను
వొప్పుగఁ బవళించీని వొద్ద నీవునట్టె వచ్చి
దప్పిదేరఁ బవళించి తమకింతువంటాను

చ. 3: మాటలాడీనదె వాఁడె మర్మములు సోఁకఁగ
కోటులుగ నీవు పలుకుదువంటాను
గాఁటమైకూడెను శ్రీ వేంకటపతి యిదె వీఁడె
మేటివై వురముమీఁద మెరతువంటాను

రేకు: 0139-1 గుజ్జరి సంపుటం: 07-225

పల్లవి: ఏఁటికి మంకుఁదనము యీవేళను
గాఁటాన నొడఁబరచీఁ గానిమ్మనఁ గదవే

చ. 1: చలము సాదించఁబోతే చప్పనౌను బ్రియము
బలిమిసేయఁగఁబోతే పలచనౌను
పిలువఁగ రాకున్న బెట్టుగా వేసటవుట్టు
చెలఁగి నీ రమణుఁడు చెప్పినట్టు సేయవే

చ. 2: యెదురు మాటాడితే యెగసక్యమౌ పొందు
పదరితే కడుఁగడుఁ బాటి చాలదు
పొదుగఁగ నూరకున్న పోరచి కాఁకలు రేఁగు
అదన నీపతిమతి ఆస యీడేరించవే

చ. 3: చేవల్లకు రాకుండితేఁ జిగిరించు పంతము
భావించక లోఁచితేను పచ్చిదేరును
యీవేళఁ గూడె నిన్నునింటికిఁ దానే వచ్చి
శ్రీ వేంకటేశ్వరుఁడు చెనకీని నవ్వవే

రేకు: 0139-2 సౌరాష్ట్రం సంపుటం: 07-226

పల్లవి: చేసినట్టే సేసుఁగాక చెప్పేదేమి
సేస వెట్టినట్టి తన చేతి లోని దానను

చ. 1: వేడుకకు వెలలేదు వెన్నెలకుఁ గాటువోదు
ఆడనీవే తన మాట కడ్డము లేదు
గోడ గడుగవచ్చునా కొసరఁగనీఁకనేల
కూడిన తన సతుల గుంపులలోని దానను

చ. 2: జవ్వనము పొల్లవోదు చలిగాలి బొందువోదు
నవ్వనీవే తనవావి నడుమఁబోదు
గవ్వ వొరయవచ్చునా కక్కసించ నీఁకనేల
కువ్వగాఁ బోసిన త నకొలువులోదానను

చ. 3: తియ్యవిల్లు చప్పగాదు దీకొన్న వలపు వోదు
యియ్యనీవే తన మోవికెంగిలిలేదు
పయ్యదంటి శ్రీ వేంకటపతి నన్నునిదె కూడె
యియ్యెడఁ దాఁ బవళించే యింటిలోనిదానను

రేకు: 0139-3 పాడి సంపుటం: 07-227

పల్లవి: ఆనక పోరాదుగాని అండనుండ వారము
నిను నీవెరఁగలేవు నీకేడ వలపు

చ. 1: ఆఁటదానిఁ గంటే పతి ఆదరించనే వలె
వేఁటకానివలెనుంటే వేడుకేడది
గాఁటానఁ గొలువుసేయఁగా గద్దెమీఁదనుండి
నీటుతోనే సాదించేవు నీకేడ వలపు

చ. 2: పాసివున్న సతిఁగంటే బాఁతిపడి నవ్వవలె
మాసటీనివలెనుంటే మచ్చికేడది
ఆసపడి చూడఁగాను అట్టె మలఁగుపైఁబండి
నీ సుద్దులే చెప్పేవు నీకేడ వలపు

చ. 3: తరుణి కూటమి గంటే దప్పిదేర్చనేవలె
తరకానివలెనుంటే తమియాడది
అరిది శ్రీ వేంకటేశ ఆపె నిన్నుఁ గూడఁగాను
నెరుపేవు సిగ్గులే నీకేడ వలపు

రేకు: 0139-4 హిందోళం సంపుటం: 07-228

పల్లవి: నేరములెంచేదెల్లా నిన్నా నేను
నేరిచి మాటాడేది నీతోనా నేను

చ. 1: కపటాలు గలవంటా కల్లరివి నీవంటా
నెపములెన్నేదల్లా నిన్నా నేను
వుపమల దాననంటా వొరపులు నేర్తునంటా
నిపుణత మెరసేది నీతోనా నేను

చ. 2: యెక్కడనో వుంటివంటా యెరవులవాఁడవంటా
నిక్కపుబాసడిగేది నిన్నానేను
చక్కనిదాననంటా చలము సాదింతునంటా
నెక్కొని నవ్వునవ్వేది నీతోనా నేను

చ. 3: మట్టున నడవుమంటా మాయింటికి రమ్మంటా
నెట్టనఁ గొంగువట్టేది నిన్నానేను
గట్టిగ శ్రీ వేంకటేశ కలసితివిటు నన్ను
నిట్టూర్పుతో నలసినది నీతోనా నేను

రేకు: 0139-5 బౌళిరామక్రియ సంపుటం: 07-229

పల్లవి: నాకే వలతువోయి నరహరి
చేకొని నేనెరుఁగుదు చెప్పకు నరహరి

చ. 1: నగేవు నామోము చూచి నరహరి నీ
నగరెల్లా సతులే నరహరి
నగములు మాచన్నులు నరహరి
పగటున నిన్ను నాఁటేఁ బట్టకు నరహరి

చ. 2: నలుగడఁ జూచి చూచి నరహరి మోవి
నలినలిసేతురా నరహరి
నలఁగనియ్యకు కొంగు నరహరి
బలిమినెవ్వరెవ్వరు పట్టిరో నరహరి

చ. 3: నానారతులఁ గూడి నరహరి కడు
నానఁబెట్టేవు వలపులు నరహరి
మానక శ్రీ వేంకటేశ మండెమురాయఁడవై
పూని నన్ను మన్నించి పొందేవు నరహరి

రేకు: 0139-6 శంకరాభరణం సంపుటం: 07-230

పల్లవి: ఏఁటిమాఁటలాడేవే యెందాఁకా నీవు వోరి
వాఁటముగ యిట్టే వట్టి వళకులాడకురా

చ. 1: పయ్యదలో వాలెనవే పట్టియ్యవే జక్కవల
కొయ్యకాఁడ కావుర కుచములివి
ముయ్యనేఁటికే అట్లైతే మొరఁగక చూపఁగదే
యియ్యెడఁ బైఁడి బిందెలెట్లు చూపవచ్చురా

చ. 2: వొడిలోన దాఁగెనదే వొప్పగించవే సింహము
గడుసుకాఁడ కాదది నడుమింతేరా
విడిచి సోదనీవే విచ్చనవిడినట్టైతే
సుడిసి ఆకసమెట్లు సోదనగోనేవురా

చ. 3: కుచ్చులలోపల దాఁగె కొమ్మ నెమళ్ళు నీవే
అచ్చపు నడపులింతే అవిగావురా
కుచ్చి శ్రీ వేంకటేశుఁడ గురితేది అట్టైతే
యిచ్చఁగూడితివి గురుతెటు చూపవచ్చురా

రేకు: 0140-1 శ్రీరాగం సంపుటం: 07-231

పల్లవి: గుట్టుగలవాఁడు గల కొసరఁడాతఁడు నిన్ను
రట్టడితనమున నాఁబడిసేయకువే

చ. 1: యెండమావుల నీరు యేకతపు పాలయలుక
వండఁగ వండఁగ నట్లు వలపులెల్ల
కొండల నున్ననిచూపు గొనకొన్న వెడయాస
అండనుండే విభుని నలయించనేలే

చ. 2: గుంటిమీఁదటివాన కొనబు సరసపుటాన
వెంటవెంట తోడినీడ వేడ్కతగులు
పంటవండిన పాల్లు పాసివుండినకాఁక
జంటఆయిన పతినింత సడిఁబెట్టనేలే

చ. 3: బేగడపసిఁడి నిగ్గు బీరపుబిగువులివి
లాగవేగపుగోరి లాంచనములు (?)
చేగదేరఁగఁ గూడె శ్రీ వేంకటేశ్వరుఁడు
యీగతి నితనినింక యెలయించనేలే

రేకు: 0140-2 శంకరాభరణం సంపుటం: 07-232

పల్లవి: ఎన్నఁడు లేనిగురుతులిదె నీమేనఁ గంటిమి
సన్నల యీసుద్దులెట్లు చవిసేసేవే

చ. 1: చెదరెను నీకురులు చెమట చెక్కుల నిండె
యెదురి మెచ్చఁగ నర్థమేమి చెప్పేవే
వదలె నీమొలనూలు వాడెను నీకెమ్మోవి
పొదలి యిందుకెట్లా బొంకఁగలవే

చ. 2: కంకణాలు వదలెను గందపుఁబూఁత చిట్లె
వంకలొత్తి యిందుకెట్టు వాదించేవే
సుంకుమోపెఁ బలుకులఁ జూపులఁ గొత్తలు దోఁచె
సంకెలేక యివియెట్లు సటలనేవే

చ. 3: మోమునఁ గళలు నించె ముక్కున నిట్టుర్పురేఁగె
యీమాటకుత్తరమెట్లిచ్చేవే మాకు
ఆముక శ్రీ వేంకటేశుఁడన్నిటాను నిన్నుఁగూడె
ఆమని సెలవినవ్వులాఁపనెట్లు వచ్చునే

రేకు: 0140-3 కాంబోది సంపుటం: 07-233

పల్లవి: ఎంతసంతోసమోకాని యేమి చెప్పేది
వింతలైన వలపుల విడిదాయఁ దాను

చ. 1: అమరనాదరించి చెప్పంపిన నీమాటవిని
చెమటలచెలమాయఁ జెలియ
గమకపు నీముద్దుటుంగరపు గురుతుచూచి
గములైన మెఱుఁగులగని యాయ మొగము

చ. 2: అలరనాసరేచ నీవంపిన విడెము చూచి
పులకలపోగాయఁ బొలఁతి
వలనై పొందికల నీవ్రాలకమ్మలు చూచి
పలచని నవ్వుల పండుగాయ మోవి

చ. 3: కడఁగి శ్రీవేంకటేశ కాఁగిట నీవు నించితే
కడు సిగ్గులకొండాయఁ గలికి
పుడివోని నీరతుల వొడఁబడికలఁ జెంది
అడియాలమైన మణిహారమాయను

రేకు: 0140-4 ముఖారి సంపుటం: 07-234

పల్లవి: వింతవాఁడా తానేమి వేమరుఁ జెప్పించుకొన
బంతినే తరితీపులు పచరించవలెనా

చ. 1: తనమాటే నామాట దగ్గరి రమ్మనవే
యెనసియునెడమాటలేలాడించీని
మనసుకు మనసే మరి తారుకాణగదే
చెనకి పొందులు యింకాఁ జేసి చూపవలెనా

చ. 2: అక్కడే యిక్కడ నాఅండనుండుమనవే
పెక్కుప్రియములెల్లాఁ జెప్పించఁగనేల
చొక్కమైన చూపుకు చూపులే గురిగదే
పక్కన నింకా నొడఁబరచఁగవలెనా

చ. 3: యీవలఁ దానే నేను యిప్పుడె కూడుమనవే
శ్రీ వేంకటేశుఁడేల సిగ్గువడీని
వావులకు వావులే వలపించెఁగదవే
వేవేలుగా మన్నించె వేఁడుకొనవలెనా

రేకు: 0140-5 కేదారగౌళ సంపుటం: 07-235

పల్లవి: ఒక్కరికిఁ జెప్పరాదు వూఁకొనరాదు
పక్కననేమనినాను పైఁడికతవంటిదే

చ. 1: ఆరెఁ దేరె నెడమాటలాడించ మీతోనేలే
చేరి తానే యడిగితేఁ జెప్పేఁ గాని
గోర గీరితే నీరయ్యీ గుట్టుననుండనియ్యరే
మేర మీరితే నతని మెప్పించేఁ గాని

చ. 2: వక్కణగా నాకుమీఁద వాసి పంపనేలే నా
దిక్కునఁ జూచితేఁ దనకే తెలిపేఁ గాని
వొక్కటంటే రెండయ్యీనూరకే వుండనియ్యరే
వెక్కసమైతేఁ దనతో వెలయించేఁగాని

చ. 3: తప్పులెంచి అందరిచేఁ దగవులఁ బెట్టనేలే
యిప్పుడే యేకతమైతే యెంచేఁగాని
పుప్పు చిందినుమడయ్యీ వొనరె నుండఁగనీరే
కప్పి శ్రీ వేంకటేశుఁ గాఁగిలించేఁగాని

రేకు: 0140-6 బౌళిరామక్రియ సంపుటం: 07-236

పల్లవి: ఎక్కడ నేరిచితివే యేడలేని వేసాలు
వెక్కసాలేల చేతి విడెమియ్యఁ గదవే

చ. 1: మువ్వంకల నీకునీవె ములిగేవు సారెసారె
నవ్వులకాడినమాట నాటెనటవే
పవ్వళించి అప్పటి నీపానుపుపైఁ బొరలేవు
పవ్వుల వేసినపోటు బొప్పిగట్టెనటవే

చ. 2: కప్పుచుఁ బయ్యదకొంగు కడునొడ్డించుకొనేవు
తప్పక చూచినచూపు తాఁకె నటవే
తిప్పి తిప్పి చూచేవు తేరకొనఁ జన్నులపై
కప్పురము చల్లితే కసుగందె నటవే

చ. 3: కినిసి యంతటలోనె కిందుపడి మొక్కేవు
వొనరఁ గాఁగిలించితే వొత్తెనటవే
యెనసి శ్రీ వేంకటేశునెదురుగాఁ గొసరేవు
చెనకితే మేనిమీఁద జీరవారె నటవే

రేకు: 0141-1 మాళవిగౌళ సంపుటం: 07-237

పల్లవి: ఒక్కరియెంగిలి సొత్తుకొకరాసపడుదురా
దక్కని సొమ్ములకును తానేల వచ్చీని

చ. 1: పయ్యదంటి నీవు నన్నుఁ బైకొనఁగా వచ్చి యీపె
కయ్యమడువఁ దనకుఁ గలదా పని
ఇయ్యడనేకతమున యిద్దరమునుండఁగాను
దయ్యమువలె నిప్పుడు తానేల వచ్చీని

చ. 2: చెంది నీవు నాతొడపై శిరసువెట్టుకుండఁగా
సందు చొచ్చి చూడనేమి సమ్మందము
సందుడివలపుల సదమదమై వుండఁగా
దందు పసురమువలె తానేల వచ్చీని

చ. 3: నిగిడి శ్రీ వేంకటేశ నీవు నన్నుఁ గూడితేను
తగునని పొగడఁగఁ దనకేమి
మొగము చూచుకొని ముచ్చట నీతో నాడఁగా
తగిలి పొట్టేలువలె తానేల వచ్చీనే

రేకు: 0141-2 సౌరాష్ట్రం సంపుటం: 07-238

పల్లవి: ఎట్టు దరియించవచ్చును యిటువంటివెల్లఁ జూచి
బట్టబయలీఁదించఁగా భ్రమసినట్టయ్యీని

చ. 1: పమ్మి నీమేనిమీఁదట పచ్చిచెమట గారఁగా
నమ్మికలియ్యఁగనే పో నవ్వు వచ్చీని
చిమ్ముచు వెంగెమాడితే సిగ్గులువడక నీవు
నెమ్మదినూఁకొనఁగానే నివ్వెరగయ్యీని

చ. 2: పోదిగా నీపెదవికెంపులు రేఁగ మాటలాడి
ఆదరించఁగానె పో అదరీ మేను
ఆదెస నేరమెంచితే అందాలు సేసుక నీవు
వాదుకు రాకుండఁగా నివ్వల సోద్యమయ్యీని

చ. 3: మేరతో ఆఁడుసొమ్ములు నీమెడఁ బెట్టుకొని వచ్చి
సారెఁ గాఁగలించఁగా బో చలమెక్కీని
యీరీతి శ్రీ వేంకటేశ యేలితివి ననునిట్టే
గారవించఁగా నప్పటిఁ గరుణ పుట్టీని

రేకు: 0141-3 బౌళి సంపుటం: 07-239

పల్లవి: ఔనే జాణక త్తెవు అన్నిటా నీవు
యేనిగె గుజ్జౌఁగదే యెక్కినవారికిని

చ. 1: ఇంతవాసి గలదానవేల నవ్వితివే ముందు
చెంతఁ బెట్టనికోటవై చెలఁగవద్దా
వంతులకు నీవెంత వలపించుకొనినాను
పంతపు విభుఁడు కిందుపడునా నీకు

చ. 2: యెగ్గుపట్టేటి దానవు యేల రమ్మంటివే ముందు
వొగ్గి వీడనిగంటవై యుండఁగరాదా
అగ్గలమై నీవెంత అట్టె బాసగొనినాను
సిగ్గులాతఁడు ప్రియము చెప్పునా నీకు

చ. 3: యెలయించేటిదానవు యేల మొక్కితివే ముందు
అల కదలనికంబమై యుండరాదా
బలిమి శ్రీ వెంకటేశుఁగలసి యెంతవుండిన
బలువుఁడీతఁడు తడఁబడునా నీకు

రేకు: 0141-4 శంకరాభరణం సంపుటం: 07-240

పల్లవి: నీవె విచ్చేయవయ్య నేరుపరివిందుకెల్ల
నీవనిత యలుకలు నేము దిద్దఁగలమా

చ. 1: మాఁటవోరువఁగలేని మంకు దానిఁ గేరడాలు
యేఁటికినాడితివయ్య యింతలో నీవు
వాఁటమై పారెఁ గన్నీటివరదలు చన్నులపై
నీఁటున నింతటెలుక నేము దిద్దఁగలమా

చ. 2: కాఁకకోరువఁగలేని కాంతకుఁ గోపమురేఁచి
సోఁకింతురా కొనగోరు చురుకనను
వేఁకపు నిట్టూరుపులు విసరీ హారములపై
యేఁకటనింతేసి పనులేము దిద్దఁగలమా

చ. 3: రవ్వకోరువఁగలేని రమణితో జూజాలాడి
నవ్వుదురా శ్రీ వేంకటనగవిహార
పువ్వులు కొప్పువి రాలె పొందితే బుజాలమీఁద
నివ్వటిల్లు మీవోజలు నేము దిద్దఁగలమా

రేకు: 0141-5 శ్రీరాగం సంపుటం: 07-241

పల్లవి: ఏల కొనఁబెట్టేవే యెందాఁకా మాటలు
నాలితో వండినకూడు ననుఁబాయే కాదా

చ. 1: పెక్కువనితలమీఁది ప్రియము గలవానికి
యెక్కడిది మోహము నీవేమి చేప్పేవే
వొక్కమాఁటె సారెసారెనొట్టుకొని చవిగొంటే
మొక్కలానఁ బంచదార మొగచాటుగాదా

చ. 2: గాఁటపుసతులఁబొంది కాయాటైన వానికి
యేఁటికిఁ గరఁగీ గుండె యెమిచేప్పేవే
మేఁటియై మేనినిండా మితిలేక పెట్టుకొంటే
నీఁటున బంగారైన నిండా వేఁగుగాదా

చ. 3: ఊరఁ జుట్టపు శ్రీ వేంకటోత్తముఁడైనవానికి
యేరీతిఁ దమిరేగీనేమి చేప్పేవే
యీరీతి నన్నునేలె యింకాఁ గొసరితేను
పేరఁబెట్టితే పాలు పెరుగేకాదా

రేకు: 0141-6 గౌళ సంపుటం: 07-242

పల్లవి: తరుణిమేనికిని నీతనువె మాటు
నిరతపుటాసకు నిండుఁజూపె మాటు

చ. 1: చెలియసిగ్గులకు చెక్కుఁచేయే మాటు
పలుకులకును మోవిపండె మాటు
నెలకొన్న చింతలకు నివ్వెరగే మాటు
బలుజవ్వనమునకు పయ్యదే మాటు

చ. 2: ముంచిన నవ్వులకును మొక్కులివే మాటు
మంచి నడపులకును మట్టెలే మాటు
వంచిన శిరసునకు వాలుఁగొప్పే మాటు
కొంచని చనులకు కొనగోరె మాటు

చ. 3: పొందుల రతులకను పుక్కిటివిడెమె మాటు
అందిన వేడుకకు నాయములె మాటు
విందుల వలపులకు వేవేలు రతులె మాటు
యిందుముఖికై శ్రీవేంకటేశ నీ యింపె మాటు

రేకు: 0142-1 గుజ్జరి సంపుటం: 07-243

పల్లవి: తెలిసినవాఁడవు ధీరుఁడవిన్నిటా నీవు
చలము సాదింతురా సతులతో నీవు

చ. 1: అప్పటి మానవు మాటలాపెతో నీవు
కప్పురమిచ్చినమీఁద గలదా వాదు
చెప్పరాని తిట్టుదిట్టి చేయెత్తి మొక్కితేను
వొప్పుగొనవద్దా మఱి వొరట్లేమిటికి

చ. 2: తలవంచుకున్నాఁడవు తరుణియెదుట నీవు
సెలవి నవ్వినమీఁద సేతురా యింత
కలువపువ్వులవేసి కౌఁగలించుకొంటేను
అలుకదీరఁగవద్దా ఆనలు మరేఁటికి

చ. 3: బింకములు నెఱపేవు ప్రియురాలి యెదుటను
సంకెలు దీర్చినమీఁద చలమేఁటికి
అంకెల శ్రీవేంకటేశ ఆలయించి నిన్నుఁగూడె
మంకులు మానఁగవద్దా మదము మరేటికి

రేకు: 0142-2 శ్రీరాగం సంపుటం: 07-244

పల్లవి: ఇందవయ్య కానుకయిచ్చె నీకుఁజెలియ
మందలించేనింటికాడ మగువతో నిన్నును

చ. 1: కలువరేకులవాఁడి కాంతచూపులనున్నది
వలరాజు నమ్ములకు వాసనే కాని
చలివేఁడి వలపులు చన్నులకొనల నవే
చెలువుఁడ నీవిఁకనేల సేసేవు జాగులు

చ. 2: ననిచిన చిగురెల్లా నాఁతిమోవినె వున్నది
వనముల మాకులెల్లా వట్టివే కాని
మనసుమర్మములెల్లా మాటలతుదలఁదోఁచె
ఘనుఁడవు యిఁకనేల కప్పేవు తమకము

చ. 3: నిండుమేఘము మెరుఁగు నెలఁతమోమున నిదే
వుండు మింటననే పేరు వొక్కటేకాని
కొండల శ్రీవేంకటేశ కూడితిరిద్దరు నేఁడు
గండికాఁడ యిఁకనేల కాదనేవు మాటలు

రేకు: 0142-3 పాడి సంపుటం: 07-245

పల్లవి: ఏల నన్నునొరసేవు యిన్నేసిచేఁతలను
చాలుననేనా మోవి చప్పఁజేతుఁగాక

చ. 1: పంతములాడేనా పరాకున నీవుండితే
చింతదేర నీసేవ సేసేఁ గాక
వంతులడిగేనా నిన్ను వనితలలోన నుంటే
దొంతరవలపులను తొప్పఁదోఁగింతుఁ గాక

చ. 2: కన్నులఁ దిట్టేనా గక్కన నీవు రాకుంటే
చన్నులనే వొత్తి నిన్ను సాదింతుఁగాక
విన్నపాలు సేసేనా విచ్చనవిడినే వుంటే
కిన్నర మీఁట్లలోనే గిలిగింతుఁగాక

చ. 3: కపటాలు సేసేనా కాఁగలించుకోకుండితే
వుపమ వీడేనకుఁ జేయొగ్గింతుఁ గాక
యిపుడె శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
అపలాపించేనా నేనట్టే మెత్తుఁగాక

రేకు: 0142-4 శ్రీరాగం సంపుటం: 07-246

పల్లవి: తానిటువంటివాఁడా తనగుణమిదిగాదు
వూని యీ వెరపు మతిఁబుట్టించినదెవ్వతె

చ. 1: కొత్తకొత్తవలపులు కొంతకొంత నెరపుతా
వత్తునంటాఁ జెప్పింపవలెనా నేఁడు
యిత్తలఁ దా వింతవాఁడా యెవ్వరన్నా వద్దనేరా
చిత్తములోనింత కొంకఁజేసినది యెవ్వతె

చ. 2: వేఁడివేఁడి తమకము వేసివేసి తనచేయి
వాఁడి నాచన్నులమోపవలెనా నేఁడు
పేఁడుకొనేమా చలము భేదమా తనకు నాకు
పోఁడిమి తనకునింత బుద్ధిచ్చినదెవ్వతె

చ. 3: ముద్దుముద్దుమాటల ముంచి ముంచి బాసలిచ్చి
వద్దనుండి గోరగీరవలెనా నేఁడు
అద్దుక శ్రీవేంకటేశుఁడన్నిటాఁదా నన్నుఁగూడె
తిద్దినట్టి తనపాలిదేవరైనదెవ్వతె

రేకు: 0142-5 ముఖారి సంపుటం: 07-247

పల్లవి: కంటకములాడనేల కాఁతాళమేఁటికి నీతో
మంటదీర నా పనులు మానివుండేఁ గాక

చ. 1: కోపగించేనా నీతో కొప్పువట్టి తీసితేను
యేపున ముడుచుకొనేనేమాయను
పైపై దొరలతోడి పంతాలకు నేమిపని
ఆపరాకై వానగుంటలాడుకొనేఁ గాక

చ. 2: కమ్మటిఁ దిట్టేనా నిన్ను కాలు నీవు దొక్కితేను
యెమ్మెలేక తీసికొనేనేమాయను
దిమ్మరి విభునితోడ దీకొనేవాదులేల
యిమ్ములఁ జుక్కలై నానెంచుకొనేఁ గాక

చ. 3: పక్కన నొట్టువెట్టేనా పచ్చడము గప్పితేను
యిక్కువలు గరఁగేను యేమాయను
నిక్కి శ్రీవేంకటేశుఁడ నిన్నుఁగూడి కొంకువద్దా
చక్కనైతి నీమోవి చవిచూచేఁగాక

రేకు: 0142-6 భైరవి సంపుటం: 07-248

పల్లవి: ఓరుపే నేరుపు సుమ్మీ వువిదలకు
మారుకోకు మగవాని మనసు మెత్తనిది

చ. 1: చలము సాదించవద్దు చనవే మెఱయవే
చెలువుఁడాతఁడే నీచేతఁ జిక్కీని
బలుములు చూపవద్దు పకపక నగవే
అలరిన జాణతనమందులోనే వున్నది

చ. 2: పగలు చాటఁగవద్దు పైకొని మెలఁగవే
సొగిసి ఆతఁడే నీసొమ్మై వుండీని
తగవులఁబెట్టవద్దు తమకము చూపవే
అగపడ్డ నీ పంతములందులోనే వున్నవి

చ. 3: మొక్కలమేమియునొద్దు మోహములు చల్లవే
నిక్కి శ్రీవేంకటేశుఁడు నిన్నుఁగూడెను
తక్కులఁ బెట్టఁగవొద్దు దయలు దలఁచవే
అక్కజపు నీరతులు అందులోనే వున్నవి

రేకు: 0143-1 సౌరాష్ట్రం సంపుటం: 07-249

పల్లవి: పొత్తుల మగువలకుఁ బోవునా యింక
యిత్తలఁ గూడుండుదము యీడకిట్టేరావే

చ. 1: మచ్చరము నాకేలే మగఁడు మొదలనే
మచ్చికచేసి నిన్ను మన్నించునట
వెచ్చనూర్పు నీకేలే వెరపులింకానేలే
కుచ్చినేనూఁ గౌఁగిలించుకొనేఁ గాని రావే

చ. 2: వెంగెమాడ నాకేలే విభుఁడు వేడుకపడి
సింగారించి నిన్ను రట్టుసేసుఁ దానట
ముంగిటనే కొంకనేలే ముసిముసి నవ్వులేలే
సంగడిబూవానకు చలివాపీ రావే

చ. 3: పెనఁగఁగ నాకేలే ప్రియుడు లోలోనె వచ్చి
కనుసన్న సేసి నిన్నుఁ గలపునట
నను శ్రీవేంకటేశుఁడు నవ్వుతానిట్టెకూడె
తనిసిన రతులు చింతనసేసే రావే

రేకు: 0143-2 దేసాళం సంపుటం: 07-250

పల్లవి: ఇద్దరము నిద్దరమే వోవోయి
వద్దుసుమ్మీ వట్టిపంతాలోవోయి

చ. 1: యెఱఁగవా మాగుట్టు యేమోయి మమ్ము
ఉఱక గుట్టరసేవు వోవోయి
యెటికెతనా నీకు యేమోయి - మాపై
వొఱగుంటే నేమాయనో వోవోయి

చ. 2: యెప్పటికెప్పటి సుద్దులేమోయి - నీపై
నుప్పరాలెగసీఁ జన్నులేమోయి
యిప్పలేర్లులాయ మోవి యేమోయి
వొప్పన గొనుమీ నేఁడు వోవోయి

చ. 3: యెమ్మెలు మనలోనేల యేమోయి
వుమ్మగిలీ వలపులు వోవోయి
యిమ్ముల శ్రీవేంకటేశ యింతలోనె కూడితిమి
వొమ్మె గా జాణతనాలోవోయి

రేకు: 0143-3 దేశి సంపుటం: 07-251

పల్లవి: మేలయ్యా నీచేఁతలు మెచ్చితినయ్యా
తాలిమిలెస్సపనాయఁ దగవరివవుదువు

చ. 1: పడఁతిఁ బిలువనంపి పగడసాలాడేవు
వుడుగకీపరాకులకోపునా ఆపె
యెడసి పానుపుమీఁద యెదురుచూచీఁ జెలియ
నడుమ మామోముచూచి నవ్వేవిక్కడను

చ. 2: కొమ్మను లోనికినంపి కొలువున్నాఁడవు యీడ
వుమ్మగిలు నికాఁకలకోపునా ఆపె
చెమ్మఁ జెమటలతోడ చేసన్న సేసేనబల
పమ్మి మాకునుడిబడి పనులుచెప్పేవు

చ. 3: దోమతెర వేయించి తొంగిచూచేవిందరిని
వోముచు నీవేసాలకోపునా ఆపె
ఆముకొని శ్రీవేంకటాధిప నిన్నింతి గూడె
వేమారు మమ్మిక్కడను వీడేలడిగేవు

రేకు: 0143-4 మాళవిగౌళ సంపుటం: 07-252

పల్లవి: ఎవ్వరినేల తడవేవీడ వారేమిసేతురు
జవ్వనపాయముమీఁద సడివేయవే

చ. 1: మందలించి మాతోనేల మాటలకు వచ్చేవు
కందువలు పతినడుగవే నీవు
అంది వుండఁబట్టకుంటే ఆతని నిన్నుఁగూర్చిన
ముందరి మరునికే మొరవెట్టవే

చ. 2: యిల్లురికి మాతోనేల యీసడించ వచ్చేవు
చెల్లుబడాతనిమీదఁ జేయవే నీవు
పల్లదమంత గలిగితే పై పై నెడమాటలాడే
తెల్లమైన నీచెలులఁ దిట్టవే నీవు

చ. 3: సంగడిఁ గూచుండి నీవు సణఁగులేల రాల్చేవు
బంగించి యీతనిఁ దప్పుపట్టవే నీవు
రంగై శ్రీ వేంకటేశుఁడు రమించె నీతఁడు నాతో
అంగడి జాణతనములాడవే నీవు

రేకు: 0143-5 కేదారగౌళ సంపుటం: 07-253

పల్లవి: నిక్కము నాబదుకెల్ల నీచేతిది
మక్కువలు నెరవేరె మఱి యేఁటిమాటలు

చ. 1: తలఁపు నాలోనిది తగవు నీచేతిది
వలపు పదారేండ్లవయసుది
నిలువెల్లఁ జెమరించె నీవొద్దనుందాన
చెలులింకనేమని చెప్పేరు బుద్ధులు

చ. 2: సిగ్గులు నామేనివి చెనకు నీగోళ్ళది
తగ్గనియాసలు మనతమకమువి
వెగ్గళించెఁ బులకలు వేడుకలు గనమాయ
కగ్గుదేర నేమని కానుకలిచ్చేను

చ. 3: చన్నులు నాపురమువి చనవు నీకౌఁగిటిది
పన్నిన పరవశాలు భావరతివి
అన్నిటా శ్రీవెంకటేశ అట్టె నన్నుఁగూడితివి
యెన్నిలేవు నీగుణాలు యెదురేది నీకు

రేకు: 0143-6 కన్నడగౌళ సంపుటం: 07-254

పల్లవి: నీకెరవుగాను నేను నీవునాపెఁ గూడితేను
రేకగా నీళ్ళుడచితే రెండయ్యీనా యెపుడు

చ. 1: నేరుపున నాపెతోడ నీవే మాటాడరాదా
చేరి నేఁబిలువఁబోతే సిగ్గువడీని
సారెఁ బ్రియముచెప్పినా సవతుల నమ్మదురా
పేరనిపాలఁ దోడంటుపెట్టితేను పేరునా

చ. 2: పంతాన నీవేకతాన బలిమిసేయఁగరాదా
చెంతలనేఁ జేవట్టితే సిగ్గువడీని
యింతటి మావంటివారి యిచ్చకాలియ్యకొందురా
కొంతైనా నినుముతోఁ గూడునా కనకము

చ. 3: వల్లెవేసి యాపెఁగూడి వావులు చెప్పుకోరాదా
చెల్లెలవంటేఁ దాను సిగ్గువడీని
యిల్లిదె శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
వొళ్ళఁబెట్టిన సొమ్ములు వొద్దికెఁగూడుండవా

రేకు: 0144-1 శ్రీరాగం సంపుటం: 07-255

పల్లవి: బాపు బాపు నాతపసు ఫలియించెను
యేపున నీచెప్పినట్టే యిఁకనుండే నేను

చ. 1: మచ్చరము నాకుఁదీరె మనసెల్ల నొక్కటాయ
నచ్చులనాపె నీతో నవ్వఁగాను
విచ్చనవిడిఁజలఁగు వెంగెమాడ నిన్నుమఱి
యిచ్చకురాలనై నీకు యిఁకనుండే నేను

చ. 2: వేడుకలు నాకుఁబుట్టె వెరపులిన్నియుఁ బాసె
కూడా నీతొడపైనాపె కూచుండఁగాను
వోడక సిగ్గువిడువు వుల్లసాలాడ నిన్ను
యీడనె సతమై నీకు యిఁకనుండే నేను

చ. 3: తారుకాణ నాకువచ్చె దయపుట్టె నాలోన
చేరి కౌఁగిలించి యాపె చెనకఁగాను
యీరీతి శ్రీవేంకటేశ యిటునన్నుఁ గూడితివి
యీరసము మానెఁ బాయకిఁకనుండే నేను

రేకు: 0144-2 గుజ్జరి సంపుటం: 07-256

పల్లవి: ఒక్కటే విన్నపము వొచ్చెములేనిమాట
యెక్కువగా నిందరిలో నేలవయ్య మమ్మును

చ. 1: యెగదిగఁజూసితేను యెంతేసినేరవు నీవు
జిగిఁ బనిగొనేవారిచేతిదేకాక
బిగిసి కామినులకుఁ బిండంతే నిప్పటి నీవు
యెగసక్కెములు మాని యేలవయ్య మమ్మును

చ. 2: ఇచ్చకములాడితేను యేపని సేయవు నీవు
కొచ్చికొసరేటివారి కొలఁదేకాక
నిచ్చలుఁ గామినులకు నీరు కొద్ది తామెరవు
యెచ్చరిక తోడ నిఁకనేలవయ్య మమ్మును

చ. 3: యియ్యకోలై నడచితే నెందరిఁ గూడవు నీవు
నెయ్యాన బెండ్లాడేవారి నేమమేకాక
కొయ్యవై శ్రీవేంకటేశ కూడితివి నన్నునిట్లే
యెయ్యెడఁ బూపలే పిందెలేలవయ్య మమ్మును

రేకు: 0144-3 సామంతం సంపుటం: 07-257

పల్లవి: ఆఁటదానిబలువిది ఆడుకోనేమున్నది
కూటములు గలిగితే కొంగువట్టి తీసును

చ. 1: కూరిమిగలుగు సతి కోపగించుకొంటేను
పేరడి కన్నీరు నించు ప్రియుని తోను
ఆరీతి నాఁడికత్తెయైతే మఱియొకతె
నేరుపుతోడ నూరకే నెటికవిరుచు

చ. 2: యేఁపిన విభుఁడువచ్చి యెదుట నిలిచితేను
దాపుగఁజేయెత్తిమొక్కి తలవంచును
రావుతోడ వేరొకతె రాజసమైనది యైతే
తీపుల మోవి మీఁద తిట్టులెల్లాఁదిట్టును

చ. 3: ఆసపడ్డ మగువను ఆయములంటితేను
నేసవెట్టి లోనౌను సిగ్గుతోడను
యీసుదీర శ్రీవేంకటేశ ననుఁబోఁటిదైతే
వాసికి నిన్నుఁగూడి వలపెల్లా నింతును

రేకు: 0144-4 శ్రీరాగం సంపుటం: 07-258

పల్లవి: నెపములన్నియు నీవు నేరిచినవే
కపటాలు మాయెడకు గడించకువయ్యా

చ. 1: చిగురువంటిది మేను శిలవంటిది మనసు
యెగసక్యములు మాతోనేలయ్యా
నగపువంటిది తమి నాముపంటిది వలపు
తగవులఁబెట్టి మాతో తక్కించకువయ్యా

చ. 2: అద్దమువంటి వయసు అమ్ముపంటికోపము
సుద్దుల మా మనసేమి సోదించేవయ్యా
పొద్దువంటిదడియాస పూఁసవంటిది గుణము
గద్దించి మమ్మేల నీవు కైకొలిపేవయ్యా

చ. 3: చుట్టమువంటిది వావి సూదివంటిది చూపు
చెట్టువట్టి మమ్మునేల చెనకేవయ్యా
యిట్టె శ్రీ వేంకటేశ యెనసితివిటు నన్ను
పట్టిన పంతముదక్కెఁ బదరకువయ్యా

రేకు: 0144-5 కాంబోది సంపుటం: 07-259

పల్లవి: ఏమిగాఁ జూచితివి నన్నెంతసేసేవయ్యా నీవు
కామించి రతులలోనే కనేవు నాజాడలు

చ. 1: చిన్నారి పొన్నారినాటి చీరలలో సిగ్గులా
కన్నెనైన నామంచి కను చూపులు
వెన్నలు దొంగిలేనాటి వెట్టిగొల్లెతలలో నీ
సన్నల నాతోడి నీసరసాలు

చ. 2: పసులఁ గాచేనాటి బాఁపెతల విందులా
ముసరే తుమ్మెద నామోవితీపులు
సిసువవై యెమునలోని చీఁకటి నీ తప్పులా
యెసఁగిన నాతోడి యియ్యకోలుఁ జాఁతలు

చ. 3: బలిమి రుక్మిణిఁదెచ్చి పైకొన్న నీకూటమా
చెలరేఁగినట్టి నాసేసపెండ్లి
యెలమి శ్రీవెంకటేశ యిటు నన్నుఁ గూడితివి
అల పదారువేలతో అంకెలా నాలంకెబు

రేకు: 0144-6 శంకరాభరణం సంపుటం: 07-260

పల్లవి: నీవాడినదే మాట నేఁజేసినదే చేఁత
యీవిధాన మనలోన యెరవులు గలవా

చ. 1: చిత్తమెల్ల నీసొమ్ము సిగ్గులివి నాసొమ్ము
మత్తిలి పూవుటమ్ములు మరునిసొమ్ము
కొత్తగా నీవు నేను కుప్పలుసేసుకొంటిమి
యిత్తల నీకును నాకు హెచ్చుకుందులున్నవా

చ. 2: మొక్కులెల్ల నీపాలు మోవినవ్వు నాపాలు
చిక్కి యెడమాటలు చెలులపాలు
తొక్క మెట్టుగాను మనము దొరయఁ బంచుకొంటిమి
కక్కసించి చూచితేను కడమలిందున్నవా

చ. 3: వినయాలు నీచేతివి వేగిరాలు నాచేతివి
అనువైన యాసలు పాయముచేతివి
ఘనుఁడ శ్రీవెంకటేశ కలిసితిమింతలోనె
చనవుల రతులలో జంపులు మరున్నవా

రేకు: 0145-1 బౌళి సంపుటం: 07-261

పల్లవి: ఇందరూను జూడఁగానే యింతసేతురా
చెందమ్మిరేకుల కొన చేపలాయ నేఁడు

చ. 1: చేరి సిగ్గువడఁగానె చెయిపట్టి తీసేవు
సారెకును మగవానిజాడగా యిది
తేరకొన మెత్తనైతే దిగఁబడేదన్నమాఁట
యేరా నీవల్లఁగంటిమిదివో నేఁడు

చ. 2: గద్దించి జంకించఁగానె కళలంటఁ జూచేవు
వొద్దనున్న రమణుని వోజగా యిది
అద్దుకొని మాఁటలలోనంటు బచ్చలన్నమాట
తిద్ది నీవద్దనున్నది తేరకొన నేఁడు

చ. 3: పయ్యద దొలఁగఁగానె పట్టేవు కుచములు
నెయ్యపు విటునికెల్ల నేర్పుగా యిది
గయ్యాళిరతిఁ గన్నదే కందికుడుమన్నమాట
నియ్యందే శ్రీవేంకటేశ నిజమాయ నేఁడు

రేకు: 0145-2 శుద్ధవసంతం సంపుటం: 07-262

పల్లవి: పోపో నీకిదియేమి పొద్దువోదు
తీపులు చూపి మమ్ముఁ దియ్యకురా యిఁకను

చ. 1: ఒల్లనివాఁడవు మమ్మునూరకేల పిలిచేవు
మల్లాడి మాపైమనసు మరవరాదా
బల్లిదురాలాకెగొన్న బాసదప్పినాఁ దప్పీ
పల్లదాననిఁక నీవు పట్టకురా మమ్మును

చ. 2: ఇంటికి రానివాఁడవు యేడనైన నవ్వనేల
వెంటనే మాతో తగులు విడువరాదా
గొంటరై యిందుకునాపె కోపగించినా కోపించీ
అంటి ముట్టి సరసములాడకురా యిఁకను

చ. 3: పంతపువాఁడవు మమ్ము పట్టి కౌఁగిలించనేల
అంతయు నాపెనే పోయి అడుగరాదా
చెంతనే శ్రీవెంకటేశ చేకొని నన్నుఁగూడితి
వింతకంటె రతినలయించకురా నీవు

రేకు: 0145-3 పాడి సంపుటం: 07-263

పల్లవి: ఊరకున్న వారినేల వుప్పటించేవే
దూరులేక దూరితేను దోసముగాదా

చ. 1: ఎక్కడికెక్కడి సుద్దులేదో మనసునఁబెట్టి
చక్కఁ జూడనైతినంటా సాదించేవు
వొక్కట్టిపై వొక్కటివేశూరకె వాదడిచితి
అక్కరతోఁ జేయివట్టితే అపరాధమా

చ. 2: పనిలేని పనులకు పంతములెక్కించుకొని
చనవుననవునంటా సాదించేవు
అనుమానములకుఁగా అట్టెవొలలు వేసితి
నినుఁ గాగలించితేనే నేరమాయనా

చ. 3: తమకమెడలేనిది తనువునఁ బెట్టుకొని
సమమోహము లేదంటా సాదించేవు
భ్రమదీర శ్రీవెంకటపతినంటా నన్నుఁగూడి
జమళిఁ బాయవు నేఁడు సంతోసించితివా

రేకు: 0145-4 దేశి సంపుటం: 07-264

పల్లవి: ఏల మమ్ముఁ దడవేవు యింకానయ్య
యేలితివి నాఁడెనాఁడె యెరుఁగుదుమయ్యా

చ. 1: చిత్తములో చింతలెక్కి చిగురులు గోసేవారు
అత్తి నిన్ను వెదకేరు అదిగోవయ్య
వొత్తిలి నవ్వులు నవ్వి వొడుళ్ళు నించేవారు
బత్తులు సేసేరు నీకుఁ బైకొనవయ్యా

చ. 2: మించులమాటల మంద మిరియాలు చల్లేవారు
అంచుల నిన్నుఁబిలిచేరాలకించవయ్య
పొంచి నీతో జాళెలేక బొమ్మరాలు వేసేవారు
ముంచి చేతులు చాఁచేరు మొగిఁజూడవయ్యా

చ. 3: తోడనెసరెత్తి లేళ్ళుఁ దోలేటియట్టివారు
యీడనే విందులు చెప్పేరియ్యకోవయ్య
కూడితి శ్రీవెంకటేశ గొబ్బున నిదె నేఁడు
వాడికెగా కొంతగొంత వారిమెచ్చవయ్యా

రేకు: 0145-5 సౌరాష్ట్రం సంపుటం: 07-265

పల్లవి: బలు నీ నేమము చూచి ప్రత్యక్షమయితి నీకు
అలమి నాకౌఁగిటనే అనుభవించవయ్యా

చ. 1: కొమ్మచన్నులకౌఁగిలి కొండలమీఁది తపసు
సమ్మతిమాటలే మంత్రజపములు
పన్నిన నిట్టూర్పులే ప్రాణాయామములు
నెమ్మది మాకూటములె నిండుయోగాలు

చ. 2: సారె సారె వీడేలు శాఖాహారములు
సారమైన సిగ్గులు పైపై సన్యాసాలు
ఆరయఁ బరవశాలు అందిన బ్రహ్మానందాలు
తీరనితనుభోగాలు దేవపూజలు

చ. 3: బొడ్డు హోమపుగుంటలు పొంగుఁజెమటలు నేయి
అడ్డములేని సరసాలాచారాలు
వెడ్డువెట్టి కూడితి శ్రీవేంకటేశ నన్నునిట్టే
వొడ్డిన తమకములే వున్నతపదవులు

రేకు: 0145-6 నాదరామక్రియ సంపుటం: 07-266

పల్లవి: అందుకుంటే గెలిచితివౌనే నీవు
సందడినెప్పుడు నీవు చనవులిచ్చేవో

చ. 1: కూరిమి నీయెలుఁగులు కోవిలకూఁతలును
వోరలేకని చందాలొక్కటందురు
ఆరితేరి ఆరునెల్లకైనాఁ బలుకవని
పేరుకొన్నా నీవైతే బీరానఁ బలుకవు

చ. 2: కమ్మిన నీ కన్నులును కలువ పూవులును
నెమ్మదిని వొక్కతోడునీడలందురు
పమ్మి వికసించు మాపటికవి నీవైతే
వుమ్మడి నే వొద్దనుంటే వొక్కింతాఁ జూడవు

చ. 3: అంది నీ చేతులుఁ దీగెలవి వొక్కసరందురు
కందువనరడునవి కౌఁగలించవు
చెంది కూడితివింతలో శ్రీ వేంకటేశుఁడనని
ముందునేనంటితేఁ గాని మొనగోరు మోపవు

రేకు: 0146-1 భైరవి సంపుటం: 07-267

పల్లవి: ఏమి సేతువు నీవు యిందరికిఁ గలిగినదే
నీమనసుకిచ్చకమే నేర్తు నేనయ్యా

చ. 1: తగులు గలవారికిని తమకములె చెలరేఁగు
యెతగసక్కెమాడినా యెగ్గులేదు
పగటు నగవులె కాని భ్రయమించుకా లేదు
అగడుసేసిఁక నిన్ను నాడనేలయ్యా

చ. 2: ఆసగలవారికిని అంగములెరఁగరావు
దోసమని పుణ్యమని తోఁచదొకటి
వేసటించుకలేదు వెంటవెంటనె తిరుగు
కోసి రాచిఁక నిన్నుఁ గొసరనేలయ్యా

చ. 3: చవులు గలవారికిని సమరతులె పనులగును
దివములును రాత్రులు తెలియదెప్పుడును
ఇవలనిదె శ్రీ వేంకటేశ ననుఁ గూడితివి
జవళి నీతో మాకు చలములేలయ్యా

రేకు: 0146-2 కేదారగౌళ సంపుటం: 07-268

పల్లవి: ఇంతవాఁడవు గాకున్న యిన్నినేల సేసేవు
చెంతల నీసరితెలు చూచేనింతేకాక

చ. 1: వొట్టుక నేనేమనిన వూరకే వున్నాఁడవు నీ
గుట్టుతోడిచేఁ తలకు కొసరా యిది
యిట్టె నే నెంతసేసినా యించుకాఁ గోపగించవు
తిట్టమై చిన్ననాఁడె సాదించితివో యిది

చ. 2: తప్పక చూచితే నట్టే తలవంచుకుండేవు
వొప్పుగా నీవొళ్ళుఁ గలవోజా యిది
తప్పు నీపై మోపినాను తగినంతే నవ్వేవు
చప్పుఁగాని నిజగడుసుఁ జదువా యిది

చ. 3: కందువ నేఁగూడఁగాను కలకల నవ్వేవు
దిందుపడ్డ నీ తరితీపా యిది
అందగాఁడ శ్రీ వేంకటాధిప నన్నుఁ గూడితి
విందుల నీ విటరాచవిద్దెలా యివి

రేకు: 0146-3 బౌళిరామక్రియ సంపుటం: 07-269

పల్లవి: మేలుగా నీ మేకులు
వాలుఁజూపులట్టే పంచేవు

చ. 1: చెంది నిన్నాతఁడు చెనకఁగా యేమే
కందువలంటక కసరేవు
యిందులోనే కొన్నియెమ్మెలా విడె
మంది యిమ్మనఁగ నలసేవు

చ. 2: పేరుకొని నిన్నుఁ బిలువఁగా యేమే
కూరిమి గొసరక కొంకేవు
నేరుచుకొంటివే నిన్నిట్లా పతి
గోర గీరితేను గొణఁగేవు

చ. 3: నిండుఁగాఁగిట నించఁగా చన్నుఁ
గొండలనొత్తక గునిసేవు
అండనే శ్రీవేంకటాధీశుఁడు గూడె
మెండుకొనఁగానే మించేవు

రేకు: 0146-4 శుద్ధవసంతం సంపుటం: 07-270

పల్లవి: చిత్తము వచ్చినట్టల్లా సేతువుగాక వోరి
పొత్తుల నీబాసలకు పూఁటయేది

చ. 1: రొట్టెకును రేవేది రుచిగొనుటేకాక
వొట్టిన నీ కోరికలకొడియేది
వెట్టికిని వెలయేది వివరించి చూడఁబోతే
గుట్టుతో నీవిద్యలకు గురియేది

చ. 2: చక్కెరకు మొదలేదిసంతసించుకొంటగాక
మిక్కిలి నీనవ్వులకు మేర యేది
చుక్కలకు లెక్కలేవి చూచుటింతేకాక నీ
అక్కజపు సుద్దులకు అవుఁగాములేవి

చ. 3: కప్పుర విడెములోన కారమెంచఁ జోటేది
గుప్పేటి నీఁకాగిటిలోఁ గొసరేది
అప్పుడె శ్రీ వేంకటేశ ఆలమేలుమంగ నేను
దప్పిదీరఁ గూడితివి తతియెంచనేది

రేకు: 0146-5 శ్రీరాగం సంపుటం: 07-271

పల్లవి: వనితపాలికిని దేవరవు నీవు
వనమె జవ్వనమిందె వరమియ్యవలెను

చ. 1: ముదితకు నీతోమాట మోహనమంత్రము
చదరపు నీవురము జపశాల
మదిలోన నీరూపు మరవని ధ్యానము
వదలరాదిఁక నీవు వరమియ్యవలెను

చ. 2: పడఁతికి నీశయ్య బలుపుణ్యక్షేత్రము
వొడలిచెమట నీపై హోమకృత్యము
అడరుమోవితేనెలు ఆరగింపు నవేద్యాలు
వడిఁ జేకొనిఁక నీవు వరమియ్యవలెను

చ. 3: కామినికి నీకూటమి ఘనదివ్యయోగము
నేమపుఁ బరవశము నిజానందము
ఆముక శ్రీవేంకటేశ ఆపె నీవుఁ గూడితిరి
వాములుగా నింకానిట్టే వరమియ్యవలెను

రేకు: 0146-6 మధ్యమావతి సంపుటం: 07-272

పల్లవి: ఏల నాతోఁ గరాళించి యిది వో తప్పు
యీాలకూరకుప్పు చాలదిదివో తప్పు

చ. 1: మరఁగున నాపె నీతో మాటలెల్లఁ జెప్పఁగాను
యెరఁగక వింటిమి యిదివో తప్పు
మెరయఁగ సరసము మీఁదమీఁదనాడఁగాను
యెరుకతో వద్దనుంటిమిదివో తప్పు

చ. 2: చెక్కు నొక్కి ఆపె నీతో చేఁతలెల్లాఁ జేయఁగాను
యెక్కుడుగా నవ్వితిని యిదివో తప్పు
వక్కణించి నీతోఁ దన వలపులు చెప్పఁగాను
యిక్కువలు గరఁగితి యిదివో తప్పు

చ. 3: మెచ్చి తనచన్నులు మీఁదనట్టె మోపఁగాను
యెచ్చరిక సేసితివి యిదివో తప్పు
నచ్చుల శ్రీ వేంకటేశ నన్ను నీవు గూడఁగాను
హెచ్చి తన్నునడిగితి యిదివో తప్పు

రేకు: 0147-1 కేదారగౌళ సంపుటం: 07-273

పల్లవి: ఎప్పుడును గుట్టుతోడి యిల్లాండ్లము నేము
వొప్పుగ సిగ్గు విడువనోజగాదు మాకును

చ. 1: మాటమాటలను నీకు మనసిచ్చి మెచ్చి యాపె
కాటుకకన్నులఁ జూచి కరఁగించీని
తేటలు నేరుచునాపె తేలించనోపునాపె
యేఁటికి యవ్వరిపొందులేమిబాఁతి యిఁకను

చ. 2: చేయివేసి చేయివేసి చెక్కునొక్కి చేత మొక్కి
మాయపు నవ్వులు నవ్వి మరిగించీని
చాయలకు వచ్చునాపె సరసములాడునాపె
ఆయనాయ వున్నసుద్దులాడనేల యిఁకను

చ. 3: వలపులు చల్లిచల్లి వాడికెగా నిన్నుఁగూడి
యెలయించనేర్చునాపె యిన్నిటానాపె
అలరి శ్రీ వేంకటేశ అప్పటి నన్నుఁగూడితి
తొలుతటిసుద్దులేల దొమ్ములేల యిఁకను

రేకు: 0147-2 మాళవిగౌళ సంపుటం: 07-274

పల్లవి: ఇన్నిటా నీవేకరాజ్యమేలుదు గాక
మన్ననకాంతవైతివి మరి యాలే వెలితి

చ. 1: ఈతల నీరమణుఁడు యే పొద్దు చూచిననిట్లే
చేతికి లోనై యుండగఁ చింతలేలా
కాతరపుఁజెలులెంత కాతాళించి దూరినాను
యేతులనందువుగాక యిఁకనేలే వెరపు

చ. 2: చెప్పినట్టుల్లాఁ జేయ చేరి యాతఁడు గలఁడు
చిప్పిల నీవు చెయిసేసుకోనేలే
పుప్పతిల్లి సవతులు వొరసి యెంత చూచినా
నెప్పుననుందువుగాక నీకేలే వెరపు

చ. 3: శ్రీ వేంకటేశ్వరుఁడు చేకొని నిన్నుఁ గూడి నీ
భావములోనుండఁగాను పదరనేల
వేవేలకునిందరును వెగటువాయ మొక్కిరి
చేవ మీరి నీచేఁతలే చెల్లనేలే వెరపు

రేకు: 0147-3 పాడి సంపుటం: 07-275

పల్లవి: తొల్లి నేఁజేసిన గురుతులంటానేలాడేవు
తెల్లమిగనింక నీవు తెలుకోవయ్యా

చ. 1: మచ్చికనెవ్వతో నీమంచిరూపు గోడ వ్రాసి
నచ్చుల చూపులు నీమై నాఁటించఁబోలు
ఇచ్చట నీతనువుననింతటా రేకలు నిండె
చెచ్చెర మీఁదటిమాఁట చింతించుకోవయ్యా

చ. 2: పొంచి మరెవ్వతో నిన్నుఁ బొందుగా మాఁకునఁజేసి
చుంచుల నీమోవి చవిచూడఁబోలును
అంచల నీయధరాననవిగో కెంపులు నిండె
దించి ఆవొచ్చాలు నీవే తీరుచుకోవయ్యా

చ. 3: బత్తితో నెవ్వతో నిన్ను బయలు దలఁచి యాడ
వొత్తి కాఁగిలించుకొని వుండఁబోలును
ఇత్తల శ్రీ వేంకటేశ ఇటు నేఁ గాఁగిలించితి
హత్తి నిందలాడితి నీకవి యేఁటికయ్యా

రేకు: 0147-4 మధ్యమావతి సంపుటం: 07-276

పల్లవి: పంతపుఁ జెలులలోన భాగ్యము నాది
యింతటిదాననై రూఢికెక్కితి నేనమ్మా

చ. 1: పవళించి వుండినాను పాదము నామీఁదనే
కవగూడనుండినాను కాఁక నామీఁద
అవలఁ బారకై యున్న హస్తము నామీఁదనే
యివల నాపతిమోహమేమి చెప్పేనమ్మా

చ. 2: తలవంచుకుండినాను తలఁపు నామీఁదనే
పలుకకుండిన నాసబాస నామీఁద
కొలువులోనుండినాను గురుతు నామీఁదనే
యెలమి నాపెద్దరికమేమి చెప్పేనమ్మా

చ. 3: పనిగలిగుండినాను పక్షము నామీఁదనే
మనవి వింటానున్నా మర్మము నామీఁద
అనువై శ్రీ వేంకటేశుఁడన్నిటాను నన్నుఁగూడె
యినుమడించె వలపులేమిచెప్పేనమ్మా

రేకు: 0147-5 పాడి సంపుటం: 07-277

పల్లవి: తనకేమి విచారమే తా నిన్నిటా బలువుఁడు
మనసునఁ బెట్టి మమ్ము మన్నించుమనవే

చ. 1: యేళ్ళవెనుకచాలు యెదుటనే ఫలియించె
రాళ్ళపై నడపులు రట్టుకెక్కెను
తాళ్ళపై చప్పుడుకు తగనిమూకలుగూడె
నీళ్ళపైఁ జొప్పులనె నెరవేరెఁ బనులు

చ. 2: కొండపైఁ బుట్టినవాదు గొప్పయమ్ముమొనఁ దీరె
యెండ పంటివానికులమేలె లోకము
వెండిశికరమువాని వెట్టియీవి తుదముట్టె
వండనికూటివారికి వైపాయఁ బనులు

చ. 3: పాముశిరసుపైసొమ్ము బలురామరాజ్యమాయ
దోమటివిందులవాదు దొడ్డవారైరి
సేమముతోనుండనీవె శ్రీ వెంకటేశుఁడు దాను
తామసములెల్లఁ బాసె దక్కెనిఁకఁ బనులు

రేకు: 0147-6 వరాళి సంపుటం: 07-278

పల్లవి: నిన్నుఁ బాసియు నీపతి నీవద్దనున్నాఁడనంటా
పన్ని నీరూపుదలఁచి భావరతి సేయును

చ. 1: పట్టెమంచముకోటిగుబ్బలు నీచన్నులంటా
పట్టి పట్టిచూచి మోమప్పళించుకొను
అట్టె చిన్నిమలగు అదియె నీమేనంటా
బెట్టి కాఁగలించుకొని బిగియించు సారెకు

చ. 2: మడిచి యిచ్చినయాకు మగువ నీమోవంటా
పడఁతిచేనందుక చప్పరించును
ముడిచిన మేలుకట్టు మొల్లలదండలు నీ
కడగంటి చూపులంటా ఘాతఁ బైపైఁ జూచును

చ. 3: కప్పిన దుప్పటికొంగు కాంత నీపయ్యదంటా
తప్పితారి బలిమిని తన్నుఁదానె తీసును
చెప్పరానిమోహముతో శ్రీ వేంకటేశుఁడు గూడె
యిప్పుడిట్టె నీవురాఁగా ఇదే నిజమాయను

రేకు: 0148-1 గుండక్రియ సంపుటం: 07-279

పల్లవి: చెలువుఁడ చూడుమా యీ చెలియసింగారము
మెలఁగి మెలఁగి మంచిమేలెల్లాఁ గూడెను

చ. 1: గక్కన సంపెంగపూవు కలువలు దామరయు
నొక్కట నీచెలిమెమ్మై యొనగూడెను
పక్కన వజ్రములును పగడాలు నీలములు
అక్కరతోఁ గడుకొని అందుకే తోడాయను

చ. 2: కొండలును దీగెలును గుహలోని సింహమును
మెండుకొని యీవనితమేనాయను
గండుఁదుమ్మిదల చేరుఁ గనకము శంఖమును
అండనె పొత్తుగలిసి యందుకుఁ దోడాయను

చ. 3: చిగురును నరంట్లు చిత్తజుబండికండ్లు
తగనింతిపిరుఁదుఁ బాదాలుఁ దొడలై
నిగిడి శ్రీ వేంకటేశ నీకు మంచివస్తువుల
వగలలమేలుమంగ వనితయ్యై కూడెను

రేకు: 0148-2 వరాళి సంపుటం: 07-280

పల్లవి: నెలమూఁడు శోభ్రనాలు నీకు నతనికిఁ దగు
కలకాలమును నిచ్చకల్యాణమమ్మా

చ. 1: రామనామమతనిది రామవు నీవైతేను
చామన వర్ణమతఁడు చామవు నీవు
వామనుఁడందురతని వామనయనవు నీవు
ప్రేమపు యిద్దరికి పేరుబలమొకటే

చ. 2: హరి పేరాతనికి హరిణేక్షణువు నీవు
కరిఁ గాచెఁ దాను నీవు కరియానవు
సరిఁ దా జలధిశాయి జలధికన్యవు నీవు
బెరసి మీ యిద్దరికిఁ బేరుబలమొకటే

చ. 3: జలజనాభుఁడతఁడు జలజముఖివి నీవు
అలమేలుమంగవు నిన్నలమెఁ దాను
ఇలలో శ్రీ వేంకటేశుఁడిటు నిన్నురాన మెచె
పిలిచి పేరుచెప్పెఁ బేరుబలమొకటే

రేకు: 0148-3 మంగళకౌశిక సంపుటం: 07-281

పల్లవి: ఆదిమపురుమనియండ నదే
సోదించి చూచిన సుదతై నిలిచె

చ. 1: పున్నమచంద్రుఁడు పొడచెనల్లదివొ
పన్నిన తుమ్మెదపొఁజులవే
సన్నపుమదనుని శంఖమునల్లదె
యెన్నిక వట్టఁగ నింతై తోఁచె

చ. 2: జక్కవపులుగులు జడిసీనల్లవె
తెక్కుల నిరుదెసఁ దీగెలవే
యిక్కువబయలదె యిసుకదిబ్బలవె
చక్కజాడగా సతియై తోఁచె

చ. 3: సరిననంట్లు రాజనపుఁ బొట్లలవె
వెరవున తామరవిరులునవే
యిరవై శ్రీవెంకటేశ్వరుకాఁగిట
మరిగిన యలమేల్మంగైతోఁచె

రేకు: 0148-4 దేశాక్షి సంపుటం: 07-282

పల్లవి: నవరములదీనళినాక్షి
జవకట్టి నీకుఁ జవిసేసీని

చ. 1: శృంగారరసము చెలియమొకంబున
సంగతి వీరరసము గోళ్ళ
రంగగు కరుణారము పెదవులను
అంగపుఁ గుచముల నద్భుతరసము

చ. 2: చెలి హస్యరసము సెలవుల నిండీ
పలుచని నడుమున భయరసము
కలికి వాఁడుఁగన్నుల బీభత్సము
అలబొమ జంకెన నదె రౌద్రంబు

చ. 3: సతిరతిమరపుల శాంతరసంబదె
అతిమోహము పదియవరసము
ఇతవుగ శ్రీ వెంకటేశ కూడితివి
సతమై యీపెకుసంతోసరసము

రేకు: 0148-5 కేదారగౌళ సంపుటం: 07-283

పల్లవి: ఎట్టి బాలుఁడు పుట్టెనే యశోద నీకు
వుట్టిపడీనింతలేసికోపనమ్మ నేను

చ. 1: సారెఁ జంకనిడుకొంటే చన్నులకే చెయి చాఁచీ
నీరీతి వీనినెత్తుకోనిందుకే నేను
కోరి తొడలపైనిడుకొని బాల్పోయఁగా నవ్వీ
ఆరసి వీనిదగ్గరనందుకే నేను

చ. 2: ముద్దుపెట్టుకొనఁబోతే ముంగురులు చుట్టి పట్ట
వొద్దికి రాసయించదు ఓయమ్మ నేను
గద్దించి చెక్కునొక్కితే కాఁగలించి విడువఁడు
చద్దివేఁడి వీనిపొందు చాలు (ల?) నమ్మ నేను

చ. 3: అప్పలప్పలనఁబోతే నంగమెల్లా మరపంచీ
ఇప్పుడేమి సేకొంటినిస్సీ నేను
అప్పఁడు శ్రీ వెంకటేశుఁడన్నీఁ దానె యెరుఁగు
చిప్పిలి యాచేతలెఁ జెప్పఁజాల నేను

రేకు: 0148-6 శంకరాభరణం సంపుటం: 07-284

పల్లవి: తినరాని కొనరాని దేవలోకపుఁబండు
మనసునఁ దలఁచితే మరిగించే పండు

చ. 1: పంటకెక్కి పాలవెల్లిఁ బండిన పాలపండు
తొంటిగొల్లెతల మెవి దొండపండు
అంటుకొన్న మేనిచాయ అల్లునేరేడుఁబండు
ముంటిసింహపుగోళ్ళ ముండ్లపండు

చ. 2: ఇచ్చల వేదశాస్త్రాలు దెచ్చిన పేరీఁతపండు
తచ్చిన దైత్యమారి దేవదారుఁబండు
పచ్చిదేర మెరిసిన బండిగురువిందపండు
యిచ్చవలెనన్న వారియింటనంటిపండు

చ. 3: తెమ్మగా మునులపాలి తియ్యనిచింతపండు
తెమ్మల సిరివలపుఁదేనెపండు
యిమ్ముల శ్రీ వెంకటాద్రినింటింటిముంగిటిపండు
కొమ్మల పదారువేల గొప్పమామిడిపండు

రేకు: 0149-1 సామంతం సంపుటం: 07-285

పల్లవి: నీ విభుఁడు వచ్చుదాఁక నిచ్చలాన నుండే వే
వేవేలకును రేయి వేగించలేమే

చ. 1: పూయకు కస్తూరి మేనఁ బొద్దుగూఁకెఁ జీఁకటంటా
నోయమ్మ చందురుఁడుదయించెను
చాయల వెన్నెలదాఁకి చల్లజంపు యెండలంటా
ఆయెడ నీవు వేఁగఁగ నదిచూడలేమే

చ. 2: గందము పుయ్యకువే కలికి నీకుచములే
చందనపుఁ గొండలంటాఁ జల్లీ గాలి
అందులో పూవుతావి దాఁకి అమ్ముమొనలంటెనంటా
మందమై మేనుమరవఁగ మందులుదేలేమే

చ. 3: వద్దేలే కుంకుమలు వసంతపుఁ జిగురంటా
నద్దితేఁ గోవిల భూతమని లోఁగేవు
నిద్దపు శ్రీ వెంకటాద్రినిలయుఁడిట్టె కూడె
యిద్దరి మీవలపులు యింక నెంచలేమే

రేకు: 0149-2 ముఖారి సంపుటం: 07-286

పల్లవి: ఉవిదకు వొకట్గైతే వొకటిగాదు
వివరించి చూడవయ్యి విరసముగాదు

చ. 1: చెమటల యేరు వారి చింతలచెరువు నిండె
కమలాక్షికిది వానకాలముగాదు
జమళిఁ జంద్రోదయమ్మై చకోరములు దనిసె
అమరె శారదసమయమునూఁ గాదు

చ. 2: కన్నీటిమంచు గురిసి కరపల్లవాలు ముంచె
కన్నెకిది హేమంతకాలము గాదు
వెన్నెల నవ్వుచల్లితే వెళ్ళై జాజిపులకలు
విన్నకన్నశిశిరపువేళయుఁ గాదు

చ. 3: వలపులు చిగిరించె వసంతరుతువుఁగాదు
వెలసె విరహపెండ వేసవి గాదు
అలమేలుమంగఁ గూడితపుడె శ్రీ వెంకటేశ
మలయు నీమన్ననలు మరుపేరాదు

రేకు: 0149-3 రామక్రియ సంపుటం: 07-287

పల్లవి: ఒకటిఁ బోలిచిన వేరొకటి మరి తోఁచీని
సకలముఁ బోలిచేము సతిసింగారములు

చ. 1: కలువలుఁ జకోరాలు గండుమీలుఁ దామరలు
చలిముత్తెపుఁ జిప్పలు సతికన్నులు
అలులు నీలపుమణులంధకారము మేఘము
నలుపులరాశివో నలినాక్షితురుము

చ. 2: జక్కవలు నిమ్మపండ్లు సరిఁ బూగుత్తులుఁ గొండ
లెక్కువ మరుమిద్దెలు యింతిచన్నులు
చుక్కలు సురవొన్నలు సూదివజ్రాలు గోళ్ళు
అక్కరయేనుఁగ తొండాలరంట్లే తొడలు

చ. 3: సోగతీగెలు తూండ్లు దతి బాహువులివె
చేగ చిగురు లత్తిక చెలిపాదాలు
యీగతి శ్రీవేంకటేశ యింతి నీవురముమీఁద
బాగుగ నమరి పైఁడిపతిమఁ బోలినది

రేకు: 0149-4 సాళంగనాట సంపుటం: 07-288

పల్లవి: తనమతి నామతి తారుకాణ గాఁబోలు
వనితకు నాకునొక్కవలపే కాఁబోలును

చ. 1: పొలిఁతిరూపము మతిఁ బొలసినట్టాయ నాకు
తలఁపులో నాకె నన్నుఁ దలఁచఁబోలు
కలసి యింతి నన్నుఁ గాఁగలించినట్టాయ
కలలోననాడ నన్నుఁ గలయంగఁ బోలును

చ. 2: వనజాక్షిచూపు నాపై వడిఁ జల్లినట్టాయ
జునిగి యాకె యెదురుచూడఁబోలును
యెనసి యామగువ యెలుగైనయట్టాయ
అనుఁగుఁజెలితో నన్ను నాడుకొనఁబోలును

చ. 3: అంగన అప్పుడే నా అండ నుండినట్టాయ
రంగుగ నావద్దికిట్టె రాఁబోలును
చెంగటఁ గడితినిట్టె శ్రీవేంకటేశుఁడ నేను
పంగెననిద్దరికొక్క ప్రాణమే కాఁబోలును

రేకు: 0149-5 వరాళి సంపుటం: 07-289

పల్లవి: ఒకటికినుమడాయ వువిద నీబలఁగము
వొకఁడింతె మరునికి వొదుగనేమిటికి

చ. 1: గండుమీలవంటివి నీకన్నులు కంతునికైతే
గండుమీరనొక్కటెక్కెమే కలఁగకువే
అండనే వొంటితామర అతనిబాణముగాని
రెండుదామరలు నీరిచ్చులహస్తములు

చ. 2: చిలుకల తేరింతే చిత్తజునకు నీకైతే
చిలుకల పలుకులు సేనాసేన
అలులనారివిల్లు అతనికైతే నీకు
అలుల బొమ్మలవిండ్లవె రెండు గదవే

చ. 3: చిగురుఁగైదువ మరుచేతిదింతే నీకయితే
చిగురుఁబాదాలు రెండు చింతయేఁటికే
తగిలి యాతఁడు యేకతాననే వుండుఁ గాని
నిగిడి శ్రీ వేంకటేశు నీవు గూడితివి

రేకు: 0149-6 పాడి సంపుటం: 07-290

పల్లవి: ఇదివో యింతట వరంబీవయ్యా
కదిసి ప్రత్యక్షంబు గావయ్యా చెలికి

చ. 1: తరుణి నిన్నుఁ బెడఁబాసి తపము శాయఁగఁ దొడఁగె
విరహంపు నులిగురుల విరజడలతో
అరమోడ్పు కనుఁగొనల ఆనందములతోడ
బరువైన నిట్టూర్పు పవనముతోడ

చ. 2: ముదిత నినుఁ దలపోసి మునిమార్గమునఁ జెలఁగె
మొదల నివ్వెరపాటుమోనంబుతో
వదలని పులకగముల వనవాసములతోడ
అదనెరఁగని నిరాహారంబుతోడ

చ. 3: ఉవిద నీతోఁగూడి యోగంబు సాధించె
వివరంబుతోడ శ్రీ వెంకటేశ
నవకమగు రతుల నానావిధంబులతోడ
కవగూడియున్న చిరకాలంబుతోడ

రేకు: 0150-1 రామక్రియ సంపుటం: 07-291

పల్లవి: భ్రమయకు చెలువుఁడ పలుమారు నీ
తమకపు పట్టుపు తరుణినింతే

చ. 1: నినుఁగని వొకచెలి నిలువునఁ గరఁగెనె
కనకపు బొమ్మే కాఁబోలు
అనువున నదిగాదయితే మెదలునా
మినుకన మెరచిన మెరుఁగింతే

చ. 2: పొలఁతి నీయెదుటఁ బులకించెనొరపు
గల పుష్పలతిక గాఁబోలు
తలఁచకుమటువలెఁ దగదట్లైతే
చెలఁగి పలుకునా చిలుకింతే

చ. 3: పడఁతి నీయురముపై నెలకొనెనదె
కడఁగిన హారము గాఁబోలు
కడపట శ్రీవేంకటపతి గాదది
జడిసెటి నీ శ్రీసతి యింతే

రేకు: 0150-2 శంకరాభరణం సంపుటం: 07-292

పల్లవి: వలపులు వలపులు వయ్యాళి
చలమరి మరుఁడును సమేళి

చ. 1: నెలఁతవమోమునకు నీకనుచూపులు
నిలువున ముత్తెపు నివాళి
కొలఁదికి మీరిన గురుకుచములకును
తొలఁకు నీమనసు దువాళి

చ. 2: వనితనిండు జవ్వన గర్వమునకు
ఘనమగు నీరతి కరాళి
వెనకముందరల వెలఁదిమేనికి నీ
పెనఁగు గోరికొన పిసాళి

చ. 3: పడఁతికోరికల భావంబునకును
కడుఁగడు నీతమి గయాళి
చిడిముడి మగువకు శ్రీ వేంకటపతి
విడువనికూటపు విరాళి

రేకు: 0150-3 వరాళి సంపుటం: 07-293

పల్లవి: ఎరఁగను కపటాలు యెరిఁగి మరతురా
చిరుతపాయముదాన చిత్తము నీకెట్టిదో

చ. 1: మలసి కోపింతుఁగాని మాటాడకుండలేరా
అలసి జంకింతుఁగాని అలుగలేరా
తలఁపె తెగుదు గాని దగ్గరకుండఁగలేరా
సిలుగు నామోహమిది చిత్తము నీకెట్టిదో

చ. 2: నేరములె యెంతుఁగాని నిన్ను మెచ్చకుండలేరా
దూరి పలుకుదుఁగాని తొలఁగలేరా
ఆరసి మొక్కుదుఁగాని అవ్వలిమోము గాలేరా
చేరిన నాభావమిది చిత్తము నీకెట్టిదో

చ. 3: పచ్చిగా నవ్వుదుఁగాని పంతమియ్యకుండలేరా
గచ్చుల నీవంటితే నే కాదనలేరా
నిచ్చలు శ్రీవేంకటేశ నిన్నుఁ గూడితినిదే
చెచ్చెర నాగుణమిది చిత్తము నీకెట్టిదో

రేకు: 0150-4 శ్రీరాగం సంపుటం: 07-294

పల్లవి: సారెసారెకును నేల జంపుమాఁటలు
ఆరెఁ దేరెఁ బదరోరి ఆరడైతిఁకును

చ. 1: ఆడరాదు దొరవని ఆడకున్నఁ బోదు నిన్ను
చూడఁ జూడ నీమోవేల చుక్కలాయరా
తోడ నేఁగోరితి వెంట తొడుకులైనట్లాయ నీ
జాడలెల్లఁ గంటి వింటి చాలుఁజాలుఁ బదరోరి

చ. 2: మొదల నే నెరఁగక మోసపోతిఁగాకనే
కదిసి యేపొద్దు వద్దఁ గాచుకుండనా
యిది మింగినకడికి యింకఁ జవులెంచనేల
చెదర నీపంతమెల్లఁ జెల్లెఁజెల్లెఁ బదరోరి

చ. 3: సిగ్గులెల్లఁ దీరెఁదీరె శ్రీవేంకటేశుఁడ నేఁడు
వెగ్గళమై నీనాసంది వింతలేలరా
దగ్గరి కూడినమీఁద తలపోఁతలింకనేల నే
నగ్గలమై నీ నా కోపమారెఁదేరెఁ బదరోరి

రేకు: 0150-5 బౌళిరామక్రియ సంపుటం: 07-295

పల్లవి: ఏమనఁ గలదే యిందుకును
ఆమనినాఁడే అదవధలాయ

చ. 1: తరచగు తురుమున దాకొనె మేఘము
మెరుఁగుల కన్నుల మెరిచె నిదే
వరదల చెమటల వానలు గురిసెను
తెరవకు దప్పులు దీరకపోయ

చ. 2: పొలుపగు తనువునఁ బులకలు మొలచెను
నులిఁ గోరికలెన్నులు వెడలె
బలిమిఁ గుచంబులఁ బాలు గొనియెనిదె
తలిరుఁబోఁడి మతిఁ దనియకపోయ

చ. 3: కాంతను శ్రీ వేంకటపతి గూడఁగ
బంతిరతుల వైభవమలరె
అంతట నరగొరలన్నియుఁ దీరెను
దొంతిమదములకుఁ దుదలేదాయ

రేకు: 0150-6 కేదారగౌళ సంపుటం: 07-296

పల్లవి: చెప్పుడు మాఁటలివేల చెలులలోన మిమ్ము
మెప్పించరాదుట మీలో మీకే తెలుసును

చ. 1: చాలుకొన్న జంకెనల జగడాలు మీ
వేలికొనగోళ్ళలో విగడాలు
పాలుపుఁ గోపపు చూపుపగడాలు యివి
మేలుమేలు మీలో మీకే తెలును

చ. 2: కింకల మాటలలోని కిసరులు మీ
వుంకువకాఁకలలోని వుసురులు
కొంకనికూరిమిలోని కొసరులు మీ
మంకుల మత్సరములు మనసులే యెరుఁగును

చ. 3: పూనిన మీవలపుల పొంతనాలు నేఁడు
మానరాని కూటముల మంతనాలు
కోనల శ్రీ వేంకటేశ కొమ్మకు నీకు మీ
మేనులు సోఁకినరతి మేకే తెలుసును

రేకు: 0151-1 శ్రీరాగం సంపుటం: 07-297

పల్లవి: ఎంతని చెప్పుదు నీలేమజవ్వన
మంతయు నెరుఁగు నంగజుఁడు

చ. 1: మిన్నెల్లా నిండెను మెరుఁగులే చెలి
కన్నుల మించులు గలుగఁగా
పున్నమవెన్నెల పోయెఁ జోటులేక
సన్నముగాఁ జొచ్చె చందురుఁడు

చ. 2: దిక్కుల నింతటఁ దిమిరము గప్పె
నిక్కి కొమ్మకొప్పు నెగడఁగా
చిక్కి రాతురుల చీఁకటి చెదరి
చుక్కల రాసులు చూపట్టినే

చ. 3: ఇంతలో శ్రీ వేంకటేశు కౌఁగిటికి
నింతికుచగిరులెదుగఁగా
వంతలఁ గొండలు వానలఁ గరఁగి
యింతలింతలాయె నిన్నియును

రేకు: 0151-2 శంకరాభరణం సంపుటం: 07-298

పల్లవి: ఒకటి కొకటి పైనొరపాయ
చికురభరములో చిడిముడియాయ

చ. 1: జలజపువదనకు చాయలకన్నులు
జలజపురేకులు సహజములే
నలుపునఁ జనుపక నాసికమొకటే
కలసి కదంబపు కలబెరికాయ

చ. 2: పెనుగజయానకు పిరిఁదిబటువులే
మొనకుంభస్థలములు దొరసె
చెనసి అందుపై సింహపునడుమే
వెనక ముందరికి విరసములాయ

చ. 3: నిరతి బాహులతల నెలఁత కుచములే
విరిపూ గుత్తుల విధమమరె
ఇరవుగ శ్రీవేంకటేశుని కూటమి
పరిమళములలోఁ బరిమళమాయ

రేకు: 0151-3 కన్నడగౌళ సంపుటం: 07-299

పల్లవి: అయ్యోయేమనవచ్చునాసాస నీపతి
యేయెడఁ బాయకపోయనేమవునోయమ్మా

చ. 1: కోవిలకూఁతలు విని కొమ్మ విలిచీనంటా
దావతితో రమణుఁడు దగ్గరఁబోయి
ఆవలనొక నెమలి అంతలోనేఁగఁగఁ జూచి
వేవేగ చెలియంటా వెంటఁ గూడఁబారె

చ. 2: కీరము వేరొకచోటఁ గెలయుచునుండఁగాను
చేరఁబోయె సతియందుఁ జెలఁగీనంటా
నీరులోతామరమీఁద నిండుఁదుమ్మిదలఁ జూచి
కోరి యింతిముఖమంటాఁ గొలనిలో దుమికె

చ. 3: చెంతఁబావురాలమోఁత చెలిమంతనములంటా
సంతసానఁ బొదరింటి చాయకేఁగెను
అంతలో శ్రీవేంకటేశుఁడలమేలుమంగఁ గని
వింతరతులను గూడి విఱ్ఱవీఁగెను

రేకు: 0151-4 శ్రీరాగం సంపుటం: 07-300

పల్లవి: ఎవ్వరికిఁ బోరాదు యెదిరిఁజేసిన ఫలము
దివ్వెయై చేచేత దిష్టమౌఁగాని

చ. 1: వేమారు విరహులను వెతలఁ బెట్టిన ఫలము
కామునికి నేఁటేఁటఁ గనలవలసె
దీమసపుఁ గోవిలలు తెగువఁ బలికిన ఫలము
ఆమనియెడలదాఁక నణఁగుండవలసె

చ. 2: చందురుఁడు కాముకుల జాలిఁబెట్టిన ఫలము
కుందుచును నెలనెలకుఁ గొవరవలసె
మందానిలుండెదిరి మనసుగలఁచిన ఫలము
కందువగు శేషునికిఁ గాటియ్యవలసె

చ. 3: రావమున దంపతుల రవ్వసేసిన ఫలము
తావిసంపెఁగకలులు తలఁకవలసె
శ్రీవెంకటేశ్వరుఁడు చెలియనిటు గూడఁగా
భావమున నిన్నియును బంతమీవలసె

రేకు: 0151-5 ముఖారి సంపుటం: 07-301

పల్లవి: ఎడమాటలిఁకనేల యేమనీనే
అడుగవే చేముంచేదప్పుడో యిప్పుడో

చ. 1: విరహమే వేఁడి విరులే వాఁడి
యెరవుల రమణుఁడు యేమనీనే
దరిఁ దొక్కెఁ దలఁపు దట్టుమాయ వలపు
తరవాతిపనులింకఁ దనకో నాకో

చ. 2: తత్తరమే తరవు తాలిములు గరవు
యిత్తల రమణుఁడు దానేమనీనే
వొత్తవచ్చె మరపు వుడివోయ వెరవు
మొత్తమిఁ దనకు నాకు మునుపో వెనకో

చ. 3: పట్టినదె పంతమో పాయమిదిసంతమో
యిట్టె శ్రీవెంకటేశుఁడేమనీనే
రట్టుకెక్కెఁ గాఁగిలి గుట్టెల్ల రతికెక్కె
జట్టిగొనె తానునేను చలి మోబలిమో

రేకు: 0151-6 మాళవిగౌళ సంపుటం: 07-302

పల్లవి: కొమ్మల జవ్వనములు కోరువట్టేనా
కమ్మర మాకోరికలు గాదెఁబోసేవా

చ. 1: నామనరయనేల నన్ను నీవొరయనేల
యేమీ మాకుచగిరులెంతలెంతలాయనేమి
లేమల చక్కఁదనాలు లెక్కవా సేవా

చ. 2: ఎక్కువ నాకనుసోగలెంతలెంతలాయనేమి
కక్కసించి యందులోసుంకముగొనేవా
చక్కని నాగోళ్ళివి సరిగాని బేసిగాని
పక్కన నాతో నీవు పందెమాడేవా

చ. 3: చెంతలఁ గూడితి నన్ను శ్రీ వెంకటేశ నా
సంతసపుమోవి లంచముగొనేవా
మంతనాలు నెరుపేవు మరురాజ్యపదవికి
యింతటికి నన్నుఁ బట్టుమేలించేవా

రేకు: 0152-1 హిందోళవసంతం సంపుటం: 07-303

పల్లవి: చెప్పనేల నీగుణాలు చెలువుఁడ చాలుఁజాలు
వుప్పుదినుటాఁ గాక వుపతాపమా

చ. 1: కంటిఁ గంటి నీచేఁత కన్నులతుదలనే
వెంటనే వీనులనింక వినవలెనా
కంటకములాడ నిన్ను ఘనుఁడ నేనోపనోప
గింటెల నవ్వులలోన గిలిగింతలా

చ. 2: విరహన నీకుఁగా నే వేదనఁబొందుట గాక
వెరవెరఁగక నీతో వెళ్ళనాడేనా
నెరజాణవిన్నిటాను నీవేడ నేనేడ
వులిసిన మీఁదనింక వుడుకులునా

చ. 3: బెట్టుగాఁ గాఁగిట నిన్ను బిగియించుకొంట గాక
నట్టుకొట్టి మోవిమీఁద నసికాట్ల
గుట్టుతో శ్రీవేంకటేశ కూడితివి నన్నునిట్లే
చెట్టువట్టి తీసి యింకాఁ జేసన్నలా

రేకు: 0152-1 శంకరాభరణం సంపుటం: 07-304

పల్లవి: ఇంకనేసుద్దులు యెరఁగమిదే
సంకె లేనికోర్కె సఫలంబాయ

చ. 1: నిలువునఁ బులకలు నిండఁగ నిండఁగ
పొలఁతి వలపు పూవక పూచె
పొలయుచు నీపేరు కిన్నెర మీటఁగ
కలికిచనుఁగవలు కాయక కాచె

చ. 2: పనివడి ప్రియములు పలుకఁగఁబలుకఁగ
ననుపుమొవి పండక పండె
ఘనమగు కాఁకల కడు చెమరించఁగ
వొనర నవరసములొలుకక వొలికె

చ. 3: సుడిగొని నీపలు సోఁకఁగ సోఁకఁగ
వడిగొని మై మరవక మరచె
యెడయక శ్రీవేంకటేశ నినుఁగలసి
పొడవుగ నిను చెలి పొగడక పొగడె

రేకు: 0152-2 రామక్రియ సంపుటం: 07-305

పల్లవి: ఇంతలోనివాఁడా తానిస్సీ వీఁడు
పంతమెల్లఁ గంటిఁజాలు పదవే వీఁడు

చ. 1: అలిగి నాతో మాటలాడనివాఁడు నా
చిలుకతో మాటలాడీ చీచీ వీఁడు
నలువంక నాతో నవ్వనివాఁడు నా
చెలితో నవ్వఁగనేలే చెల్లఁబో వీఁడు

చ. 2: వొద్దనె నామోముచూడకుండినవాఁడు నా
అద్దమేల చూచీనే అయ్యో వీఁడు
అద్దో నాకుచములు అంటనివాఁడు నా
ముద్దుఁ గిన్నెరకాయలు ముట్టెనే వీఁడు

చ. 3: పొత్తుమాని వున్నవాఁడు పొదిగి నాయడపము
పొత్తుయేల కలసీనే పోపో వీఁడు
యిత్తల శ్రీవేంకటేశుఁడింత సేసి నన్నుఁగూడె
తత్తరపువాఁడు గదే తగునే వీఁడు

రేకు: 0152-3 సాళంగం సంపుటం: 07-306

పల్లవి: ఇంతివల్ల నెపో యింతేసి
మంతనంబులే మరపై నిలిచె

చ. 1: కొండల పాడవుల కోరికలింతికి
నిండుఁగుచములై నెరిఁబెరిగె
పండిన జవ్వనభారము తరమయి
మెండుకొనఁదొడఁగె మీఁదటనెట్లో

చ. 2: ఎరగొని చెమటల యేరుల కతమున
పిరిఁది యిసుకదిబ్బలు వొదలె
తిరముగ మాటల తీపులకతమున
తెరలక యధరపుతేనెలు వడిసె

చ. 3: వెలయ వలపు మది వెదలువెట్టఁగా
పులకననలు యింపుల మొలచె
కలగొని శ్రీవెంకటపతి గూడఁగ
వెలిగోరిమణులు వేవేలాయ

రేకు: 0152-4 శంకరాభరణం సంపుటం: 07-307

పల్లవి: వరుకు మాపటంత వచ్చేఁ గాని
గెరసు దాఁటకువోయి కేశవరాయ

చ. 1: చేసన్న చాలదా చెట్టవట్టి తియ్యనేల
ఆసల నెదురుచూచే ఆఁటదానికి
రాసిఁ గుచములవి రాయడిఁబెట్టుకువోయి
సేసకొప్పగంటుజారెఁ జెన్నరాయా

చ. 2: పదమంట చాలదా బలిమిసేయఁగనేల
కదియఁగఁ దమకించే కామినికిని
చెదరెఁ గస్తూరిబొట్టు చెరఁగు విడువవోయి
అదె నామై చెమరించె హరికృష్ణరాయ

చ. 3: కాఁగిలిదే చాలదా కన్నుల మొక్కఁగనే
నాఁగువారే ననుపుల ననుఁబోఁటికి
ఆఁగి కూడితివి నన్ను అలసితి రతులలో
వీఁగేవు చెప్పల్లి శ్రీవేంకటరాయా

రేకు: 0152-5 పాడి సంపుటం: 07-308

పల్లవి: ఒకరికొకరి అన్యోన్యము చూడరే
సకలమునెరిఁగిన సరసులె వీరు

చ. 1: చెలిచంద్రముఖముసిరుల నాయకుఁడు
కలువలకన్నులఁ గడుఁ జూచె
చెలువ సూర్యతేజపుఁ బతిని మరల
జలజాక్షంబుల సతియును జూచె

చ. 2: తారని బింబాధరితో రమణుఁడు
కోరి చిలుకపలుకులఁ బలికె
తోరపు మేఘపుతురుము విభునితో
ఆరయ మయూరయానయుఁ బలికె

చ. 3: పడఁతిదేహలత ప్రాణనాథుఁడిటు
వొదలి చెమటచెరువులఁ దడిపె
కడఁగిన శ్రీవేంకటగిరిపతితోఁ
దడవి సింహమధ్యయునొనఁగూడె

రేకు: 0153-1 దేసాళం సంపుటం: 07-309

పల్లవి: ఇద్దరినేలేననీఁ బో యెనయదమ్మా యీ
సుద్దులేల యీడకే తాఁజొచ్చి రానీవమ్మా

చ. 1: ఒప్పుగనాకెను నన్నునొక్కటిసేయఁ బనిచీ
వుప్పులోఁ గప్పురమేల వొద్దమ్మా
అప్పటి నావుసురుల నాకెవుసురులఁ దన్ను
దప్పిదేర విసరేయు తనకేమోయమ్మా

చ. 2: మూలనాకెచేత నాకు మొక్కించఁ బలిచీని
పాలలోనఁ బులుసేల పదవమ్మా
ఆలి నామైకాఁక నాకెమేని కాఁకలను
కాలపువరుసఁ జలిగాయిమనమ్మా

చ. 3: తానాకె మానితినని తారుకాణించఁ బిలిచీ
తేనెలోనఁ దీపులేల తెలిసెనమ్మా
పూని శ్రీవేంకటతి బుజ్జగించి నన్నుఁగూడె
తానె యాకెఁజూపెనిందాఁక సటకమ్మా

రేకు: 0153-2 శంకరాభరణం సంపుటం: 07-310

పల్లవి: ఘనుఁడవు నీమహిమ గన్నవారెవ్వరు
మినుకుల కొంతకొంత మెచ్చుటింతేకాని

చ. 1: జలధినీరు సొచ్చి సారెసారెనీఁదవచ్చు
ములుగుచుఁ గొండైన మోవవచ్చును
యిలయెల్లనెత్తవచ్చు నేరూపైనఁ గావచ్చు
బలిమి నీచిత్తమే పట్టరాదుగాని

చ. 2: ఆకసమింతంతని యంటికొలవఁగవచ్చు
చేకొని ఘోరతపము సేయవచ్చును
రాకాసులఁ జంపవచ్చు రామలఁగలయవచ్చు
ఆకడ నీగుట్టు తెలియఁగరాదు గాని

చ. 3: పట్టరానివ్రతములు పట్టించి సేయించవచ్చు
గట్టి రాయైనాఁ గడుఁ గరఁచవచ్చు
ఇట్టె శ్రీవేంకటేశ యిటు నన్ను గూడితివి
దిట్టు నీనాలోన భేదించరాదుగాని

రేకు: 0153-3 భైరవి సంపుటం: 07-311

పల్లవి: నిన్నుఁ బాసినకతాన నెలఁతకింతేసి పుట్టె
కన్నులఁ జూచితివింకఁ గావవయ్య చెలిని

చ. 1: జలములోపలఁ బుట్టె జలజమందురు గాని
జలజాస్యమున నేత్రజలములుబ్బె
అలయగ్ని నీటిచే నారునందురు గాని
వెలయఁ జెమటనీరు విరహగ్నినిగిరె

చ. 2: ఇంపులఁ దీగెఁ బూవులెసఁగునందురు గాని
తంపి పూవులనదివో తనులత
సంపెంగకు తుమ్మిదలు జరగునందురు గాని
సంపెంగ ముక్కునవాలె జాలియలినెరులు

చ. 3: మించె మేఘముమీఁద మెరుఁగనందురు గాని
నించుఁ జెలిమెరుఁగుపై నీలమేఘాము
అంచల శ్రీవేంకటేశ అతివ నీవు గూడఁగా
యెంచఁగ నీమన్ననలనెక్కుడాయఁ గాని

రేకు: 0153-4 తెలుఁగుఁగాంబోది సంపుటం: 07-312

పల్లవి: ఎరుక చెప్పే నీయిచ్చ యెల్లానెరుఁగుదు
మెరుఁగైన సొమ్ములిచ్చి మెచ్చవయ్య నన్ను

చ. 1: చేతికి కల పలము చెప్పే రావయ్య నీకు
ఘాతలఁ బరాంగనలఁ గాఁగిలింతువు
ఈతలఁ గన్నులమేలిటు చెప్పే రావయ్య
సూతకపుమానములు (?) చూడఁగలదిఁకను

చ. 2: మోవిలక్షణాలు నీకు మోవఁజెప్పే రావయ్య
చావనొక్కరాకాసిచన్ను దాగితి
వావిరి నీపాదముల వ్రాఁతల జయము చెప్పే
బావిమడుగుననొక్క పాముఁ దొక్కితివి

చ. 3: ఇంగితాకారపుభాగ్యమిటు చెప్పే నీవురాన
నంగన మోహించి పాయకయున్నది
తంగని శ్రీ వేంకటేశ తలఁపు చెప్పే నన్నుఁ
బొంగుచుఁ గూడి యిట్టె పోననేవయ్యా

రేకు: 0153-5 నాదరామక్రియ సంపుటం: 07-313

పల్లవి: కాంతయైతే నీకుఁ జేసీ కమలముపైఁ దపము
వంతుల రమణుఁడవు వరమియ్యవయ్యా

చ. 1: కూటువ నీయింతికనుఁగొనలఁ బోలుదుమని
నీటనే తపము సేసీ నీరజములు
చాటి కొమ్మతురుముతో సరివచ్చేమని మింట
మీటుఁదపములు సేసీ మేఘములు

చ. 2: మెండగు చెలినడుము మించేమనుచు నేఁడు
కొండలఁ దపాలు సేసీ కోరి సింహాలు
అండ నీసతిచన్నుల అందములకు వనాల
చండిఁ దపములు సేసీఁ జక్రవాకాలు

చ. 3: యీవనితపాదముల యీడుకుఁగా చిగురులు
దావతిఁ దపాలు సేసీ తరువులపై
శ్రీవేంకటేశ నీవు చెలినిట్టే కూడుమని
భావజుఁడు తపియించీఁ బంచాగ్నినడుమ

రేకు: 0153-6 వరాళి సంపుటం: 07-314

పల్లవి: ఒరయుచు నురమున నునిచితివీకె నీవు
అరయఁ గాంతారత్నమన్నిటాఁ గనక

చ. 1: మాటలాడి చూచితేనే మంచివైడూర్యాలు రాలీ
గాట్టఁపుజూపల మాణికాలు రాలీని
మూటగాఁగ నవ్వితే ముత్యాలు రాలీని
కూటువ నీసతి రత్నకోమలి గనక

చ. 2: బడినడుగడుగుకుఁ బద్మరాగములు రాలీ
జడిసి పొలసిఁ బచ్చలు రాలీని
పడఁతి చేవిసరినఁ బగడాలు రాలీని
నడుమ నీసతి యంగనామణి గనక

చ. 3: కుంకుమచెమటల గోమేధికాలు రాలీ
సంకుగోరికొన వజ్రాలు రాలీని
పొంకపుఁబుష్యరాగాలు పొంగీ నీకూటమిని
ఇంక శ్రీ వేంకటేశ నీయింతి రత్నాంగి గాన

రేకు: 0154-1 భైరవి సంపుటం: 07-315

పల్లవి: చెల్లెఁ జెల్లె నీచేఁత శింగరి నీ
వుల్లమెల్లఁ దక్కఁ గొంటినో శింగరి

చ. 1: చిక్కని నీనవ్వుచూచి శింగరి నే
నొక్కటై నీకు మొక్కితినో శింగరి
చెక్కులఁ జెమటగారె శింగరి నీ
వుక్కుగోరు సోఁకనీకు వో శింగరి

చ. 2: చిరుత నిట్టూర్పుల శింగరి నిను
నొరసీఁబో నాకు చాలు వోశింగరి
సిరుల నిట్టచూపు శింగరి నీ
వొరపు నాచేతఁజిక్కెనో శింగరి

చ. 3: చేవదేరె నీమోవి శింగరి నే
నోవరిలోఁ గూడఁగానె వో శింగరి
శ్రీ వేంకటాద్రిమీఁది శింగరి
వోవమన సిగ్గుదేరెనో శింగరి

రేకు: 0154-2 ముఖారి సంపుటం: 07-316

పల్లవి: అలుగుత లేదు సుమ్మీ అప్పుడు నీతో
యెలమి నోరమణుఁడ యేమనివుండితివో

చ. 1: ఎదుట నీవుండఁగాను యేపే మరుఁడో యంటా
అదివో గుండెబెదరి అవ్వలిమోమైతి
కదిసి చేయివేయఁగాఁ గమ్మచిగురుటమ్మంటా
నుదిరిపడి వెరచి వుస్సురంటిని

చ. 2: మలసి చూడఁగఁ జల్లె మంతపువెన్నెలలంటా
తొలఁగి పయ్యద నామైఁ దుడుచుకొంటి
పలికి మాటాడఁగాను పంపుడుఁ జిలుకలంటా
నిలువున వెరగంది తలవంచుకొంటివి

చ. 3: కాఁగిట నీవు గూడఁగాఁ గలలోని భ్రమతలంటా
కాఁగిన కుచములతోఁ గన్నుమూసితి
సోగల నీకొనగోరి సోఁకులనిన్నీఁ దెలిసి
బాగుల శ్రీ వెంకటేశ పైకొంటివి

రేకు: 0154-3 ముఖారి సంపుటం: 07-317

పల్లవి: ఎటువంటి తమకమో యెదుటనల్లదె చూడు
యిటు నీచిత్తముకొలఁదిఁకనేమి యంపునో

చ. 1: కాంత నిన్నుఁబిలువ నీకడకు నన్నంపి యట్టే
కాంతుఁడ నీపేర లేకలూనంపె
దొంతిగా నావెంటనె తొంగలిచూపులునంపె
యింతట విచ్చేయకున్న యిఁకయేమి యంపునో

చ. 2: కామిని నాచేత నీకుఁ గానికంపె తోడనే
మైమరచి యీడకుఁ దా మనసూనంప
కోమలపుమాఁటల కోవిలయెలుగులంపె
యేమిట విచ్చేయకున్న నిఁకనేమి యంపునో

చ. 3: ఉంగరమానవాలంపె వువిద వాయువేగాన
అంగపు నిట్టుర్పుగాలి అదివో అంపె
తంగక శ్రీ వెంకటేశ తన నడపులు నంపె
యింగితాన నిదెకూడె యిఁకనేమి యంపునో

రేకు: 0154-4 శ్రీరాగం సంపుటం: 07-318

పల్లవి: బుద్ధి చెప్పవే పతికిఁ బొద్దొక వింత వలెనా
వొద్దనుండే యింతసేపు వుపచారాలేలే

చ. 1: నిమ్మపండియ్యఁగ వచ్చి నెట్టున నావురమున
నిమ్మపండ్లు రండవే నేనేమి సేసేనే
తమ్మిపువ్వియ్యఁగ వచ్చె దాకొని నాపాదముల
తమ్మివిరులు రెండవె తనవి నాకేలే

చ. 2: నీలము గానుక యిచ్చి నిక్కిన నాతురమున
నీలములెన్నైననివే నేనేమి సేసేనే
యేలే యద్దము నాచేతికిచ్చే నాచెక్కులివే
మేలిమి యద్దాలు రండు మించేది గానఁడా

చ. 3: నిగ్గుముత్యాలియ్య వచ్చి నేఁడు నామేనిచెమట
నిగ్గుముత్యాలై వూరీ నేనేమి సేసేనే
అగ్గమై శ్రీ వెంకటేశుఁడంతలోనే ననుఁగూడి
వొగ్గి మోవియిచ్చి రతులనోలలార్చెఁ జాలదా

రేకు: 0154-5 రామక్రియ సంపుటం: 07-319

పల్లవి: చిత్తగించి యేఁటికో విచ్చేసితి గాక
హత్తి నన్ను బుజ్జగించేవన్నిటా జాణవయ్యా

చ. 1: సరసమాడఁగ నీకు సతి శూర్పనఖ గద్దు
పొరిఁ జన్నిచ్చి పెంచఁగఁ బూతకి గద్దు
పొరసి కామించి నిన్ను భోగించఁ గుబ్జ గద్దు
తిరిగి మాయింటికి రాఁదీరునటవయ్యా

చ. 2: అంది నీకుఁ గావఁబో నావులమంద గలదు
కుంది వయ్యాళికి రాతిగుఱ్ఱము గద్దు
అందపుబోయిఁడవుగా నర్జునుని బండి గద్దు
దిందుపడి యీడకు రాఁదీరునటవయ్యా

చ. 3: సారెఁ బవళించఁ బాలజలనిధి నీకుఁ గద్దు
పోరచి దానమడుగ భూమి గద్దు
చేరి నిక్కిచూడ శ్రీవేంకటాద్రి గద్దు
తేరి నన్నుఁ గూడితివి తీరునటయ్యా

రేకు: 0154-6 కాంబోది సంపుటం: 07-320

పల్లవి: ఇందరి భావము నీవే యెరుఁగుదాకె యెరుఁగు
యిందుకుఁగా నింతసేయనేమిటికయ్యా

చ. 1: సుదతి నిన్నుఁ గోపానఁ జూడకొక్క మాను చూచె
అదె యొక్క మానితో మాటాడె సొలసి
పదరి పరవాశానఁ బట్టెనొక్క మానికొమ్ము
వొదిగి యొకమానిపై నుస్సురనెను

చ. 2: మానిని యొకమానిపై మదనరాగము చిమ్మె
ఆనిన పూఁదేనె యొక్క మానఁ జిలికె
పూనిన నీబాసలకు నొకమానిపై నవ్వె
తానుడుకు దీర నొకమానిపొంతఁ బాడెను

చ. 3: అంత నీవు దగ్గరితే అందు మాను చేతనంటె
కాంత నీమారొకమాను కాలఁదన్నెను
ఇంతలో శ్రీవేంకటేశ యింతి నీవు గూడఁగను
వింతగా నీతరువుల విరులు నీకిచ్చెను

రేకు: 0155-1 హిందోళవసంతం సంపుటం: 07-321

పల్లవి: ఒకటి గలిగినచోట నొకటి లేదు
వికటంపుటలుకేలె విభుఁడెదుట వీఁడె

చ. 1: ఉవిద నీమోము చంద్రోదయంబై యుండి
నివురు నీ నవ్వువెన్నెల గాయదు
చివురుమోవి వసంతసిరి దొలఁకి యుండియును
యివలఁ గోవిలేల యెలుఁగియ్యవే

చ. 2: వనిత నీ నిండుజవ్వనవనము గలిగియును
మినుకు నడపులకరులు మెదలవేలే
ఘనమైన చన్నుజక్కవలు మితిమీరఁగా
చెనసి నివ్వెరగుమతి చీఁకటిఁకనేలే

చ. 3: మెలుఁత నీ నెరిఁదురుము మేఘంబు గలిగియును
తొలఁకు మెరుఁగులకళలు దోఁచవేలే
ఎలమితో శ్రీవేంకటేశుఁడింతటఁ గూడె
కలదెల్ల గర్వమై ఘటియించనేలే

రేకు: 0155-2 శ్రీరాగం సంపుటం: 07-322

పల్లవి: చల్లలమ్మేదానవు అచ్చపుమగనాలవు
మల్లడిమాపొందులేల మరిగేవు నీవు

చ. 1: కమ్మి పున్నమవెన్నెల గాదెఁబోసికొంటివటే
యెమ్మెకే సెలవి నవ్వేవేపొద్దును
తమ్మిరేకులెల్లాఁదెచ్చి దాఁచుకవుందానవటే
కుమ్మరించేవు కన్నులఁ గుచ్చికుచ్చి మీఁదను

చ. 2: చిలుకపలుకులెల్లఁ జేన విత్తుకొంటివటే
వొలికేవు పెదవుల నొకటొకటే
కులికి చిగురులెల్లఁ గోసితటే మావాకిట
వెలయ నీయడుగుల వెదచల్లేవు

చ. 3: సోగతీఁగెలెల్ల నీసొమ్మటే నీచేతులను
భోగపుఁ గాఁగిట నన్నుఁ బొదిగేవు
యీగతి నే శ్రీ వేంకటేశుఁడ కూడితి నిన్ను
జాగులేల యిక్కడనే సతమై నిలువవే

రేకు: 0155-3 మధ్యమావతి సంపుటం: 07-323

పల్లవి: వెలఁది చక్కఁదనము వేరొకటి గాదు సుండి
చెలులార చూడరమ్మ చెప్పరాదు వింతలు

చ. 1: చెందమ్మిరేకులలోనఁ జేరి తుమ్మిదలు వాలె
కందువఁ జెలికినవే కన్నులాయను
చందమై వొకతీగెపై జక్కవపిట్టలు వాలె
గొందినవే యెంచిచూడఁ గుచములాయను

చ. 2: నిండుఁజందురునిమీఁద నీలముల గని వుట్టె
కొండవంటి చెలికవే కురులాయరు
పండుటరఁటులమీఁద బలుసింహమదె యెక్కె
మెండగు నెన్నడుమై మించెనిదె యిప్పుడే

చ. 3: పచ్చని చిగురుమీఁద పగడపుఁబండు వండె
అచ్చపుఁ జెలియకదె అధరమాయ
ఇచ్చకుఁడై శ్రీవేంకటేశుఁడింతలోఁ గూడె
నిచ్చకల్యాణములై నిలిచె నిన్నిటను

రేకు: 0155-4 దేసాళం సంపుటం: 07-324

పల్లవి: ఏల వెరచేవే నీవు యిదివో నీపతివచ్చె
జాలివాయ నిన్నుఁగూడిసంతసమిచ్చీని

చ. 1: నీరధిలోఁ బుట్టినట్టి నీరుచిచ్చైన పూవు
నూరిపోసినట్టి పామునోరిలో కడి
మారుతో నగ్నిఁబడిన మాకులలో భూతము
యీరీతి విరహులకెగ్గు సేయకుందురా

చ. 2: తల్లిదండ్రి వెంచనట్టి తగుఁబలుగాకి చూర
చల్లుఁ బుప్పొడి దొంగిలిన జాజరకాఁడు
మల్లాడి చెట్లమీఁద మధువుపట్టిన పాత
వెల్లిగా మంచిగుణాలు వీనికింక వచ్చునా

చ. 3: వంగి వంచనేర్చిన వడిఁదియ్యని గుణము
ముంగిట నిందరి చిత్తముల వేలుపు
ఇంగితాన శ్రీ వేంకటేశు నిన్నుఁ గూడఁజేసి
రంగన నీపాలింటికి అందరను హితులే

రేకు: 0155-5 ఆహిరి సంపుటం: 07-325

పల్లవి: ఇదె వీఁడె చూడవే యించుక మాటాడవే
యెదురై కూడితిరి మీరిఁకనేలె యలుక

చ. 1: తామెరలు వికసించె తరుణి నేఁడు నీమోహము
తామర వికసించదు తగునటవే
తామెరకుఁ జుట్టుము ధరణిపై సూర్యుఁడు
నీమోముదామెరకు నీవిభుఁడు చుట్టుము

చ. 2: కలువలు వికసించె కలికి నేఁడు నీకన్నుఁ
గలువలు ముకుళించఁ గారణమేమే
కలువలచెలికాఁడు కందువచంద్రుఁడు నీ
కలువకన్నులకు నీకాంతుఁడెపో చుట్టుము

చ. 3: వనములు వికసించె వనిత నేఁడు నీజ
వ్వనమును వికసించ వైపాయనే
వనదేవతందుకైతే వసంతుఁడు నీకు మిం
చినవనదేవతైతే శ్రీ వెంకటేశుఁడు

రేకు: 0155-6 శంకరాభరణం సంపుటం: 07-326

పల్లవి: ఎంతజాణ నీచెలియనేమని పొగడవచ్చు
దొంతులమాఁటలలోనే దోమటి దొడికెను

చ. 1: మెట్టిన చమ్మాళిగలు మించఁ బారితెంచి నిన్ను
పట్టితీసి మొలనూలు పైపై చెలి
అట్టె కోపాన నీవు ఆఁపలేక పెనఁగఁగ
తిట్టెన నీమోవి గంటి తెగి సేసెనప్పుడే

చ. 2: వంచిన పయ్యదకొంగు వల్లెవాటు వేసుకొని
కొంచక నీమొగమై కొనగోరను
ఇంచుకంత నీవందుకు యియ్యకొనకుండఁగాను
ముంచి నిన్నుఁ దనచను మొనలనాఁగీని

చ. 3: వాకునిండా కస్తూరివాసనలు చల్లి చల్లి
యేకతమాడి చెలి యిప్పుడే నీతోను
యీకడ శ్రీ వేంకటేశ యియ్యకొని కూడఁగాను
లోకము మెచ్చేటి నిన్ను లోను కొనెను

రేకు: 0156-1 వరాళి సంపుటం: 07-327

పల్లవి: ఏమని పొగడవచ్చునిట్టి వింత సింగారము
నేమముతో రమణుఁడ నీభాగ్యమాయను

చ. 1: కమలముమీఁద రెండుకలువలు వికసించె
జమళినందువల్లనే సంపెఁగ వూచె
తమితో నాకొట్టఁగొనఁ దగదొండపండు వండె
అమరనిన్నియుఁగూడి అతివమోమాయను

చ. 2: కన్నెయరఁటులమీఁద కంతునిరథము చాలె
పన్ని సింహమొకటి యాపైనెక్కెను
సన్నలనామెకముపై సతి జక్కవలు వాలె
ఇన్నియుఁ గూడఁ గూడ నింతిరూపమాయను

చ. 3: అంచెలఁ గూర్మాలు రెండుహంసలతోఁ బొందుసేసె
పొంచి బిసాలు సంకముపొత్తు గూడెను
నించి శ్రీ వెంకటేశుఁడ నీసందిటఁ బట్టఁగా
యెంచక వేపురముపై నిందిరాదేవాయను

రేకు: 0156-2 శ్రీరాగం సంపుటం: 07-328

పల్లవి: ఇంత యేల బిగువు యిది లెస్స తగవు
నంతకూటపుమాటలు చాలునయ్య నీవు

చ. 1: పట్టినదే పంతమా పడతిఁ బిలువరాదా
చుట్టుమవో నీవు లేక సూడుబంటవో
యెట్టుయెదురనున్నారు యెడమాటలాడలేము
రట్టుపాలకమ్మకెక్కె యిట్టెరావయ్యా నీవు

చ. 2: చెల్లినంతాఁ జేఁతా చెలియఁ జేకొనరాదా
యెల్లగా నవ్వులకో యిదే నిజమో
తెల్లవారె సిగులనే తెగి మిమ్ము దూరలేము
అల్లమే సొంటిగాదా అవునయ్య నీవు

చ. 3: ఆడినదే యాటా ఆకెఁజక్కఁజూడరాదా
వీడుదోడువయసులు వేడుకో వెట్టో
ఈడనే శ్రీ వేంకటేశ యింతిఁ గూడితివి నీవు
వోడలు బండ్లవచ్చు వుండవయ్య నీవు

రేకు: 0156-3 బౌళి సంపుటం: 07-329

పల్లవి: హరి యేమనెనే అలిగెనో
విరహినై నేనుండఁగా యేలరాఁడాయ

చ. 1: మరలి మరలి తన్ను మాటలఁ గొసరను
యిరవైన విభుఁడేమనెనే
తరుణులే వచ్చితిరి తానాడనున్నాఁడు
యెరవెరవై తానేమనెనే

చ. 2: వాకిటికిందాఁక వచ్చి తిరిగెనట
యేకారణమిది యేమనెనే
రాకలఁ బోకల రాతిరాయనిదె
యీకడఁ దుదమాఁటేమనెనే

చ. 3: తలపులో ప్రియరము తానే యెరుఁగును
యెలుఁ గెత్తొకమాఁటేమనెనే
బలిమి శ్రీవేంకటపతి దా విచ్చేసి
యిల ననుఁగూడెను యేమనెనే

రేకు: 0156-4 బౌళి సంపుటం: 07-330

పల్లవి: ఇందాఁక నెరఁగము యీవింత సతి
కందు వాసె శ్రీకాంతావిభుఁడ

చ. 1: సుదతికి నీరాక సూర్యోదయమ్మై
వదనకమలమిటు వడిఁ జెలఁగె
పొదలిన నీనవ్వుపున్నమవెన్నెలకు
కదిసి చకోరపుకన్నులు దెలిసె

చ. 2: వనితకు నీచూపు వసంతకాలమ్మై
వెనకఁ బలుకుఁగోవిలలొదరె
మినుకు నీతనువుమేఘకాంతులకు
పనివడి పులకలపైరులు దేరె

చ. 3: సతికి నీపొందులె జలధిమథనమ్మై
రతినధరామృతరసమబ్బె
ఇతవై శ్రీ వెంకటేశ నీవు చెలిఁ
దతిఁ గూడఁగ మరుతంత్రము గెలిచె

రేకు: 0156-5 పాడి సంపుటం: 07-331

పల్లవి: ఏమి సేతు ముచ్చటకు యెవ్వరు గలరు నాకు
యేమీననకూరకున్న యెగ్గుపట్టుఁగా

చ. 1: అడుగుదునో వానినాడనేల వుంటివని
అడుగఁబోనలుగుఁగా అందుకతఁడు
తుడుతునో వానిమేనఁ దొరిగే వేఁడిచెమట
చిడిముడి వాఁడందుకు సిగ్గువడుఁగా

చ. 2: విసరుదునో సురటి విభునియలపు దీర
విసరఁబో అదియును వెంగెమౌఁగా
కొసరుదునో తనగుట్టు నేఁగనినదాఁకా
ఇమంతపనికి మనసు నొచ్చుఁగా

చ. 3: నవ్వుదునో రమణుఁడు నాతోఁ గరఁగినవేళ
నవ్వఁబో ఆతనిమేలు నామేలుగా
రవ్వగా శ్రీ వేంకటాద్రిరాయఁడిట్టె నన్నుఁగూడె
యివ్వల మోవియిత్తునో యిచ్చగించఁగా

రేకు: 0156-6 శంకరాభరణం సంపుటం: 07-332

పల్లవి: పోపో అదేఁటిమాట పొద్దువోదా
మాపుదాఁకా నదే కాక మరియేఁటిమాటలే

చ. 1: గుత్తులపూవులు నీవు కోవయ్య కానికె ఆ
గుత్తులేల నీచనుగుత్తులీరాదా
జొత్తులైన లతలవే చూడవయ్య మాటలేల
హత్తి నీబాహులతలు అవె కంటినే

చ. 2: పండుబలమిదివో పట్టువయ్య సూడిదె
పండులేల నీమోవిపండె కాక
మెండగుఁ దామరలు మీఁదవేసేఁ జూమ్మి
దండి నీచేతులె రెండుతామరలు గావా

చ. 3: కప్పురమిచ్చే నీకుఁ గైకోవయ్యా ఆ
కప్పురాలు నీనోరికతలెకావా
యిప్పుడె శ్రీ వెంకటేశ యిటుగూడితి నేఁ
డిప్పుడా అల్లప్పుడెపో యెరఁగవు గాని

రేకు: 0157-1 బౌళిరామక్రియ సంపుటం: 07-333

పల్లవి: అలిగినవేళ విభుఁడంటితేఁ గోపమే తోఁచు
తెలుసుక నీలోనే తేరుకొవే చిత్తము

చ. 1: వేసవికాలమునాఁడు వేడుకైన వెన్నెలలే
యీల విరహవేళనెండలై తోఁచు
వాసితోఁ దానేరిపిన వన్నెచిలుకమాటైన
పాసినదంపతులకు పగిలించు మర్మము

చ. 2: సోఁప దనమేవనున్న సొంపుల జవ్వనమైన
కోవిలకూఁతలవేళ గొరబై తోఁచు
పూవులు తాఁ గొప్పులోన పూఁచి ముడిచినవైన
కావిరిఁ దానొంటినుంటే కంతునమ్ములౌను

చ. 3: ప్రతిలేని తనలో ప్రాణపుటూరుపైన
రతినలసినవేళ రంపమై తోఁచు
యితవై శ్రీ వేంకటేశుఁడింతలోనె నిన్నుఁగూడె
సతమై యీవిరసాలే సరసములాయెనే

రేకు: 0157-2 శుద్ధవసంతం సంపుటం: 07-334

పల్లవి: బలిమిసేయక నీవు పదవమ్మా
చెలియ నామనసు చేకొనవమ్మా

చ. 1: ననుపు లేనిచోట నవ్వుటకంటెను
జునిగి వాదులడుచుటె సుఖము
మనసు రానిచోట మాటలాడుకంటెను
మునుపనే తనలోనిమోనమే సుఖము

చ. 2: ప్రేమలేనిపతిఁ బిలుచుకంటెను
సోమరై వేగించుటె సుఖము
కామించనిరతిఁ గరఁగుటకంటెను
ఆమారు కంభమునలముటె సుఖము

చ. 3: ఒల్లమి సరిఁ గూచుండుటకంటెను
చల్లఁగఁ దొలఁగుటె సమసుఖము
ఎల్లగ శ్రీవేంకటేశుఁడు నన్నుఁగూడె
కొల్లగనిదియే కోరుట సుఖము

రేకు: 0157-3 మధ్యమావతి సంపుటం: 07-335

పల్లవి: చేసినట్టుల్లాఁ జెల్లె సేఁతలు నీకు
గాసిఁబెట్టుకిఁక నన్నుఁ గరుణించవయ్యా

చ. 1: చెప్పినట్టుసేయఁగానె చెరఁగేల పట్టేవు
తప్పులెంచననఁగానె తడవనేల
కొప్పువంచి మొక్కఁగానె గుంపెనపంతాలేల
ముప్పిరి దప్పులు దేర మోవియ్యవయ్యా

చ. 2: సరములాడఁగానె సాదించనేల వచ్చేవు
కెరలించకుండఁగానె కేరడమేల
పరగ నేఁ బండఁగానె బలిమిసేయఁగనేల
గరిమ నాకోరినట్లు కాఁగలియ్యవయ్యా

చ. 3: కూడి రతిసేయఁగానె కొరేల చూపేవు
వీడెమందుకొనఁగానె వేసాలేలా
పాడితో శ్రీవేంకట పట్టపలమేల్మంగను
జాడతోనింకాను సేలు చల్లవయ్యా

రేకు: 0157-4 కాంబోది సంపుటం: 07-336

పల్లవి: నీవిభుని ప్రియములు నెట్టునఁ జేకొనఁగదే
కావలసిన మేలెల్లాఁ గాచుకున్నది

చ. 1: తనంతనయ్యేపనికి తమకించఁ బనిలేదు
వినవలసినందుకు వేసరవద్దు
మనసు నమ్మినందుకు మరివిచారములేల
కొనసాగేయందులకుఁ గోపమేఁటికి

చ. 2: ఆస గలిగినచోట అంటు విడువఁదగదు
వాసితోడి పొందెపుడు వంచించరాదు
యీసులేక పెనఁగితే యియ్యకొనకుండనేల
చేసూటిని మెలఁగఁగ చెప్పించఁ జనదు

చ. 3: కూటపుమాటలాడఁగఁ గొసరేదండము గాదు
నీటునఁ గాఁగలించఁగ నేరమెక్కుదు
యీటున శ్రీ వేంకటేశుఁడేలె నిన్నునింతలోనె
సాటికి బేటికి మీలో జంటలిఁకఁ బాయవు

రేకు: 0157-5 సామంతం సంపుటం: 07-337

పల్లవి: ఏమని పొగడుదుమె యీచెలిచక్కఁదనము
యీమేఁటి యలమేల్మంగ యెక్కువైతానిలిచె

చ. 1: అరచంద్రుఁడుఁ జకోరాలద్దాలు సంపెఁగయు
ధర శింగిణులు శ్రీలు తలిరులును
అరుదుగాఁ దుమ్మిదలుసందముగాఁ గూడఁగాను
మరుతల్లి యలమేలుమంగమోమై నిలిచె

చ. 2: బిసములు శంఖమును పెనుఁజక్రవాకములా
కసము నీలపుఁజేరు కరికుంభాలు
పొసఁగ నివెల్లానొకపోఁడియై నిలువఁగాను
మసలక అలమేలుమంగమేనై నిలిచె

చ. 3: అనఁటులంపపొదులు నబ్జములు ముత్తేలు
వొనరి వరుసఁ గూడి వుండఁగాను
ఘనుఁడైన శ్రీ వెంకటేశునురముమీఁద
పనుపడలమేల్మంగ పాదములై నిలిచె

రేకు: 0157-6 గౌళ సంపుటం: 07-338

పల్లవి: తనసేవ నేఁజేయనా తగవు దప్పఁగాఁ గాక
చెనకీఁ దానిందుకేపో సిబ్బితయ్యీ నాకు

చ. 1: కడుఁ దమకాన నేను కస్తూరి నూరఁగాను
తడఁబడ నామీఁదఁ బాదము చాఁచీని
బెడిదమై ఆఁటదాని పెండెము వెట్టుకున్నాఁడు
చిడిముడి నిందుకేపో సిబ్బితయ్యీ నాకు

చ. 2: పొందుగా నేను గొజ్జంగ పువ్వుదండ గుచ్చఁగాను
చెంది నాబుజముమీఁదఁ జెయివేసీని
మందెమేళాన నెవ్వతో మట్టెలు వేలనున్నవి
చిందువందసేఁతకేపో సిబ్బితయ్యీ నాకు

చ. 3: పొలుపుగా నేఁదట్టుపునుఁగు వాసించఁగాను
అలమీ శ్రీ వేంకటేశుఁడంతలో నన్ను
మొలనూలేడదో పురమునఁ బెట్టుకున్నాఁడు
చెలరేఁగి కూడఁగానే సిబ్బితయ్యీ నాకు

రేకు: 0158-1 హిందోళవసంతం సంపుటం: 07-339

పల్లవి: చెలులము నేము బుద్ధి చెప్పనోపమాకెకు
అలరి నీవాపెను మాఁటాడించవయ్యా

చ. 1: మక్కువతో నాపె నీవు మాటలాడేవంటాను
పక్కునఁ బాన్పుపైనీకె పవళించె
వెక్కసాన నింతలోన విచ్చేసితివీడకు
నెక్కొని నీవే యిఁక నిద్రలేపవయ్యా

చ. 2: తతితో విందాకెయింటఁ దగనారగించేవంటా
అతివ బోనమెల్లా చల్లారఁబెట్టెను
అతివేడుకనింతలో నాఁకలిగొంటివనేవు
కతగా నీవే వడ్డించఁ గైకొలుపవయ్యా

చ. 3: కందువనాపెతో నేఁడు కాఁపురము సేసేవంటా
వొందిలిఁ దలుపు మూసుకున్నది చెలి
అందుకె శ్రీ వేంకటేశ అండకేఁగి కూడితివి
చెంది నీవె వాకిలాపెచేఁ దెరపించవయ్యా

రేకు: 0158-2 శంకరాభరణం సంపుటం: 07-340

పల్లవి: ఎంత తమకమో చెలికేమి చెప్పేది
వింతవింతవేడుకలు వెల్లివిరిసీని

చ. 1: జారినపయ్యదతోడ సగము చన్నులు చూపి
నేరుపుల మాటలాడీ నెలఁత నీతో
కూరుములు గొసరుతా గోరఁజెమట చిమ్ముతా
తారుమారైవలపుల తన్నుఁదానెరఁగదు

చ. 2: కడుఁగొప్పు దువ్వుకొంటా కరమూలములు చూపి
వెడయాస నవ్వు నవ్వీ వెలఁది నీతో
నిడువాలుఁజూపులతో నిన్నుఁ దానొరసుకొంటా
తడఁబాటుచిత్తముతో తన్నుఁ దానెరఁగదు

చ. 3: బిగ్గెనొడ్డాణము గట్టి పిరిఁదిబటువు చూపి
అగ్గలమై కాలుదొక్కీనతివ నీతో
నిగ్గుల శ్రీ వేంకటేశ నిన్నుఁగూడి మొక్కు మొక్కి
తగ్గని కోర్కులతోడ తన్నుఁ దానెరఁగదు

రేకు: 0158-3 బౌళి సంపుటం: 07-341

పల్లవి: ఆతని తలఁపు మీరే అడుగరే చెలులాల
కాతరములేని సిగ్గరిదాన నేను

చ. 1: మలసి యాతనితోను మారుమాటాడేనటవే
తలకొన్న మొగమోటదానను నేను
కలువలఁ దాఁకవేసి గద్దించేనటవే
నలువంక మెత్తని మనసుదానను నేను

చ. 2: జలిసి యతని జంకించఁగఁ గలనటవే
తటితోడ వలచినదానను నేను
వెఱవక చెయివట్టి వెసఁ దియ్యగలనటే
కఱకరిలేని యిచ్చకపుదాన నేను

చ. 3: అంచల నాసలు చూపి యలయించేనటవే
మంచితలఁపలమేలుమంగను నేను
ఇంచుకంతా శ్రీ వెంకటేశు మీరేనటవే
వంచనసేయని చనవరిదాన నేను

రేకు: 0158-4 రామక్రియ సంపుటం: 07-342

పల్లవి: నీవోజ నేనెరఁగనా నెపాలేల చెప్పేవు
వేవేలకు నాకు వింతవాఁడవా

చ. 1: ఎప్పుడు నామోహమోరఁగవా నీకక్కడ
కప్పి యెంతపని నీకుఁ గల్గెనోకాక
నెప్పున మాయింటికి నీవు రానివాఁడవా
అప్పటి నేచుట్టాలు మాటాడుతా నీకుండిరో

చ. 2: మలసి నన్ను నీవు మరచేటివాఁడవా
చెలులెవ్వరు పరాకుసేసిరోకాక
తలఁపు నామీఁద నీకుఁ దగిలివున్నదే కాదా
సొలసేవారిమొగాలు చూడనందుండితివో

చ. 3: వరుస నన్నుఁజేపట్టి వదలుదువా నీవు
యిరవై నీచిత్తాననేమెంచేవో కాక
నిరతి శ్రీ వేంకటేశ నేనలమేర్ మంగను
కరుణించితి విప్పుడు గలయ వేళాయనో

రేకు: 0158-5 పాడి సంపుటం: 07-343

పల్లవి: ఎప్పుడూ మేలువాఁడవే యెరుఁగుదు నిన్నునేను
కప్పి వోరువనియ్యవు కాంక్షలే నన్నును

చ. 1: ఆవేళ నీవురావని అలుగఁదలఁతుఁ గాని
భావించితే నామనసు పట్టులేను
నీవంకఁ దుప్పేమీలేదు నేనెంచి చూచితేను
తావుకొన్న నాలోని తమకమే కాని

చ. 2: చేముట్టిపెనఁగవని చింతఁ దలవంతుఁ గాని
నీమోము చూడక నే మానలేను
కామించి నీగుణాలలో కడమలు మరిలేవు
ప్రేమపు నాకోరికలు పెనగోనీఁ గాని

చ. 3: పరఁగఁగ బరపుపై పంతాననుండుదుఁ గాని
సరిఁ గాఁగిటికి చేయి చాఁచకుండలేను
అరిది శ్రీ వెంకటేశ అలమేల్మంగ నేను
గరిమెనేలితివేలొ కాఁతాళింతుఁ గాని

రేకు: 0158-6 హిజ్జిజి సంపుటం: 07-344

పల్లవి: ఇంతవాఁడవు గాఁగానే యిందరు మోహింతురు
సంతసానఁ జెలఁగుదు సరసుఁడవు నీవు

చ. 1: విరహవేళ నెంతేసి వెంగెములాడుదు నిన్ను
యెరవు లేక వోరుతువిన్నియు నీవు
సరసమాడే యప్పుడు సారెనలయింతు నేను
విరసము లేకుందువు వేడుకతో నీవు

చ. 2: కొసరేటి తరినెంత గోరనూఁదుదు నిన్న
అసముతో నవ్వుదువందుకు నీవు
పొసఁగఁ బరాకారైనచో పూబంతినివేతు నిన్ను
సుసరాన వేఁడుకొని చొక్కింతువు నీవు

చ. 3: సరిఁ గూడేయెడనెంత జంకింతు నిన్ను నేను
గరిమనెంత మెత్తువు కాఁగిట నీవు
నిరతి శ్రీవెంకటేశ నేనలమేల్మంగను
మరిగితి నేను కడు మన్నింతువు నీవు

రేకు: 0159-1 మంగళకౌశిక సంపుటం: 07-345

పల్లవి: మఱచితినంటా నీవు మమ్మెంత బుజ్జగించేవు
యెఱుక గలచోట యెట్టుండినా యేమి

చ. 1: అక్కడే పరాకైతే అట్టే యెచ్చరింతుఁ గాక
దిక్కరించి నిన్ను సాదించేనా నేను
మక్కువ నూరకుండితే మాట నేనాడింతుఁ గాక
చిక్కించుక గొరబులు సేసేనా నిన్నును

చ. 2: పెలుచవై రాకుండితే పిలువనంపుదుఁ గాక
చలమున నీతోను వేసరుకొనేనా
తలవంచుకుండితేను తమకము రేఁతుఁ గాక
తలుపుమాటుకుఁ బోయి తరితీపుసేసేనా

చ. 3: పవళించివుండితేను పాదములొత్తుదుఁ గాక
ఇవల వాసులు వంతులెంచఁ జూచేనా
వివరించి నన్నిట్టె శ్రీ వెంకటేశ కూడితివి
నవమైన నీచేతలు నవ్వించవా నన్నును

రేకు: 0159-2 మాళవిగౌళ సంపుటం: 07-346

పల్లవి: నీకునింతి వలచుటే నీవెరఁగవా
చేకొని యీకెదిక్కు చిత్తగించరాదా

చ. 1: చెక్కునొక్కి ఆపె నిన్ను చెయివట్టి తియ్యఁగాను
యెక్కడ పరాకు సేసేవేమయ్యా నీవు
యిక్కువలు గోరనంటి యింటికిఁ బిలువఁగాను
గక్కననేమి నవ్వేవు కానిమ్మనరాదా

చ. 2: వేడుకతోడ సారెకు విందులు నీకుఁ జెప్పఁగా
ఆడేవు జూజాలిప్పుడే అదేమయ్యా
వీడెము చేతఁబట్టుక వెనక నిలుచుండఁగా
పాడితివి పాటలప్పటనుండి నీవు

చ. 3: పానుపువరచుకొని పడఁతి సన్నసేయఁగా
కానుకలందుకొనేవు కాంతలచేత
మోనాన నలమేల్మంగ మొక్కి నిన్నుఁ గాఁగలించె
తానకమై యేలితివింతటి శ్రీ వేంకటేశ

రేకు: 0159-3 కేదారగౌళ సంపుటం: 07-347

పల్లవి: మేలుమేలు యిందుకిట్టే మెచ్చితి నిన్ను
తాలిమితో నిన్నీరీతి దక్కించుకొనెఁగా

చ. 1: మంతనాననేపొద్దు మాటలాడేవాపెతోను
ఇంత వలపించెఁగా యింతి నిన్ను
పొంతనే నీవెంగిలిపొత్తు గలపుకొంటివి
పంతాన నిందుకొగ్గించి భ్రమయించెఁగా

చ. 2: తతిగొని చూచేవు తరుణిమొకమే నీవు
బతిమాలింపించెఁ గా భామ నిన్ను
సతముగాఁ బానుపుపై జంటవాయనియ్యదు
మతిఁ దనకాఁగిలి మరగించుకొనెఁ గా

చ. 3: చెలరేఁగి విడేలకు చేతులు చాఁచేవు నీవు
అలవాటు సేసెఁగా అంగన నిన్ను
అలమేలుమంగ ఆకె అట్టె శ్రీ వెంకటేశ్వర
నలిఁ గూడితివి నీచే నన్నూ నెలిఁపించె గా

రేకు: 0159-4 వసంతం సంపుటం: 07-348

పల్లవి: ఇటులా నేముసేసేమా యిల్లాండ్లము నేము
తటుకన నీమదిలోఁ దడఁబడకిఁకను

చ. 1: యేడనైనా గయ్యాళియైనది చనవు గలితే
ఆడరానిమాఁట నిన్నాడుఁగాక
వేడుకకత్తెయినది విచారించకందరిలో
వీడెమిచ్చి కాలుఁజేయి వేసును నీమీఁదను

చ. 2: మందెమేళమైనది మరగితే నీమేన
చిందరవందరసేఁత సేయుఁగాక
అందునిందు రట్టడియైనది వెరవులేక
చెంది నీబుజాన మోము చేర్చుకొని నవ్వును

చ. 3: సారెకు దిట్టైనది సంగడిఁ బెట్టుక వుండితే
చేరి రతివేళఁ గక్కసించుఁ గాక
ఆరీతి శ్రీ వెంకటేశ అలమేల్మంగను నేను
కోరి నన్నునేలితివి కొంకకాపె మెచ్చును

రేకు: 0159-5 దేసాళం సంపుటం: 07-349

పల్లవి: ఏల వెరచేవు నమ్ము యేమీననదాపె నిన్ను
తాలిమితో మాటాడితే తప్పులన్నీఁ దీరును

చ. 1: చెలి పిలువనంపఁగా సింగారించుకొనేనంటా
యెలిమితో జరపులనేల పెట్టేవు
వెలయలేకలంపెను వేలఁ దగిలించుకొని
సొలపుల మమ్మునేమి సుద్దులడిగేవు

చ. 2: భామ నీదిక్కుచూడఁగా పనిగలవానివలె
వేమారుఁ దలవంచేవు వీదిలోనుండి
తామరగొని వేసితే తగఁజేతఁ బట్టుకొని
ప్రేమముతో మాకునెంత ప్రియాలు చెప్పేవు

చ. 3: అలమేలుమంగను అదరిపాటువలెను
కలసేవాకెను శ్రీ వెంకటేశ్వర
యెలమినెదురుచూచెనిందాఁకా నీకుఁ గాను
వెలినాకకేమి విన్నవించకుమనేవు

రేకు: 0159-6 శంకరాభరణం సంపుటం: 07-350

పల్లవి: చెల్లునయ్యా యీచేఁతలు చెలియకు నీకును
చిల్లరచెనకులకు సిగ్గేయానందము

చ. 1: సతులకుఁ బతులకూ జవ్వనమే భాగ్యము
రతివేళలనెల్లా రహస్యమే వేడుక
తతితో మనసులకు తలపోఁతే పండుగ
సతమైన మోహాలకు సరసమే సౌఖ్యము

చ. 2: వొట్టిన తమకములకొద్దనుండుటే ఫలము
ముట్టినయాసలకు మోముచూపే తనివి
పట్టరానికోరికకు పచ్చిమాటే సోబనము
చిట్టుకపుచేఁతలకు చిరునవ్వే లాభము

చ. 3: ననుపైన కూటమికి నాటుగోరే సింగారము
పెనఁగుటకు కాఁగిటిబిగువులే సంపద
యెనసితివి శ్రీ వేంకటేశ యలమేల్మంగను
చనవులకును మోవిచవులె సామ్రాజ్యాలు

రేకు: 0160-1 కేదారగౌళ సంపుటం: 07-351

పల్లవి: ఇప్పుడు మాఅక్క వింటే యేమనువో యిందుకు
దప్పిదేర సారెనేల తడవేవు మమ్మును

చ. 1: పంతముతోఁ గూచుండఁగా పనిగద్దు రమ్మనేవు
యెంతలేదు ఆపని నేనెరిఁగినదే
సంతోసాన నీమొగము చక్కఁజూడుమనేవు
దొంతరలుగా నేనెప్పుడ తొల్లే చూచినది

చ. 2: తొరలి యప్పటి నన్ను నీతోడుత నవ్వుమనేవు
గరిమ నీచేఁతలకుఁ గడు నవ్వుదురు
మరుమాటలు నాతో మక్కువనాడుమనేవు
అరసి నీవాడితివి అవే నామాటలు

చ. 3: కొలఁది మీరఁగ నాకూటమికిఁ బెనఁగేవు
అలమేల్మంగఁ గూడితివదియె నారతి
యెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్నునేఁడు
బలిమిఁ దొల్లే యేలుబడిదానఁ గానా

రేకు: 0160-2 నాదరామక్రియ సంపుటం: 07-352

పల్లవి: ఎవ్వతెకో యీకెయంటా యెంతేసి తుటారించితి
చివ్వన నిందుకుఁగాను చిన్నఁబోకు మీఁకను

చ. 1: ఆపెపై బత్తిగలిగితే నప్పుడే చెప్పవలదా
చేపట్టి నేనిచ్చకము సేకుందును
యీపాటి నీదేవులైతే నింటికిఁ దెచ్చుకోవద్దా
చూపెట్టుకో వొక్కమనసుననుందును

చ. 2: తగులు నీకుఁ గలితే తారుకాణించవలదా
పగటున నేనూ వొడఁబడియుందును
నగినవాఁడవా పొందు నడపఁగ వలదా
తగినట్టు తగవులు తప్పక నేనుందును

చ. 3: చుట్టురికము గలితే నాకుఁ జూపఁగవలదా
వొట్టుకొని సంతోసాన నూరకుందును
నెట్టన శ్రీ వెంకటేశ నేనలమేల్మంగను
గట్టిగా నన్నేలితివి కానిమ్మని వుందును

రేకు: 0160-3 పాడి సంపుటం: 07-353

పల్లవి: ఎక్కడ పరాకు నీకు యిటుచిత్తగించరాదా
పక్కనఁ బలిచితేఁ జాలు బత్తిగలదానికి

చ. 1: కడనుండి రమణుఁడు కన్నులఁ జూచినఁజాలు
అడియాసఁ బొరలేటి ఆఁటదానికి
చిడిముడితోఁ గొంత సెలవుల నవ్వినఁ జాలు
యెడసియుండి రతులకేఁకరేటిదానికి

చ. 2: మలసి మగఁడేపాటి మాటలాడినాఁ జాలు
చెలరేఁగి కడు వలచినదానికి
నెలకొని ముందట నిలుచుండినాఁ జాలు
సొలసి యెట్టుయెదురు చూచేటిదానికి

చ. 3: ఇచ్చగించి నాయకుఁడు యింటికి వచ్చినాఁ జాలు
కచ్చుపెట్టి ప్రేమము గలదానికి
కొచ్చి శ్రీ వెంకటేశ కూడితివలమేల్మంగ
నిచ్చట నీవుంటేఁ జాలునింపుగలదానికి

రేకు: 0160-4 కాంబోది సంపుటం: 07-354

పల్లవి: మగవాఁడిది యెరిఁగి మగువలనేలవలె
నిగిడి వోరమణుఁడ నీచిత్తమిఁకను

చ. 1: వినయమే చూపును విభుఁడెంత జరసినా
చనవున గర్వించదు జాణైనది
పెనఁగులాడదు యెంత బెట్టిసరసమాడినా
మనసు రామెలఁగును మర్మమెరిగినది

చ. 2: మచ్చికలే నెరపును మగఁడెంత పరాకైనా
కొచ్చి నేరాలెంచదు గుణియైనది
రచ్చలోఁ జెప్పుకొనదు రతికెంత పలిచినా
విచ్చనవిడి భోగించు వెరవరియైనది

చ. 3: గక్కనఁ గాఁగిటనించు కాంతుఁడెంత బిగిసినా
వుక్కుమీరి యలుగదు వొద్దికైనది
యిక్కడ శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
యిక్కువలు గరఁగించు యితవరియైనది

రేకు: 0160-5 సాళంగనాట సంపుటం: 07-355

పల్లవి: ఎక్కడ పరాకు యిదివో నీకు
మిక్కిలిఁ జేసితివి నమ్మినయడ మేకు

చ. 1: కలికి పొంచి నిన్నుఁ గలయ
వెలలేని వలపులు వెలయ
సులభుఁడవా నీవు సొలయ
మెలుపున నవ్వీని మేనెల్లానలయ

చ. 2: ముచ్చటతోడ మొక్కీ మొదల
కచ్చుపట్టి కుచములు గదల
పచ్చిదేరీ మదనసంపదల
మచ్చరము లేదీకెకు మాటలతుదల

చ. 3: వెక్కముగా వేసీ విరుల
చక్కఁగా దిద్ది తన సరుల
యిక్కువ శ్రీ వేంకటేశ యీకె యలమేల్మంగ
చెక్కునొక్కి నిన్నుఁగూడె చెదరినకురుల

రేకు: 0160-6 మంగళకౌశిక సంపుటం: 07-356

పల్లవి: అటుగాన నీచేఁతలమృతములె నీకు
యెటువలెనైనా మీకిద్దరికిఁ దగును

చ. 1: మొక్కలాన నడచినా మురిపెములై తోఁచు
చక్కఁదనములు గల జలజాక్షులు
కక్కసించి మాటాడినా కామమంత్రమై తోఁచు
వెక్కసపు జవ్వనాన విఱవీఁగేవారలు

చ. 2: అలవోకగా నవ్విన ఆయములు గరఁగను
వలపించ నేరిచిన వనితలు
తలకొని జంకించినా తరితీపులై యుండు
నిలిచి జంటవాయని నెరజాణలు

చ. 3: వొడివట్టి పెనఁగినా వొడఁబాటులై మించు
కడువిలాసాలతోడి కామినులు
అడరి శ్రీ వెంకటేశ అలమేలుమంగ యీకె
తడయక కూడెనిదె తగవందురిందరు

రేకు: 0161-1 శ్రీరాగం సంపుటం: 07-357

పల్లవి: ఏఁటికిఁ బొద్దు గడుపేవిటు మాతోను
చోటిచ్చి యాపెను రతిఁజొక్కించరాదా

చ. 1: చెలిమిసేయఁగ నేర్చు చెప్పనేర్చు బుద్ధులెల్లా
పిలిపంచి యాపెనొద్దఁ బెట్టుకోరాదా
నిలిచి కొలువుసేసు నీమర్మాలు దానెరుఁగు
చలివాయ మాటలాడి చనవియ్యరాదా

చ. 2: చెనకి నిన్ను నవ్వించు సిగ్గులుదేర్చునాపె
యెనసి వూడిగాలు సేయించుకోరాదా
వినయాలు సేసుఁ గడు వేడుకలు నీకు రేఁచు
వొనరఁ బానుపుపైఁ దోడుండుమనరాదా

చ. 3: మరిగించుకొనునాపె మనసురా మెలఁగును
సిరులఁ జుట్టరికము సేయరాదా
నిరతి శ్రీ వెంకటేశ నేనలమేలుమంగను
సరి నన్నేలితివాపె సమ్మతిసేయరాదా

రేకు: 0161-2 సామంతం సంపుటం: 07-358

పల్లవి: ఇట్టుండవలదా యెనసి సంగాతము
వొట్టి వొకటొకటికొద్దికలాయ

చ. 1: కలువ రేకులే మంచి కన్నులుగాఁగా
చెలిమొగము మెరసి శశియాయ
వెలయ బొమలు మరువిండ్లుగాఁగా
నలి సంపెగవిరి నాసికమాయ

చ. 2: సతతముఁ గుచములు శైలములుగాఁగ
అతివ కరంబులు లతలాయ
తతిగొను నాభియె తగు బిలముగాఁగ
మితిమీర నడుము మృగపతియాయ

చ. 3: పొగరు జఘనము పులినము గాఁగ
మగువపదములు తామరలాయ
సొగిసి శ్రీ వెంకటేశుఁడు మగఁడుగాఁగ
తగిలినవలుపే తలపోఁతలాయ

రేకు: 0161-3 కన్నడగౌళ సంపుటం: 07-359

పల్లవి: ఏమయ్యా నీవెరఁగవా యింతిగుణమెల్లాను
కామించి నీదేవులాయఁ గడమలు గలవా

చ. 1: సతులెంతైనా దీమసమే చూపుదురుగాక
తతిఁ దమవాసి వన్నె దప్పఁగలరా
పతి యెట్టు నడపినాఁ బరిణామింతురుగాక
బతిమాలి సవతుల పంగెనకుఁ జొత్తురా

చ. 2: నెట్టున దొరతనమే నెరపఁ జూతురుగాక
గుట్టువిడువ నేర్తురా గుణవతులు
దట్టుపుమానముతోనే తగురై వుందురుగాక
తొట్టి సిగ్గులు విడుతురా యెప్పుడును

చ. 3: వెలలేని పంతముల విఱ్ఱవీఁగుదురు గాక
అలసి లోఁగుదురా అందరిలోన
యెలమి శ్రీవెంకటేశ యీకెనిట్టె యేలితివి
బలిమి మానుదురా నిబ్బరమైన రతిని

రేకు: 0161-4 భైరవి సంపుటం: 07-360

పల్లవి: ఇంత సేసినవాఁడవు యిదె నీవె కదవయ్యా
వింతలుగా సారెసారె విఱ్ఱవీఁగీఁ దాను

చ. 1: పొలఁతి గుబ్బలమీఁది పొగడ పువ్వుల దండ
చెలఁగి యాపెకు నీవిచ్చితివి వోయి
చెలులతోఁ జెప్పుతాను చెంగటి సవతులకు
పలుమారుఁ జూపి యెమ్మె పచరించీఁ దాను

చ. 2: పెదవిపై గానవచ్చే పెద్దకప్పురపు లప్ప
అదన నీవంపితివా ఆపెకు నేఁడు
వుదుటునఁ జవిగొంటా వొద్దనుండే యింతులను
యెదుట నోరూరించి యెలయించీఁ దాను

చ. 3: అందపుఁ జెక్కులమీఁదనంటి బేంట్లు రాలీ
గందము వూసితివా కాంతకు నీవు
ముందె నన్నుఁగూడితివి మోహాన శ్రీ వేంకటేశ
చిందినరజములెల్లా చేతనెత్తీఁ దాను

రేకు: 0161-5 కాంబోది సంపుటం: 07-361

పల్లవి: ఏమి సేతుఁ జెప్పవయ్యా యెందుకొౌదును
వేమరు నామొగమాట విడువఁగఁ గలనా

చ. 1: చెక్కులు నొక్కితివంటా చేరి వేఁడుకొంటివంటా
పక్కన నీసతులకుఁ బంతమిత్తురా
మిక్కిలి వలపునాది మీఁద మదనుఁడు పోది
వొక్కమారు నిన్నుఁబాసి వోరువఁగఁ గలనా

చ. 2: కమ్మటి నవ్వితివంటా కన్ను గిరిపతివంటా
దొమ్మికాంతలతోడఁబొత్తు గలతురా
నమ్మితి నేనీబాస నాదే మదినడియాస
యెమ్మెలకైనా నీతో యెదురాడఁగలనా

చ. 3: సరసమాడితివంటా చనవులిచ్చితివంటా
సరివారికి మొక్కి వంచనసేతురా
గరిమ శ్రీవేంకటేశ కాఁగిలి నన్నింతసేసె
అరసి నన్నేలితివి అవుఁగాదనఁగలనా

రేకు: 0161-6 శంకరాభరణం సంపుటం: 07-362

పల్లవి: ఆడఁగల మాటగాఁగానాడితిఁగాక
పాడిపంతాలిందులోన పచారించనేఁటికే

చ. 1: మనసునఁ గలితేనే మాటలాడనింపు పుట్ట
చనవులు సతమైతే సంతోసమౌను
పెనఁగఁగఁ జోటిచ్చితే ప్రియములు గడునిండు
ఘనుఁడు తానేమన్నాఁ గాదనేనటవే

చ. 2: ఆసగలిగినచోట అన్నిటాఁ గొసరఁదగు
వేసట లేనిపొందు వెగటుగాదు
వాసితోడిమెలఁకువ వలపు దానె పుట్టించు
సేసవెట్టేఁ దనమాట చెల్లెనని యనవే

చ. 3: పరగ నవ్వు నవ్వితే పనులెల్లాఁ జేకూరు
తరితీపులైతేనే తమిరేఁగును
యిరవై శ్రీవేంకటేశుఁడింతలోనే నన్నునేలె
సరసమెంతాడినాను సమ్మతి నాకనవే

రేకు: 0162-1 సామంతం సంపుటం: 07-363

పల్లవి: పిలిచీ రాఁగదవే ప్రియుఁడు నిన్ను
బలిమి సేసినంతనే పనులెల్లా దక్కునా

చ. 1: కలసి మెలసి వుంటే కాపురమీడేరుఁ గాక
పెలుచుఁదనాననుంటే ప్రేమ వుట్టునా
నెలఁతకు మగనితో నేస్తమే మంచిదిగాక
అలుకలు నెరపితే నట్టే విసుగరా

చ. 2: మాటలు సారెనాడఁగా మనసులెనయుఁగాక
జూటుఁదనాన నుండితే సొంపు గల్గునా
మేటిజవ్వనపువారు మేలుమీఁదివారుగాక
బూటకము చూపితేను పొందులు వొసఁగునా

చ. 3: సరసములాడఁగానే చవులు గానిపించుఁగాక
యెరపరికములైతే యెబ్బిడి గాదా
సిరుల నిన్నేలె నేఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
మరిగి పాయకుండితే మచ్చికలు రేఁగవా

రేకు: 0162-2 ముఖారి సంపుటం: 07-364

పల్లవి: గద్దించి నేఁడు కొత్తలు గడించెఁ గాక
వొద్దికై మందెమేళాననుండమా తొల్లి

చ. 1: వొంటి నేఁజెనకితే వొరపులు వట్టీని
నంటునఁ దాను నేను నవ్వమా తొల్లి
వెంటవెంట నెరసులు వెదకీనప్పటివచ్చి
అంటి ముట్టి సరసములాడమా తొల్లి

చ. 2: కందువ నాచన్నులు దాఁకఁగా దప్పక చూచీని
అంది కమలాల వేట్లాడమా తొల్లి
ముందు నాయెంగిలిమోవి మోవ మాటాడితినని
విందుపొత్తులు గలసి వెలయమా తొల్లి

చ. 3: బీరమునఁ దనతోడఁ బెనఁగితినని యాడీ
కూరిమితోఁ గాఁగలించుకొనమా తొల్లి
యీరీతి శ్రీ వేంకటేశుఁడిన్నిటా నన్నేలినాఁడు
చేరి చుట్టురికాలెల్లాఁ జేయమా తొల్లి

రేకు: 0161-3 పాడి సంపుటం: 07-365

పల్లవి: ఎప్పుడూఁ దగులాయమె యెంతైనాఁ బోదు
తప్పదు నాయకుఁడిందు తానే వచ్చీని

చ. 1: పట్టి పెనఁగితేనేమి పంతములాడితేనేమి
గట్టిగా మేనరికము గలవారికి
వొట్టు వెట్టితేనేమి వొరసి పైకొంటేనేమి
చుట్టురికమియ్యకొన్న సులభపువారికి

చ. 2: తప్పక చూచితేనేమి తలవంచుకొంటేనేమి
అప్పసము వలచిన యట్టివారికి
కొప్పువట్టితేనేమి కొనగోరూఁదితేనేమి
వొప్పుగ సరసమాడే వొద్దికైనవారికి

చ. 3: చేసన్న చేసితేనేమి సిగ్గులువడితేనేమి
యీసులేక మెలఁగేటి యింటివారికి
వేసరక యీతఁడె శ్రీ వేంకటేశుఁడు నన్నేలె
పాసివుండరాదు నేరుపరులైనవారికి

రేకు: 0162-4 కేదారగౌళ సంపుటం: 07-366

పల్లవి: తెలిసితి నిపుడు నీతెరఁగెల్లాను
నిలుకడతో నన్నునిట్టె మన్నించవయ్యా

చ. 1: మనసొక్కచోఁ బెట్టి మాటలాడఁబోతేను
పెనఁగులు వడుఁగాని బెంబడిరాదు
ననుచనిచోటను నంటుసేయఁ దలఁచితే
అనుమానమె కాని అమరికరాదు

చ. 2: చేతులొకతెపైఁ జాఁచి సెలవుల నవ్వితేను
కాతరమై తోఁచుఁగాని కాంక్షదీరదు
యేతరితనాలకు యెన్నియిూవులిచ్చినాను
నీతులెన్నుదురు గాని నిజమని నమ్మరు

చ. 3: దిక్కులాలించుకొంటా బత్తితోఁ గాఁగిలించితేను
తక్కులందురుగాని తగులనరు
యిక్కడ శ్రీ వేంకటేశ యేలితివి నన్నునేఁడు
మక్కువలు నిండుఁగాని మరివేరుగాదు

రేకు: 0162-5 కన్నడగౌళ సంపుటం: 07-367

పల్లవి: ఆతనితోనేల పంతాలాడేవే నీవు
యేతరివాఁడు గుట్టుతోనెడయఁగ నేర్చునా

చ. 1: సరమాడినవాఁడుసంగడిఁ గూచుండుఁగాక
పరగ వట్టిసిగ్గులు వడునటవే
వరుసతో మాటాడినవాఁడు చెయిచాఁచుఁగాక
శిరసువంచి చింతతో చిక్కువడునా

చ. 2: మొగముచూచినవాఁడు మోహించి పైకొనుఁగాక
బిగిసి వట్టిబీరాలు పెంచునటవే
తగుల వలచువాఁడు తమకమె చూపుఁగాక
అగడైన అడియాస లణఁచఁగఁ గలఁడా

చ. 3: చేపట్టి కూడినవాఁడు చేరిమోవియిచ్చుఁగాక
చాపలాన రతులకు జడియునటే
యేపున శ్రీ వెంకటేశుఁడిట్టె నిన్నుఁగూడె నేఁడు
కాఁపురములీడేరె గరిసించనోపునా

రేకు: 0162-6 రీతిగౌళ సంపుటం: 07-368

పల్లవి: ఏల సిగ్గులు వడేవు యిందరిలోన
పాలిండ్లు చూపి నాపె బాఁతిపడివున్నది

చ. 1: దీకొని మోమైనాను దిట్టించి చూడరాదా
నీకు మొక్కినాపె యిట్టె నిలుచున్నది
మైకొని వూరకే మంచిమాటైనానాడరాదా
ఆకుమడిచిచ్చినాపె ఆసపడియున్నది

చ. 2: ఆనుకొని పరిణామమైన నడుగరాదా
కానుకలిచ్చినయాపె కాచుకున్నది
నానఁబెట్టి సెలవుల నవ్వైనా నవ్వఁగరాదా
పూని సన్నసేసినాపె పొలయుచున్నది

చ. 3: కొంగువట్టి రతులకు గురుతు చెప్పఁగరాదా
వుంగరమువట్టినాపె వొద్దనున్నది
చెంగట శ్రీ వెంకటేశ చేరి నన్నుఁ గూడితివి
యింగిత మెరిఁగినాపె యెదుటనే వున్నది

రేకు: 0163-1 బౌళిరామక్రియ సంపుటం: 07-369

పల్లవి: చిత్తగించవయ్యా యీపె చెలువములు
కొత్తలుగా మోవి చిగురు చెంగలించెను

చ. 1: జలజ లోచన నిండు జవ్వన వనములోన
మొలక నవ్వు వెన్నెల మోసులెత్తెను
వలరాజనెడి తోఁటవాఁడు పోదిసేయఁగాను
పులక జాజిననలు పూవక పూచెను

చ. 2: కాంతనెరిఁగురుల చీకటి పొదరింటిలోన
వింత తుమ్మిదగూండ్లు విరివాయను
చెంత గాలియనే తపసి నెలవైయుండఁగాను
అంతటా నానందకళాలాని నిండుకొనెను

చ. 3: సతి వలపుల పెద్ద జలజాకరములోన
తతిఁ గన్నుల మీలు చందములాయను
అతివ యలమేల్మంగ యాకె శ్రీ వెంకటేశ్వర
రతిఁగూడ మోహనమరందములు గురిసె

రేకు: 0163-2 మధ్యమావతి సంపుటం: 07-370

పల్లవి: చెలులెల్లాఁ జూచిసంతోసించి మెచ్చి పొగడేరు
కలిగె నీకు మేలము కలకాలము

చ. 1: చెలియ నీవద్దనుండి సెలవి నవ్విన నవ్వు
వెలలేని వలపుల వెన్నెలపువ్వు
అలవోక నీమీఁదనంట జూచినచూపు
తలకొన్న జవ్వనమదము తరితీపు

చ. 2: పొంచి నీదేవులు నీతోఁ బూఁచి యాడినపలుకు
వంచి తీసిన మరువాఁడిచిలుకు
అంచి నీయెదుటఁ బచరించిన సింగారము
పంచలఁ బదారువన్నె బంగారము

చ. 3: వనిత నీతోఁబెనఁగి వలలఁబెట్టిన యాస
మునుకొన్న తమితోడి ముత్తేల సేస
చనవిచ్చి శ్రీవెంకటేశ్వర యీకెనేలితివి
చెనకురతిమెండు చెరకునఁ బండు

రేకు: 0163-3 భైరవి సంపుటం: 07-371

పల్లవి: నేనే వింతగాని నీ చుట్టాలవేయివి
కానుకగా నేఁదెచ్చితే కడు వెంగమనేవు

చ. 1: కప్పురము నేనిచ్చితే కసరుదురా
దప్పికి నెవ్వతో నీకు దాఁచినది
తెప్పిర సురటి వీచితే జంకింతురా
వొప్పుగా నాపేరూపు వొనర వ్రాసినది

చ. 2: పానుపు వరచితే సిగ్గువడుదురా యిందాఁక
నీనెలఁత యెవ్వతో నిద్రించినది
వూని గందమిచ్చితే వొల్లనందురా
మేననాకె వూనుకొని మిగిలినది

చ. 3: సారెఁ బువ్వుల వేసితే సాదింతురా
కూరిమి నీ సతి పెద్ద కొప్పులోనివి
చేరి నన్నుఁ గూడితివి శ్రీ వేంకటేశ్వర
వారిదాననే నేను వచ్చి పెండ్లాడితిని

రేకు: 0163-4 శ్రీరాగం సంపుటం: 07-372

పల్లవి: వెలఁది సింగారము వింత వింత బాగులాయ
చెలువపు విభుఁడవు చిత్తగించవయ్యా

చ. 1: తేఁటులు పువ్వులుండిన చోటికి వచ్చుఁగాక
తేఁటులలోఁ బువ్వులెట్టు తిరమాయను
గాఁటపు చందురురాక కలువలు గోరుఁగాక
వాఁటమై చంద్రునిలోఁ గల్వలు తావుకొనునా

చ. 2: చివ్వనను సంపెంగ చిగురుపై బూచుఁగాక
పువ్వుకొనఁ జిగురు దాపుగనుండునా
పువ్విళ్ళూరఁ గొండలపై నుండుఁగాక సింహము
కొవ్వు మీరి సింహము కొండలుదామోచునా

చ. 3: అల మరుతేరిపైనంపపోదులుండుఁ గాక
అలరులు పొదులు తేరునఁ గలవా
బలిమి నీలానకు బంగారు గమ్యోఁగాక
నెలవై శ్రీ వేంకటేశ నీలము గమ్యోనా

రేకు: 0163-5 శంకరాభరణం సంపుటం: 07-373

పల్లవి: గుట్టు చేసుకొని పతిఁ గూడి మాడి యుండరాదా
చుట్టిచుట్టి యిప్పుడెంత చొప్పులెత్తేవే

చ. 1: మొగలి రేకులు వంగి ముంగురుల జారెనంటా
యెగసక్కేలాతని నీవేలాడేవే
నగుతా నీతోడనానలు సారెఁ బెట్టుకోఁగా
సొగిసి మచ్చములేల చూపవచ్చేవే

చ. 2: కడు నోసలికస్తూరి కరఁగి మోవంటెనంటా
జడిసి యీతనివేల సాదించేవే
పడఁతుల సాకిరులు పలుమారుఁ దెలుపుకోఁగా
వెడవెడగానేల వెంగేలాడేవే

చ. 3: చెమట రేఁగి రెంటెము చిప్పిలఁ దడిసెనంటా
జమళి శ్రీ వేంకటేశు జంకించనేలే
తమితోఁ గాఁగిటఁగూడి తానె వచ్చివేఁడుకోఁగా
నెమకుచు నిట్టె యింత నీటులు చూపేవే

రేకు: 0163-6 కేదారగౌళ సంపుటం: 07-374

పల్లవి: చిత్తగించు నీవీకెకు సింగారము
బత్తిసేసెనాపె నీకుఁ బాయనిసింగారము

చ. 1: చెలియ మోమునకును చిరునవ్వు సింగారము
చిలుకుఁ జూపు కన్నుల సింగారము
కలితంపుఁజెక్కులకు కళలు సింగారము
లలిమీర నొసలి కలకలు సింగారము

చ. 2: ఉన్నతపు చన్నులకు నొరపు సింగారము
చిన్నినడిమికి నారు సింగారము
అన్నువ చేతులకు నొయ్యారి గోళ్ళే సింగారము
తిన్ననిమెడకు సోగతీరు సింగారము

చ. 3: నవకపుఁబాదాలకు నడపు సింగారము
చివురుమోవికి మించు సింగారము
తివిరి శ్రీ వేంకటేశ తెరవఁగూడితి విట్టే
సవరనిమేనికందచందమే సింగారము

రేకు: 0164-1 సౌరాష్ట్రం సంపుటం: 07-375

పల్లవి: ఔనో కాదో యీతగవులడుగవే రమణుని
కానుకలెంత యిచ్చినా కంటకమై వుండును

చ. 1: మనసురానిసతి మంచిమాటలాడినాను
విని విని పతికది వెంగెమై తోఁచు
ననుపు లేనియాకె నవ్వులెన్ని నవ్వినాను
కినిసి యాతనికి కేరడమై వుండును

చ. 2: ఎరవెరవైనయాకె యిచ్చకము సేసినాను
విరసానాతనికి వెగటై తోఁచు
పొరపొచ్చెమైనయాకె పొదుగఁగ వచ్చితేను
గరిమ నాతనికిని కదిమినట్లుండును

చ. 3: వెగటైనయాపె యెంత వేడుకలు చూపినాను
యెగసక్కెపువానికి యెగ్గులైవుండు
తగు శ్రీ వేంకటేశుఁడు తానె వచ్చి నన్నుఁ గూడె
మగఁడైన యాతనికి మర్మము గరఁగును

రేకు: 0164-2 దేసాళం సంపుటం: 07-376

పల్లవి: అదేల నవ్వేవంటానడిగేవప్పటి నన్ను
సుదతులలో నిన్నుఁ జూచి నవ్వురాదా

చ. 1: ఇంటింటికేఁగి వచ్చి యిందరు నీవారంటా
నంటు చూపి మాటాడఁగా నవ్వురాదా
దంటయైన చెమటలచేఁ దడిసిన పచ్చడము
అంటించి చేతికియ్యఁగానందుకు నవ్వురాదా

చ. 2: వెలఁదుల పొత్తులను విందులారగించి వచ్చి
నలిఁ జవులు చెప్పఁగా నవ్వురాదా
కొలువుకాంతలిచ్చిన గొప్ప నిమ్మపండ్లెల్లా
లలి నీచేనుండఁగా మెల్లనె నవ్వురాదా

చ. 3: పడఁతులకుఁ గప్పురబాగాలు నీవు వెట్టఁగా
నడుమ నుండిన నాకు నవ్వురాదా
యెడయక శ్రీ వెంకటేశ నన్ననేలితివి
కడమలేని రతులకింకా నవ్వురాదా

రేకు: 0164-3 శ్రీరాగం సంపుటం: 07-377

పల్లవి: ఇందుకుపాయము నీవు యెటుసేసేవో
యిందరిలోపల నిన్ను నేమీననకున్నది

చ. 1: అక్కడిబాగాలు దెచ్చి అతివకు నియ్యఁగాను
పక్కననొల్లననదు పట్టదు చేత
మొక్కలపుటల్క గొంత మొకదాకిరి గొంత
నిక్కముగా నీకుఁజూపి నివ్వెరగందినది

చ. 2: ఊరివారి చిల్కదెచ్చి వొడిలో నీవు వెట్టఁగా
నేరుపదు మాటలు దాని విడువదు
ఆరితేరిన సిగ్గుగొంత ఆసపాటు మరికొంత
కూరిమి లోలోఁదలఁచి గుట్టుతోడనున్నది

చ. 3: సవతుల కానికలుసంగడి నీవిడఁగాను
తివిరి కోపగించదు దిష్టించదు
యివల శ్రీ వేంకటేశ యింపుగొంత తెంపుగొంత
కవగూడి అన్నిటాను కైవసమయినది

రేకు: 0164-4 హిజ్జిజి సంపుటం: 07-378

పల్లవి: మంకు గొల్లవారైతేనే మానము లేదా
బింకమున నాతోనెంత పెనఁగులాడేవు

చ. 1: కాఁపురము సేసేదానిఁ గలువ పువ్వుల వేసి
రాఁపుసేసి మమ్మునేల రచ్చఁబెట్టేవు
పూఁపచన్నులు పయ్యదఁ బొదిగి దాఁచుకుండఁగా
చూపుమని మమ్మునెంత సోదించేవు

చ. 2: సిగ్గుతోడన్నదానిఁ జేతులు వట్టి తీసి
కగ్గుదేర నెంత నవ్వి కాకుసేసేవు
వొగ్గి తేనెమోవి చేతనూరకే మూసుకుండఁగా
వెగ్గళించి యెంగిలి గావించనేల వచ్చేవు

చ. 3: పానుపుపై నున్నదానిపక్కఁ బండి కౌఁగిలించి
మేను ముట్టి నన్నునెట్టు మేర మీరేవు
పూని శ్రీ వెంకటేశుఁడ పొంచి తెరలోనుండఁగా
ఆనవెట్టి రతినెంత అలయించేవు

రేకు: 0164-5 పాడి సంపుటం: 07-379

పల్లవి: విచ్చేయరాదా వెలఁదిఁ జూతువుగాని
హెచ్చిన తమకముతో నింటిలోననున్నది

చ. 1: తలఁచిన తలఁపులు తరుణియురముసను
మొలచెను మొలకలై మొగిఁ జన్నులు
వలచిన వలపులు వడియుచుఁ జెక్కులను
జలజలఁ జెమటలై జడివట్టెనిదివో

చ. 2: కోరిన కోరికలెల్లాఁ గొనసాగి శిరసున
పేరడిగాఁ బెరిగెను పెనుఁదురుమై
నేరిచిన నేరుపులు నిండా మోవితేనెయై నో
రూరఁజొచ్చె నీ సతికి నొద్దికతో నిదివో

చ. 3: ననిచిన ననుపులు నాతిని నీవు గూడఁగ
గొనకొని గోరితాకుల లతలై
అనిశము శ్రీ వేంకటాధిప యీరీతినే
దినదినమును మాకు దిష్టమాయనిదివో

రేకు: 0164-6 దేశి సంపుటం: 07-380

పల్లవి: కొమ్మ కడకు విచ్చేసి కోరినవరమీరాదా
యెమ్మెల మానసతపమీకె చేసీని

చ. 1: వెన్నెలయెండలలోన విరహతాపానఁ జెలి
పన్ని మిక్కుటమైన తపము చేసీని
చెన్నుమీరఁ బరచిన చిగురుఁగత్తులమీఁద
యెన్నరాని వుగ్రతపమిదె చేసీని

చ. 2: మొనసి చెమటఁ దలమునుకల నీటిలోన
పనివడి నీకుఁ దపము చేసీని
ఘనమైన నిట్టూరుపు గాలి లోనఁ జెలించక
యెనలేని ఘోరతపమిదె చేసీని

చ. 3: బాయిటనె తనమేని పచ్చిజవ్వనవనాన
పాయక నీరతికిఁ దపము చేసీని
నీయింట శ్రీ వెంకటేశ నిన్నుఁగూడెలమేల్మంగ
యీయెడ మోహనతపమిదె చేసీని

రేకు: 0165-1 భైరవి సంపుటం: 07-381

పల్లవి: చేతలు నీవిచూచి సిగ్గయ్యీ మాకు
కాతరమింకానెంతే కతకారి నీకు

చ. 1: నీడనుండె యలసేవు నిన్ను నీవె సొలసేవు
చేడెరో నీమగఁడు చూచీనంటాను
పాడిపాడి చొక్కేవు పలుమారు నిక్కేవు
యేడ నేరుచుకొంటివే యెమ్మెలాఁడి నీవు

చ. 2: వేసాలకే మురిసేవు వెస ముద్దుగురిసేవు
పోసరించి యాతఁడు పొగడీనంటా
ఆసలు గడు రేఁచేవు అట్టె సిగ్గులు దాఁచేవు
మాసుద్దులు వినరాదా మాయదారి నీవు

చ. 3: బొమ్మనె జంకించేవు పొందులనె లంకించేవు
కమ్మి శ్రీ వేంకటేశుఁడు కైకొనీనంటా
నెమ్మది నన్నేలినాఁడు నేనలమేల్‌మంగను
సమ్మతించ నేరుతువే సటకారి నీవు

రేకు: 0165-2 బౌళిరామక్రియ సంపుటం: 07-382

పల్లవి: ఆతఁడేమనునో యని అనుమానించఁగనేల
చేతికిఁ గానుకియ్యవే చెప్పీఁ దానె సుద్దులు

చ. 1: వలవనేర్చినవాఁడు వట్టిజాలిఁ బెట్టఁడు
పలుకనేర్చినవాఁడు బాసదప్పఁడు
కలయనేర్చినవాఁడు గర్వములు చూపఁడు
పిలువవే యతని నాప్రేమ తానె యెరుఁగును

చ. 2: మనసెరిఁగినవాఁడు మరి జవదాఁటఁడు
తనవాఁడైనవాఁడు వింతలు సేయఁడు
ననుపు గలుగువాఁడు నవ్వినానెగ్గుపట్టఁడు
వినయానఁ దోడితేవే విభుఁడన్నీ నెరుఁగు

చ. 3: ఆసలుగలవాఁడు అట్టె జోలిసేయఁడు
వాసిగలవాఁడు తనవారిఁ బాయఁడు
సేసవెట్టెఁ దానె వచ్చి శ్రీ వేంకటేశుఁడు గూడె
రాసికెక్కె దినమును రప్పించవే ఆతని

రేకు:	0165-3 కాంబోది సంపుటం:	07-383

పల్లవి: ఏమి సేసితిమి నిన్ను యేల తడవేవు మమ్ము
మోము చూచితే నీకు మొక్కరాదా యేమి

చ. 1: మచ్చరాన వెంగెముగా మాటలాడరాదు గాక
యిచ్చకములాడితేను యెగ్గాయేమి
కొచ్చి మూతులుగిరిపి గుంపించవద్దుగాక
మెచ్చి తలవూబితేను మేలుగాదా యేమి

చ. 2: చేరి నీపైఁ దప్పువేసి చేయిచాఁచరాదు గాక
కోరి పాదాలొత్తితేను కోపమా యేమి
బీరముతోనొడివట్టి పెనఁగఁగ వద్దుగాక
కూరిమిఁ గొంగువట్టితే కొరతా యేమి

చ. 3: సరి నీకు మనసు దాఁచఁగరాదు గాక
తెరవేసి కూడితేను దిగ్గుడా యేమి
యిరవై శ్రీ వేంకటేశ యేలితివి నన్నునిటె
విరులవేసి నవ్వితే వెగటా యేమి

రేకు: 0165-4 పాడి సంపుటం: 07-384

పల్లవి: ఆపె చేసిన చేఁతకు అమరునా నీమేలు
మోపులు గట్టేవు యింతి మునుకొన్న సుద్దులు

చ. 1: చుట్టుపు వరుసనాకె సుద్దులెల్లా నిన్నడిగి
అట్టె కప్పురము మోవి అంది యిచ్చెను
ముట్టి పయ్యెదకొంగు నీముంజేతఁ జుట్టుకొని
బట్టబయలీఁదించేవు పడఁతి చన్నులను

చ. 2: మంచితనముననె మచ్చికలు నీకుఁ జూపి
అంచగమన బాగాలు అంది యిచ్చెను
ముంచిన వేడుకతో మునివేళ్ళ శిరసెత్తి
అంచలఁ దేలించేవు అంగనచూపులను

చ. 3: ఒడఁబాటుతోఁ గూడి నిన్నొరసినలమేల్మంగ
అడియాలమగు సొమ్ములంది యిచ్చెను
తొడఁదొడ మోయ కాలుదొక్కి శ్రీవెంకటేశ
పడియించేవు చెమట వనితదేహమున

రేకు: 0165-5 సామంతం సంపుటం: 07-385

పల్లవి: పుట్టిన మాటలివి భూమిలోనను
దట్టుపు సిగ్గులతోడ తానేల నవ్వీనే

చ. 1: తుమ్మిదలు బెదరెను దొండపండు గంటివడె
కొమ్మలాల చూడరే యీకొత్తలు నేఁడు
యిమ్ముల నీసోద్యములిందరమునాడుకొంటే
తమ్మికంటి యిందుకుఁగా తానేల నవ్వీనే

చ. 2: జల్లన ముత్యాలు రాలె చందురుఁడుదయమాయ
యిల్లదివో వినరె వోయింతులాల
చల్లఁగా నేమిదిచూచి సంతోసించుకొంటేను
దల్లాళితనముతోడ తానేల నవ్వీనే

చ. 3: కలువలు చెంగలించె కన్నెజాజులు ననిచె
లలిమీరి వోభామలాల మెచ్చరే
అలమి శ్రీ వెంకటేశుఁడాడనున్నాఁడంటిమింతే
తలపోసి తలపోసి తానేల నవ్వీనే

రేకు: 0165-6 మాళవిగౌళ సంపుటం: 07-386

పల్లవి: ఆనతిమ్మి నాతోను అనుమానము గలితే
నేనిక్కడనుండఁగానో నేమముచూపేవు

చ. 1: ఆసపడి వచ్చివున్న అంగనఁ జేకొనకుంటే
దోసమనే మాట నీవు తొల్లి వినవా
వాసిగల బొమ్మచారివలెనే వూరకుండేవు
బాసిచ్చి వచ్చితివో యేపడఁతికైనాను

చ. 2: చుట్టమై వచ్చినాపెకుఁ జోటియ్యకుండితేను
వట్టి నిష్ఠూరముగాదా వరవాతను
ముట్టుక తపముచేసే మునివలెనె వుండేవు
గుట్టుతోడనుండేనని గుణముగైకొంటివో

చ. 3: గరిమ మొక్క వచ్చిన కాంతఁ గౌఁగిలించకుంటే
యెరవెరవై తోఁచదా యెవ్వరికైనా
దొరవై శ్రీ వేంకటేశ గురునివలెనుండేవు
సరిననేలితివి నాసమ్మతి గావలశో

రేకు: 0166-1 కేదారగౌళ సంపుటం: 07-387

పల్లవి: ఏమోయని యెంచకుమీ యిందరిలోన నీవు
కామించిన జాడసుమ్మీ కలికి యిన్నియును

చ. 1: కొమ్మ నీపయ్యదలోనికుచముల మారు సుమ్మీ
నిమ్మపండ్లెగరవేసీ నీరమణుఁడు
రమ్మని చేతులఁ జూపరాక సుమ్మీ సన్నగాను
తమ్మిపూవులను వేసీ దవ్వులనే తాను

చ. 2: నిద్దరపుమెరుఁగుల నీచెక్కులమారు సుమ్మీ
అద్దముల నీడచూచీనప్పటిఁ దాను
వుద్దండాన నిన్ను గోరఁసూదిన భావము సుమ్మీ
కొద్దిమీరి గేదంగిరేకులనె చిమ్మీని

చ. 3: మలసి నిన్నుఁ గూడిన మారు సుమ్మీ నీవంపిన
చెలికత్తెఁ గాఁగిలించె సిగ్గుదేరను
కలసెను నిన్ను శ్రీ వెంకటేశుఁడీడకు వచ్చి
అలయించలేక సుమ్మీ ఆయములంటీని

రేకు: 0166-2 సౌరాష్ట్రం సంపుటం: 07-388

పల్లవి: పడఁతి చందములు నీభాగ్యమాయను
యెడయకాపెకు నిట్టె యేకచిత్తమాయను

చ. 1: కొలువులోఁ గొప్పువీడి కొమ్మ చక్కఁబెట్టుకోఁగా
వలుద చన్నులు గానవచ్చెనదివో
చెలఁగి రెంటికిఁగాను సిగ్గువడి యెంతలోనే
బలిమి నీ పచ్చడము పైఁగప్పుకొనెను

చ. 2: కాంత మేను చెమరించి కట్టుఁజీర తొప్పఁదోఁగి
వింతగాఁ దొడలకాంతి వెలిఁబడెను
చెంతనేమీననరాక శిరసు వంచుకొని
మంతనాన నీ మలఁగుమాటునఁ గూచుండెను

చ. 3: అలమేల్‌మంగ పులకలంగమున నుబ్బఁగాను
బలిమిఁ గుచ్చల జారి పచ్చిదేరెను
అలరి అందుకు నిందుకొఁగాదనఁగ రాక
నెలవై శ్రీ వేంకటేశ నిన్నుఁ గాఁగిలించెను

రేకు: 0166-3 దేసాళం సంపుటం: 07-389

పల్లవి: ఏమి నీకు తమకమో యెరఁగ నేను
వాములాయ పులకలు వట్రువ నాచన్నుల

చ. 1: చేరి యాల పట్టేవు నాచేఁకట
యేరా యెంతలేదు నీయేఁకట
ఆరజము సేయకు మమ్మందరిలోన
చేరెఁడేసీ కురిసె నీచెమట నామేన

చ. 2: సూటిగానేమి చూచేవు చొక్కపుమోవి
తేటగానందునున్నది తియ్యనితావి
యేఁటికి రేఁచేవు సారెనిటె నాసిగ్గు
గాఁటపు నానగవులె కప్పురపు ముగ్గు

చ. 3: కందువమేలిదివో నాకాఁగిట
విందు నీసుద్దులెల్లా భావించి లోఁగిట
చెంది నీచింతలో శ్రీ వెంకటేశ
సందడినొండొంటితో చన్నులు రాశె

రేకు: 0166-4 నాదరామక్రియ సంపుటం: 07-390

పల్లవి: మన్నించి నన్నేలుకోర మచ్చిక తోడ
యిన్నిటా జాణఁడవు నన్నిట్టె యీడ

చ. 1: మక్కువతో నీకుఁగొంటి మరులు
వెక్కసమై రాలీఁ గొప్పువిరులు
కక్కసించీ మరునంపగరులు
యిక్కువఁ జెయిచాఁచర యివె కుచ గిరులు

చ. 2: పొదలెను మనలోని పొందులు
సదరాన నదరీ నీసందులు
మదమెత్తించీ వీడేల మందులు
పెదవిపై నివె నీకు పెరతేనెవిందులు

చ. 3: ముందరనె మొక్కే నీకు మొక్కులు
అంది నీకు నాకూటమిననె చొక్కులు
ఇందరిలోఁ గూడితివి యిట్టె శ్రీ వెంకటేశ
సందడించీఁ బాదముల సరసపు తొక్కులు

రేకు: 0166-5 శ్రీరాగం సంపుటం: 07-391

పల్లవి: ఏమి గావలెనో నీకు నిదివో ఆపె
ఆముకొని చక్కఁజూడవయ్యా నీవిపుడు

చ. 1: సొలసి సొలసి నిన్నుఁ జూచినల్లాడనుండి
కలువ రేకుల నుండి కన్నులాపె
పిలిచీనప్పటి నిన్నుఁ బేరుకొని సారెసారె
నలిరేఁగి సెలవుల నవ్వులాపె

చ. 2: సందడిలోననె నీకు సన్నలుసేసీఁ దాను
పొందుల నీమేనమామపోలికలాపె
కందువలనుండి పోఁకకాయలను నిన్నువేసి
చిందెడి చెక్కులమీఁదిచెమటలాపె

చ. 3: చిత్తజకేలికినిట్టె చేతులుచాఁచీ నీపై
కొత్త కొత్త మెరుఁగుల గుబ్బలయాపె
యిత్తల శ్రీ వెంకటేశ యేలితివి నన్నునేఁడు
పొత్తుగలసీ నీతో పోరచి యాపె

రేకు: 0165-6 శంకరాభరణం సంపుటం: 07-392

పల్లవి: వెలఁది భావము నీకు విన్నవించితి
యెలమి నాపె వలపులేమి చెప్పేదిఁకను

చ. 1: నిరతముఁ బ్రేమతోడ నీవు చేసిన చేఁతలు
తరుణికినే పొద్దు తలపోఁతలు
సరవి నీవు దీసిన చన్నులపై గీఁతలు
సిరుల జవ్వనపు లచ్చెనవాఁతలు

చ. 2: చతురుఁడ నీవు మున్ను చల్లిన యట్టి శాసలు
అతివకు పాయని అడియాసలు
యితరులెరఁగఁగానె యిచ్చిన నీ బాసలు
తతి సవతులకు సదా గోసనాసలు

చ. 3: వొలిసి నీవాడిన వొడఁబాటు మాటలు
చెలికి వీణలో వాయించే పాటలు
యెలమి శ్రీ వెంకటేశ యీకె నిట్టె కూడితివి
అల మోవి తేనె వూటలమృతపుఁ దేటలు

రేకు: 0167-1 శ్రీరాగం సంపుటం: 07-393

పల్లవి: అంగనకు నీకుఁబొందు అధరామృతపు విందు
అంగవించి సరసములాడ నిదే సందు

చ. 1: మనసులొక్కటులాయ మర్మములొండొంటి రాయ
తనివోని వలపులు తగులుసేయ
ఎనసి మీరున్నవారు యింపులకిదే తీరు
చెనకి మీలో మీకు చెల్లదిఁక దూరు

చ. 2: తలపోఁతలొనఁగూడె దట్టపు సిగ్గులు వీడె
యెలమి మీ కోరికలు యీడుజోడాడె
పులకలు నిండె మేన పొసఁగదు తొల్లిటాన
చెలరేఁగెనిద్దరికిఁ జెమటల సోన

చ. 3: మొగమునఁ గళలెక్కె ముచ్చటలెల్లా దక్కె
సొగసైన రతుల చొక్కులు నిక్కె
నిగిడి శ్రీ వెంకటేశ నెలఁతఁ గూడితివిదె
మొగమోట నీకునీపో ముందరను మొక్కె

రేకు: 0166-2 బౌళిరామక్రియ సంపుటం: 07-394

పల్లవి: ఇంతిరో నీపతిని నీవేమి సేసినానేమాయ
కాంతునివద్దికి రావే కడు సిగ్గులేఁటికి

చ. 1: కూడి వున్నచోటను కుచ్చితము వద్దుగాని
ఆడరానిమాటలన్నీ నాడవచ్చును
వేడుకే కలిగితేను వేసరుకోవద్దుగాని
జాడతోడ బొమ్మలను జంకించవచ్చును

చ. 2: కూరిమిగల పట్టున గుట్టుసేయవద్దుగాని
నారుకొననెంతైనా నవ్వవచ్చును
మేరతోడిపొందులకు మేకు చూపవద్దుగాని
బీరపు సమ రతులఁ బెనఁగఁగ వచ్చును

చ. 3: చనవుగల యెడను చలములు వద్దుగాని
వెనుకొని విరులను వేయవచ్చును
చెనకి నన్నిదె కూడె శ్రీ వెంకటేశుఁడు
పొనుఁగఁగ వద్దుగాని భోగించవచ్చును

రేకు: 0167-3 వరాళి సంపుటం: 07-395

పల్లవి: ఉపకారముచేయుట ఊహించుకోవద్దా
కపటము గలిగితే కాదనుటగాక

చ. 1: చన్నులమీఁదిపయ్యద జారఁదీసీనంటాను
కన్నుల జంకించేవు కాంతుని నీవు
వున్నతపు జక్కవలు వుమ్మడిఁజిక్కివుండఁగాను
యెన్నఁగ బాయిట వేయుటెగ్గా యిది

చ. 2: కొప్పు సంపెంగ పువ్వులు కుమ్మరించెనంటాను
అప్పుడె యాతని దూరేవౌనే నీవు
తప్పకుండా నెరితుమ్మెదలకును జిక్కకుండా
వొప్పుగాఁగ దులుపుట వుచితము గాదా

చ. 3: మునుకొని నీపోకముడి విడిచెనంటాను
యెనసి శ్రీ వెంకటేశునేల తిట్టేవే
ఘనకరికుంభములు కట్టుగాడినుండఁగాను
కని మరఁగు దీయుట కడు నేర్పు గాదా

రేకు: 0167-4 వరాళి సంపుటం: 07-396

పల్లవి: ఆతని చిత్తమెట్టిదో అదెరఁగను
నీతి తోడ నడపితే నెట్టుకొనే నేను

చ. 1: చలపట్టువద్దుగాని చనవిచ్చి మన్నించితే
చెలరేఁగి యెంతైనా సేవచేసేను
అలుగఁగనోపఁగాని ఆసవెట్టి చెనకితే
నలువంకనెంతైనా నవ్వే నేను

చ. 2: కపటము వద్దుగాని కడుఁబొందు సేసితేను
యెపుడైనా తనమాటకియ్యకొనేను
నెపమెంచనోపఁగాని నేరుపున లాలించితే
వుపమలఁ దనచేతకొడఁబడే నేను

చ. 3: మచ్చరము వద్దుగాని మంచితనానఁ గూడితే
మచ్చికఁ దన్నునిట్లా మరిగే నేను
తచ్చనలకోపఁ గాని తగిలి శ్రీవేంకటేశుఁ
డిచ్చట నన్నేలినాఁడు యిరవైతి నేను

రేకు: 0167-5 సామంతం సంపుటం: 07-397

పల్లవి: ఇల్లాలైనదానికి యివి గుణాలా
మెల్లనె గుట్టుతోడనె మెరతురు గాక

చ. 1: కాతరించి సారె సారెఁ గడు సరసమాడేవు
ఆతనికి నీవు దొల్లి ఆలవా యేమి
యేతుల మాటలాడి యిట్టె నవ్వించేవతని
జాతిక ర్తవా నీవు జాణతనాలాడను

చ. 2: సముకాన నీవిట్టే చనవులు నెరుపేవు
తమితోడఁ బోరానిచుట్టుమవా యేమి
చెమటలు గారఁగాను సేవలెల్లాఁ జేసేవు
అమరఁగ నూడిగపు అంగనవా యీడను

చ. 3: పతివద్దనందరికి పనులెల్లాఁ జెప్పేవు
సతతమునదికారిసానివా నీవు
తతి శ్రీ వెంకటేశుఁడు తగ నన్నుఁ గూడె నేఁడు
కతకారిదానవా చక్కటులు చెప్పఁగను

రేకు: 0167-6 ముఖారి సంపుటం: 07-398

పల్లవి: చెప్పుమని యడిగినఁ జెప్పదు మాతోనిదె
చొప్పులు నీకె తెలు సోదించుకోవయ్యా

చ. 1: చిత్తరుపటము చూచి చెలి లోలోఁ దలపూఁచి
చిత్తడిచెమటతోడ సిగ్గువడెను
యిత్తల నీవందులోన నేమి వ్రాసితివో కాని
అత్తి నీవాపనే యింకానడుగవయ్యా

చ. 2: బొమ్మలపెండెము చూచి పొలఁతి యేమీననక
వుమ్మడినే నవ్వునవ్వుచున్నది యిట్టే
చిమ్ములనేమిభావాలు సేయించితివందులోనె
నెమ్మదినందలిమేలు నీవడుగవయ్యా

చ. 3: పట్టినసురటి చూచి పడఁతి శ్రీ వెంకటేశ
గట్టితమకాన నిన్నుఁ గాఁగిలించెను
గుట్టుననందేమి మేకులు గడించితివో
అట్టునిటునా పెతలఁపడుగవయ్యా

రేకు: 0168-1 మాళవిగౌళ సంపుటం: 07-399

పల్లవి: ఇంకనేల వట్టిజోలి యిందులోనే వున్నది
తెంకినే ఆపెకిన్నియుఁ దెలుపఁగరాదా

చ. 1: కన్నుచూపె వాండ్లైతే కడునొడ్డించుకోనేది
వెన్నెలలే వేండ్లైతే విచారమేది
కన్నె నిన్నుఁడుగుమనెఁ గరుణించి యిఁకను మా
విన్నపము వినాడకు విచ్చేయరాదా

చ. 2: నవ్వులే నాములెక్కితే నయమైన మందులేవి
పువ్వులే పోటుకువస్తే బుద్ధులేవి
జవ్వనిట్టె ఆడుమనె సముకమే యిద్దరికి
దవ్వులేల యించుకంత దగ్గరి రారాదా

చ. 3: చల్లగాలి పగలైతే సందిమాటలిఁకనేవి
వల్లెతాడు వలపైతే వద్దనేది
ఇల్లిదె శ్రీ వేంకటేశ యింతి నీకుఁ జెప్పించె
లొల్లిఁ గూడితివిఁకను లోననుండరాదా

రేకు: 0168-2 నాదరామక్రియ సంపుటం: 07-400

పల్లవి: ఇందుకేల వలచితి మింతులము
పందెపు మరు పూబంతులము

చ. 1: మలకలయిన నీమాటలు
యెలయింపులకును యేటలు
పలుమరుఁ బాడేటి పాటలు
తెలిగన్నులకును తేటలు

చ. 2: నడుమంత్రపు నీనగవులు
తడవినవారికి తగవులు
బెడిదపుఁ జూపుల బిగువులు
యెడయనియాసల యెగువదిగువలు

చ. 3: కలయ నీకాఁగిటి కరఁగులు
తెలియఁగలుగు రతితెరఁగులు
కలసితి శ్రీ వేంకటపతి ననునిటు
మలసిన మర్మపు మరఁగులు

రేకు: 0168-3 ఆహిరి సంపుటం: 07-401

పల్లవి: వద్దు చలమింతటను వనితఁ గావఁగరాదా
ముద్దసేసి తమకము మూలఁబెట్టకొనేవా

చ. 1: కోరికలు పెడరేఁచి గుట్టుననున్నాఁడవు
ఆరీతినలయింతురా ఆఁటదానిని
రారాదా యిఁకనైనా రమణిపానుపుపైకి
వూరనిచ్చి విరహము వుట్టిఁగట్టేవా

చ. 2: చెమటపుట్టఁ జెనకి సిగ్గుననున్నాఁడవు
చిమిడింతురా మనసు చెలియకును
జమళినింతిచన్నుల సాములు సేయఁగరాదా
వుమరఁబెట్టి వలపు వొడినించుకొనేవా

చ. 3: కాఁగిలించి కరఁగించి కన్నులు మూసుకొనేవు
దాఁగిలిముచ్చిమేఁటికి తరుణితోను
వీఁగక శ్రీవేంకటేశ వెలఁదిఁ గూడితివిట్టే
మాఁగనిచ్చి మోవితేనె మరిఁ గొసరేవా

రేకు: 0168-4 సాళంగనాట సంపుటం: 07-402

పల్లవి: ఇందులోనె వున్నదిదె యింతి తమకములేల
గొందినే కోరికలెల్లా కొమ్ములేకిగిర్చెను

చ. 1: చెలి నీకడకు రాఁగా చెమటలఁ దొప్పఁదోఁగె
వలపులు వానలేనివరదాయను
ఎలమి నీరాకల కెదురులు చూడఁగాను
వెలయఁగ దీవె లేకే వెలుఁగు గాన్పించెను

చ. 2: వెదకుతానే నిన్నువెలఁది కాఁకలఁ బొందె
యెదుటఁ బొద్దువొడవకెండ గాసెను
ఇదె నీపై యాసలనిట్టె మేను పలకరించె
వెదవెట్టుక ససులు వేవేలు మొలచెను

చ. 3: నీరతికిఁ జేయి చాఁచి నిట్టూర్పుల నిండెఁ జెలి
కోరి యాస గాలిలేక తూరుపెత్తెను
సారె శ్రీ వెంకటేశుఁడ చన్నుల నిన్నునొత్తి
బోరుసఁదా జాళెలేని బొమ్మరాలువేసెను

రేకు: 0168-5 బలహంస సంపుటం: 07-403

పల్లవి: కడుఁ జుట్టుమవు నీవు కావంటినా
యెడయక నన్నునిట్టె యేలుమంటిఁ గాక

చ. 1: చెక్కునొక్కి నీవు నాచేయిమీఁదఁ జేయి వేసి
తక్కక నవ్వులు నవ్వఁగాఁ దగదంటినా
వొక్కతెపైఁ బెట్టి మాట వొక్కొక్కటి తడవఁగా
వక్కణించనంతేసి వద్దంటిఁ గాక

చ. 2: ఏపున నావద్దనుండి యింత కలసి మెలసి
కాఁపురము సేయఁగాను కాదంటినా
చూపి మోపి యాడోవారి సొమ్ములు మేనఁబెట్టుక
రాఁపులుసేయఁగా నందుకోపనంటిఁ గాక

చ. 3: చన్నులురమున రాయ సారెఁ గాఁగలించుకొని
యెన్నిచేఁతలు సేసినానేఁటికంటినా
అన్నిట శ్రీ వేంకటేశ అలమేల్మంగనే నేను
మన్నించి కూడితివిది మాననంటిఁ గాక

రేకు: 0168-6 బౌళిరామక్రియ సంపుటం: 07-404

పల్లవి: ఇందుకే నేఁ జింతించేను యెటువలెనున్నాఁడవో
సందడిపెండ్లిండ్లాయ సరుస నీబతుకు

చ. 1: చెంతలనాపె నీపైఁ జెలు చాఁచఁగాను
వంతుకుఁ జెయి చాఁచితినివ్వల నేనుండి
యింతుల మిద్దరమును యిరువంకలానుండఁగా
సంతకూటమాయను చక్కని నీమేను

చ. 2: ఆకడనాకె నీకు నాకుమడిచియ్యఁగాను
యీాకడ నేనూ నీకునిచ్చితినిట్టే
కైకొని యిద్దరునూడిగము నీకుఁ జేయఁగాను
కాకువడి కలగూరగంపాయ నీనోరు

చ. 3: గక్కన నాపె నిన్నుఁ గాఁగిటఁ గూడఁగాను
వొక్కటై నేనూనట్టే వొనరఁగాను
యిక్కువ శ్రీ వెంకటేశ యెనసి యిద్దరివల్లా
అక్కర నురిపేకళ్ళమాయను నీవురము

రేకు: 0169-1 మధ్యమావతి సంపుటం: 07-405

పల్లవి: మించెనివె సింగారాలు మెలుఁతలాల
పంచబాణు సవరణ పరగినయట్లు

చ. 1: నలినాక్షి కన్నుల నడుమనీనాసికము
చెలఁగి యమరెనె వోచెలులాల
కలువల బొమ్మవిండ్లఁ గంతుఁడేయఁగాఁ జూచి
యెలమి సంపెగపవ్వు యెడచొచ్చినట్లు

చ. 2: ముదిత కుచాంతరముననను యీరోమరాజి
అదివో యంత చూపట్టె నంగనలాల
కదిసి పెట్టలు గుండ్లు కంఠనాళమున మరుఁ
డెదిగించఁ బొగబాణమెడచొచ్చినట్లు

చ. 3: శ్రీసతి పిరుఁదుచెంత శ్రీ వెంకటేశునురము
ఆసరినెట్టుండెనో అంగనలాల
రాసి మధ్యరంగానఁ జక్రాలు మరుఁడొనరింప
యీసుదీర హరిగె దానెడచొచ్చినట్లు

రేకు: 0169-2 దేసాళం సంపుటం: 07-406

పల్లవి: అంగన చెలువు చూడవయ్యా నీవు
సంగడి సింగారాలు సతమై నిలిచెను

చ. 1: వెంటనె చంద్రుఁడు గడు వెన్నెల గాయఁగాను
వొంటిఁ జీఁకటి వెనకకొదిగినట్లు
నంటున నేఁడీచెలియ నవ్వుమోముతోనుండఁగ
అంటి వీఁపునఁ దురుము అందమై నిలిచెను

చ. 2: చెలరేఁగి సింహము చేరి యెక్కితే భారాన
వెలికిఁ గరికుంభాలు వీఁగినయట్లు
మెలుఁత సన్నపు నడిమితోఁ జెలఁగఁగాను
బలిమిఁ బిరుఁదు కిందుపడి తా నిలిచెను

చ. 3: కోవిల వేడుకఁ జవిగొనఁగా లేఁతచిగురు
శ్రీ వెంకటేశ్వర చిల్లులైనట్లు
నీవింతిఁ గూడఁగా నాపె నేరుపుల మాటలతో
వావాత మోవి కెంపులు వరుసలై నిలిచె

రేకు: 0169-3 శ్రీరాగం సంపుటం: 07-407

పల్లవి: చిత్తజు వేఁడుకొనరే చెలియలాల
తత్తరించి పతిమీఁది తలపోఁతనున్నది

చ. 1: అతివవై మదనుఁడు అనలాస్త్రమేయఁబోలు
కతలుగ విరహగ్నిఁ గాఁగీనదే
యితవుగా వరుణాస్త్రమేయఁబోలునప్పటిని
తతిఁ జెమటవానలఁ దడియుచునున్నది

చ. 2: అమరగ నంతలో వాయవ్యాస్త్రమేయఁబోలు
వుమరఁబడి నిట్టూర్పులొగి రేఁగెను
జమళిఁ గూడఁగ నట్టె శైలాస్త్రమేయఁబోలు
భ్రమసి చనుఁగొండలు బాయిటఁ గాన్పించెను

చ. 3: మునుకొని పంతాన సమ్మోనాస్త్రమేయఁబోలు
మనసు పరవశాన మరపందెను
అనిశము రక్షగా నారాయణాస్త్రమేయఁబోలు
ఘన శ్రీవేంకటేశుఁడు కాఁగిటిలోఁ గూడెను

రేకు: 0169-4 కేదారగౌళ సంపుటం: 07-408

పల్లవి: ఇద్దరి భావములును యెంచగ నలవిగావు
వొద్దికలై సింగారాలు వొడ్డినయట్లుండెను

చ. 1: చెలువపు రమణుఁడు చెమట పైఁ జిమ్మితేను
జలజలఁ జెమరించి సకి యెట్లుండె
నెలవై లావణ్య జలధిలో స్వాతి వానచే
బలిసి ముత్యాల పంట పండినట్లుండెను

చ. 2: సరసపు నాయకుఁడు జాజి మొగ్గలు వేసితే
తరుణి మైపులకించి తానెట్టుండెనే
మరిగి పాయపుచేన మన్మథాస్త్రపు మొలక
పారి వసంతుఁడు చల్ల పాదలినట్లుండెను

చ. 3: శ్రీ వెంకటేశ్వరుఁడు చెంది మోవి యిచ్చితేను
యీా వనితమోము కళ యెట్టుండెనే
పోవులై మోహపు నిండుఁబున్న మనమృతముబ్బి
ఆవేళఁ జంద్రకళలానినయట్లుండెను

రేకు: 0169-5 నాదరామక్రియ సంపుటం: 07-409

పల్లవి: ఇంకానేఁటికి జోలి యిదె నీ భాగ్యమాయ
పొంకపు రతుల నిట్టె భోగించవయ్యా

చ. 1: మదిరాక్షి చన్నులనే మందర గిరులు మోప
చెదరని యారనే శేషునిఁ బూఁచి
ముదమున లావణ్య సముద్రము మరుఁడు దచ్చె
అదె అధరామృతము అవధరించవయ్యా

చ. 2: అతివమోముఁజంద్రుఁడనేటి సానబిల్లకు
తతి జడియనేటి సూత్రము చుట్టి
అతనుఁడు చూపులయమ్ములు సానఁబట్టితే
సతమై మోహపుఁబొడి సారె రాలీఁ గోవయ్యా

చ. 3: పడఁతిపిరుఁదనేటి బండికండ్లతోడను
తొడలనే కలహంస నడలఁ గట్టి
యెడయక శ్రీవేంకటేశ నిన్నెక్కించె మరుఁ
డడరి వలపు బండ్లవచ్చె నీకయ్యా

రేకు: 0169-6 సాళంగనాట సంపుటం: 07-410

పల్లవి: రావయ్య చూతువుగాని రమణిలాగు
దైవార నిన్నే మతిని దలఁచినట్టున్నది

చ. 1: వెలఁది నిన్నుఁబాసి విరహగ్నిచేఁ గాఁగి
వొలిసి కేళాకూళిలో నోలలాడఁగా
వలరాజుకరవాలు వసంతుఁడనేటి కమ్మరి
పెలుచుగ వాఁడిపదను పెట్టినయట్టున్నది

చ. 2: సతి నీపై తమకాన చంద్రకాంత శిల మీఁద
ఇతవుగాఁ బవళించి యింపొందఁగా
రతిరాజు నిజ కీర్తి ప్రతిమఁ జంద్రవిధాత
తతి మెరుఁగువెట్టితే తళుకున్నట్టున్నది

చ. 3: ఇంతి నీవు గూడేటప్పుడెడలేని పూదండలు
చెంతలఁ జుట్టుకొనఁగా శ్రీ వేంకటేశ్వరా
కంతుని తోఁట పూఁదీగె గాలియనే దోహళజ్ఞఁ
డంతటఁ బుట్టించఁ జేసినటువలెనున్నది

రేకు: 0170-1 నాదరామక్రియ సంపుటం: 07-411

పల్లవి: చిత్తగించవయ్య యీచెలిని నేఁడు
పొత్తుల వలపులిట్టె పోదిసేసినట్లు

చ. 1: మగువ నీకు మొక్కె మాయింటికి రమ్మని
జిగిఁ దన శిరసుపై జేతులు మోడ్చి
వొగి చంపకనాసికమున్నదని యలులకు
వెగటుగాఁ దామరలు వేగు చెప్పినట్లు

చ. 2: వెలఁది నిన్నుఁ బిలిచె విడెము చేకొనుమని
సెలవుల నవ్వు గండ స్తలులు మోవ
అల తాటంకరవులున్నవని కనుఁగల్వలకు
వెలయ మోముఁజంద్రుఁడు వేగు చెప్పంపినట్లు

చ. 3: కన్నె శ్రీ వెంకటేశుఁడ కాఁగిలించి యేలుమని
చన్నులు బిగ్గెనదిమి సందులంటను
వున్నవి యానమయూరాలొద్దనె పాముసకు
విన్నపముగాఁ గొండలు వేగుచెప్పినట్లు

రేకు: 0170-2 వరాళి సంపుటం: 07-412

పల్లవి: ఆతఁడేమి నీవేమి అవుఁగాములిందులోనేమి
కాతరపుఁ దమకము కలదె యిద్దరికి

చ. 1: మించుఁదేనె పెదవిపై మిరియాలు చల్లుదురా
పంచదార చల్లుదురు పైపైఁగాక
మంచిమాటలాడవే మరి వెంగేలేమిటికే
కంచపుఁబొత్తువలపు కలసెనిద్దరికి

చ. 2: కలువకన్నుచూపుల కాఁకలు చల్లుదురా
చలువవెన్నెలతేట చల్లుటగాక
కలయ సన్నసేయవే కడు జంకించనేఁటికే
కలికి సిగ్గులపొత్తు కలదె యిద్దరికి

చ. 3: పచ్చిగుబ్బలటు చూపి పంతాలు చల్లుదురా
కొచ్చి మెరుఁగులు చల్లఁగూడుఁగాక
ఇచ్చట శ్రీ వెంకటేశునెనసితివి రట్టేల
గచ్చుల వీడేలపొత్తుకలదె యిద్దరికి

రేకు: 0170-3 శ్రీరాగం సంపుటం: 07-413

పల్లవి: చెలులు గనుఁగొనరె యీసింగారము
నిలువెల్ల రతికళలు నిండుకొనుమాడ్కి

చ. 1: అతివపురమున కంఠహరములు కడుఁ బెక్కు
తతిఁ గట్టుకొన్నచందంబమరెను
కతలుగా ముఖచంద్రుఁగని చన్నుజక్కవలు
క్షితిఁ బాయకుండ లంకెలఁ బెనఁచినట్లు

చ. 2: సుదతి నెన్నుదుటఁ గస్తూరినామము వెలయ
చెదరకుండఁగ దీర్చిన భావము
పొదినూర్పుగాలిచప్పుడుకుఁ గనుచకోరాలు
కదలకుండఁగఁ గట్టుకంభమో యనఁగా

చ. 3: నెలఁత శిరసున విరులు నించుకొనె నీ సొబగు
కలిగి శ్రీ వేంకటేశుఁ గదిసి వుండి
కలికి నాసిక చనుపకము తావికి కురుల
అలులు వోకుండ వలలమరించుగతిని

రేకు: 0170-4 పాడి సంపుటం: 07-414

పల్లవి: ఎవ్వరికిఁ దమసొమ్ము లెంత తీపులో
నివ్వటిల్ల మీవంక నెరసె నీసుద్దులు

చ. 1: ఈకడ నింత కంఠపు టెలుఁగుఁ గోవిలలకు
మేకొని చిగురాకులు మేపినయట్లు
ఆకుమడిచి మడిచి అంది నీవియ్యఁగాను
దాకొని చిగురుటడిదము దాఁచె మరుఁడు

చ. 2: నెలకొని యీ వనిత పలుకుఁ జిలుకలకు
యెలమి బింబ ఫలములిచ్చిన యట్లు
పలుమారు నీమోవిపండు చవిచూపుఁగాను
కలపండ్లు గోటరానఁ గప్పెను వసంతుఁడు

చ. 3: కందువతో నీమగువకనుఁజకోరములకు
అంది వెన్నెల విందులానించినట్లు
చెంది శ్రీ వెంకటేశుఁడ చిరునవ్వు నవ్వఁగాను
యెందువెంటఁదిప్పికళ లిదివో చందురుఁడు

రేకు: 0170-5 దేసాళం సంపుటం: 07-415

పల్లవి: అందుమీఁదనాలఁ గాచేవతి మంకుఁ దనము
సందుల వంకలొత్తితే చాయకు వచ్చీనా

చ. 1: వెన్నతోఁ బెట్టిరి నీకు వేడుక కారితనము
చిన్ననాఁడె గొల్లెతలు చెప్పఁగనేల
పన్ని కడమ దొడమ పాలలో నూరి పోసిరి
సన్నల బుద్ధి చెప్పితే చక్కనుండేవా

చ. 2: పెరుగుతోడఁ బొదిగి పెట్టిరి దుష్టుఁదనము
పెరుగఁ బెరుగ నాఁడె ప్రియురాండ్లెల్లా
నిరతిని వలపులు నేతితో లోనికిచ్చిరి
వొరసి నేనేమనినా వోజకు వచ్చేవా

చ. 3: మోవితేనెలోఁ బెట్టిరి మోహపునాలితనము
శ్రీ వెంకటేశ్వర నాఁడె చెలులెల్లాను
కూవలుగా నేరుపులు గుబ్బలలో హత్తించిరి
యీవల నన్నుఁ గూడితి వీక నెడసేవా

రేకు: 0170-6 దేశి సంపుటం: 07-416

పల్లవి: వింతగా నానతీవయ్య వినే నేను
పంతానఁ దాను విన్నపము లెట్టుసేసెను

చ. 1: సెలవుల నవ్వుతాను చెక్కుగోర గీరుతాను
మలసి నీతో నాకె మాఁటలాడెను
వలపులు చల్లుతాను వడిఁగొప్పు దువ్వుతాను
సొలసి మరేమని సుద్దులెల్లాఁ జెప్పెను

చ. 2: సిగ్గులు నెరపుతాను చెమట దుడుచుతాను
దగ్గరక యేమికతలు చెప్పెను
అగ్గలమై మొక్కుతాను ఆయములంటుతాను
తగ్గక యంతవడి తలపోసుకొనెను

చ. 3: సురటి విసరుతాను సొమ్ములు చక్కఁబెట్టుతా
అరసి కౌఁగిటనే ప్రియము చెప్పెను
ఇరవై శ్రీ వెంకటేశ యిట్లు నన్నుఁ గూడితివి
నిరతి నీచుట్టుమేల నిన్నొడఁబరచెను

రేకు: 0171-1 శంకరాభరణం సంపుటం: 07-417

పల్లవి: చెలులాల యీ భావము చెప్పఁగ నలవిగాదు
వలపుల పంటవండి వలసినట్టున్నది

చ. 1: వనితచెక్కుచేతితో వజ్రాలకమ్మ వొరయ
ఎనసి చింతించే భావమెట్లున్నది
ఘన తాప సూర్యుఁడును కమలాబాణమును
తనపై దండెత్తనేకాంతమాడినట్టున్నది

చ. 2: పమ్మిన నిట్టూర్పులు పళ్ళెపుమోవినొరయ
యిమ్ములఁ గందినభావమెట్టున్నది
చిమ్మిరేఁగి చల్లగాలి చిగురుటడిదమును
కొమ్మను సాదించ పొత్తుగూడినట్టున్నది

చ. 3: దిట్టు శ్రీ వెంకటేశురతివేళ కాంతకు
యిట్టె బొమ్మలపైఁ గురులెట్టున్నది
తొట్టి మరువిండ్లును తుమ్మిదలు యీకెతోడి
చుట్టురికానకు వచ్చి జోడైనట్టున్నది

రేకు: 0171-2 పాడి సంపుటం: 07-418

పల్లవి: ఎఱిఁగిన పనులకు యేఁటికి నింక
నెరవాదై మెరసేది నీగుణమే కా

చ. 1: సెలవి నవ్వఁగనేమి చెక్కు నొక్కఁగానేమి
నెలకొని కరఁగేది నీమనసే కా
బలిమి సేయఁగనేమి పైకొని మొక్కఁగనేమి
నిలిచి సత్యమాడేది నీనాలికే కా

చ. 2: బెట్టువెనఁగఁగనేమి ప్రియము చెప్పఁగనేమి
నెట్టుకొని వుండేది నీతనువే కా
యిట్టట్టనఁగానేమి యెదుటనుండఁగనేమి
నిట్టుచూపు చూచేవి నీకన్నులే కా

చ. 3: సమ్మతించఁగా నేమి సంగడికి రాఁగానేమి
నెమ్మది చెవుల వినేది నీ తగవే కా
యిమ్ముల శ్రీ వెంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
నిమ్మలము సేసేది నీకరుణే కా

రేకు: 0171-3 శుద్ధవసంతం సంపుటం: 07-419

పల్లవి: ఇద్దరిభావములును యీడు జోళ్ళాయ నిదె
అడ్డుకొని తులఁదూఁగినట్టి చందమాయను

చ. 1: తళుకున నీ విప్పుడు తరుణిఁ జూచితేను
తొలఁకి చెక్కుఁజెమట దొరుగఁజొచ్చె
లలి మీరి ఆ మెరుపులకు యీ తురుము మేఘ
మలరి వానగురిసినట్టిచందమాయను

చ. 2: చదురుమాఁటల నీవు జలజాక్షిఁ బిలిచితే
పొదిగొని నిలువెల్ల బులకించెను
కదిసి ఆమాఁటలగాలికి యీమ్మైఁదీగె
అదనుగూడ ననిచినట్టిచందమాయను

చ. 3: ననుపై శ్రీ వెంకటేశ నవ్వి నీవు గూడితేను
యెనసి కామినిచిత్తమెల్లఁ గరఁగె
వొనరి ఆవెన్నెలకీమనసనే చంద్రకాంత
మనువుగాఁ గరఁగినయట్టి చందమాయను

రేకు: 0171-4 బౌళిరామక్రియ సంపుటం: 07-420

పల్లవి: ఎటువంటి పందెగాఁడె యితఁడు
అటమటలనే ఆటలన్నీ గెలిచీని

చ. 1: ఆసతో నేఁబగడసాలాడఁగానె పిడికిటి
పాసికలు దీసి తానప్పటి వేసెనే
యీసుతోడ తనపాళి యింటిసారె దాఁకితేను
రాసి యట్టుట్టుండెనంటా బాసచేసీనే

చ. 2: అండనూఁటుకొన్న కాయలట్టె నేఁ బరాకైతే
పండెనంటాఁ బడదొబ్బి పట్టునియ్యఁడే
చండితోడ నాపయ్యెద జార నే వేసిన బారా
వొండొక నెత్తమనుచు వోరచూపీనే

చ. 3: జోడుగూడుకొని వచ్చి సారిది నేఁ దాఁకితేను
జోడు తానంటాఁ గూడి చొక్కించెనే
యీడులేని శ్రీ వెంకటేశుఁడిచ్చకానకోడి
వీడెము పందేనకిచ్చి వేడుకచేసీనే

రేకు: 0171-5 నాదరామక్రియ సంపుటం: 07-421

పల్లవి: ఎదురుబడి కాఁగిళ్ళు యేరులాయ మీవలపు
అదనుఁ బదనుఁగూడి అడుసాయ వలపు

చ. 1: చిక్కని చెమటలను చిప్పిలీని వలపు
చొక్కపుకరఁగులను జొబ్బిలీని వలపు
చక్కని సరసముల జాలువాలీ వలపు
తెక్కుల మచ్చికలచే దిగి వారీ వలపు

చ. 2: జవ్వనముకళల రసములుబ్బీ వలపు
నివ్వటిల్లు కోరికల నీరుకమ్మీ వలపు
రవ్వల తమకముల వువ్విళ్ళూరీ వలపు
చివ్వనఁ దరితీపుల జిడ్డుకట్టీ వలపు

చ. 3: పంతపు రతులనే పాలుగారీ వలపు
బంతి మోవులనె కడుఁ బచ్చిదేరీ వలపు
ఇంతలో శ్రీ వెంకటేశ యెనసి మీరుండఁగాను
దొంతరచుట్టిరికానఁ దొప్పఁదోఁగీ వలపు

రేకు: 0171-6 కేదారగౌళ సంపుటం: 07-422

పల్లవి: కాఁక నీవు రేఁచఁగాను కన్నవారినేల దూరీ
వీఁకపుఁగోరికతోడ విఱ్ఱవీఁగీని

చ. 1: కోమలి నిన్నుఁబాసి కోవిలకూఁతలు విని
వేమరు కోపానవుంట వింట వేసీని
ఆమని చిగురు చూచి అంతలోనే వేసారి
దోమటికొనగోరి కత్తులు చాఁచీని

చ. 2: వెన్నెల తేటలు చూచి విసుగుచు వెళ్ళఁజల్లీ
కిన్నెరకాయల ముంచి కిమ్ములకును
తిన్నని మేఘము చూచి తిట్టుచు నీరెల్లఁగార
సన్నపుటల్లికామల చాఁచి పిలిచీని

చ. 3: తుమ్మెద మూఁకలఁ జూచి దూరుచు తురుములోని
కొమ్మ సంపెంగ విరులఁ గొని వేసీని
నెమ్మది శ్రీ వెంకటేశ నీవింతలోఁ గూడఁగాను
కమ్మి మరుబలములఁ గని నవ్వీని

రేకు: 0172-1 శంకరాభరణం సంపుటం: 07-423

పల్లవి: ఆవధరించఁగదయ్య అన్నిరసములు నీవు
తివురుచునబ్బెనిదె తేనెమోవిరసము

చ. 1: చెలియచక్కఁదనాన శృంగారరసము
వెలయ బొమజంకెనల వీరరసము
కలయు రతికాంక్షలను కరుణారసము
అలరు మైపులకలను అద్భుతరసంబు

చ. 2: తరుణిసరసములను తగుహాస్యరసము
పరుషంపువిరహాన భయరసంబు
బెరయు నిబ్బరములను బీభత్సరసము
గరిమ మరుయుద్ధాన ఘనరౌద్రరసము

చ. 3: వనిత ఆనందముల వడిశాంతరసము
ననుపుమంతనములను నవరసములు
యెనలేని శ్రీ వేంకటేశ నీతోఁ గూడి
దిన దిన వినోదాల తిరమాయ రసము

రేకు: 0172-2 కాంబోధి సంపుటం: 07-424

పల్లవి: నావొళ్ళ దోసములేదు నాఁటి నీపుణ్యములింతే
పూవులు నాకొప్పులలోవి పొంది నీపై రాలెను

చ. 1: యెవ్వతె తిట్టు దాఁకెనో యిదె నీకు నాతమ్మ
పవ్వళించి వుండగానె పైఁబడెను
యివ్వల నప్పటి మరి నెవ్వతె దీవించెనో
దవ్వుల నీవుంటే నాపాదము దాఁకెను

చ. 2: ఉమ్మడి నెవ్వతె గోరుకుండెనో నీవెంట్రుకలు
కెమ్ములనే నాపిడికిటఁ జిక్కెను
పమ్మిన యెవ్వతె తప: ఫలమో నా మెట్టెలతో
కమ్మి నీ కంఠహారాలు కట్టువడెను

చ. 3: వారించి యెవ్వతె యేదేవరకు మొక్కెనో నా
గోరు దాఁకి నీమేను జీరలాయను
యీరీతి శ్రీవెంకటేశ యేలితివి నన్నునిట్టె
చేరెవ్వతెమంత్రానో చెంది నా కిందైతివి

రేకు: 0172-3 మధ్యమావతి సంపుటం: 07-425

పల్లవి: పడఁతికిని నాయకుఁడ బలుతొడవు లిచ్చితివి
యెడనెడలఁ జూచినను ఇన్నియునుఁ దొడవు

చ. 1: జలజాక్షి మేనికిని జవ్వనంబిది దొడవు
పొలుపుఁ గన్నులకు చూపులు దొడవు
నెలకొన్న శిరసునకు నిలువుఁ దురుమే తొడవు
కలికి యీ చెక్కులకు కళలు దొడవు

చ. 2: ఘన కుచంబులకు నీ గట్టితనమే తొడవు
వొనరు నడిమికి నాభి వొప్పుఁ దొడవు
అనువైన పిరుఁదులకు నందలి బటువు దొడవు
పెనుఁదొడల కచటఁ బంబిన మెరుఁగు దొడవు

చ. 3: చిగురుఁబాదంబులకు చెంగావియే తొడవు
తగు రూపునకు మంచితనము దొడవు
జిగి నీపైఁ గూడితివి శ్రీవెంకటేశ్వరుఁడ
నగవులకు మిగులనానందములు దొడవు

రేకు: 0172-4 వరాళి సంపుటం: 07-426

పల్లవి: నీతోడి సాములకు నెలఁత వోపఁగలదా
రాతిరిఁ బగలు నింత రాఁపుసేతురా

చ. 1: కామతంత్రముల నిట్టె కడు నలయించఁగాను
మోము చూచి యింతి నీకు మొక్కు మొక్కీని
గోమునఁ బెంచినయట్టి గొజ్జఁగపూవువంటిది
గామిడితనాల నింత గాసిసేతురా

చ. 2: చలపట్టి కుచములు సారె నీవు పిసుకఁగా
వెలది గడ్డమువట్టి వేఁడుకొనీని
నెలకొన్న అరచేతి నిమ్మపండువంటిది
వలపుల కాతరాన వాడింతురా

చ. 3: మునుకొని కూడుతానె మోవిగంటి సేయఁగాను
అనువుగా నీకుఁ బ్రియము చెప్పీని
ఘనుఁడ శ్రీ వెంకటేశ కప్పురమువంటిదీకె
పెనఁగులాటలనే బెండుసేతురా

రేకు: 0172-5 కన్నడగౌళ సంపుటం: 07-427

పల్లవి: చెప్పినట్టు సేసేఁ గా నీ చిత్తము రాను
అప్పసముగా నాపె అప్పణదేరాదా

చ. 1: అక్క వూడిగెపుదాన నంటానే చెనకేవు
గుక్కక ఆపె గంటేఁ గోపగించదా
తొక్కి నీవు మాటఁబడి దూరు నాపై వేయకు
అక్కర అంత గలితే అప్పణదేరాదా

చ. 2: అమ్మపేరిటిదాన నంటానే నవ్వేవు
నెమ్మది నాపె వింటేను నిన్నుఁ దిట్టుదా
నెమ్మి నీవు చేతఁబడి నేరము నాపై వేయక
అమ్మరో యిఁనైనాను అప్పణదేరాదా

చ. 3: అలమేలుమంగతొత్తనంటా సొమ్ములిచ్చేవు
చలమున నిందుకాసె సాదించదా
యెలమి శ్రీవెంకటేశ యిద్దరిని నేలితివి
అలవాటుగా నాపె అప్పణదేరాదా

రేకు: 0172-6 శోకవరాళి సంపుటం: 07-428

పల్లవి: ఆఁడువారమైతేనే అంత సిగ్గు విడిచేమా
పేఁడుక పానుపుపైకి పిలిచేవు నీవు

చ. 1: ఏకాంతమునను మీరిద్దరూ నుండఁగాను
కాకుసేసి నేను దగ్గరవచ్చునా
మేకొని మీలోపల మీరే నవ్వుకోఁగా
యీకడ నే నెడచొచ్చి యెలయించవచ్చునా

చ. 2: మచ్చిక నొకరొకరుమాఁటలాఁడుకొనగాను
వచ్చి నేఁ బొత్తు గలయవచ్చునా నేఁడు
పచ్చియైన వలపులను పరవశమై యుండఁగ
పచ్చడము గప్పి మిముఁ బలికించవచ్చునా

చ. 3: నీవు నాపె గూడి నేరుపులు మెరయఁగాను
చేవదేర నేను సేవ సేయవచ్చునా
శ్రీ వెంకటేశ్వర నన్నుఁ జెందితివాకెకుఁ జెప్పి
మా వంటి వారికి మేలు మరవఁగవచ్చునా

రేకు: 0173-1 శంకరాభరణం సంపుటం: 07-429

పల్లవి: ఆఁటదాన నేను నీ వధికుఁడవు
వాటముగా మాయింటికి వచ్చినట్టే రార

చ. 1: కూరిమి గలిగితేను కొట్టినాఁ గోపము లేదు
బీరము గలిగితేను భీతి లేదు
వోరుపు గలిగితేను వుల్లములో వెత లేదు
చేరి నీ వుద్దండాలు సేసినట్టు సేయరా

చ. 2: తెలివి గలిగితేను తీరని మరుఁగు లేదు
బలిమి గలిగితే తడఁబాటు లేదు
చెలిమి గలిగితేను సిగ్గునెగ్గును లేదు
చెలఁగి నీవుద్దండాలు సేసినట్టు సేయరా

చ. 3: ఆస గలిగితే అడ్డాఁకెందును లేదు
బాసనిజము గలిగితే దోసము లేదు
వాసితో శ్రీవేంకటేశ వడి నన్నుఁ గూడితివి
సేసవెట్టి వుద్దందాలు సేసినట్టు సేయరా

రేకు: 0173-2 కన్నడగౌళ సంపుటం: 07-430

పల్లవి: ఏమి దలఁచుకొంటివి యేమిపని సేసితివి
గామిడి నీచేఁతలకు కాంతాళాలు రేఁగవా

చ. 1: మంతనమాడి నమ్మించి మరఁగున నన్నుఁబెట్టి
ఇంతలో నాకె వద్దికి నెట్టువోతివి
వింతవారు నవ్వేరని వెరపుమానితేఁ బోనీ
దొంతర నీ బాసలకు దోసమైనా ముట్టునా

చ. 2: కత చెప్పి నిద్ర పుచ్చి కడు నన్నెరఁగకుండా
రతినెట్టు గూడితివారాము నీడనే
మతిలో వెత లేకుంటే మాననీ దీనిపట్టుకు
కితకుఁడవనే అపకీరితైనాఁ బుట్టదా

చ. 3: యీకడ ననుఁగూడి యెంగిలితోనే పోయి
వాకిట నాపెఁగూడి వచ్చితివిట్టే
చేకొని శ్రీవెంకటేశ సిగ్గులేకుంటే మాననీ
దాకొని యిరువంకల దగయైనాఁ దొట్టుదా

రేకు: 0173-3 ఆహిరి సంపుటం: 07-431

పల్లవి: ఇల్లురికి వత్తురా యెవ్వరైన సవతులు
మెల్లమెల్లన నీవు మేకులేల సేసేవే

చ. 1: వలపు పదను చూచి వడ్డించితి నేఁబతికి
కలయనేల పెట్టేవే కాంత నీవును
తొలుత నెసరువెట్టి తొయ్యలుల నేనంపితి
పిలువని పేరటము ప్రియమేల చల్లేవే

చ. 2: నవ్వులు దొంతివెట్టితి నడుమంత్రమున నీవు
కువ్వగానేల చూపేవే కూరాకుమోవి
పవ్వళించి యింటిలోన పళ్ళెము నేనె పెట్టితి
ముువ్వంక అప్పటి నీవు ముగ్గులేల పెట్టేవే

చ. 3: శ్రీ వెంకటేశుఁ గూడితి చెప్పరాని విందువెట్టి
వావితో విడేలేల వచ్చియిచ్చేవే
చేవదేర గురుతులు చెక్కుల నేనే వొత్తితి
నీవొళ్ళఁ గలిగిన నేర్పులేమి చూపేవే

రేకు: 0173-4 కాంబోధి సంపుటం: 07-432

పల్లవి: ఎందరికి వలతువో యెవ్వఁడెరుఁగు
కందువ నీ చేఁతలిక్కడ నేనెరఁగనా

చ. 1: కట్టిన వన్నెదట్టి కైదండిచ్చినాపెది
కట్టుకొన్న కంటసరి కాళాంజాపెది
పెట్టుకొన్న పదకము పెద్దఅడపమాపెది
నెట్టున నీ సింగారాలు నేనెరఁగనా

చ. 2: కొనవేలి వుంగరము కుంచె వేసేయాపెది
కొనబు వొడ్డాణము గొడగాపెది
అనువైన పువ్వుదండ అవసరమాపెది
నినుపు నీసింగారాలు నేనెరఁగనా

చ. 3: ముడిచిన సవరము మురిపెపుగిండాపెది
బడినే నీ పెండెము పావడాపెది
పొడవై శ్రీ వెంకటేశ పుక్కిటివీడెము నాది
నిడివి నీ సింగారాలు నేనెరఁగనా

రేకు: 0173-5 భైరవి సంపుటం: 07-433

పల్లవి: ధరణిపై వెన్నెల యెందరు గాయరు
యిరవై నీతో భోగమెంతలేదు మాకు

చ. 1: చిత్తము వచ్చితేఁ జాలు చెలులనెందరినైనా
కొత్తగాఁగ నీవు దెచ్చుకోవయ్యా
హత్తి పూఁడిగముసేసి అండనుండి బుద్ధిచెప్పి
యిత్తల నానందించ నెంతలేదు మాకు

చ. 2: ఇచ్చ నీకైతేఁజాలు యెందరిసొమ్ములైనాను
కుచ్చులుగా మేన మోచుకొనవయ్యా
పచ్చిగా నీపాదాలొత్తి పనులెల్లఁ జేసి చేసి
యెచ్చరి చొక్కుచునుండే నెంత లేదుమాకు

చ. 3: వేడుక నీకైతేఁజాలు వేవేలు సతులను
కూడపెట్టి పెండ్లాడుకొనవయ్యా
నీడల శ్రీవెంకటేశ నిన్నుఁ గూడి కూడి
యీడుజోడుగాఁబెనఁగ నెంతలేదు మాకు

రేకు: 0173-6 బౌళిరామక్రియ సంపుటం: 07-434

పల్లవి: పలుమారు వలపుల పైరులు వి త్తఁగవలె
సొలసి తప్పక యిట్టె చూడవయ్య నీవు

చ. 1: చెలియ తమకములు చెక్కుల చెమటలై
నిలువున జిందీని నీయెదుటను
యోలమి జన్నులసందియేరులై పారీ నిదె
కలసి కౌఁగిట గండి గట్టరాదా నీవు

చ. 2: పడఁతి సరసములు పై పైనె నవ్వులై
బడినె మేనఁ జెడలువారఁజొచ్చెను
యెడయక కళలనే యిదివో పదనులెక్కె
కడగోరి రేక నచ్చుకట్టురాదా నీవు

చ. 3: అట్టె అలమేలుమంగ ఆసలే పోదియ్యై
జట్టిగొని పులకలససులొత్తెను
ఇట్టె శ్రీవెంకటేశ నీవెనయఁ దపసువండె
నెట్టున వేడుక గాదె నించరాదా నీవు

రేకు: 0174-1 ముఖారి సంపుటం: 07-435

పల్లవి: ముప్పిరిగొనెఁగా మేలు ముదితలాల
తిప్పరాని తమి తరితీపులతో మించెనే

చ. 1: సొలసి చీఁకటిమాను చుక్కలతో మాటాడగాఁ
వెలి మెరుఁగుఁజంద్రుఁడు వెన్నెల గాసె
బలిమి నీరెండుఁ జూచి పంతమున వేరె తెల్లఁ
గలువలేమిటికి చెంగలువలాయనే

చ. 2: గక్కన నిండుమొయిలు గాలివాన గురియఁగా
చిక్కులువడక తీగె చెంగలించెను
తక్కక వొండొంటితో దప్పిదేరఁ బొరుగున
నెక్కువెట్టి చెరకువిండ్లేకతమేలాడెనే

చ. 3: కావించి నీలపుఁ గొండ కళలు పైఁ జల్లఁగాను
సోవలఁ బైఁడియేరు జోడుగూడెను
శ్రీ వెంకటేశుఁడు ప్రేమ చిలుకనెదఁ బెట్టితే
పావురమట్టె బుజముపై నేలకొనెనే

రేకు: 0174-2 మాళవిశ్రీ సంపుటం: 07-436

పల్లవి: సిగ్గరికాఁడతఁడు చెప్పఁడున మనతోనేవి
యెగ్గులెంచ నేనతని యీడకుఁ బిలువరే

చ. 1: పొంతనె సాములు సేయఁబోలు మేను చెమరించె
వంతుకు నిద్రించఁబోలు వదలెఁ గొప్పు
సంతమాటలాడఁబోలు చక్కనిమోవి గంటాయ
కాంతుని కుపచారాలు కడుమీరు సేయరే

చ. 2: కమ్మి యీఁదులాడఁబోలు కస్తూరిబొట్టు చెదరె
వుమ్మడి కొండెక్కఁబోలు వూర్పులు రేఁగె
పమ్మి జాజరాడఁబోలు పచ్చడము పసపాయ
సొమ్ములతోడి ఆతనిఁజూచి మీరు మెచ్చరే

చ. 3: పువ్వుఁదోఁటనుండఁబోలు పొసఁగ మై వాసనంటె
నవ్వఁబోలు మేలు(ను?) మిన్నక యలసె
రవ్వగా నన్నుఁగూడి రతులను జొక్కించె
ఇవ్వల శ్రీ వెంకటేశు యేతులెల్లాఁ జూడరే

రేకు: 0174-3 నాదరామక్రియ సంపుటం: 07-437

పల్లవి: చెప్పరాని నీ చేఁతలు
చిప్పలీ మేనఁ జెమటలేడవిరా

చ. 1: కంటిఁగా నీ కతలెల్లాఁ నాఁడె
అంటిఁగా నీవన్నట్టే
ఇంటికి వచ్చేవిప్పుడు నీ
వెంటనే వచ్చి వెలఁది యెవ్వతెరా

చ. 2: నిలిచెఁగా నీ నేరుపులు అవే
తలఁచేఁగా నేఁ దమకమున
పిలిచే వెదుటనే ప్రియుఁడవై నీకు
వలచినటువంటి వనిత యెవ్వతెరా

చ. 3: వొరసెఁగా నీవుదుటుగోరు నే
బెరసేఁగా నీపెనురతిని
ఇరవై శ్రీ వెంకటేశ యేలితివి నన్ను
గరిసించి యడిగె నీకాంత యెవ్వతెరా

రేకు: 0174-4 హిందోళవసంతం సంపుటం: 07-438

పల్లవి: తానేల సిగ్గువడీనే దండకు రమ్మనఁగదే
మేనిపై మచ్చములుంటే మెచ్చి పొగడుదునే

చ. 1: యేమిసేసి వచ్చినాను యెదురాడఁ జాలనే
నాములుగా సెలవుల నవ్వేదుఁగాని
కోమలులఁ దెచ్చుకొంటే కోపగించఁ జాలనే
చేముంచి యిచ్చకములే సేతుఁగాని

చ. 2: తప్పులెన్ని మోచినాను తారుకాణించఁ జాలనే
చిప్పిలఁ జెక్కులు నొక్కి చెల్లింతుఁగాని
దుప్పటి పసపైవుంటే దొమ్మిగా జంకించనే
కొప్పుపై సేసలు చల్లి కూర్చుకొందుఁగాని

చ. 3: వెక్కసమై కళలుంటే వెంగెములాడనే
గక్కున విడెమిచ్చి కలతుఁగాను
యిక్కడ శ్రీవెంకటేశుఁ డిన్నిటా నన్ను నేలె
తక్కులింకఁ జూపనే తమకింతుఁ గాని

రేకు: 0174-5 నారాయణి సంపుటం: 07-439

పల్లవి: వింతవారైతే నిన్ను వెంగెమాడరా
జంతఁ గాఁ గనక నీతో సాదనై వుందాన

చ. 1: మచ్చిక నీతరితీపుమాటలు మరిగికదా
యిచ్చకములాడుకొంటా యిట్లుందాన
వచ్చి వచ్చి నీవలపు వలలకుఁ జిక్కికదా
కుచ్చి నీచేఁతలు మెచ్చుకొంటానుందాన

చ. 2: ననుపైన నీసెలవి నవ్వులాసపడి కాదా
మొనసి సారె సారెకు మొక్కుచుందాన
చొనిపి నీకడగంటిచూపులను జొక్కికదా
పనులు సేయుచు నిన్నుఁ బాయకుందాన

చ. 3: రాపుల నీకాఁగిలిరతులఁ దగిలి కదా
వోపి తములానకు చేయొగ్గుచుందాన
పై పై శ్రీ వెంకటేశ పచ్చిమోవిసోఁకి కదా
తేపలైన రతుల నీదేవినైవుందాన

రేకు: 0174-6 శ్రీరాగం సంపుటం: 07-440

పల్లవి: ఎంతవాఁడవయ్యా నీవు యేమని పొగడుదుము
చెంతలఁ గూర్చున్నదాని సిగ్గులు దేర్చితివి

చ. 1: మాఁటలఁ బందిలివెట్టి మగువపాదము మెట్టి
గీఁటుచు కొనగోరను గిలుకొట్టి
మేఁటిరమణుఁడాకె మెరుఁగుఁజన్నులు ముట్టి
పాటించి ముద్దరాలిని ప్రౌఢఁ జేసితివి

చ. 2: పెనువేల మెచ్చు మెచ్చి ప్రియముతోఁ జనవిచ్చి
ననుపు సరసముల నమ్మికలిచ్చి
పనివడి నీవాకె పయ్యదకొంగు వచ్చి
కనుకలిఁ గన్నెఁ దెచ్చి కలికిఁ జేసితివి

చ. 3: కందువలఁ బేరువారి కాఁగిటికూటము మీరి
మందపు నవ్వులనే మందులు నూరి
అందపు శ్రీ వెంకటేశ ఆపెనిట్టె కోరి కోరి
విందులనే బాలఁదెచ్చి వెకలిఁ జేసితివి

రేకు: 0175-1 మధ్యమావతి సంపుటం: 07-441

పల్లవి: ఇద్దర నిద్దరే మోహమేమి చెప్పేది
అద్దుకొని యిదివో పెండ్లాడినది మొదలు

చ. 1: ఒండొరులఁ జూచి యాసనొగి రెప్పలు వేయరు
యెండలేక చెమరించిరిద్దరు నట్టే
దిండుకొని పానుపుపై తెల్లవారుటెరుఁగరు
నిండుకున్నారు రతుల నేరుపులఁ దాము

చ. 2: పచ్చిమోవితేనెలాని పలుమారుఁ దనియరు
లచ్చనై వొకమాఁటే పులకలురేఁగె
హెచ్చుగా నాకు మడిచి యిచ్చే చెలులఁ జూడరు
పెచ్చువెరిగేరు తమ ప్రియములఁ దాము

చ. 3: తమ మేనులపై గోరితాఁకులౌత చూచుకోరు
జమళి నలపులకు జడియరు
అమర శ్రీ వెంకటేశుఁడలమేలుమంగాఁ గూడి
తమకించేరు లోలోతలఁపులఁ దాము

రేకు: 0175-2 కేదారగౌళ సంపుటం: 07-442

పల్లవి: చెప్పఁగదే అది చక్కఁజేసేనిపుడు
పిప్పిగట్టు నతనితో బిగిసేటిభావమో

చ. 1: బంతిబోజనానకు పతి గాచుకుండఁగాను
యింతి తోడ నెత్తమాడే వెరఁగనట్టే
ఇంత సేయనేమిటికి యేకతాననేమైనా
కొంత గొంత వొట్టు వెట్టుకొంటివో చలానను

చ. 2: వీడెమియ్య రాఁగాను విభుని కెదురురాక
నీడ ముసుఁగిడుకొని నిద్దిరించేవు
జోడువాయఁ బనిలేదు సొగియనివేళను
ఆడ బ్రహ్మచారి వ్రతమట్టె పట్టితివో

చ. 3: శ్రీ వెంకటేశ్వరుఁడు చేరికూడి వుండఁగాను
పావురము పెట్టె మీఁద బత్తిసేసేవు
నీవాతని విడువవు నీమారు పలుకఁగ
యీవిగానతనిచేత నిప్పించుకొంటివో

రేకు: 0175-3 శ్రీరాగం సంపుటం: 07-443

పల్లవి: మీరిని నీతురుము తుమ్మిదమూకలా
కారుకమ్మే కామాంధకారముగాక

చ. 1: అలివేణి నీమోము అద్దమా మోవితేనె
చెలరేగే అమృతపుఁజెలమ గాక
తలఁప నీచేతులేమి తామరతూఁడులా మంచి
వలరాజు మోహనవల్లి కలుగాక

చ. 2: గరిమ నీ చన్నులు జక్కవలా వలపులు
పెరరేఁచే బంగారు కొప్పెరలు గాక
సిరుల నీనడుమేమి సింహమా నా మనసు
పరువువెట్టే వయ్యాళి బయలుగాక

చ. 3: యెంచఁగ నీపిరుఁదిది యిసుకదిబ్బె యేమి
మించినరతిచుట్టు మేడెముగాక
పొంచి శ్రీవెంకటేశుఁడ ననుఁబొందితివి నీపాదాలు
వందల చిగురు రాజ్య పదములు గాక

రేకు: 0175-4 కాంబోది సంపుటం: 07-444

పల్లవి: వేసంగి కాలమున వేడ్క సలుపు
శ్రీ సతియు భూసతియుఁ జేరి కలయఁగను

చ. 1: మెఱయు శశికాంతంపు మేడలోపలను
ఆఱిమురి కప్రంపుటరుగుమీఁద
తఱచు వాసనల గందపుఁగోళ్ళ మంచమున
పఱచిఁగుంకమపవ్వు పరపు మీఁద

చ. 2: చలువైన కురువేరు చప్పరములోఁబన్ని
తలకొన్న వట్టివేళ్ళ దడియుఁ గట్టి
మెలుపుఁ జెంగలువలయ మేలుకట్లమరించి
మలసిశేవంతి చామరలు వీవఁగను

చ. 3: పన్నీటి తిత్తులే పై మంచు గురియఁగా
వన్నె తామర నూలి వలువగట్టి
యెన్నఁగల శ్రీ వేంకటేశ్వరుఁడు రతి సలిపె
వెన్నెల రసము చాల వెదచల్లఁగాను

రేకు: 0175-5 వరాళి సంపుటం: 07-445

పల్లవి: వరుసతో సాసముఖా వసంత పూర్ణిమ నేఁడు
సిరుల యీ విభవాలు సేవించరో

చ. 1: లలితపు గోవిందుఁడు లక్ష్మీమండపమందున్న
వలరాజదివో కొలువఁగ వచ్చెను
వెలిఁ జంద్రుఁడు తోడనే వెల్లగొడగటు వట్టె
సులభానఁ బవనుఁడు సురటి విసరెను

చ. 2: పొందుగా వసంతుఁడు పువ్వులఁ బూజించవచ్చె
కందువతోఁ దుమ్మిదలు గానముసేసె
సందడించి చిలుకలు చదువఁజొచ్చె పద్యాలు
గొందినే కట్టిగ వారై కోవిలలుగ్గడించె

చ. 3: రతిదేవి మొదలైన రమణులు నాట్యమాడి
రతివసంతమాడె మేఘావళి యెల్ల
తతి శ్రీ వెంకటగిరిఁ దాపుకొని యిందునందూ
మితిమీరఁగా మొక్కేరు మెరసి దేవతలు

రేకు: 0175-6 పాడి సంపుటం: 07-446

పల్లవి: భావము దెలియరే పడఁతులాల
యీవలనావలాను యెన్నఁగొత్తలాయను

చ. 1: తొలుతనే కలువలు తుమ్మిదలనంపితేను
మొలచి తామెర వురుములనంపెను
అల చంద్రుఁడు కానరానట్టె కప్రమంపితేను
తొలఁకి చిగురాకులు దుర్గాలు చేకొనెను

చ. 2: గక్కన మొగలిరేకు కస్తూరి రేఁచితేను
మక్కువ మొల్లమొగ్గలు మణులానించె
యెక్కువ మరుని పుట్టినింటఁ దేరులు గూడితే
చక్కని కరితుండాలు చక్రముతో నమరె

చ. 3: ముగ్గని మెరుఁగుఁదీగె ముత్తేల పంట పండితే
వెగ్గళించి తేనెపండు వెన్నెలగాసె
అగ్గమై పువ్వులకొమ్మ ఆకులఁగాయలునిచ్చె
సిగ్గుల రాజ్యమేలె శ్రీ వెంకటేశుఁడు

రేకు: 0176-1 భైరవి సంపుటం: 07-447

పల్లవి: మఱియేఁటి విన్నపము మాపుదాఁకాను
కఱదలఁ బెట్టుకింకఁ గావఁగదవయ్యా

చ. 1: చెలి నిన్నుఁబాసివుండి చెమటముత్యాలు చల్లీ
వెలయఁ బారులు గుచ్చి వేసుకోవయ్యా
వెలవెలఁ బారుచు వెసఁ గప్పురాలంపే
వొలిసితే నీవు పెద్దవొడిగట్టుకోవయ్యా

చ. 2: పొందులు నీవి దలఁచి పులకల విరులిచ్చీ
సందేఁడు దండలుగట్టి చాతుకోవయ్యా
సందడి నిట్టూర్పుల విసరుకో సురటిగట్టీ
చెంది అందుకును నీవు సేదదేరవయ్యా

చ. 3: కూడఁగ నిన్నుఁ దలఁచి కోరికలఁ జిగిరించీ
వోడక బంతిగట్టుక వుంచుకోవయ్యా
యీడనె శ్రీ వేంకటేశ యింతినిట్టె యేలితివి
వాడకుండా బుజ్జగించి వరమియ్యవయ్యా

రేకు: 0176-2 శంకరాభరణం సంపుటం: 07-448

పల్లవి: లేవే యెక్కడసుద్ది లెస్సాయను
యీవేళ విడెమియ్యవే యీతనికిని

చ. 1: జవ్వన పాయపు సతి చలము సాదించితేను
యెవ్వరు బుద్ధులు సెప్పేరింక మరి
నవ్వుతా విభుఁడంటితే నాటెనింతే కొనగోరు
పవ్వళించి యిందుకుఁగాఁ బలుకకుండుదురా

చ. 2: ఆఁటది మంకువట్టి అట్టె మాఁటాడకుంటే
వాఁటానఁజెప్ప నొరుల వశమౌనా
చాటువఁబట్టి తీసితే జారెనింతే నీతురుము
తేటలుగా నింతలోనే తెరవేసుకొందురా

చ. 3: దేవులు శ్రీ వెంకటేశుఁ దెలిసి వురమెక్కితే
కావరించి నేము వంకలు దిద్దేమా
భావించి నిన్నుఁగూడితే పచ్చాయనింతె మోవి
మూవంక సిగ్గునఁ గరముల మూసుకొందురా

రేకు: 0176-3 గౌళ సంపుటం: 07-449

పల్లవి: కొమ్మలాల యిదె మంచి కొలువు వేళ
చిమ్ముచు విన్నపాలెల్లఁ జేయరే యిపుడు

చ. 1: భామఁ దొడపై నిడుక ప్రహ్లాద వరదుఁడు
ఆముకొని సరసములాడుచున్నాఁడు
దోమటి వలపులను తొప్పఁదోఁగి చెమటల
ఆమని వేడుకనోలలాడుచున్నాఁడు

చ. 2: చెలి విడెమియ్యఁగాను శ్రీ నారసింహుఁడు
నలువంకఁ బకపక నవ్వుచున్నాఁడు
పులకల జొంపముల పువ్వుదండల తోడ
చెలరేఁగి మచ్చికలు సేయుచున్నాఁడు

చ. 3: పొంది లకిమమ్మతోడ బొమ్మిరెడ్డిచెర్లహరి
యిందరి శ్రీ వెంకటేశుఁ డేలుచున్నాఁడు
సందడి రతులఁ జొక్కి జవ్వనమదము మించి
మందెమేళాము సేసుక మన్నింపుచున్నాఁడు

రేకు: 0176-4 మాళవి సంపుటం: 07-450

పల్లవి: కామినిసింగారాల కాలమువేళలెరిఁగి
భూమిలోన నిన్నిటాను భోగించవయ్యా

చ. 1: నిలుపుఁదురుముఁ జారి నిండా జీఁకటివడె
సొలపు మోవి కెంపులఁ జుక్కలు నిండె
మొలచిన కళల మోమునఁ జంద్రుఁడుదయించె
వెలలేని నగవుల వెన్నెలగానె

చ. 2: అదనఁ గనుఁగొనల నరుణోదయంబాయ
యెదలోని సంతోషాన నిదె వేఁగెను
పొదలు రతికాఁకను పొద్దులువొడచి వచ్చె
ఇదివొ తమకమున నీరెండలూఁ గాసెను

చ. 3: చెక్కుల చిరు చెమట చిక్కని మంచు గురిసె
చక్కఁగా పులకల వసం తము వచ్చె
యిక్కువ శ్రీవెంకటేశ యింతినిట్టె కూడితివి
యెక్కువాయ దినముల యేండ్లకొలఁదుల

రేకు: 0176-5 భైరవి సంపుటం: 07-451

పల్లవి: నీ చిత్తము కొలఁదింతే నేనేమనేను
చేచేతనేమి సేసినాఁ జెల్లు నీకు నన్నియు

చ. 1: దొసిట వెన్నెల వట్టి తొడికి చూపవచ్చునా
ఆసల నీకోరికింతంతనవచ్చునా
లాసి నాతోఁ బెనఁగేవు దోసమో అందుకేమి
సేసవెట్టినప్పుడే చెల్లు నీకు నన్నియు

చ. 2: తగిలి యాకసమిట్టే తాసునఁ దూఁచవచ్చునా
జిగి నీమాఁటలకర్థాలు చెప్పవచ్చునా
నగుతా నేమడిగేవు నాకు నీతో బలిమా
చిగురుఁజేఁతలిప్పుడు చెల్లు నీకు నన్నియు

చ. 3: కోవిలకూఁతలొక్కట గుంపు సేయవచ్చునా
ఆవటించి నీవేడుకలాఁపవచ్చునా
కావించి కూడితివి చేఁగల మట్టిచెన్నుఁడవై
శ్రీవెంకటేశుఁడ యింకఁ జెల్లు నీకు నన్నియు

రేకు: 0176-6 పాడి సంపుటం: 07-452

పల్లవి: చేయవయ్య యింకా నీకుఁ జెల్లినటులనెల్లాను
పాయరానిచుట్టుమవై పనిగొంటివయ్యా

చ. 1: నీనయగారితనమే నిచ్చ నన్ను వలపించె
నానాఁటి ప్రియములు నమ్మించె
వీనుల వినుకులే వేడుకలు పుట్టించె
కానీవయ్య యింకా నీవే కలవుగా నాకును

చ. 2: మంచి జాణతనములే మరులు గొలిపె మతి
వంచిన మొక్కులు నీకు వసముసేసె
పెంచిన నవ్వులు నీతో పెనఁగలాటకుఁదెచ్చె
యెందకువయ్య నీవే యిచ్చేవింకాఁ జనవు

చ. 3: కాఁగిట నీ కూటములు కళలెల్లమొలపించె
చేఁగదీరిన మోవులు చిమ్మిరేఁచెను
వీఁగక శ్రీ వెంకటేశ వింతలుగాఁ గూడితివి
రేఁగించేవయ్య నీవె రేసులేని మెచ్చులు

రేకు: 0177-1 మంగళకౌశిక సంపుటం: 07-453

పల్లవి: ఇంకనెన్ని గాఁగలవో యింతి నీవల్లఁ బనులు
సుంకులు మోచినవెల్లాఁ జూచేము నేము

చ. 1: చెలియరో నీవలపు చెక్కులపై రతికెక్కె
పలుకుఁదేనెలఁ గొంత పాలుగారీని
కులుకుఁ గుచములను కొనలు వెళ్ళఁగఁజొచ్చె
పలుదెరఁగులనింత బయలాయ సిగ్గులు

చ. 2: కామినిరో నీ యాసలు కన్నుల రెప్పలు నిండె
దామెనమోవులఁ బంచదార చిందీని
వేమరుఁ దురుము జారి విరులు రాలఁగఁజొచ్చె
ఆమని ఆసలతోనే అగడాయఁ బొందులు

చ. 3: అంగనరో నీకూటమి ఆయములన్నియు ముట్టె
రంగుగా మోవి కళల రసములూరె
అంగవించి శ్రీవేంకటాధిపుఁ గూడితివిట్టే
వెంగలితనాన వెల్లవిరులాయఁ జేఁతలు

రేకు: 0177-2 ఆహిరి సంపుటం: 07-454

పల్లవి: తటి నిట్టిపనులెల్లా తగ నీవెరఁగవలె
యెఱుకలు సేసునా యిల్లాలు

చ. 1: చెలి నీమొగము చూచి సెలవిఁ బారఁగ నవ్వె
మలసి మాఁటాడునా మగనాలు
తలుపు మాఁటున నిల్చి తలచూపి నిలుచుండె
చలివాసి తిరుగునా జవరాలు

చ. 2: నీపై భారము వేసి నిట్టూర్పు నిగుడించె
మోపుగట్టునా వలపు ముద్దరాలు
తీపులు మోవిఁగార తేఁకువతోఁ జెమరించె
చాపలానఁ బైపడునా చదురాలు

చ. 3: కొప్పుదువ్వి పయ్యదకొంగు నీపైసోఁకించె
కప్పి సిగ్గు విడుచునా ఘనురాలు
యిప్పడె శ్రీ వెంకటేశ యెనసె నిన్ను గుట్టున
విప్పుచు రట్టుసేసునా విత్తరాలు

రేకు: 0177-3 వరాళి సంపుటం: 07-455

పల్లవి: కానీవయ్యా దానికేమి కలది గలట్టయ్యీ
ఆనుక నీకింకనెంత ఆసోదమో

చ. 1: పొలఁతి నయమంటేను పూఁటలు నన్నడిగేవు
తెలిపిన రతియప్పు తిద్దఁగలనా
యెలమి నాకె వలపు యెరవు నాపైఁ బెట్టేవు
చెలులకింకానెంతేసి సిగ్గువాట్లో

చ. 2: వాడిక యింతికిఁ గుదువగా నన్నుండు మనేవు
కూడి వావి విడిపించుకొనఁగవసమా
మాడలవలె సతుల మారిపెళ్ళాడేవు
తోడనిట్టేయందరిని దొడ్డిఁబెట్టేవో

చ. 3: కొమ్మను గాఁగిటఁ గూడి కొసరు నన్నడిగేవు
కమ్మర నేనూఁ దగులు గావలెనా
దొమ్మి శ్రీ వెంకటేశుఁడ తోడఁబెండ్లాడేవు
మమ్మిద్దరి నిక్కడనే మండెమురాయఁడవై

రేకు: 0177-4 సాళంగనాట సంపుటం: 07-456

పల్లవి: పురుష విరహ మింత పొగులాయ నీవల్ల
సరిఁజూతువు రావమ్మ చక్కని నీవిభుని

చ. 1: తలపోతలనె నీపైఁ దమకించి తమకించీ
పిలుపులనే నిన్నుఁ బేరుకొనీ
చెలులు యెదుటనుంటే చేరి నీసుద్దులడిగీ
కలతువు రావమ్మ గక్కన నీప్రియుని

చ. 2: బయలుగాఁగిళ్ళనే పైపైనె పొద్దువుచ్చీ
నియతిఁ జక్కఁదనాల నిన్నువర్ణించీ
రయమున నేడనైనా వ్రాఁతల నీరూపువ్రాసీ
క్రియఁ గూడరావమ్మ కేలుచాఁచి మగని

చ. 3: ఇక్కువ నీ పానుపుపై నెదురులు చూచి చూచి
గక్కన నిన్నుఁగూడె నీ కడకు వచ్చి
యెక్కువ మన్నించి నిన్ను నింటిలోనఁ బెట్టుకొనె
చెక్కునొక్క రావమ్మ శ్రీ వెంకటపతిని

రేకు: 0177-5 కాంబోది సంపుటం: 07-457

పల్లవి: నిన్నుఁ గొసరేటియట్టి నేనే యెడ్డనింతేకాక
యెన్నిమాటలాడినా నీకేడ మొకదాకిరి

చ. 1: సిగ్గులనే తెరగట్టి చెలిమోవి విందువెట్టె
కగ్గనిచనవులుడుగరలిచ్చెను
అగ్గలమై ఆపెకడ ఆడకెట్టు మానేవు
నిగ్గుల నిచ్చకునికి నీకేడ నిజము

చ. 2: కన్నుల నివాళిచ్చె కాఁగిట విడిది వెట్టె
కన్నె దన కుచముల కప్పము వట్టె
చెన్నుమీరనాపెపంపు సేయకెట్టు మానవచ్చు
మన్ననఁ బక్షపాతికి మరియేడ తగవు

చ. 3: ఇచ్చకానఁ బోఁకవెట్టి యింపులనె పెండ్లాడె
మెచ్చెను శ్రీ వెంకటేశ మేలములను
ఇచ్చట నన్నుఁ గూడితివిరుమొనసూదివైతి
విచ్చన విడికాఁడవు వెరుపేల యిఁకను

రేకు: 0177-6 శంకరాభరణం సంపుటం: 07-458

పల్లవి: ఇదివో తెలుసుకొమ్మా యీరెంటికి నీవే గురి
పదివేలు విన్నపాలు భావించుకోనీవే

చ. 1: సరవితో నడచితవే జగడముఁ జవులే
విరసాన నడచితే వెగటౌఁ బొందు
నిరతి నావద్దనుంటే నీవేమన్నా నాకునింపౌ
పరులవొద్దనుంటే నీపలుకే వేసటలు

చ. 2: తగవులు దప్పకుంటే తమవారే యిందరును
యెగసక్యమైతే తనయిల్లే యెరవు
నగుతా నీవూరకుంటే ననుపులీడేరును
మొగము ముణుచుకొంటే మోవులౌఁ బ్రియములు

చ. 3: కాఁగలించుకొంటేను కపటమంతయుఁ బాసు
ఆఁగుక వూరకుండితే అదియే కాఁక
వీఁగక శ్రీ వెంకటేశ వెస నన్నుఁగూడితివి
మాఁగిన నీనా మనసు మాఁటువే యిన్నియును

రేకు: 0178-1 దేసాళం సంపుటం: 07-459

పల్లవి: చద్దికి వేఁడి వలపు సరికి బేసి
ఇద్దరూను యిద్దరమే యేలయింత గర్వము

చ. 1: సలిగెలఁ బొరలే నీసరితలు చూచేఁగాక
నెలఁతరో నీయంత నేరనా నేను
ఎలమితో రమణుఁడు యిద్దరినడిమితాను
యిలపై యెందు వీఁగునో యేలయింత గర్వము

చ. 2: ఆసోదపు నీలోని అనువు దెలిసేఁగాక
వోసతిరో నీపాటి వోపనా నేను
పూసలలో దారమీపురుషుఁడు నీకు నాకు
యేసూటివచ్చునో నీకు యేలయింత గర్వము

చ. 3: కూడిన కొత్తరికపు గుణము చూచేఁగాక
చేడెరో నీ పాటి పొందు చెల్లదా నాకు
యీడనే శ్రీ వెంకటేశుఁడెనసె నిన్నును నన్ను
యేడకేడ మాటలాడేవేల యింత గర్వము

రేకు: 0178-2 మధ్యమావతి సంపుటం: 07-460

పల్లవి: లోకముల జాడలివి లోనాయ విభుఁడు నీకు
సాకిరివెట్టి నీవేల సాదించేవే

చ. 1: చలములు మానితేనే జగడాలు చక్కనౌను
అలుకలు దీరితేనే ఆసలు మించు
కలయికలు గలితే కపటాలన్నియుఁ బాసు
వెలినుండి నీవేల వెంగెమాడేవే

చ. 2: బింకములాడుకోకుంటే బెరయుఁ జుట్టురికము
మంకు లేని పొందులైతే మతి గరఁగు
అంకెలఁ బైకొంటేనే అరమరపులు నిండు
సంకు మోపి నీవేల సొలయ వచ్చేవే

చ. 3: వేడుకలఁ గూడితేనే వెలయు సెలవి నవ్వు
వాడికెలు గలితేనే వడదేరును
యీడనె శ్రీ వెంకటేశుఁడింతలోనె నిన్నుఁగూడె
జాడ తోడ నింకనేల సన్నసేసేవే

రేకు: 0178-3 కేదారగౌళ సంపుటం: 07-461

పల్లవి: పొంచి యెదురుకట్లకుఁ బోవమ్మ పతి వాఁడె
ముంచి యాతనికి నీవు మొక్కనేర్తువు

చ. 1: చవులుగా విచ్చివిచ్చి సారెసారెనాతనికి
చెవిలో నీమాఁటలెల్లఁ జెప్పనేర్తువు
చివురుఁదమకముబ్బ చిత్తజకళలు రేఁగ
నవకానఁ గవకవ నవ్వనేర్తువు

చ. 2: మంచము దగ్గర నుండి మారుకొని ఆతనితో
అంచ సరసము నీవాడనేర్తువు
కొంచక కొప్పు విడిచి కురుల చిక్కులుదీసి
పెంచి పెంచి వలపులు పేర్చనేర్తువు

చ. 3: గక్కనఁ గాఁగిట నించి కప్పురము నోటికిచ్చి
వుక్కునఁ గొనగోరనొత్తనేర్తువు
ఇక్కువ శ్రీ వెంకటేశుఁడింతలో నన్నుఁ గూడె
యెక్కవమ్మ వురమెలయించనేర్తువు

రేకు: 0178-4 శంకరాభరణం సంపుటం: 07-462

పల్లవి: ఎంత రట్టుడియిది యిట్టి నేమపువానిని
ఇంతసేసెఁ జూడరమ్మ యిఁకనేమి సేసీనో

చ. 1: పిలిచి తా రాకుండఁగాఁ బ్రియునితోఁ బగచాటి
నెల పొడపు వెన్నెల నిద్రించేవాని
చెలీఁ దాను మంచముపైఁ జేరి యింటికిఁ గొంపోయి
మెలుత గాఁగలించితే మేలుకొనెనతఁడు

చ. 2: పందెమంటానంతలో పగడసాలాడె విభుఁడు
దిందుపడి మచ్చరానఁ దెల్లవారెను
ముందుయెడకె వచ్చె మొకమజ్జనానకు
కందువగానాపె వచ్చి గూడె వెట్టెనే

చ. 3: శ్రీ వెంకటేశుఁడందుకుఁ జేరి తనవురముపై
దేవులుఁ జూపతే తెలిసి మొక్కె
కావించి వారిద్దరును కైకొని మన్నించఁగాను
చేవదేర నూడిగాలు సేసి తా వెలసెనే

రేకు: 0178-5 దేసాళం సంపుటం: 07-463

పల్లవి: తప్పుగాదు రావయ్యా దానికేమి దోసమా
వుప్పుచింది యెత్తితేను వొకటి రెండవుఁ గా

చ. 1: నగితిఁగా నేను నామోము నీవు చూడఁగ
తగి యిన్నాళ్ళకు నేను తలఁపయితిఁగా
చిగిరించిన వలపు చేగలెక్కెవి యిపుడు
మొగి ముమ్మారు నాఁటితే ములుక వంగవుఁ గా

చ. 2: విరుల వేసితిఁగా వెరగుతో నీవురాఁగా
పరగ నీ కూటమికి బాఁత్రైతిఁ గా
మురిపేన మూలవావి ముంగిటికి వచ్చెనేఁడు
పొరలి మా జవ్వనాలు పోఁకకు పుట్టేఁడు గా

చ. 3: మొకమెడితిఁగా నేను ముంచి నీవు గూడఁగాను
వొకవేళనైనాను వొద్దికైతిఁగా
వెకలివై నన్నును శ్రీవెంకటేశ యేలితివి
ప్రకటమై పేరితే పాలే పెరుగవుఁగా

రేకు: 0178-6 పాడి సంపుటం: 07-464

పల్లవి: చూతువు విచ్చేయవయ్య సారిది విరహమిది
చేత నీకు విన్నపము సేసేయట్టే వున్నది

చ. 1: చెక్కునఁ బెట్టిన చెయి చేరఁడేసి కన్నులకు
యిక్కువ చెప్పినయట్టు యింతికున్నది
మిక్కిలి కస్తూరిపట్టు మించు మోవి చంద్రునికి
దిక్కుల విహరించే రాతిరివలెనున్నది

చ. 2: పూవులపానుపు మీఁదఁ బొరలేటి చెలిబాగు
వావి నీకుఁబెట్టే సేసవలెనున్నది
యీవల తుమ్మిద కురులిట్టే చెదరివుండఁగ
వేవేలకు మరుదండు విడిదలై యున్నది

చ. 3: కడుఁ దాపమునకుఁగా గందము పూసినపూఁత
వడి వలపుల వెల్లి వలెనున్నది
యెడయక శ్రీ వెంకటేశయీకెఁ గూడితివి
నడుకొత్తి నిచ్చకల్యాణమువలెనున్నది

రేకు: 0179-1 కేదారగౌళ సంపుటం: 07-465

పల్లవి: అడుగరే యీమాఁట అన్నియుఁ జెప్పీఁగాని
తడఁబాటు నవ్వులకు తానోపఁగలఁడా

చ. 1: ఇప్పుడు తనవొద్దికి యేల రమ్మనీనే
అప్పటిమాటలే కావా ఆడేవి
నెప్పున మాతోడిపొందు నిజము నిష్ఠూరమింతే
తప్పులు నేఁబట్టితేను తానోపఁగలఁడా

చ. 2: పీఁట మీఁద నుండి వచ్చి పెనఁగనేఁటికే నాతో
నాఁటి బాసలే కావా నడుపేవి
పాటించ మా విన్నపాలు పట్టినదే పంతమింతే
దాఁటరానినడకకు తానోపఁగలఁడా

చ. 3: ఆస మీరఁ దెరవేసి అంతలోనె నన్నుఁగూడె
చేసిన చేఁతలే కావా చెల్లేది
రాసికెక్క శ్రీ వెంకట రమణుఁడే తాఁగలఁడు
తాసువలె సరిదూఁగ తానోపఁగలఁడా

రేకు: 0179-2 కన్నడగౌళ సంపుటం: 07-466

పల్లవి: ఆతనిఁ గోసరకురే అందేమున్నది
ఆతుమలో సరివచ్చెనందేమున్నది

చ. 1: చాయపాటుమాఁటలెల్ల చవిసేసుకొంటగాక
ఆయడఁ దప్పువట్టితే అందేమున్నది
శేయరానిచేఁత చూచి సెలవి నవ్వుటగాక
ఆయరత దిద్దఁబోతే అందేమున్నది

చ. 2: ఒలిసి నొల్లని వలపాడిఁ బెట్టుకొంటగాక
అలిగి సొలయఁబోతే అందేమున్నది
బలిమి చుట్టరికము పైఁబొదుగుటగాక
అలరి విచ్చి చూచితే నందేమున్నది

చ. 3: ఎగసక్కేలేమి గల్లా యెదఁబెట్టుకొంటగాక
అగడు శాయఁబోతే నందేమున్నది
నిగిడి శ్రీ వెంకటాద్రి నిలయుఁడే నన్నుఁగూడె
అగపడ్డ మీఁద నేరాలందేమున్నది

రేకు: 0179-3 ఆహిరి సంపుటం: 07-467

పల్లవి: ఎప్పుడు తనదాననే యెగ్గువట్టేనా
చొప్పుగ నావంక దయఁజూచితేనే చాలదా

చ. 1: తానేల వేఁడుకొనీనే తడిసీఁ జెమటచేయి
అని విరహన గిజ్జిడైవుందానను
మానక సరిసేసుక మాఁటలేలాడీ నాతో
వీనులకు వెట్టదోఁచు విభుఁడు తాఁదాను

చ. 2: దగ్గరేల కూచుండీనే తనమేను కసుగందీ
వెగ్గళపు కాఁకలచే వేఁడై వుందాన
బగ్గన నాకేల తాను పచ్చడము గప్పితేనె
వొగ్గి జీడివంటివలపు వొమ్మునో వొమ్మదో

చ. 3: అంతేల కాఁగిలించీనే ఆయములు తన్ను సోఁకీ
కంతునియమ్ములు మేనెల్లా కాఁడివుందాన
ఇంతలో శ్రీ వెంకటేశుఁడెనసీఁ దమకమేలే
వింత మోవి తేనె లెల్ల విందులాయ తనకు

రేకు: 0179-4 సౌరాష్ట్రం సంపుటం: 07-468

పల్లవి: ఇదివో మాతోడి పొందులిటువంటివి
వుదుటున నిందుకెల్ల వోపుదువా నీవు

చ. 1: చిగురుమోవిని నేను చెలఁగి మాఁటాడఁగా
వొగరుగాదుగదా వో విభుఁడా
నిగిడి పద్మపు మోము నీకు నేను చూపఁగాను
తగిలి మరునియమ్ము తలఁపుగాదుగదా

చ. 2: కలువ కన్నుల నిన్నుఁ గాఁడిపారఁ జూడఁగాను
చలిగొనదు గదా యిచ్చట విభుఁడా
బలు కుచ గిరులను పై పై నిన్నొత్తఁగాను
నులివడి నీమేను నొవ్వదుగదా

చ. 3: అంది బాహులతల నిన్నట్టె చుట్టుకొనఁగాను
కందదుగదా శ్రీ వెంకట విభుఁడా
అందముగాఁ గలసితి నలమేలుమంగ నేను
విందువంటి మోవితేనె వెగటుగాదుగదా

రేకు: 0179-5 రామక్రియ సంపుటం: 07-469

పల్లవి: అప్పుడుట నీవు నవ్వితివౌనోకాదో
చొప్పులు సోరణగండ్లఁ జూచితినావేళను

చ. 1: వనిత చన్నుల మీఁది వాసన కస్తూరి పూఁత
మునుప నీవురముపై ముద్రలంటెను
వెనకనొక్కతె వచ్చి వెస గాఁగిలించుకొంటే
తన చన్నుల నంటితే తాఁదెలిసి తిట్టెను

చ. 2: తరుణివుపరిసురతపువేళ మెడదండ
గిరికొని నీమెడఁ దగిలియుండఁగగా
తరువాత వేరొకతె తా నీరతికి కిందై
మరలి దండ దగుల మరి నిన్నుఁ దిట్టెను

చ. 3: అలమేలుమంగ చెమటట్టే నీమేనిపైఁ జింది
చెలఁగి శ్రీ వెంకటేశ చిప్పిలుండఁగా
కలసి తులసీదేవి కాఁగిలించి ఆనీట
మెలుపునఁ దొప్పఁదోఁగి మెచ్చిమెచ్చి తిట్టెను

రేకు: 0179-6 దేసాళం సంపుటం: 07-470

పల్లవి: కొమ్మలాల యెంతవాఁడే గోవిందరాజు
కుమ్మరించీ రాజసమే గోవిందరాజు

చ. 1: వులిపచ్చినవ్వులతో వొత్తగిలి పవ్వళించి
కొలవు సేయించుకొనీ గోవిందరాజు
జలజాక్షులిద్దరూను సరిఁ బాదాలొత్తఁగాను
కొలఁదిమీర మెచ్చీని గోవిందరాజు

చ. 2: అదె నాభికమలాననజునిఁ బుట్టించి తాను
కొదలేక వున్నవాఁడు గోవిందరాజు
చెదరక తనవద్ద సేవసేసే సతులకు
గుదిగుచ్చీ వలపులు గోవిందరాజు

చ. 3: వొప్పుగా వామకరము వొగిఁజాఁచి వలకేల
కొప్పుగడునెత్తినాఁడు గోవిందరాజు
ఇప్పుడు శ్రీ వెంకటాద్రినిరవై శంఖు చక్రాలు
కుప్పెకటారముఁబట్టె గోవిందరాజు

రేకు: 0180-1 ముఖారి సంపుటం: 07-471

పల్లవి: వినుమా ఆపె చేతనే వింతలుగఁ గాకుచేసి
అనఁబోలుదువు నీవే ఆపెతో నేఁడు

చ. 1: మంతనాన నీవు నేను మాఁటలాడుకొన్న మాఁట
అంతలో నెవ్వరు చెప్పిరాపెతో నేఁడు
చెంత నీచేఁతకు నేను చేయెత్తి మొక్కిన మొక్కు
అంతరంగమెట్టు చెప్పిరాపెతో నేఁడు

చ. 2: పరపు పై నిద్దరము పచ్చుగా నవ్విన నవ్వు
అరసి యెవ్వరు చెప్పిరాపెతో నేఁడు
తెరలోని మనగుట్టు దిష్టముగ వివరించి
అరుదుగానెట్టు చెప్పిరాపెతో నేఁడు

చ. 3: మనలోఁ గూడిన యట్టి మదన బంధములెల్ల
అనువులెవ్వరు చెప్పిరాపెతో నేఁడు
ఘనుఁడ శ్రీవెంకటేశ కలసితివప్పటిని
అనవయ్య యింకా నీవు ఆపెతో నేఁడు

రేకు: 0180-2 మాళవిశ్రీ సంపుటం: 07-472

పల్లవి: చెల్లఁబో నీవెటువంటి చెలివైతివే
కొల్లలుగానతనినే కూడితివిగా

చ. 1: మనసిచ్చి ఆతనితో మాఁటాడవైతివిగా
చనవు సేసుకొని కొసరవైతిగా
పెనఁగి చేతులువట్టి పిలువవైతివిగా
వినయాన భారము పై వేయవైతిగా

చ. 2: తప్పరాని బాసలెల్ల తలఁపించవైతివిగా
అప్పసము నేమొక్కితిననవైతిగా
అప్పుడె ముద్దుటుంగరమటు చూపవైతివిగా
నెప్పుననానలు వెట్టి నెట్టుకొనవైతిగా

చ. 3: నగవులనే వలపు నానఁబెట్టువైతివిగా
చిగిరించ నిచ్చకాలు సేయవైతిగా
తగు శ్రీ వెంకటేశుఁడు తానెవచ్చి నన్నుఁగూడె
నిగిడి నీయంత నీవు నేర్పవైతిగా

రేకు: 0180-3 మలహరి సంపుటం: 07-473

పల్లవి: తిరు మజ్జనపు వేళ దేవునికి నిదివో
పరగ నారదాదులు పాడరో యిందరును

చ. 1: చింతదీర వేంచేసి సింహాసనమున నుండి
దంతధావనాది కృత్యములు చేసి
సంతసాననంటరో సంపెంగ నూనియదెచ్చి
కాంతలు గందపుటటికలి వెట్టురో

చ. 2: పంచామృతముల తోడ పన్నీట మజ్జనమాడె
కాంచనాంబరాలు గట్టె కస్తూరిపూసె
నించుకొనె సొమ్ములెల్లా నిలువు దండలు చాతె
పొంచి దూపదీపతాంబూలములొసఁగరో

చ. 3: పాదుకలు వాహనాలు బహుఛత్రచామరాలు
ఆదరించె శంఖకాహళాదివాద్యాలు
వేదపారాయణలతో వెసఁజూచెఁ గపిలను
గాదెలలెక్కలడిగె గడేరాలు వినెను

చ. 4: అంగరంగవైభవాలకరళుపాడులు వెట్టె
అంగపు నిత్యదానాదులన్నియుఁజెసె
చెంగటనలమేల్మంగ శ్రీ వెంకటేశుఁడు గూడి
ముంగిటిపారుపత్యములు చేసీని

రేకు: 0180-4 మధ్యమావతి సంపుటం: 07-474

పల్లవి: తెట్టఁదెరువునవేల తేరకాఁడా
యెట్టువలసిననయ్యా నింటికి రావయ్యా

చ. 1: గొల్లెతల నీవేల కొప్పువట్టి తీసేవు
చల్లచాడె వదిలము జాజరకాడ
గుల్లసంకుదుబ్బను కొలచి పోయిమనేవు
యిల్లిదె యిప్పుడె మాయింటికి రావయ్యా

చ. 2: వుమురుఁగూటాన నావొడివట్టి పెనఁగేవు
చమురు చిందీనోయి జగడగాఁడ
బమసి పిల్లఁగోవి పడిరోఁ బోయిమనేవు
యిముడుకోవలసితే యింటికి రావయ్యా

చ. 3: బాలుఁడ శ్రీవెంకటేశ పయ్యదేల తొడికేవు
పాలు దొలఁకీనోయి పంతగాఁడ
కోలుముంద్రై నీతుత్తురుఁగొమ్ములోఁబోయుమనేవు
యేలుకొందుగాని మాయింటికి రావయ్యా

రేకు: 0180-5 కేదారగౌళ సంపుటం: 07-475

పల్లవి: పట్టియలుకల నీవే వలఁబడితివి గాక
పట్టి పెనఁగఁగా నీతోఁ బదరితినా

చ. 1: అడరి నే వద్దకి రానంటాఁ గోపగించేవు
వొడివట్టి తియ్యఁగా నే నోపనంటినా
పడితిఁ గాఁకలనంటాఁ బలుమారు దూరేవు
కడఁగి కాఁగిలించఁగాఁ గాదంటినా

చ. 2: కతలనే తెల్లవారెఁగా యంటాఁ గినిసేవు
రతిఁబిలువఁగా నే రానంటినా
తతి మోవి తేనెకుఁగా దవ్వులఁబొరలే విట్టే
ఇతవై నీవడుఁగఁగా నియ్యనంటినా

చ. 3: అంచల నేకతమాడనంటాను మొరసేవు
వంచి తెరవేయఁగా నేవద్దంటినా
పొంచి శ్రీ వెంకటేశ యిప్పుడు నన్నుఁబొందితివి
మంచముపై నల్లపుడు మారుకొంటినా

రేకు: 0180-6 సాళంగనాట సంపుటం: 07-476

పల్లవి: నిజము నిష్ఠూరము నేమైతేను
గుజగుజలను యాల కొసరింపించేవు

చ. 1: నెమ్మినాపెను వేఁడుకో నీవే నేరుతువు
కొమ్మ కోపము దప్పించుకో నేరుతువు
దొమ్మరి చేఁతలు సేసి తిద్దుకొననే రుతువు
మమ్మేల యందుకునెడమాఁటలాడించేవు

చ. 2: పొసఁగ నీయంకెకు రాబుద్ధిచెప్ప నేరుతువు
అసు దైయాపెపంపుశాయఁగ నేర్తువు
పసలుగా సారెసారె బాసలు సేయనేర్తువు
యెసగి నే వెంటవచ్చియేమి సేసేనయ్యా

చ. 3: ఈవులిచ్చి యింటికిరా నెలయించ నేరుతువు
వేవేలు విధముల నవ్వించ నేర్తువు
శ్రీ వెంకటేశుఁడ నీవే చెలియఁగూడితి విట్టే
దేవుఁడవు మమ్మెంత పొదిగి మెచ్చేవిపుడు

రేకు: 0181-1 సాళంగనాట సంపుటం: 07-477

పల్లవి: ఆస తికి నీకుఁబోదు అండనుండేవారమింతే
బేసబెల్లితనమునఁ బెనఁగ మాకేల

చ. 1: కురులెంత చిక్కువడ్డాఁ గొనగోళ్ళే తీర్చు
సరులెంత పెనగొన్నా చన్నులే యాను
తరుణెంత గోపించినాఁ దగ నీవే వోర్చేవు
పెరరేఁచి సారెసారెఁ బెనఁగ మాకేల

చ. 2: పిక్కటిల్లుఁదిట్టులెల్లా పెదవి మోవఁగవలె
వెక్కసపుఁ గన్నులైతే విడిది మోమే
నిక్కముగ చెలి పంతము నీవే చెల్లించవలె
పెక్కువిధముల మీతోఁ బెనఁగ మాకేల

చ. 3: కందువ రతులకెల్లా కాఁగిలి యొక్కటే గురి
అందపుఁబిరుదు భారమానుఁ బాదాలు
యిందునె శ్రీ వెంకటేశ యీపె నీవురమెక్కెను
పెందలకాడనుండి పెనఁగ మాకేల

రేకు: 0181-2 సామంతం సంపుటం: 07-478

పల్లవి: ఊరకుండితే మేలు వూఁకొంటేఁ బైఁడికతౌను
బారపెట్టితే నలపు పచ్చిదేరెనందువు

చ. 1: పగడవాతెర విచ్చి పలుమారు మాఁటాడితే
దగర యెంతటిది రట్టడియందువు
మొగమెత్తి నేను నీమోము సారెకుఁ జూచితే
జిగిమించ నిదియెంత సిగ్గులేనిదందువు

చ. 2: చెలఁగి నీ చిత్తము రా సెలవుల నగితేను
కెలసి యెంత యెగసక్కెపుదందువు
తలఁపించి నీబాసలు తడవి పేరుకొంటేను
వలవంతనిది యెంతవళకులదందువు

చ. 3: గక్కన నేనే ముందు కాఁగలించుకొంటేను
దక్కి నీకంటె బలిమిదాననందువు
ఎక్కువ శ్రీవెంకటేశ యింతలో నన్నేలితివి
మిక్కిలినిఁ బెనఁగితే మీరితి నేనందువు

రేకు: 0181-3 పాడి సంపుటం: 07-479

పల్లవి: ఆతఁడెంత నీవెంత అవునే మేలు
యేతరిదానవు నీకునెంచనున్నదా

చ. 1: చెల్లుబడిగలితేను శింగారించుకొందుగాక
పల్లదాలాడుదురా పతితోను
గొల్లవారి తోడిపని గొడ్డలి నానఁబెట్టుట
మల్లాడి బుద్ధిచెప్పితే మంకు మానీనా

చ. 2: మేనదానవై తేను మేరతోఁ గైకొందుగాక
ఆనలువెట్టుదురా ఆతనితోను
పూని చల్లలమ్మేవారిపొందు దూలమూఁతకోల
ఆనుకెంత కిందుపడ్డా నారడి మానీనా

చ. 3: చనవరివైవుండితే సరసమాడుదుగాక
యెనసి శ్రీ వెంకటేశునెగ్గులెంతురా
గునిసి మందలవారిగుణము రాతిపైనార
ననుపెంత గలిగినా నాలి మానీనా

రేకు: 0181-4 హిందోళవసంతం సంపుటం: 07-480

పల్లవి: నీవైన విన్నవించవే నేర్చుకొనునాతఁడు
వేవేలు కోరికలకు వెల వలెనా

చ. 1: యీడువెట్టుకాడఁగాను యేది నిజమౌనో
యేడ లేనిమాఁటలునేల పెంచీనే
వాడికవలపులకు వచ్చినంతే లాభము
వోడక ఆసోదానకు వొడిగట్టువలెనా

చ. 2: దొంతల సరసముల దొమ్మియెంత గూడునో
యెంత దరవైన నవ్వులేమి సేసీనే
బంతి భోజనాలకు పట్టినదెల్లాఁ గడి
వింతజాణతనాలకు వేళ చూడవలెనా

చ. 3: మచ్చికఁ బరవశాన మఱతునో తలఁతునో
హెచ్చి తన మోహమేల యెచ్చరించీనే
తచ్చి శ్రీ వెంకటేశుఁడు తానె నన్నిదె కూడె
కొచ్చి కొచ్చి తమకము గుదిగుచ్చవలెనా

రేకు: 0181-5 హిజ్జిజ్జి సంపుటం: 07-481

పల్లవి: తానేకల గనెనో తప్పక చెప్పుమనవే
మానక తెల్లవారఁగా మాయింటికి వచ్చెను

చ. 1: ఆకు మడిచిత్తునంటా ఆయములూనంటెనంటా
కైకొని యిద్దరూనుండఁగల గంటినే
దాకొని నవ్వితినంటా తములమువెట్టెనంటా
కాకరితనాల మంచి కల గంటినే

చ. 2: పెనఁగితి నేనంటా ప్రియము తాఁజెప్పెనంటా
కనుమూసినంతలోనే కల గంటినే
కొనగోరంటితినంటా కొప్పువట్టి తీసెనంటా
ఘనమైన వలపుల కల గంటినే

చ. 3: లలి సన్నసేతునంటా లాగుగాఁ జేపట్టునంటా
కలికితనాలనొక్క కల గంటినే
అలమేల్మంగనేను అట్టె శ్రీ వెంకటేశుఁ
గలసితినిట్లా నేకల గంటినే

రేకు: 0181-6 కేదారగౌళ సంపుటం: 07-482

పల్లవి: ఎప్పుడూను నీ సుద్దులిటువంటివి
గుప్పి సముద్రములోనే కురియించేవు వాన

చ. 1: కానికె దెచ్చినయాపె కాచుకిట్టే వుండఁగాను
వూని వీఁగేయాపెనేల వొడివట్టేవు
ఆని దప్పిగొంటినన్న యాపెనటువెట్టి నీళ్ళ
నానుచున్నయాపెకేల పానకమిచ్చేవు

చ. 2: పెండిలికి వచ్చినాపె పెరట విడిశుండఁగా
చండి పొరుగాపెనేల సన్నసేసేవు
అండ నాఁకలిగొన్నాపె అట్టెమోముచూడగాను
నిండఁదనిసినాపెకు నీవువిందు వెట్టేవు

చ. 3: వొద్ది యలమేలుమంగనురమునఁ బెట్టుకొని
గద్దించి కడవారిపై కాలుచాఁచేవు
కొద్దితో శ్రీ వెంకటేశ కూడినాపె వుండఁగగాను
అద్ది పిల్చినాపెకేల ఆసలు నించేవు

రేకు: 0182-1 ముఖారి సంపుటం: 07-483

పల్లవి: నేమే దొరసానులము నేరక లోననుందుము
సాముసేయ నెంతలేదు సముకపువారికి

చ. 1: సిగ్గువడ నెంతలేదు చెయిచాఁచ నెంతలేదు
దగ్గరి సేవలు సేసే తరుణులకు
వొగ్గి పిల్వ నెంతలేదు వోపనన నెంతలేదు
అగ్గలమై కాచుక అండనుండేవారికి

చ. 2: అందిపొంద నెంతలేదు ఆనవెట్టు నెంతలేదు
కందువనుండేటి వూడిగపువారికి
చెందికూడ నెంతలేదు చెల్లించుకో నెంతలేదు
యెందుకైనానొడిగట్టే యింటిలోనివారికి

చ. 3: రవ్వసేయ నెంతలేదు రచ్చకెక్క నెంతలేదు
నవ్వులు నవ్వించే మన్ననవారికి
జవ్వనపు శ్రీ వెంకటేశ్వరుఁడిదె నన్నుఁ గూడె
నివ్వటిల్ల నెంతలేదు నీవంటివారికి

రేకు: 0182-2 బౌళిరామక్రియ సంపుటం: 07-484

పల్లవి: నేరుపరివౌదువే నీవిన్నిటా- వోరి
నేరకుంటే నేఁడుమమ్ము నీవింత సేతువా

చ. 1: పూని మాఁటలాడఁగదే పొలఁతీ -వోరి
వాన పలుమారువైతే వరదలౌరా
నానితేఁ గొంత వలపు నయమౌఁగదే-వోరి
నానునా గొడ్డలివంటి నాలైన నీచిత్తము

చ. 2: కలయవే మాపొత్తు కలికీ -వోరి
కలగలపు గిజ్జడి గాదటరా
పలురతులేకాదా పరిణామముఁ-వోరి
పలువంచలఁ బడెను పాయపు నీదేహము

చ. 3: సేస వెట్టితిగదే శ్రీసతీ-వోరి
సేసుకుంటే పుణ్యములు చేరకుండునా
రాసులైతే మేలే నీ రచనలెల్లా -వోరి
ఆసలు శ్రీ వెంకటేశ ఆయములు సోఁకెరా

రేకు: 0182-3 భైరవి సంపుటం: 07-485

పల్లవి: పైఁడికతవంటిదాయ పైకొన్ననీతోడిమేలు
వేఁడి వేఁడి కోరికలు వెల్లవిరులౌను

చ. 1: తిలకించి చూడఁబోతే ద్రిష్టి దాఁకీనందువు
పలికితేనే బహుభాషిదందువు
చెలరేఁగి నవ్వితేనే సిగ్గులేనిదందువు
యెలమి నీతోడిపొందు యెందుకైనా వచ్చును

చ. 2: సరసములాడితేనే చలివాసెనందువు
కరఁగితినంటే బూటకములందువు
సారిది నీకు మొక్కితే జూటరినేనందువు
యిరవై నీతోడిపొందు యెందుకైన వచ్చును

చ. 3: పైపైఁ జెయివేసితే పంతమిచ్చెనందువు
రాపుగ మెచ్చితే బీరములందువు
బాపురా శ్రీవెంకటేశ బలిమిఁ గూడితి నన్ను
యేపున నీతోడిపొందు యెందుకైనా వచ్చును

రేకు: 0182-4 సామంతం సంపుటం: 07-486

పల్లవి: ఇందుకే మెచ్చేరు చూచి యింతులెల్ల నిన్నును
విందుల నీ సొబగుకే వెలలేదుగాక

చ. 1: పన్నిన కొలువులోని పతిమెలెందరు లేరు
నిన్ను మోహింపించినదే నెలఁతగాక
యెన్నిలేవు కళలు నీకివె చెక్కుల మీఁదట
చిన్నికొనగోరురేకే చెప్పరాదుగాక

చ. 2: చప్పని వుప్పని మాఁటసరసములెన్ని లేవు
కొప్పువట్టి తీసినదే కొత్తలుగాక
ముప్పిరి మోవి మీఁదటి మొగచాటులెన్ని లేవు
కప్పి తములమిడుటే కతలాయఁగాక

చ. 3: సిగ్గువడ్డ చిత్తములో చిందువందులెన్ని లేవు
దగ్గరికూడినదే తగులుగాక
అగ్గమై శ్రీ వెంకటేశ ఆసలాసలెన్ని లేవు
నిగ్గుల యీకూటములే నేరుపులుగాక

రేకు: 0182-5 రామక్రియ సంపుటం: 07-487

పల్లవి: ఇన్నిటా సరసుఁడవు యెంతసేసేవు
వెన్నెల పులుగములా వేడుక నీసిగ్గులు

చ. 1: మలసి యాలకొంకేవు మరికొంత నవ్వరాదా
వెలవెట్టి కొంటివా యీవీటనేమైనా
అలరి మాఁటాడుమంటే అందునిందుఁ గలపేవు
కలగూరా యేమైనా గజిబిజి సేయను

చ. 2: మరులేని కొలిపేవు మనసు నాకియ్యరాదా
అరివేనఁ దెచ్చితివా అప్పుడే నీవు
తెరలోన దాఁగేవు తేరి నిన్నుఁ జూచితేను
సరిబేశా నీ చేఁతలు సారెసారె ముయ్యను

చ. 3: కొద్దినేల లోభించేవు కూరిమి పైజల్లరాదా
మద్దులెక్కి కోసితివా మరియలసి
గద్దరి శ్రీ వెంకటేశ కలసితి విటు నన్ను
చద్ది మూటలా రతులు సారెకు భోగించను

రేకు: 0182-6 కాంబోది సంపుటం: 07-488

పల్లవి: వద్దనేమా నేము వలవనిజోలైతే
తిద్దలేము తగవులు దిష్టమైన పనికి

చ. 1: వగలు వెట్టుక నీవు వట్టి కూరిమి గొసరి
యెగసక్కేలాడితే నేనెరఁగఁ గాక
మగువ గుణములెంచి మరి నీ గుణములెంచి
నగుమా వోరిచీ నాపె నాయమైనపనికి

చ. 2: దిమ్ములు రేఁచుక నీవు తెరవలఁ జూపి మోపి
యెమ్మెలెల్లా నెరపితే నెరఁగఁ గాక
నెమ్మదిఁ దగవెరిఁగా నెలఁతయిరవెరిఁగి
రమ్మా కలసీ నాపె రవ్వగాని పనికి

చ. 3: పంతములెల్లానాడి బలిమిఁ గాఁగిటఁ బట్టి
యింత కిందుపడితే నేనెఱఁగఁ గాక
యింతలో శ్రీ వెంకటేశ యెనసితి విటులానే
వంతిమ్మా పెనఁగీ నాపె వసమైన పనికి

రేకు: 0183-1 రామక్రియ సంపుటం: 07-489

పల్లవి: కొచ్చి కొచ్చి కొసరీనే గొల్లకొసరు
కుచ్చి యెత్తెవే చన్నుల గొల్లకొసరు

చ. 1: చేరువనుండి నిన్నుఁ జెనకీనదివో వాఁడు
గోరికొనలనొత్తవే గొల్లకొసరు
మారుకొని నీతోనిట్టె మాఁటలాడ వచ్చీని
కూరిమిఁ దిట్టఁగదవే గొల్లకొసరు

చ. 2: పఱచుఁజేఁతలు చేసి పైకొనీ వచ్చి వాఁడు
గుఱుతు మోవిసేయవే గొల్లకొసరు
మెఱసి పెనఁగవచ్చీ మిక్కుటపురతులను
కొఱకొఱఁ బెట్టఁగదే గొల్లకొసరు

చ. 3: చెల్లుబడి వావిచెప్పీ శ్రీవెంకటేశుఁడు గూడె
కొల్లున నవ్వఁగదవే గొల్లకొసరు
బల్లిదుఁడాతఁడు నీవు పట్టపు దేవులవై
కొల్లలాడేవే వలపు గొల్ల కొసరు

రేకు: 0183-2 కేదారగౌళ సంపుటం: 07-490

పల్లవి: చద్దికి వేఁడికి మీరు సరసములాడరాదా
యిద్దరుఁ గూడితిరి మీకిఁకనేల అలుక

చ. 1: మచ్చరపు గొణఁగులు మాఁటలాడినందాఁకానే
అచ్చలము మోము చూచినందాఁకనే
తచ్చనలన్నియు నేకాంతములైనందాఁకానే
యెచ్చుకొందు లేదు మీకు యిఁకనేల అలుక

చ. 2: మునుకొన్నజగడము మొక్కు మొక్కినందాఁకానే
అనుగుమోనము నవ్వినందాఁకానే
పెనఁగులాటలు తమిపెరరేఁచినందాఁకానే
యెనసెఁ జుట్టురికములిఁకనేలె అలుక

చ. 3: నేసవెట్టిన సిగ్గులు చేయి మోఁచినందాఁకానే
ఆసలెల్లాఁ గాఁగిలించినందాఁకానే
వాసితో శ్రీ వెంకటేశ్వర కూడితిరి మీరు
యీసులెల్లాఁ బెడఁబాసెనిఁకనేఁటియలుక

రేకు: 0183-3 పాడి సంపుటం: 07-491

పల్లవి: చెవులారా వినేఁగాని చెప్పమా నాకాసుద్ది
జవళి వలపు లిట్టే చల్లుదురా

చ. 1: పొరి నిన్నుఁ దలఁతునెప్పుడునంటానాడేవు
తరుణులఁ బొందేవేళఁ దలఁతువా
యెరవులేక నాకే యెదురు చూతుననేవు
కరఁగి చొక్కే వేళ కనువిచ్చి చూతువా

చ. 2: వనజాక్ష నారుపే వ్రాసి చూతుననియేవు
వనితల వురముపై వ్రాతువా
చనవున నాపేరే జపయింతుననేవు నీ
యనుఁగుఁగాంతఁ బిలిచేయప్పుడు జపింతువా

చ. 3: ఎమ్మెలతో నేరుపులెంతునంటానాడేవు
కొమ్మలతోడుత నట్టే కొనేడుదువా
మమ్ము శ్రీ వెంకటేశ మండెమురాయఁడవై
సమ్మతిఁ గూడితి విట్టే చనవిత్తువా

రేకు: 0183-4 సాళంగనాట సంపుటం: 07-492

పల్లవి: ఎందాఁక వేసరించే నిదివో నిన్ను
పొందితే నీ కాఁగిటిలో పొఁగేదేకాక

చ. 1: చిగురుఁ గొమ్మకు నెంత చేగలెక్కినామేలే
మగువనెంత వెంచినా మాకుమేలే
జగడాలకేమి వని సాదువలెనుండి నీవు
మొగము చూచినంతలో మొక్కేదే కాక

చ. 2: వలరాజునమ్ముకెంత వాఁడివెట్టినామేలే
చెలిని నీవెంత సింగారించినామేలే
చలపోర మరియేల చనవుకొలఁదినే
పిలిచినప్పుడే నీతోఁ బెనఁగేదే కాక

చ. 3: బంగారు ప్రతిమ కెంత ప్రాణము వోసినామేలే
అంగనకెంత లోనైనా మేలే
సంగతి శ్రీ వెంకటేశ సరి నన్నుఁ గూడితివి
పొంగి నీవు చెనకితే భోగించుటే కాక

రేకు: 0183-5 శ్రీరాగం సంపుటం: 07-493

పల్లవి: మదనుని తండ్రికి మజ్జనవేళ
పొదిగొనీ సింగారపు భోగములెల్లాను

చ. 1: పడఁతుల నవ్వులెల్లా పైనంటుకొన్నట్టు
కడలేక పొగడొందెఁ గప్పురకాపు
నిడివిఁ గల్ప వృక్షము నిండాఁ బూచినట్టు
కడుఁ దెల్లనై యమరెఁ గప్పురకాపు

చ. 2: సుదతుల చూపులు సొరిది పైఁగప్పినట్టు
పొదిగొని జొబ్బిలీని పుణుఁగుకాపు
అదన నల్లగలువలట్టె ముంచుకొన్నట్టు
పొదలెఁ దిరుమేనను పుణుఁగుకాపు

చ. 3: అలమేలుమంగ పురమందుండి యనురాగము
కులికినట్టు పన్నీరుఁ గుంకుమకాపు
యెలమి శ్రీ వెంకటేశుఁడిన్ని సొమ్ములు నించుక
కొలువెల్లా నిండుకొని కుంకుమకాపు

రేకు: 0183-6 శంకరాభరణం సంపుటం: 07-494

పల్లవి: ఇదివో ద్రిష్టాంతము యిచట మీయందె కంటి
యెదిరితే వెనకముందింతాఁ బెడరేఁచును

చ. 1: యేకతమైతేఁ జాలు యెంతటలుకైనాను
పోకుండా లోలోనే పొందుసేసును
సాకిరి గలితేఁ జాలు సరినెంతమోనమైనా
వాకిచ్చి మాటాడించి వడిఁ గొసరించును

చ. 2: పానుపొక్కటైతేఁ జాలు పచ్చివొట్లెట్టివైనా
మానఁజేసి తమకము మతిఁరేఁచు
మేనులు సోఁకితేఁ జాలు మిక్కుటపు కాఁకలెల్లా
ఆనుకొని చల్లఁజేసి ఆయములు గరఁచు

చ. 3: బాగాలందుకొంటేఁ జాలు పరాకులన్ని మాన్పి
చేగలెక్కి రతులెల్లాఁ జిమ్మిరేఁచును
యీగతి శ్రీ వెంకటేశ యీకె నీవుఁ గూడితిరి
జాగులేని సరసాలు చనవులిప్పించును

రేకు: 0184-1 నాదరామక్రియ సంపుటం: 07-495

పల్లవి: చిత్తగించు మామాఁట శ్రీ నరసింహా
చిత్తజ జనక వో శ్రీ నరసింహా

చ. 1: చెలరేఁగి వున్నాఁడవు శ్రీ నరసింహా - నీకు
జెలులెల్లా మొక్కేరు శ్రీ నరసింహా
సెలవుల నవ్వేవిట్టే శ్రీ నరసింహా- నీకే
సెలవు మావలపులు శ్రీ నరసింహా

చ. 2: చిందీని మైఁజెమటలు శ్రీ నరసింహాఁ నిన్ను
జెందినది కడు జాణ శ్రీ నరసింహా
చెందమ్మి రేకుల గోళ్ళ శ్రీ నరసింహా- నీపై
చిందులెల్లా బాడేము శ్రీ నరసింహా

చ. 3: సిరినెరకాఁగిటి శ్రీ నరసింహా- మంచి
సిరుల నహోబలము శ్రీ నరసింహా
శిరసెత్తు శ్రీవెంకట శ్రీ నరసింహా
చెరలాటాలిఁకనేల శ్రీనరసింహా

రేకు: 0184-2 శంకరాభరణం సంపుటం: 07-496

పల్లవి: సందడెంతైనాఁ గలదు సతులలో నీకు
అందరిలోఁ గరుణించి ఆదరింతుగాని

చ. 1: మోము చూచి నీకు నేను మొక్కితిఁ జుమ్మీ రమణ
ఆముకొని యాడో పరాకైతిననక
వోముక నీ చేఁతలు నావొళ్ళిపై నున్నవి సుమ్మీ
చేముట్టి తడివిచూచి చిత్తగింతుగాని

చ. 2: గక్కనఁ గైదండయిచ్చి కదిసి వుండితిఁ జుమ్మీ
చిక్కి ఆ వేళను మరచితి ననక
మక్కువ నాతోనాడిన మాటపట్టున్నది సుమ్మీ
పక్కన నాపాలఁజిక్కి పాయకుందుగాని

చ. 3: ననుపున నీతో నేను నవ్వులు నవ్వితిఁ జుమ్మీ
చెనకనేరక భ్రమసితిననక
మొనసి శ్రీ వెంకటేశ ముంచి కూడితివి సుమ్మీ
పెనచి నీమహిమెల్లా బెరయింతుగాని

రేకు: 0184-3 దేసాళం సంపుటం: 07-497

పల్లవి: నీ మీఁది తలపోఁతలే నిండు రతిగా భావించి
ప్రేమతోనున్నది యిట్టె ప్రియము చేకోవయ్యా

చ. 1: వీడెమిచ్చే యప్పటి వేడుకలు దలపోసి
ఆడుకోలుమాఁటలెల్ల నటుదలఁచి
కూడివున్నవేళల గురుతులు దలపోసి
వోడక సంతోసములనోలలాడుచున్నది

చ. 2: కేళాకూళిలో నీమేలములు దలపోసి
చేలకొంగువట్టిన సిగ్గు దలఁచి
సోలిఁ గొలు వున్నచోటి చూపులు దలపోసి
వోలి సంతోసములలో నోలలాడుచున్నది

చ. 3: ముప్పిరిగొనిన నీమోవితీపు దలపోసి
నెప్పున నీవు గూడిన నేర్పు దలఁచి
యిప్పుడు శ్రీ వెంకటేశ యీకె యలమేలుమంగ
వొప్పుగు సంతోసాన నోలలాడుచున్నది

రేకు: 0184-4 పాడి సంపుటం: 07-498

పల్లవి: తనకు నే విన్నవించేదానసనా చెలులాల
కనుఁగొంటే నాకుఁ దనకరుణే కలది

చ. 1: మనసులెనసితేను మంతనాలు సైకమౌను
కనుచూపులింపులైతే కలుగు రతి
చెనకులియ్యకోలైతే చేఁతలెల్లా సమ్మతౌను
పెనఁగితే వలపులు పిప్పిగట్టునే

చ. 2: సమ్మతించి వూఁకొంటే చవులౌను కతలెల్లా
కుమ్మరించితే ప్రియాలు కొనసాగును
నమ్మితేఁ జుట్టురికము నాఁటుకొని దైలువారు
దిమ్మరేఁచితే సిగ్గులఁ దెల్లవారునే

చ. 3: సరవులు నెరపితే సతమౌను కాఁగిలి
మరిగితే సరసము మక్కళించు
యిరవై శ్రీవెంకటేశుఁడితఁడె నన్నుఁగూడె
అరసి పైకొంటేనాసలే మించునే

రేకు: 0184-5 దేసాళం సంపుటం: 07-499

పల్లవి: ఇంతి మోహము లిఁకనేమని చేప్పేము నీకు
మంతనాన నాకె నేలి మన్నించవయ్యా

చ. 1: చిలుకలు మాఁటాడితేఁ జేరి నీవంపినయట్టి
చెలుల పలుకులంటాఁ జెవి యొగ్గి వినును
అలులు మొరసితే నీవాడకు వచ్చేయప్పటి
బలుశంఖరావాలని పై పై నాలకించును

చ. 2: మరుని పంచబాణాలు మనసున నాఁటితే
విరుల వేసేవంటా వెస నవ్వును
సురటుల విసరితేఁ జూచి నీ వూరుపు గాలి
సరుగనే తెంచెనని సంతోసించుకొనును

చ. 3: చందురుఁడుదయించితే చాయల నీపంజనుచు
యిందుముఖి నీరాకకునెదురువచ్చు
అందపు శ్రీ వెంకటేశ అంతలో నీవేలితివి
యిందులోఁ దెలిసి వాని హితులంటా మెచ్చును

రేకు: 0184-6 ఆహిరి సంపుటం: 07-500

పల్లవి: ఆతనివల్లఁ దప్పేది అరసి చూచేనంటే
కాతరపు నాగుణాల గతులింతే కాక

చ. 1: చనవుమెరసి నేను సారెకు మాటలాడఁగ
వినక మానీనా విభుఁడు తాను
ననిచి నాపై ప్రేమ నాఁటెనో నాఁటదో యని
అనుమానపు నామనసల్లాడీఁ గాక

చ. 2: వీడిన తురుముతోడ వేగమె నేమొక్కఁగాను
చూడక మానీనా సుగుణ తాను
వాడుదేర నన్నుఁగూడ వచ్చీనో రాఁడోయని
వేడుకతోఁ దమకించే విధమింతే గాక

చ. 3: పొంకానఁ గాఁగిలించి పొఁగ నేఁగూడఁగాను
లంకెగాక మానీనా శ్రీ వెంకటేశుఁడు
కొంకక నా రతులియ్యకొనునో కొనఁడోయని
సంకెలేని నాలో విచారమింతే కాక

రేకు: 0185-1 సామంతం సంపుటం: 07-501

పల్లవి: తల వంచుకోకుమీ తప్పు నీయందేమి లేదు
బలుదొరతనానకుఁ బాడి యిదే సుమ్మీ

చ. 1: ఇంతేసి నేనాడేది యిచ్చకము గాదు సుమ్మీ
కాంతలఁ జూచితే నీవు కరుణింతువు
అంతవాఁడవీమాటకు నట్టే సిగ్గువడకుమీ
బంతి దయగలవారి పాడి యిదె సుమ్మీ

చ. 2: వేడుక నిన్నుమెచ్చేది వెంగెములు గావు సుమ్మీ
కూడేమంటే సతులకుఁ గొంగిత్తువు
వాడికింతే యిందుకుఁగా వడి నవ్వునవ్వకుమీ
పాడిపంతాలవారికిఁ బాడి ఇదె సుమ్మీ

చ. 3: నమ్మించి కాఁగలించేది నమ్మనిది గాదు సుమ్మీ
యిమ్ముల సులభుఁడవు యెవ్వరికైనా
కమ్మి శ్రీ వెంకటేశుఁడ కలసితివిటు నన్ను
పమ్మి మోహపువారికిఁ బాడి యిదె సుమ్మీ

రేకు: 0185-2 బౌళి సంపుటం: 07-502

పల్లవి: కంటివటవయ్య నీవు కన్నుఁగొనల
వెంటనే చెయివట్టి తెరవేయవయ్య ఇపుడు

చ. 1: కంకణసూడిగములు గల్లురనఁగాఁ జెలి
పంకముగాఁ గస్తూరి నీపైనలఁది
సుంకులఁ గుచాలు నిన్ను సోఁకెనంటా సిగ్గువడి
అంకెలఁ దలవంచుక అదివో నవ్వీని

చ. 2: మొలనూలిగంటలు మోయఁగా నీశిరసున
నలరు తట్టుపుణుఁగు అట్టె నీకంటి
యెలమి మర్మాలు నీకునెక్కడనో తాఁకెనంటా
తెలిగన్నులను నీదిక్కే చూచీని

చ. 3: మట్టెల రవళితోడ మంచముమీఁదటనుండి
అట్టుగా మెప్పించె నిన్నాఁబడిభావాల
ఇటె శ్రీవెంకటేశ యింత సేయించితివంటా
ముట్టి మోవితేనెలాని మోహము చల్లీని

రేకు: 0185-3 పాడి సంపుటం: 07-503

పల్లవి: మరలి యేఁటిమాట మనమున్నచోటి
తరితీపులే కాక తమకించనేఁటికే

చ. 1: తేనెగారీ నీమోవి తేటలాయ నీమొగము
మోనానవిందుకే నేను మొక్కే నీకు
వానలాయఁ జెంజెమట వడి నీమేననెల్లా
ఆనుక పులకపైరులంటెను నామేనను

చ. 2: తెల్లనాయ నీకన్నులు దిష్టమాయ నీచేఁత
మొల్లమినిందుకే నేను మొక్కే నీకు
వొల్లనె నీముక్కున నిట్టూర్పుగాలి విసరఁగ
పల్లదపు నాగుబ్బలపైకొంగు జారెను

చ. 3: సరులు నీమేననొత్తి సరివచ్చె నీనవ్వు
మురిపెములాయ నేను మొక్కే నీకు
యిరవుగ శ్రీ వెంకటేశ నన్నునేలితివి
తెరలోనే నీకునాకుఁ దేరెను జగడము

రేకు: 0185-4 పాడి సంపుటం: 07-504

పల్లవి: సిగ్గులు పడకువయ్య చెక్కుచెయి దీయవయ్యా
నిగ్గుల నవ్వితిమి నీజాడలెరఁగక

చ. 1: వేడుకకాఁడవు నీవు వెలఁదులఁ గంటేను
కూడుకవత్తువుగాని కొల్లాడవు
వోడవేపనికినైనా వోపికగలవాఁడవు
ఆడుకొంటిమిందాఁక నీ ఆయాలెరఁగక

చ. 2: పాయపువాఁడవు నీవు పడఁతులేమి చేసిన
చాయల మెత్తువుగాని చలపోరవు
యీయకొందువేమైనా నింటివాఁడవందరికి
చేయివట్టి తీసితిమి చిత్తమిదెరఁగక

చ. 3: చెల్లుబడివాఁడవు శ్రీ వెంకటేశ యింతుల
పల్లదాలకు లోఁగాని పాయవెన్నఁడు
యిల్లిదె మమ్మేలితివి యిన్నిట దయానిధివి
వల్లెవేసితిమి నీవరుసలెరఁగక

రేకు: 0185-5 గౌళ సంపుటం: 07-505

పల్లవి: ఏమని విన్నవించేము యిన్నిటాజాణవు నీవు
కామినిభావము చూచి కరుణించవయ్యా

చ. 1: తలఁపులు వలపులు తరుణిపులక లాయ
సొలసి యాసలు కనుచూపులాయను
పిలిచేటి పిలుపులు పెదవిపై నవ్వులాయ
నెలఁతభాగ్యములిఁక నీ చేతివయ్యా

చ. 2: కోరినకోరికలెల్ల గుబ్బలమెరుఁగులాయ
పైరడిఁ గరఁగులెల్లఁ జెంజెమటాయ
నేరిచిన విన్నపాలు నిండునివ్వెరగులాయ
ధీరుఁడవిన్నిపనులుఁ దెలుకోవయ్యా

చ. 3: కందువతమకములు కాఁగిటిలో రతులాయ
ముందువెనకటిచింత ముచ్చటాయను
యిందులోనె శ్రీ వెంకటేశ యింతిఁ గూడితివి
విందుల విభవముల వెలసితివయ్యా

రేకు: 0185-6 శ్రీరాగం సంపుటం: 07-506

పల్లవి: మెత్తని మనసున మేలుదాన నిదె
చిత్తగించె దయసేయవయ్యా

చ. 1: పెంచిన చిలుకలు పెక్కులు పేలీ
నంచెల నిటు మాటాడవయ్యా
పంచలకోవిల పాటలు వాడీ
కొంచక వద్దనె కూచుండవయ్యా

చ. 2: గూఁటితుమ్మిదలు గొణఁగులు గొణఁగీ
గాఁటపు నీకొంగు గప్పవయ్యా
ఆటలనెమళ్ళు అవె కేఁకరించీ
నీటునఁ గాఁగిట నించవయ్యా

చ. 3: జక్కవపులుగులు సగినాలు చెప్పీ
పెక్కురతుల ననుఁ బెనఁగవయ్యా
యిక్కువ శ్రీ వెంకటేశ కూడితివి
తొక్కిహంసలు దొలఁగకువయ్యా

రేకు: 0186-1 శ్రీరాగం సంపుటం: 07-507

పల్లవి: ఎట్టు వలపంచితివి యింతగా నన్ను
బట్టుబయటనే నీపంతమెల్లఁ జెల్లెను

చ. 1: తమకమే మీఁదమీఁద దైలువారుఁ గాని
ఆమరు నీరతిఁ దనివందదు మతి
తిమురుచు నీరపు దిష్టించి చూచీఁ గాని
తెమలి రెప్పముయ్యవు తెల్లని నాకన్నులు

చ. 2: చేరి నీతో మాటలకు సిగ్గులు వాపీఁ గాని
ఆరీతిఁ బొంది యలయవడియాసలు
మేరతో నీకాఁగిటికి మెరుఁగులెక్కీఁ గాని
బీరము మానవు నాబిరుదైన చన్నులు

చ. 3: కందువ నీకాఁగిటిలో కతలు నేరిపీఁ గాని
సందడినలయదు నాచల్లనిమేను
అంది శ్రీ వెంకటేశ నిన్నలమి మెచ్చీఁ గాని
గొందినొదుగదు నాకోరికతో గుణము

రేకు: 0186-2 ముఖారి సంపుటం: 07-508

పల్లవి: కూడితిమిందరము గుంపులాయ నీమోహము
వేడుకకు వెలలేదు వెరుపేల నీకు

చ. 1: సతమైన పనులకు చంచలము మరియాల
మతిలో నిర్మలమౌటే మంచిదౌఁగాక
గతి నీకునాపె నీవుగలిగితివాపెకును
వెతదీరెనందరికి వెరుపేల నీకు

చ. 2: చేసిన చేఁతలకును చింతించ మరియాల
ఆల భోగించుటే అందమౌఁగాక
సేస నీవు చల్లితివి చేతులు నీపైమోచె
వేసటెల్లాఁ బాసెనిఁక వెరుపేల నీకు

చ. 3: కలిగిన పనులకు కడమలు మరియాల
కొలముగా నిల్లునించుకొందువుగాక
యెలమి శ్రీ వెంకటేశ యిట్టె నన్నునేలితివి
వెలసె నీసుద్దులెల్లా వెరుపేల నీకు

రేకు: 0186-3 రామక్రియ సంపుటం: 07-509

పల్లవి: ఎంతటిమగవాఁడవు యేఁటికి నీకుఁగొంకను
చింతలేక నీయిచ్చలఁ జెలరేఁగరాదా

చ. 1: మొగము చూచిన లోలో ముసుగువెట్టుకొనేవు
చిగురుగోరిచేఁతలు చెక్కులంటెనో
నగుతా కొంగువట్టితే నంటున సిగ్గువడేవు
అగడుగా నెవ్వతైనా ఆయాలు సోఁకించెనో

చ. 2: కందువమేను ముట్టితే గందము వూసుకొనేవు
విందుల నీపులకలు వెల్లవిరయ్యీనా
మందలించి మాటాడితే మౌనాననున్నాఁడవు
యిందులో నీబుసకొట్లెరఁగ వచ్చీనా

చ. 3: చన్నుల నిన్నొత్తితే సారెసారె లోఁగేవు
అన్నిటా నీవలపులు అట్టే కాఁగీనా
మన్నించిన యలమేలు మంగనై నిన్నుఁగూడితి
సన్నల శ్రీవెంకటేశ సంతోసషములాయఁగా

రేకు: 0186-4 దేసాక్షి సంపుటం: 07-510

పల్లవి: ఏమిసేసు మరి యెక్కడ చొచ్చును
సామజవరదుని సహజమిదియ పో

చ. 1: ఏకతమాడెను యింతితోనతఁడు
దాకొని యిదేమి తప్పటవే
కైకొనవచ్చినఁ గన్నులఁ జూచెను
యేకడనితనికి యివి నేరములా

చ. 2: నవ్వులు నవ్వెను నలినాక్షితోడ
అవ్వలనిదేమి అన్యాయమా
రవ్వగ మొక్కిన రతిఁ జెయిచాఁచెను
చివ్వన నది సేసినదోసములా

చ. 3: గక్కనఁ గూడెను కలికి దగ్గరిన
వెక్కసమిదేమి వెలితౌనా
యెక్కువ శ్రీ వెంకటేశుఁడు గూడెను
మక్కువ నలమేల్మంగనౌదునే

రేకు: 0186-5 భైరవి సంపుటం: 07-511

పల్లవి: విన్నపములెల్ల నాచే విందువుగాక
సన్నలెల్ల సరివచ్చె జాగులిఁకనేలా

చ. 1: నగినట్టివాఁడవు నాలియిఁకఁ జేయకుమీ
చిగురుమోవిచవులఁ జిక్కుదుగాని
మొగమెదుటనుందాన మోహము నీలోనున్నది
అగడాయఁ బనులెల్లననుమానాలేలా

చ. 2: మాటలాడినవాఁడవు మరిగుట్టుసేయకుమీ
యీటుగా నీమనసెల్లనిత్తువుగాని
పాటించి నీకు మొక్కితి భావము నీవెరుఁగుదు
కూటములు నెరవేరె కొంకుగొసరేలా

చ. 3: మెచ్చినట్టివాఁడవు మేకులిఁకఁ జేయకుమీ
అచ్చలాన యిక్కువలే అంటుదుగాని
యిచ్చగించి శ్రీ వెంకటేశ నన్నుఁ గూడితివి
లచ్చనలే గురుతాయ లాగవేగాలేలా

రేకు: 0186-6 గౌళ సంపుటం: 07-512

పల్లవి: నేనే యింతసులభమా నీకెపుడు
ఆనుక సరిగాఁ జూడుమాతని నన్నిపుడు

చ. 1: ఆతనిమాటలకును అడ్డమాడఁగలనా
నీతాలే బోధించేవే నీవు మాతోను
చేతులువట్టుకొంటేనే చేఁతలెల్లా మరచేనా
యేతుల నాయకునికి యిట్టె విన్నవించవే

చ. 2: చిత్తమురా తనకును సేవసేయఁగలనా
వొత్తి నన్నింత యాల వొడివట్టేవే
బత్తిసేసినంతలోనే పంతము విడుతునా
హత్తిన రమణునికి ఆయములు దెలుపవే

చ. 3: శ్రీ వెంకటేశుతోడ సిగ్గువడఁగలనా
నీవిన్నియు నాకునేల నేరిపేవే
యీవేళ నన్నిటుగూడె యెప్పుడూ మఱతునా
చేవదేర నితనికి సెలవులు వెట్టువే

రేకు: 0187-1 కేదారగౌళ సంపుటం: 07-513

పల్లవి: అందులోనే వున్నవి ఆయములెల్ల
మందలించనివాఁడవా మతకరివి

చ. 1: మన్నించే నీనాలోనొక్కమాటపట్టుకే కదా
నన్ను నిన్నుఁ జూచుకొని నవ్వితి నేఁడు
విన్నపాలిందుకుఁగాను వేగినంతాఁజేయనేల
సన్నెరఁగనివాఁడవా చతురుఁడవు

చ. 2: ఇచ్చకపు నీవు సేసే యెన్నికలకే కదా
పచ్చిచేఁతలెల్లాఁజేసి భ్రమసితిని
తచ్చితచ్చియిందులోనే తగవులఁ బెట్టునేల
మచ్చికలేనివాఁడవా మాటకారివి

చ. 3: కోరిక నీవుగూడిన కూటములకే కదా
చూరలైన రతులను చొక్కితినిట్టే
యీరీతి శ్రీవెంకటేశ యేలితివి నన్నునిట్టే
మారునితండ్రివి నీవే మండెమురాయఁడవు

రేకు: 0187-2 సాళంగనాట సంపుటం: 07-514

పల్లవి: ఆసోదకాఁడవు నీవు అయితే నౌదువుగాక
వేసటౌను కొసరితే వేమారు వలెనా

చ. 1: మోవిపంటిలోననే మోహపురసాలు నించి
వేవేలు విందులువెట్టీ వెలఁది నీకు
యీవల మమ్మువిందులు యేలడిగేవప్పటిని
భావించితే మొగచాటు పైపైనే వలెనా

చ. 2: కడుమంచి చూపులనే కప్పురాలు నించి నించి
యెడయక విడేలిచ్చీ నింతి నీకు
వడి మా విడేలకే వరుఁసజేయిచాఁచేవు
విడువకైతే కారాలు వేగినంతా వలెనా

చ. 3: వింతవింతకాఁగిటను వియ్యమందెనాపె నీతో
చెంతల నవ్వులు నవ్వీ శ్రీవెంకటేశ
బంతి నన్నుఁ గూడితివి పచ్చిగాఁగ బుజ్జగించి
కాంతల చుట్టురికము కందువ గావలెనా

రేకు: 0187-3 నాదరామక్రియ సంపుటం: 07-515

పల్లవి: నీతలనే వేగెనా నెట్టుకొన్న వలపులు
యేతుల సిగ్గువడకు యింటికాడిబేరము

చ. 1: చేసెనా అంగన నీకు చేసన్నలెల్లాను
వ్రాసెనా చెక్కుల గోరివాతలెల్లాను
మూసుకొనేవేమి నేఁడు మొగవాఁడవిందరిలో
దోసమా నీకందుకేమి తొలుసారిలాబము

చ. 2: నేరిపెనా ఆపెనీకు నిండుకొన్న విద్యలెల్లా
సారపుమోవితీపులు చవిచూపెనా
ఆరసియుఁ గొంకనేల అన్నిటా జాణవు నీకు
భారములేదించుకంతా బండవలము నీకు

చ. 3: కూడించె యాపె నీకు గురుతైన పొంతనాలు
వీడెమిచ్చెనా యిట్టే వెల్లవిరిగా
యీడనే శ్రీ వెంకటేశ యిటు నన్నునేలితివి
ఆడనీడానొక్కవెలే అంగడిలో సరకు

రేకు: 0187-4 శంకరాభరణం సంపుటం: 07-516

పల్లవి: ఎందరు చుట్టాలు గల్లానింతకు మేలే
అందుకోలువలపులకంగవించేఁ గాక

చ. 1: బత్తిసేసీనాపె నీపై పరాకుసేయకువయ్యా
చిత్తములోఁ గల మాటే చెప్పీ నీకు
హత్తినేను వద్దనుండ యందుకింత సేయనేల
సత్తుగా నే వద్దనేలా సంతోషించేఁ గాక

చ. 2: ఇచ్చకముసేసీనాపె యేల వూరకున్నాఁడవు
చెచ్చెరఁ జేసేమాటే చెప్పీ నీకు
ముచ్చట నేనెరిఁగితే మూసిదాఁచనింతయాల
మచ్చికలేమి గల్లాను మరిమెచ్చేఁ గాక

చ. 3: కలసిపెనఁగీనాపె కడమలేల పెట్టేవు
చెలిమికత్తెల సుద్ది చెప్పీ నీకు
యెలమి శ్రీ వెంకటేశ యీడనున్నఁ గూడితివి
నలువంకమేకులకు నవ్వు నవ్వేఁ గాక

రేకు: 0187-5 సామంతం సంపుటం: 07-517

పల్లవి: పంచుక అనుభవించు పడఁతులమిందరము
ముంచి నీమన్నన నాపై మోహముగలంతే

చ. 1: మనసిచ్చి నాతోను మాటాడుటే పదివేలు
యెనయుమనుచు దూరనెంతదానను
చనవు నీదొకటే సతులు పదారువేలు
పెనఁగితే నెంతవచ్చు బెరసి నావంతు

చ. 2: యిచ్చగించి నాయెదుట నిరవవుటే పదివేలు
యెచ్చరించి కొసర నేనెంతదానను
అచ్చపు నీకాఁగిలిడే అతివలు శానాశాన
ఇచ్చితివి నావంతు యెంతవచ్చునందును

చ. 3: కందువ నీరతి నన్నుఁ గలయుటే పదివేలు
యిందరిలోఁ జెప్పేనంటే యెంతదానను
విందుల శ్రీ వెంకటేశ విభుఁడవు నేమాండ్ల
మిందులో మించితి వంతుకెంత వచ్చునిపుడు

రేకు: 0187-6 కాంభోది సంపుటం: 07-518

పల్లవి: పదియారువేలు నిన్నుఁబైకొనుట యేమరుదు
మొదలనె నిన్నుఁగంటే మోహించకుందురా

చ. 1: చెక్కులకళల నిన్ను సెలవినవ్వుల నిన్ను
పక్కన నేనిటు చూచి భ్రమసితివి
చక్కనివాఁడవు తొల్లే సరి నివి గొన్నియైతే
మొక్కుచుఁ జెలులు నీకు మోహించకుందురా

చ. 2: తేనెలమాటల నిన్ను తియ్యనిమోవి నిన్ను
పూని దగ్గరినంతలో పొంగితినిదే
ఆనుక వయసువాఁడ వందుకుఁదోడివియైతే
మోనమున సతులెల్ల మోహించకుందురా

చ. 3: నేరుపురతుల నిన్ను నీటురాజసాల నిన్ను
గారవించి కాఁగలించి కరఁగితిని
యీరీతి శ్రీ వెంకటేశ యిది నీకె వన్నెవెట్టె
మోరతోపుచెలులైన మోహించకుందురా

రేకు: 0188-1 సామంతం సంపుటం: 07-519

పల్లవి: ఏమాయనే మీకునేలె చింత
యీమేరవలపులు యిమ్మడికి ముమ్మడి

చ. 1: నగవులే తగవులు నయములే ప్రియములు
జగడాలు మానినట్టి సతులకును
మిగిలి పతియున్నాఁడు మీయిద్దరినడుమను
జగతి మీవలపులు సరియె బేసి

చ. 2: మాటలే మూటలు మంతనాలే పొంతనాలు
కూటములెరిఁగినట్టి కోమలులకు
వాటముగా నిద్దరికి వరుసయిచ్చె విభుఁడు
మోట్టుపెట్టి వలపులు ముదియనాఁగాయను

చ. 3: కనుచూపులే తీపులు కరఁగులే మొరఁగులు
చనవులు గలిగిన సతులకును
యెనసె శ్రీ వెంకటేశుఁడిద్దరిని నొక్కమాటె
ననుపు వలపురెంటినడుమ మెరసెను

రేకు: 0188-2 దేసాళం సంపుటం: 07-520

పల్లవి: ఏమిచెప్పేవిఁక మాతోనెందాఁకను
మామాటలివియపో మరినేమెరఁగము

చ. 1: కూరిమియాఁటదానికి కొసరినంతాఁ జెల్లు
ఆరసి యింకానేమి ఆడేవయ్యా
నేరుపు నీకుఁ గలితే నావాపెకు లోనౌట
యేరీతి మాటాడినా యింకానేమెరఁగము

చ. 2: పాయపువనితకును పచ్చివలపెల్లాఁ జెల్లు
చేయివట్టి యిఁకనేమి చెప్పేవయ్యా
నాయమే నడపితేను నగుతా సమ్మతించుట
మాయపు కతలకెల్ల మరినేమెరఁగము

చ. 3: చక్కనియింతికి మరి సాదించినట్టే చెల్లు
పెక్కుసుద్దులిఁకనేల పెంచేవయ్యా
గక్కన శ్రీ వెంకటేశ కలసితిరిద్దరును
మక్కళించి విన్నపాలు మరినేమెరఁగము

రేకు: 0188-3 రామక్రియ సంపుటం: 07-521

పల్లవి: ఆతఁడు జాణగాఁబట్టి అట్టేలోనికిఁ దీసి
యేతులెల్లాఁ జెల్లఁబెట్టె నేమి సేసేవే

చ. 1: చనవున నాయకుఁడు సరిఁ జన్నులంటితేను
పెనఁగి తిట్టుదురటే ప్రియురాలవు
గునియఁగానిందరిలో గురుతులు మోఁచితేను
యెనలేదప్పుడు సిగ్గు యేమి సేసేవే

చ. 2: కూరిమితో రమణుఁడు కొప్పువట్టి తగిలితే
గోరున గీఁటుదువటే గుణనిధివి
ఆరసి చూచితే పయ్యదకొంగు జారితేను
యేరీతినుండునో సిగ్గుయేమి సేసేవే

చ. 3: శ్రీవేంకటేశ్వరుఁడు చేరి నిన్నుఁ గూడితేను
కావించి మీరుదురటే కలదానవు
మోవిగంటి సేసితివి ముద్రలు నిన్నంటెనిట్టే
యీవేళ సిగ్గులకు నీవేమి సేసేవే

రేకు: 0188-4 మధ్యమావతి సంపుటం: 07-522

పల్లవి: రావయ్య నీకేల యింత రామలతో బాసలు
భావించి నిన్నుఁజూచితే పై కొనకవుందురా

చ. 1: వుండుండి భూమివారెల్లా వూరకే నీకన్నులను
పుండరీకములనిట్టే పోలునందురు
కొండవలె నీవునేఁడు గొల్లెతలనంటఁగాను
అండనె నీపై నిందలాడకుందురా

చ. 2: యింతలో నల్లనుండఁగ యిందరు నీతిరుమేను
పొంతనట్టే నీలాద్రిఁ బోలునందురు
వింతగా చీఁకటిలోన వెన్నలు దొంగిలు నిన్ను
యెంతైనా నల్లఁదెల్లలు యెంచకుందురా

చ. 3: శ్రీ వెంకటేశుఁడ నీచేతిశంఖచక్రాలు
పూవుగుత్తుల చన్నులఁ బోలునందురు
కావించి మావంటివారిఁ గాఁగిలించి కూడితివి
చేవదేరె నిన్నురట్టు సేయకుందురా

రేకు: 0188-4 లలిత సంపుటం: 07-523

పల్లవి: దానికేమి దోసమా తగులములెంచుకొని
తానకమై లోలోనే తప్పక మించితివి

చ. 1: యింతి నీతో బలిమా యెదురాడఁగలదా
చెంతల నీవుండఁగాను చెయి వట్టెను
పంతగాఁడవౌదువు పడఁతికంటాఁ దొల్లి
దొంతరలైతే వలపులు తోయరాకున్నాఁడవు

చ. 2: కోపమింకఁ దగునా కోమలి చలాలదా
కోపుల నీవు నవ్వఁగా గోరగీరెను
తీపులు నేరుతువు దిక్కులెల్లానెరుఁగును
పూఁపలు చన్నులుగాఁగా పొందులుసేసితివి

చ. 3: గుట్టు నీకుఁజేసునా గురుతులు వెట్టునా
యిట్టె నీవుగూడఁగాను యెనసెఁగాక
దిట్టువు నీవౌదువు తేఁకువ శ్రీ వెంకటేశ
పట్టిన వ్రతముగాఁగా పైకొని మెచ్చితివి

రేకు: 0188-5 మంగళకౌశిక సంపుటం: 07-524

పల్లవి: నిజమై ఆతఁడు వచ్చి నిలుచున్నాఁడెదుటను
త్రిజగములును మెచ్చ దిష్టమాయఁ బనులు

చ. 1: లక్కవంటి నాచిత్తాన లచ్చనై ఆతనిరూపు
వొక్కటైవున్నదినేఁడు వొక్కటొక్కటే
యిక్కువ మామోముచూచి యేమినవ్వేరే చెలులు
చిక్కె మాకిద్దరికి మీచేసినట్టి పొందులు

చ. 2: పూవువంటినాకోరిక పూఁపవంటాతనిమాట
తావుకొనివున్నవిలే తమలోనను
యీవల మాగుణాలకు నేమి మెచ్చేరే మీరు
దీవించి మీరిట్టె దిద్దిన దిద్దుబడులు

చ. 3: పాలవంటినాయాస పంచదారాతనిమోవి
తాలిమిఁగూడి వలపుదై వారీని
యీలోన శ్రీ వెంకటేశుఁడిచ్చగించి నన్నుఁగూడె
మేలనేరు యిదిమీరు మీసంతోసములే

రేకు: 0189-1 శంకరాభరణం సంపుటం: 07-525

పల్లవి: ఆఁటదానఁ గనక నిన్నంటి నేను
గాఁటపు దేవరవింకఁ గరుణించవయ్యా

చ. 1: మనసు దెలియలేక మరి నేఁ దమకించితి
ఘనుఁడవు నీవొళ్ళఁ గడమున్నదా
వెనకటిసుద్దులకు వేవేల వెంగేలాడితి
నినుపునిజమరివి నీకుఁ దప్పులున్నవా

చ. 2: వలపు నాపైనుండఁగ వట్టినేరములెంచితి
చెలువుఁడవు నన్ను రక్షించకుందువా
చలములకే నీతో సారెసారెఁ బెనఁగితి
పలుకుపంతగాఁడవు పాడిదుప్పేవా

చ. 3: చేయి నీవు చాఁచఁగాను చెక్కుగోరు దాఁకించితి
ఆయములు నీవెరఁగనట్టివున్నవా
పాయపు శ్రీ వెంకటేశ పైపైనన్నుఁగూడితివి
దాయగాఁడవు నన్నిట్టే దరిచేర్చవా

రేకు: 0189-2 ముఖారి సంపుటం: 07-526

పల్లవి: కలికి చిలుకలకొలికి నీకునేము
చెలులముసంతోసము చేసితివే మాకు

చ. 1: అవ్వలిమోమైనవాని ఆయములు సోఁకనాడి
యివ్వల చేకొంటివిదివో నేర్పు
పవ్వళించి సతులపై పరాకై వుండినవేళ
నవ్వులు నవ్వించితివి నయగారివౌదువే

చ. 2: పంతములాడినవాని పానుపుమీఁదికి నేఁడు
యింతగా రప్పించుకొంటివిదివోనేర్పు
చెంతల నవ్వఁగా నన్నుచేరి జూజమాడేవేళ
వింతరతికిఁ దీసితి వివరి వౌదువే

చ. 3: సన్నలు సేసినవాని చాయఁ బైఁదీసుకొని
యెన్నిక చేకొంటివిదివో నేర్పు
అన్నిటా శ్రీ వెంకటేశుఁడాతఁడు చేకొన్నవేళ
మన్ననల మించితివి మంచిదానవౌదువే

రేకు: 0189-3 దేసాక్షి సంపుటం: 07-527

పల్లవి: చెలులమెందాఁక నీకు చెప్పేము బుద్ధి
నిలుచుకున్నది యింతి నీరాకకెదురు

చ. 1: పలికితివాకెతోడ పంచమవేదములు
తలఁచుకోవయ్య నీవు తగులాయాలు
పిలిచితిమిదే నిన్ను ప్రియమెల్లాఁ జెప్పితిమి
తెలుకోవయ్య యిట్టె తేనెమోవితీపులు

చ. 2: కురిసితివి నవ్వుల గురిగాఁబువ్వులవాన
కరఁగుకోవయ్య లోలో గట్టిమనసు
మరిగించితివి మరి మచ్చికలు సేసితివి
వొరసుకోవయ్య చన్నులొగిఁ బైఁడికుండలు

చ. 3: పెట్టితివి చూపులనే పెనకప్పురవీడేలు
మెట్టురయ్య పాదములు మీరు మీలోన
యిట్టె శ్రీ వెంకటేశ యిద్దరిఁ గూరిచితిమి
జట్టిగొనవయ్య నీవు సరసపురతులు

రేకు: 0189-4 గౌళ సంపుటం: 07-528

పల్లవి: ఇందవయ్య విడెము యేలకొంకేవు
సందుకొని మెచ్చేఁ గాక జంకించేనా

చ. 1: తాలిమిగలదొకతె తగ నీతోనలిగితే
యీలీల మోహించి నేమింతకోపేమా
నాలిక త్తెలమై నేము నవ్వనేర్తుముగాక
వీలుచును మొగమోట విడువఁగఁగలమా

చ. 2: గుట్టుచేసి వేరొక్కతె కొసరి నిన్నుఁ దిట్టితే
యిట్టె మన్ననలవారమింతకోపేమా
దట్టించి నీబాసలెల్లఁ దలఁపించనేర్తుఁ గాక
వెట్టుయైన నిష్టూరము వేయఁగనోపుదుమా

చ. 3: కూడేవేళ యెవ్వతైన గోరనిన్ను గీరితేను
యీడవెట్టుకొని నేము యింతకోపేమా
కూడితి శ్రీవెంకటేశ గురుతులివేకాక
పాడిపంతములు నీతోఁ బచరించేమా

రేకు: 0189-5 దేసాళం సంపుటం: 07-529

పల్లవి: ఎందరికిని వుత్తరమిచ్చేవు నీవు
సందడించి వొక్కమాటే చల్లేరు సరసము

చ. 1: చెంతలనుండి నీవు సెలవుస నవ్వఁగాను
కాంత నీమొగముచూచి కన్నులార్చీని
వింతలు మీచేఁతలెల్లా వెలఁదులు చూచి తాము
దొంతిఁబెట్టి వలపులు తోడురేఁచుకొనిరి

చ. 2: పలుమారు నీమీఁదిపాటలు నీవు వాడఁగ
వెలఁది వీనుల విని వెరగందీని
కొలువువారెల్ల మీగురుతులు చూచి తాము
చలపట్టి అందరును చవిరేఁచుకొనిరి

చ. 3: శ్రీ వెంకటేశ రతికి చేతులు నీవు చాఁచఁగ
కావించి నిన్ననదిమీ కాంతచన్నుల
వోపరిలోనుండఁగాను వూడిగాలవారెల్ల
సేవలుచేసి మొక్కి చిమ్మిరేఁచుకొనిరి

రేకు: 0189-6 భైరవి సంపుటం: 07-530

పల్లవి: వట్టి సిగ్గులిఁకనేల వద్దనున్నది
గట్టియాస నీపనులు కడపరాయ

చ. 1: ముంగిట నీకుపారము మోవితేనెలిటు చూపి
యెంగిలివలపుచల్లెనిదివో ఆకె
సింగారించుక చన్నులజిగి నీమొకముసేసి
అంగడివలపు చల్లెనదివో నీకు

చ. 2: కువాడానఁ జెప్పరాని గురుతు కన్నులఁ జెప్పి
నివాళివలపుచల్లె నీమీఁద నాకె
భవంతిమేడలో నిన్నుఁ బారితెంచి కాఁగలించి
దువాళివలపు చల్లె తొయ్యలి నీకు

చ. 3: పంతాన నీవు మెచ్చ వుపరిసురతముసేసి
దొంతవలపుచల్లె దొరసి యాపె
యింతలో శ్రీ వెంకటాద్రినెనసితివిటు నన్ను
బంతివలపులుచల్లె పయిపయి నీకు

రేకు: 0190-1 రామక్రియ సంపుటం: 07-531

పల్లవి: ఒంటి నీకెదురుచూచి వుందాన నేనింటిలోన
వెంటవెంటఁ దిరిగాడి వేరించనేరను

చ. 1: సిగ్గున నుందానఁ జుమ్మీ చెలువుఁడ నీవు నాతో
నిగ్గుల మాటాడి ప్రేమ నించుదాఁకాను
యెగ్గులేక నీకు మీఁదెత్తితి జవ్వనమెల్లా
వెగ్గళపు విన్నపాలు వేరే సేయనేరను

చ. 2: నవ్వుతానుందానఁ జుమ్మీ నాలోనియాసతో నీవు
చివ్వన తలయెత్తి చూచినదాఁకాను
యివ్వల కానుకిచ్చితి విట్టే చక్కఁదనమెల్లా
రవ్వగాఁ గొరి నిన్ను రాఁపుసేయనేరను

చ. 3: ఆసలనుందానఁ జుమ్మీ అట్టె శ్రీ వెంకటేశ
నీసరి నేఁడు గూడి మన్నించుదాఁకాను
వాసుల నీకందిచ్చితి వన్నెల నామనసెల్లా
సేసవెట్టితివి మరి చింతించనేరను

రేకు: 0190-2 బౌళి సంపుటం: 07-532

పల్లవి: వీడెమింద కోపయ్య వింతవారమా
వేడుకకు వెలలేదు వెరుపేల నీకు

చ. 1: కొండవంటిచెలి నిన్ను కొంగువట్టి తీసితేను
దండిమొగమోటమునఁ దగిలితివి
దుండగపువాఁడవా దోసము నీవల్లనేది
నిండినది తగవె పోనీకేల వెరపు

చ. 2: పొద్దువోనియాపె నీపై బొమ్మలమేలు చల్లితే
గద్దించఁజాలక నీవుగైకొంటివి
దిద్దరానివాఁడవా దీనికి వచ్చినదేది
కద్దు నీవొళ్ళ నిజము కాదున నీకు వెరపు

చ. 3: ఆయమెరిఁగినతి అంటితేఁ గడపలోన
పాయపువెంకటేశ పట్టి కూడితి
కాయకపువాఁడవా కైకొంటివి నన్నునిట్టే
నీయందుఁ గడమేది నీకేల వెరపు

రేకు: 0190-3 మాళవి సంపుటం: 07-533

పల్లవి: ఇంతసేతురటవే యీతని నేఁడు
వింతలు మామాటలివి వినవే వోచెలియా

చ. 1: పంతమాడుకొనరాదువ పతితోడ సతికిని
అంతరంగమెరిఁగిచ్చలాడుటగాని
దొంతులు వెట్టఁగరాదు తోడుతనే చలములు
కొంత వినయాన వంచుకొనవలెఁ గాని

చ. 2: వాసికిఁ బెనఁగరాదు వద్దనున్న నాయకుని
మోసలేక మెప్పించి మొక్కుటగాని
ఆసలు మానుపరాదు ఆయాలు సోఁకినవేళ
సేసవెట్టి తనివంద చెందవలెఁగాని

చ. 3: కాదుగూడదనరాదు కాఁగిట శ్రీ వెంకటేశు
నాదరించి సరసములాడుటగాని
పోదితోనాతఁడె నిన్ను భోగించె కడమలేదు
పాదుకొన్న తమకము పంచుకొంటగాని

రేకు: 0190-4 రామక్రియ సంపుటం: 07-534

పల్లవి: చేకొనుమీ నల్లఁబల్లి చెన్నకేశవా
యీకడ నీ కిన్నిటికినిదవో మొక్కేను

చ. 1: పొంచి నీవు విలిచితే బొమ్మల జంకించితిని
మంచముపై నుండితిని మన్ననలను
కంచముపొత్తుకుఁ దియ్యఁగా నీతోఁ బెనఁగితి
యెంచకుమీ యీనేరాలిదివో మొక్కేను

చ. 2: సరసము నీవాడితే సారెసారెఁ దిట్టితిని
సిరులఁ జెనకితేనే చెలఁగితిని
శిరసు వంచుకొంటిని చెరఁగు నీవు వట్టితే
యెరవుసేయకు నన్నునిదివో మొక్కేను

చ. 3: సెలవి నీవు నవ్వితే సిగ్గులు పైఁజల్లితిని
సొలసి చెక్కు నొక్కితే చొక్కితి నేను
కలసితివిదె శ్రీవెంకటగిరినుండి వచ్చి
యెలమిఁ దమకించకు యిదివో మొక్కేను

రేకు: 0190-5 నారణి సంపుటం: 07-535

పల్లవి: గుణము దెలిసెనంటా గుబ్బున నున్నాఁడతఁడు
అని వెట్టి మమ్ము మాటలాడించేవే నీవు

చ. 1: చెక్కునఁ బెట్టినచేయి సిగ్గులే వడియఁజొచ్చె
యెక్కువపతిఁ జెనకేదెపుడే యిఁక
ముక్కునఁ బెట్టినవేలు ముసిముసి నవ్వులూరీ
మక్కళించి నీవాడే మాటలెప్పుడే

చ. 2: తప్పక చూచినచూపు తలపోఁతలే పెంచీ
కప్పురబాగాలిచ్చే గతులెప్పుడే
కప్పిన పయ్యదకొంగు కమ్మఁజెమటలుబ్బించీ
విప్పుచు మోవితేనెవిందులు వెట్టేదెవుడే

చ. 3: మంచముపై నున్నకేలు మర్మములెల్లానెత్తిచ్చీ
నించిన రతులలోని నేరుపెప్పుడే
యెంచుక శ్రీవెంకటేశునింతలోనఁ గూడితివి
చుంచుల సరసముల సుద్దులెప్పుడే

రేకు: 0190-6 దేసాక్షి సంపుటం: 07-536

పల్లవి: మామాట విని నీవు మచ్చికలు దైవార
ఆముకొని పతిమేను అంటంగరాదా

చ. 1: మనసు నమ్మినయందు మతకాలెంచఁగనేల
చనవు గలిగినందు జరయనేలా
కినుకలు లేనియందు కేరడము మరియాల
పెనఁగక పతినిట్టే పిలువరాదా

చ. 2: చేతికి లోనైనయందు సిగ్గులువడఁగనేల
బీతి విడిచినయందు బీరములేల
యేతులు నెరపనందు యెగ్గులు దలఁచనేల
జాతి నీనవ్వులు మీఁదఁ జల్లరాదా

చ. 3: కప్పురవీడేలందు కాఁకలు చల్లఁగనేల
చిప్పిలు రతులయందు చింతించనేల
యిప్పుడే శ్రీవెంకటేశుఁడీతఁడిదె నిన్నుఁగూడె
దప్పిదీర మోవియిచ్చి తనివందరాదా

రేకు: 0191-1 శుద్ధవసంతం సంపుటం: 07-537

పల్లవి: కరుణించవయ్య యిఁక కడు జాణవౌదువు
వొరసేరింతులు పొదటూరిచెన్నరాయా

చ. 1: దగ్గరి కొలనిదరి తరుణులెల్లాఁగూడి
సిగ్గులఁ జాఁచేరదివో చేతులు నీపై
వెగ్గళించి కన్నుల వెడనవ్వులు నవ్వుతా
వొగ్గేరు వలపు పొదటూరిచెన్నరాయా

చ. 2: తొల్లి నోఁచిననోములు తోడనిట్టే పలియించె
వల్లెగా నీపొందులకు వచ్చివున్నారు
చల్లలమ్మేమాటలనే సరసములాడేరు
వుల్లములలర పొదటూరిచెన్నరాయా

చ. 3: చీరలు నీవియ్యఁగాను చేకొని కాఁగలించిరి
మేరతో శ్రీ వెంకటాద్రిమీఁదనే నిన్ను
గారవించి యిందునందు కందువలు మెరసిరి
వూరటగా నీకుఁ బొదటూరిచెన్నరాయా

రేకు: 0191-2 వరాళి సంపుటం: 07-538

పల్లవి: కాదు గూడదననేల కక్కసించ నీతోనేల
సేదదేర నేర్చినట్టు సేవ సేసేను

చ. 1: ఆపెకు బుద్దులుచెప్పి అట్టెనాకు మొక్కించి
యేపుననున్నాఁడ విట్టె యెరఁగనట్టే
కోపగించుకొనరాదు కోరి నీతో నవ్వరాదు
వోపినపనిసేసి వొద్దనుండే నేను

చ. 2: కామినికి సన్నసేసి కానిక నాకిప్పించి
యేమియని అడిగేవు యెరఁగనట్టే
మోమోట విడువరాదున మొక్కలముసేయరాదు
గోమున నీకొలువులో కుంచ వేసే నేను

చ. 3: యింతిచే విడెమిప్పించి యెగ్గులెల్లాఁ దీర్చితివి
యెంతకెంత సేసితివి యెరఁగనట్టే
కాంతుఁడ శ్రీ వెంకటేశ కలసితివిటు నన్ను
పంతానకు నీకునేఁడు పాదాలొత్తే నేను

రేకు: 0191-3 హిజ్జిజి సంపుటం: 07-539

పల్లవి: ఎంతకెంత విచారములేమున్నవి
పొంతల నేము చేసిన పుణ్యమిదిగాక

చ. 1: మరిగినదాన నే మాటల దూరితిఁ గాక
దొరవు కోపములు నీతోఁ జెల్లునా
తెరమరుఁగింతె నీవు తెలియనిదేమున్నది
పొరసి నేము సేసిన పుణ్యమిదిగాక

చ. 2: పాయపుదాననై పదరి అంటితిఁ గాక
చాయకాఁడవు నీతో సలిగెల నా
నాయములెంచి చూచితే నాకు నీకు భేదమేది
పోయినరాత్రి సేసిన పుణ్యమిది గాక

చ. 3: మనసులోదాననై మర్మములు రేఁచితిఁగాక
చెనకి నీమేను పచ్చిసేయఁదగునా
ఘనుఁడ శ్రీ వెంకటేశ కలసితిమిద్దరము
పొనుఁగక నేఁజేసిన పుణ్యమిదిగాక

రేకు: 0191-4 మంగళకౌశిక సంపుటం: 07-540

పల్లవి: పొంచి నే వారికినెల్లాబుద్ది చెప్పేను
యెంచరానిమాటాడేవారెవ్వరయ్య నిన్నును

చ. 1: చేరి నిన్నునాపెచూచి చిత్తములో గురి దాఁకె
సారెనిఁక మరేల విచారించేవు
చేరువ నేనున్నదాన చేతిలోనిదాననింతే
యీరసానఁ గాదనేవారెవ్వరయ్య నిన్నును

చ. 2: నవ్వేవారెల్లా నవ్విరి ననుపు నీకంతనాయ
నివ్వటిల్ల నీకు వట్టి నేమములేలా
మువ్వంక నీచేఁతలెల్ల మూసి దాఁచేదాననింతే
యివ్వలరట్టు సేసేవారెవ్వరయ్య నిన్నును

చ. 3: వూడిగము నేఁజేసితి వొద్దనున్నఁ గూడితివి
వేడుకతోనిందుకెంత వెరగందేవు
పాడితో శ్రీ వెంకటేశ పట్టపుదేవిని నేను
యీడఁ దప్పునవట్టేటి వారెవ్వరయ్య నిన్నును

రేకు: 0191-5 పాడి సంపుటం: 07-541

పల్లవి: ఎందు వోయ నేనీకు యెప్పుడు గలదాననే
కందువ వింతవారి గక్కనఁ జూడరాదా

చ. 1: ప్రియములు చెప్పఁగాని బిగియఁగ నేనోప
నయములే కాని జంకెనలకునోప
దయఁజూడు నన్ను నీవు తగిలి యాల పట్టేవు
క్రియెరిఁగినదానిపైఁ గేలు చాఁచరాదా

చ. 2: మచ్చిక చల్లేఁగాని మంకుఁదనమునకోప
యిచ్చకమే కాని వట్టియెగ్గులకోప
వచ్చినట్టే రమ్మా నన్ను వద్దికేల పిలిచేవు
మెచ్చినట్టివారితోనే మేలమాడరాదా

చ. 3: యేకతానఁ గూడేఁగాని యెరవుసేయఁగనోప
పైకొని మొక్కేఁగాని పంతానకోప
యీకడఁ బొందితివి నన్నింతలో శ్రీవేంకటేశ
నాకొరకునందరితో నవ్వు నవ్వరాదా

రేకు: 0191-6 ముఖారి సంపుటం: 07-542

పల్లవి: ఇప్పటి కక్కూ్రరితికినెంత సేసీనే
కప్పుక వున్నారందరు కాఁతాళించరా

చ. 1: యేమిటికిఁ దారుకాణలెరిఁగిన పనులకు
కామించి తానెరఁగని కల్లలున్నవా
వాములై పెండ్లికూఁతుర్లు వద్దనే కాచుకున్నారు
వోముచుఁ దానిట్లంటే వోరుతురా వారు

చ. 2: అంతేసేలే ఆనలందరికిఁ గలదే
చెంతలఁ దాఁజేయనిచేఁతలాడేరా
కాంతలిందరును నిదే కనుపెట్టుకున్నవారు
యింతకుఁ దాఁజొచ్చితేను యెగ్గుపట్టరా

చ. 3: కమ్మటిఁ బెనఁగనేలే కాఁగిటఁ గూడితిమిదే
యెమ్మెతో శ్రీ వెంకటేశుఁడిఁక మానీనా
పమ్మి తనమేలువారు పైపైనే వున్నారు
నమ్మించినయందుకెల్లా నవ్వుకోపరా

రేకు: 0192-1 వరాళి సంపుటం: 07-543

పల్లవి: నన్నేమి వొగడీనే నాథుఁడు తాను
యెన్నికెలెంచి చూచితే యింతాఁ దానె కాఁడా

చ. 1: పాయము నామేనిమీఁదఁ బచరించుచున్నది గాని
ఆయమ్మై వుండినవాఁడంతాఁ దానే
చాయల సన్నలచేత జడిసివుందానఁ గాని
చేయిమీఁదైనవాఁడు చేరి తానే కాఁడా

చ. 2: చెంతల నాసిగ్గులెల్లా చెలరేఁగున్నవి గాని
అంతరంగములో వాఁడంతాఁ దానే
కాంతుల నామొగమున కళలిట్టే నిండెఁ గాని
యింతనాచక్కఁదనాలకేలిక దాఁ గాఁడా

చ. 3: మంచితనమెల్లా నామాటలనున్నది గాని
అంచెలనందలి యర్థమంతాఁ దానే
కొంచక నన్నుఁ గలసే కోరికలు నావి గాని
మించి శ్రీ వెంకటేశుఁడుక మేలు దానే కాఁడా

రేకు: 0192-2 ముఖారి సంపుటం: 07-544

పల్లవి: వెరవు విచారించుకొంటే వేగిరించేవు
యెరవేది యిందునాపె యేమిసేసునయ్యా

చ. 1: జగడములెల్లాఁ దీరె సరసములాడితేను
నగితే కోపములేదు ననుపాయను
వెగటుఁగాఁతాళాలు వీడెను విడెమిచ్చితే
యెగసక్యమేది యింతి యేమిసేసునయ్యా

చ. 2: మఱఁగులెల్లాఁబాసె మాట్టపలుకాడితేను
మఱచితేఁబగలేదు మనసిచ్చెను
కొఱకొఱలెల్లఁ దీరె కొచ్చికొచ్చిచూచితేను
యెఱఁగనిదేది యింతి యేమిసేసునయ్యా

చ. 3: మచ్చరమింతా మానె మరి వద్దఁ గూచుండితే
లచ్చనంటితేఁ గొంకదు లాగాయను
పచ్చిదేరే శ్రీవెంకటపతినాపె గలసితే
యెచ్చుకుందులేవి యింతి యేమిసేసునయ్యా

రేకు: 0192-3 శ్రీరాగం సంపుటం: 07-545

పల్లవి: అందరిలో నీవౌఁగదవే
అందితివి పదవులౌఁగదవే

చ. 1: చతురతఁ దెరలోసందించినవా
రతఁడును నీవును నౌఁగదవే
కతలు చెప్పుతా గయ్యాళించితి
పతివెవు నీవే యౌఁగదవే

చ. 2: తప్పక యింటిలోఁ దమ్ములమిసితి
రప్పసము మీరె యౌఁగదవే
ముప్పిరి నగితివి మునుపన యేఁటికొ
అప్పుడు నీవే యౌఁగదవే

చ. 3: మక్కువ ననునిటు మన్నింపించితి
వక్కరొ నీవే యౌఁగదవే
వెక్కసముగ శ్రీ వెంకటేశ్వరుని
యక్కున నిలిచితి వవుఁగదవే

రేకు: 0192-4 కన్నడగౌళ సంపుటం: 07-546

పల్లవి: వలచినదానఁ దొల్లే వడి మనసు మెత్తన
నిలువునఁ గరఁగుదు నీకొరకేపొద్దును

చ. 1: చెమ్మగిలీ దేహమెల్లా చేతుల నీవంటితేనే
వుమ్మడినించుకవడి వుండరా నీవు
దిమ్మరేఁగీ నిట్టూర్పు దిట్టించి నీవు చూచితె
కమ్ముక నీపచ్చడము కప్పరా నాకు

చ. 2: చెక్కులెల్లాఁ బులకించె సిగ్గులు మోవనాడితే
వొక్కరీతిఁ గొంతవడి వుండరా నీవు
లక్కవంటిది నాగుండె లలిమీరీ నీసుద్దుల
యిక్కువకు వచ్చి చనవియ్యరా నాకు

చ. 3: కన్నులనే చొక్కుదేరీ కాఁగిట నన్నుఁ గూడితే
వున్నవేమిఁ దడవక వుండరా నీవు
యెన్నిక శ్రీ వెంకటేశ యియ్యకొంటి పనులెల్ల
మిన్నక నీగందమిట్టె మెత్తరా నాకు

రేకు: 0192-5 భైరవి సంపుటం: 07-547

పల్లవి: ఆనతియ్యవయ్యా నీయప్పణ గావలె నాకు
కానుకింద నిమ్మపండు కందువయేదిఁకను

చ. 1: చనవుగలాపె నీసంగడిఁ గూచున్నది
మనవిగలాపె నీతో మాట చెప్పని
ననుపుగలాపె సారె నవ్వులు నవ్వీనిడె
వొొసర నేఁజేసేటి వూడిగమేదిఁకను

చ. 2: పంతము గలాపె నీతో పలుమారు బింకమాడీ
చింత గలిగగినయాపె చేయి చాఁచీని
వంతు గలిగినయాపె వరుసకు వచ్చున్నది
బంతినున్నదాన నాకుఁ బనియేదిఁకను

చ. 3: వాసిగల్గినయాపె వన్నెతో మొగము చూచీ
ఆసగలిగినయాపె ఆయాలంటీని
యీసరినే శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
నేస చల్లితివి నాకు సేవ యేఁటిదిఁకను

రేకు: 0192-6 కాంభోది సంపుటం: 07-548

పల్లవి: మంకులెల్లఁ బనిలేదే మాపుదాఁకాన
యింకాఁ దనకే మోహించేనేమిసేతునే

చ. 1: ఆడఁబోతే మాటలలో ఆతఁడే తొరలి వచ్చీ
చూడఁబోతే గురియై చూపులలోన
వేడుకకాఁడు గనక విభునికింతాఁ జెల్లు
యేడఁ జూచినాఁ దానే యేమిసేతునే

చ. 2: సారెకు నవ్వఁగఁబోతే సరసమాతని మోచీ
నేరఁబోతే తనచేఁతే నిండుకొనీని
పేరుకల దొర తాను ప్రియమైనట్టు నడచు
యేరులాయ గోరికొన యేమిసేతునే

చ. 3: చేతికొనవట్టితేనే శ్రీ వెంకటేశుఁడే వచ్చి
కాతరించితే రతులఁ గలనె నేఁడు
పోతరించున్నాఁడు తాను పొందులుసేసినవెల్లా
యేతులునెమ్మెలునాయనేమిసేతునే

రేకు: 0193-1 కేదారగౌళ సంపుటం: 07-549

పల్లవి: వొడఁబరచఁగనేలే వొద్దే యిఁక
కడునైతే చవిగాదూ కానరాదా మీకు

చ. 1: చలము లేకున్నఁ జాలుసంతోసమే పనులెల్ల
చెలిమికత్తెలు మీరు చెప్పరే బుద్ధి
తలఁపు లేశములైతే తనమాటె నామాట
తెలుసునో తెలియదో దిష్టిములిందరికి

చ. 2: వేసట లేకున్నఁ జాలు వేడుకలే పొందులెల్ల
గాసిఁబెట్టి యిఁకనట్టే కానీ లేరే
ఆసలు గలిగితే అన్నిటాఁ దానే నేను
యీసుగద్దొలేదొ మీరె యెంచుకొరే యిందును

చ. 3: యెఱుక గలిగితేఁ జాలు యియ్యకోరె వలపెల్ల
మఱఁగులు వాపితిరి మంచిదాయనే
మఱి శ్రీ వెంకటేశుఁడు మన్నించి యిటు గూడె
గుఱిగా మీమనసులఁ గోరినట్టే ఆయనే

రేకు: 0193-2 కాంభోది సంపుటం: 07-550
పల్లవి: చెల్లు నీకు నిఁక నీ చేతఁ జిక్కె వలపు
యెల్లవారమును నిన్ను యిఁక దూరేమా
చ. 1: చేసిన చేఁతల కెల్ల శికర మెత్తిన యట్టు
యీసతి వంచిన శిరసెత్తెఁగా నీకు
వేసారని సిగ్గులగు వెరసి వెట్టినయట్టు
మూసిన మోవి పై నాపె ముద్రవెట్టెఁగా
చ. 2: సంగడి కోరికలకు సఫలమైనయట్టు
వుంగిటిఁ గుచాల నాపె వొత్తెఁగా నిన్ను
కంగులేని నీ గుణాలు కవిలెల వ్రాసినట్టు
అంగమెల్ల గోర గీరి అంటెఁగా నిన్ను
చ. 3: కూడిన కూటములెల్ల కోటికొండలైనట్టు
నీడలుగాఁ బులకలు నించెఁగా ఆపె
యీడనె మావాఁడవైతివిప్పుడె శ్రీ వెంకటేశ
వోడఁగట్టిన దూలమై వొద్దనాపె వుండెఁగా

రేకు: 0193-3 గౌళ సంపుటం: 07-551

పల్లవి: మాపుదాఁకా నమర నీ మాయలేలా
వీఁపు గానరాఁగా దాఁగే విధములేలా

చ. 1: వాడుదేరీ మోమని వలసి నేనడిగితే
యేడలేని మాటలేల యెన్నికలేల
నీడకు నిన్నుఁదీసితే నిలువుఁ జెమటలకు
వీడెపుఁ జొక్కుమందులు వేమారునేలా

చ. 2: పచ్చిదేరే నీ మేను భావించి నేఁజూచితేను
యిచ్చకాలు సేయనేల యింతలో నీకు
వెచ్చనిమేనిపైఁ జెయివేసి నిన్ను నవ్వితేను
బచ్చెన మాటలేల పరాకులెలా

చ. 3: కన్నెలు నీవద్దివారు ఘనుఁడవు నీవంటే
కన్నుల తేలింపులేల కరఁగులేలా
యిన్నిటా శ్రీవేంకటేశ యెనసి నేమొక్కితేను
వన్నెల నింతేసి పరవశములేలా

రేకు: 0193-4 నాదరామక్రియ సంపుటం: 07-552

పల్లవి: ఇంతకంటే నేరము యెపుడు నీవారము
వంతుల మాచన్నులకు వాఁడి వచ్చెనిపుడు

చ. 1: జగడించేవారికెల్లా సారెసారె వెంగెములు
తగులై నవారికైతే తమకములు
మొగమేమి చూచేవు మొరఁగులు మరఁగులు
చిగురుమోవిమాట చేఁగలెక్కెనిపుడు

చ. 2: అలిగినవారికెల్లా అసురులు నుసురులు
కలసినవారికైతే కడుమేలాలు
వలుపేమి లోఁచేవు వలరాజుబాణాలైన
తెలిఁగన్నుల చూపులు తేటలెక్కె నిపుడు

చ. 3: పెనఁగేటి వారికెల్లా పెచ్చురేఁగుఁ జెమటలు
తనిసినవారికైతే దగదొట్టును
మనసేమి దెలిసేవు మచ్చిక శ్రీ వెంకటేశ
యెనసితిమి యాసలు యెదురెక్కెనిపుడు

రేకు: 0193-5 హిజ్జిజి సంపుటం: 07-553

పల్లవి: అప్పటినుండియు విభుఁడట్టె తప్పక చూచీ
యిప్పుడిట్టె రాఁగదవె యియ్యకొన్నదానవు

చ. 1: చిత్తము పతికినిచ్చి సిగ్గులువడఁగనేలె
పొత్తుకు రమ్మనీ వలపుల నాతఁడు
కొత్తగాఁ బొందుసేసేవా కొంగువట్టి తీసితేను
వుత్తరువేమి చెప్పవే వూరకున్నదానవు

చ. 2: యింటిలోననే వుండి యింకా మరఁగులేలే
అంటి పానుపుపైకి రమ్మనీ నాతఁడు
జంటలు నేఁడాయనా సత్తువలఁ బెనఁగితే
వొంటి నట్టే వుండఁగదే వొడఁబడ్డదానవు

చ. 3: కలసి కాఁగిటఁ గూడి కన్నుల జంకెనలేలే
యెలయించీ శ్రీ వేంకటేశుఁడాతఁడు
చలములు యిఁకఁగద్దా చన్నులుగోరనొత్తితే
కొలఁదెరిఁగి నవ్వవే గుట్టుగలదానవు

రేకు: 0193-6 కొండమలహరి సంపుటం: 07-554

పల్లవి: ఎంత చెప్పినా నెరఁగదేమి సేతమే
సంతోసాన చెలులెల్లా సాకిరిగా వినరే

చ. 1: నిన్నటివలపుగాఁగ నేఁడ పెంచీఁగాక
యెన్నికగలదియ్యైతే నెమ్మేసేసునా
వన్నెకెక్కిన తుమ్మెదవంటివాఁడు మగవాఁడు
అన్నిటా నాతనిమనసంత నమ్మేనా

చ. 2: కొత్త మాట పట్టుగాఁగ కొంగువట్టి తీసెఁగాక
అత్తి సడిసన్నదైతే నంత మీరునా
మెత్తని పండు వంటిది మించిన పతి చిత్తము
వొత్తి పిసుకఁగఁబోతే వోరువఁగద్దా

చ. 3: సరి వయసులుగాఁగ సాముతోఁ బెనఁగీఁగాక
వొరయ వచ్చినదైతే వోరుచుకోదా
యిరవై శ్రీవెంకటేశుఁడేనుగవంటివాఁడు
అరసి కలసెనిఁక నడ్డమున్నదా

రేకు: 0194-1 కేదారగౌళ సంపుటం: 07-555

పల్లవి: నీవు వింతవాఁడవో నే వింతదాననో
చేవదేరి నా నవ్వు సిగ్గుదెచ్చీఁ గాక

చ. 1: నీతలఁపులోనిదాన నీకు నిచ్చకురాలను
కాతరించి నీవనఁగాఁ గాదనేనా
రేతిరిమాటలకును రిచ్చలాయ నామనసు
పైతరవై అందుకొడఁబడనీదు గాక

చ. 2: కైవశమయ్యిన నేను కందువ చేఁతల నేను
వోవరిలోని వంటఁగా నోపననేనా
నీవొళ్ళివేసాలకు నిండుఁగాఁక రేఁగి లోలో
భావముఁ జలము నేఁడు పంతమాడీఁ గాక

చ. 3: ఎనసితివి రతికి నియ్యకోలు చేసుకొంటి
తనిసి నీవల్ల మరి తప్పులెంచేనా
ఘనుఁడ శ్రీ వెంకటేశ కడమదొడమలకు
అనుఁగుఁగూరిములెల్లా ఆసపడీఁ గాక

రేకు: 0194-2 ముఖారి సంపుటం: 07-556

పల్లవి: బుద్ధి నేము చెప్పేమా పూఁటఁపూటకు
గద్దరీఁడు తానె యెరఁగవలెఁ గాక

చ. 1: వెగటుగ నేమంతేసి విన్నవించవలెనా
తగవెరిఁగనవాఁడు తాఁ గాక
మగువ లేమాడినాను మచ్చరించఁదగునా
నగవు సేసుక పై కొనఁగవలెఁ గాక

చ. 2: భ్రమయించి మాగుట్టు పచరించవలెనా
తమకపడేటివాఁడు తాఁగాఁడా
రమణులకు కూరిములు రచ్చఁబెట్టవలెనా
సమ రతులకుఁ జేయి చాఁచవలెఁ గాక

చ. 3: చెక్కునొక్కి నేమిఁకఁ జెనకఁగవలెనా
దక్కగొని నన్నుఁగూడి తానెరఁగఁడా
చిక్కి శ్రీ వెంకటేశుఁడు సెలవి నవ్వవలెనా
మిక్కిలి రతులఁజొక్కి మేలమాడుఁ గాక

రేకు: 0194-3 దేసాక్షి సంపుటం: 07-557

పల్లవి: మాపుదాఁకా జోలి మరి యేఁటికి
కోపుల మీరెను కొసరులు

చ. 1: సరివచ్చె నేఁడు సతికి నీకును
సిరుల నవ్వుల సెలవులు
పొరుగుకు వచ్చె పొద్దున మీకిదె
గరగరికెల కరఁగులు

చ. 2: చొప్పణఁగె నేఁడు సుదతికి నీకు
తప్పక చూచేవి తడవులు
ముప్పిరి గొనెను మోహము లోననే
కొప్పులు జారి గురుతులు

చ. 3: తగవులఁ బెట్టీ తరుణికి నీకు
బిగువు కాఁగిటి పెనఁగులు
జిగిఁ గూడితిరి శ్రీ వెంకటేశుఁడ
తగులాయ మీతలఁపులు

రేకు: 0194-4 నాట సంపుటం: 07-558

పల్లవి: ఆడినట్టే యాడరాదు ఆపెతో నీవు
వాడికెసరసములే వైపులింతే కొని

చ. 1: కోమలి తోడుత నీకుఁ గోపగించుకొనరాదు
యేమేమి మాటలాడినా నెంతదూరినా
కామించి వచ్చినదాపె కైకొని గురియైతివి
దామెన నీనగవులే తగవింతే కాని

చ. 2: అట్టె చలపట్టరాదు అంగనయడకు నీవు
అట్టు నిన్నెంతసేసి యాఱడిఁ బెట్టినా
చుట్టపు వరుస దాపె చొక్కి చనవిచ్చితివి
నిట్ట చూపుల మెచ్చులే నేరుపులు గాని

చ. 3: జోడువాయనిఁకరాదు సుదతి యింటను నీవు
యీాడు యెంత మీరినాను యెలయించునా
వేడుకకతై యాపె శ్రీవేంకటేశుఁడవు నీవు
కూడిన యీాకూటములే గుణములు గాని

రేకు: 0193-5 రామక్రియ సంపుటం: 07-559

పల్లవి: నీదేవులే నిన్ను నేరములెంచీఁ గాక
పొదు సేసుకొని నిన్ను పచ్చిసేయఁ దగునా

చ. 1: మఱచినా నీమాట మాడసేసుఁ గోటిసేసు
యెఱిఁగి తలఁచుకొంటే యెంతైనాఁ జేసు
యెఱఁగనెట్టువచ్చు యింతేసి దొరలను
తఱి వేచి చెలులము తప్పులెంచఁ దగునా

చ. 2: రాతిరింటి నీపనులు రతికెక్కు రచ్చకెక్కు
యీతల వేగి లేచితే నింటికెక్కును
చేతనటు చూపువచ్చు చెల్లుబడిగలవారి
ఘాతసేసి చెలులము కక్కసించఁ దగునా

చ. 3: మునుకొన్న నీగుట్టు మొదలౌను కొనయౌను
ననిచి చించివేసితే నడుమౌను
వనితఁ గూడితివిట్టె వైపుగా శ్రీవెంకటేశ
పనివడి చెలులము బాసగొనఁ దగునా

రేకు: 0193-6 లలిత సంపుటం: 07-560

పల్లవి: ఇటువంటివే నీకు యితవులౌను
కుటిలకుంతలిచేఁత గురియాయ నీకు

చ. 1: చెలియ నీయెదుటను చేతులెత్తి మొక్కితేను
మొలక చన్నులు నీపై మొనలెత్తెను
అలరి చంకగుదియ నట్టే శరణనేటి
నిలుకడయిన మాట నిజమాయ నీకు

చ. 2: కోమలి నీవూడిగేన కుంచె విసరఁ జొచ్చితే
దామెనహారాలు వల్లెతగిలించెను
వేమారు నోమేది నోము వేసెవి గాలాలు
యీమాటలెల్ల నేఁ డు యిరవాయ నీకు

చ. 3: కందువ శ్రీవెంకటేశ కాఁగిట నిన్ను నించితే
యిందుముఖి మోవి నిన్ను నెంగిలిసేసె
విందులలోనే మరి వీడుదోడుగూడినట్టి
అందమైన మాటలెల్ల ననువాయ నీకు

రేకు: 0195-1 శ్రీరాగం సంపుటం: 07-561

పల్లవి: తాను చేసినచేఁత తారుణిమేనను నిండె
వీనులు చల్లఁగ నిట్టె విన్నవించరే

చ. 1: జక్కవ గుబ్బలమీఁద చంద్రోదయములాయ
చుక్కలు మొలచెనిదె సొంపుమోవిని
అక్కజపుతురుమున నద్దమరేతిరి నిండె
వెక్కసపుపతికిది వేళ చెప్పరే

చ. 2: కనుచూపు తామెరల గక్కుననుఁ దెల్లవారె
యెనయని తలపోఁతనెండలు గానె
పనివడి విరహన పట్టపగలై తోఁచె
ననిచిన పతికి సన్నలు సేయరే

చ. 3: వడిగొన్న జవ్వనాన వసంతకాలము వచ్చె
పొడవైన కళలను పున్నమ గూడె
యెడమిచ్చి శ్రీ వెంకటేశుఁడింతలోఁ గూడె
జడివాయకుండఁ దన్ను బాసగొనరే

రేకు: 0195-2 పాడి సంపుటం: 07-562

పల్లవి: తనకు నాకు నెప్పుడు తగులేకదే
మనసు మర్మములకు మంచిదే కదే

చ. 1: మొక్కలాన నటు చనుమొనలు నే మోపితేను
వెక్కసీఁడు తనకిఁక వెరుపేఁటికే
జక్కవ పిట్టిలు నావి జవ్వన వనమె తాను
యెక్కడపోవును వాని కిరవే కదే

చ. 2: సంతోసపుఁ జూపులచక్కెర నేఁజల్లితేను
పంతగాఁడు తానేల భ్రమసీనే
కంతువిండ్లు నా బొమలు గవిశన తనమేను
పొంతనెంచి చూచుకొంటే పొందులేకదే

చ. 3: బలిమి కాఁగిటఁ దనపైఁ జేతులు వేసితేను
యెలమి శ్రీవెంకటేశుఁడేల నవ్వీనే
జలజములివి నావి సరవిఁ బూజ తనది
నిలుకడలకు నివి నిజమే కదే

రేకు: 0195-3 సౌరాష్ట్రం సంపుటం: 07-563

పల్లవి: నేఁడు గొత్తగాదు తొల్లే నీకు నాకుఁ గలదే
ఆఁడుదాన బలిమేది ఆయము నీ చేతిది

చ. 1: వొట్టిన నీ చేఁతలకు వొడిగట్టుకొన్నదాన
గట్టిచనుఁగవవారకపుదానను
ఎట్టుసేసినా నీచిత్తమెదురాడేవారెవ్వరు
పట్టిన నావలపుభారము నీమీఁదిది

చ. 2: పొంచుకొని పాదముల పొందులు మెట్టినదాన
పంచల సిగ్గుల తలఁబాలదానను
కంచము పొత్తుకు లోనుకలది నీచేతిదింతే
మంచముపైఁ బెనఁగే నామర్మము నీచేతిది

చ. 3: వేడుక మోవి తీపుల విందుకు లోనైనదాన
వీడెమందుకొన్న యరవిరిదానను
జాడతోడ శ్రీ వెంకటేశ చనవిచ్చితివి నాకు
కూడితివి నాలోని గుణము నీచేతిది

రేకు: 0195-4 సామంతం సంపుటం: 07-564

పల్లవి: ఆపెతోనేమి మాటాడీనంతవాఁడు
యీపనికి నావంక నిటుచూడుమనవే

చ. 1: తగవు చెప్పఁగఁబోతే తన మీఁద మోఁచు మాట
మగువలకెంతైనా మంచితనాలే
యెగసక్యాలిఁక వద్దు యేల రట్టుసేసుకొని
యిగిరించె వలపులు యీడకు రమ్మనవే

చ. 2: పంతములాడఁగఁబోతే పాడి దానే యియ్యవలె
కాంతల నెవ్వరైనాను కాదనరు
వింతలేల సేసుకొని వేగిరమే తనకును
యెంతైనాఁ బోదు వావి యీడకు రమ్మనవే

చ. 3: వెనక సుద్దులెంచితే వేవేలుఁ దనవల్లనే
వనితల కెప్పుడును వాసి వన్నెలే
యెనసెను శ్రీ వెంకటేశుఁడు ముందె నన్ను
యినుమడించెఁ దమక మీడకు రమ్మనవే

రేకు: 0195-4 శ్రీరాగం సంపుటం: 07-565

పల్లవి: తమకించకురె మీరు తరుణులాల
సముకపు నవ్వె మేలు జాణనితోను

చ. 1: విన్నవించినా మేలు వెరగుతోనున్నా మేలు
అన్నియు నెరిఁగినట్టి యాతనితోను
కన్నుల మొక్కినా మేలు కాఁకలు చల్లినా మేలు
సన్నెరిఁగి మేలఁగేటి సరసునితోను

చ. 2: ప్రియము చెప్పినా మేలు బిగువుతోనున్నా మేలు
నయగారి గుణముల నాథునితోను
క్రియలు చూపినా మేలు కేలెత్తి మెచ్చినా మేలు
దయదలఁచనేర్చిన తగుదొరతోను

చ. 3: సేవలు చేసినా మేలు చెక్కులు నొక్కినా మేలు
యీవల నన్నుఁ గూడిన యీతని తోను
వావులు చెప్పినా మేలు వన్నెలు చూపినా మేలు
శ్రీ వెంకటేశుఁడైనా చెలువునితోను

రేకు: 0195-5 భైరవి సంపుటం: 07-566

పల్లవి: అల్లదివో నిలుచుక ఆతఁడున్నాఁడు
తెల్లమిగా నిన్నుఁగూర్చే తెలుసుకోరాదా

చ. 1: అదనెరిఁగి మాటాడేనాతని నీడకుఁ దెచ్చే
సుదతి నానేరుపెల్లఁ జూడరాదా
కొదలెల్లఁ దీరవలె గురుతులు గావలె
చదరుఁదనము నీవు సంతోసించరాదా

చ. 2: తలఁపెల్ల భ్రమయించే తరి తీపు పుట్టించే
మెలుఁతరో నీవు నన్ను మెచ్చురాదా
సెలవుల నవ్వించే చేతికి లోనుగాఁ జేసే
సెలవు నాకిదె నేఁడు చిత్తగించరాదా

చ. 3: ఆసలెల్లఁ బుట్టించే నలవాట్లెల్లఁ జేసే
చేసన్నకు లోనుసేసేఁ జేపట్టరాదా
యీసరికి శ్రీవేంకటేశుడట్టె విచ్చేసి
రాసికెక్క నినుఁగూడె రాజ్యమేలరాదా

రేకు: 0196-1 రామక్రియ సంపుటం: 07-567

పల్లవి: మఱి యేమి యెఱఁగను మాటలు నేను
నెఱవైన యట్టి దిక్కు నీవే నాకు

చ. 1: తపము చేసినదాన తగులనాడినదాన
నెపము సేసినదాన నేనే నీకు
రపమయ్యేవాఁడవు రక్షించేవాఁడవు
నిపుణుఁడ విన్నిటాను నీవే నాకు

చ. 2: పట్టి కొలిచినదాన పనులు చేసినదాన
నెట్టన నీదయవల్ల నేనే నీకు
జట్టిగొన్నవాఁడవు చనవిచ్చినవాఁడవు
నెట్టెపు మోహపుగురి నీవే నాకు

చ. 3: గక్కనఁ జూచినదాన కాఁగిటఁ గూడినదాన
నెక్కొని తొలుదొలుత నేనే నీకు
యెక్కువ శ్రీ వెంకటేశ యేలుకొన్నవాఁడవు
నిక్కమిన్నిపనులందు నీవే నాకు

రేకు: 0196-2 సాళంగనాట సంపుటం: 07-568

పల్లవి: ఎటువంటివాఁడవు యెంతమెత్తనివాఁడవు
మటమాయములలోని మరఁగు దెలియవు

చ. 1: మచ్చరించేనా నీతో మనసు చూడవలసి
యెచ్చరికెగా నంటినేమైనను
కొచ్చికొచ్చి పోరేనా కొనగొన చన్నులను
తచ్చనకు నదిమితే తమకించేవు

చ. 2: తప్పువట్టేనా నీ తగవు చూడవలసి
చొప్పులెత్తి నీమేను సోదించితి
వుప్పటించి పెనఁగేనా వుడివోని సరసాన
కొప్పువట్టినంతలోనే కొసర వచ్చేవు

చ. 3: చలపట్టేనా నీవు సారెకు మెచ్చవలసి
కలసి కాఁగిలఁ గూడి కరఁగించితి
బలిమి చూపేనా నీతో పక్కన శ్రీ వెంకటేశ
తెలిపి మోముచూచితేఁ దిట్టువచ్చేవు

రేకు: 0196-3 లలిత సంపుటం: 07-569

పల్లవి: ఎవ్వరితోఁ జెప్పరాదు యీసుద్దులు
నివ్వటిల్ల నాతోను నీవే ఆనతియ్యవయ్య

చ. 1: కన్నులనే కొసరను కాఁకలు విసరను
వున్నదాన నీయెదుట వూరకే నేను
సన్నలు సేసేవు నీవు సంగతేమి దెలియదు
పిన్నదాన యాకతానఁ బిలిచి ఆనతీవయ్యా

చ. 2: పక్కన వేసరించను పంతాన నోసరించను
వొక్కటై కాచుకుందాన వొద్దనే నేను
మొక్కులు మొక్కేవు నీవు ముందువెనకెరఁగను
చిక్కితి నీవలపులఁ జేరి ఆనతీవయ్యా

చ. 3: చలములు సాదించను సారెసారె బోదించను
కొలఁది మీరఁగ నిన్నుఁ గూడితి నేను
బలిమి శ్రీ వెంకటేశ పైకొంటివి నన్నునిట్టె
తలఁపు నీవెరఁగవా తగ నానతీవయ్యా

రేకు: 0196-4 లలిత సంపుటం: 07-570

పల్లవి: మొగదాకిరివాఁడవు మొదలే నీవు
తెగనాడవేమిటికి దేవరవు నీవు

చ. 1: చెప్పినట్టు సేతునంటే చెలఁగి మందెమేళాన
యెప్పుడైనా విన్నవింతునేమైనను
యిప్పుడిట్టే పదారువేలేకతాలకారు నీకు
వొప్పి యెవ్వరిమాటలు వూకొనేవు నీవు

చ. 2: చేతిలోని వాఁడవంటాఁ జిక్కించుక కాతరాన
యీతల నాతలఁ దీతునేడకైనను
ఆతుమ నీకుఁ బాయరానట్టివారు యెనమండ్రు
యేతుల నెవ్వరిచన వియ్యకొనేవు నీవు

చ. 3: కూడినట్టే కూడేవని గుటిగా శ్రీ వెంకటేశ
యీడులేక పెనఁగితినిందాఁకాను
వాడికె గొల్లెతలైతే వలసినందరు నీకు
మేడేన నెవ్వరిపొందు మెచ్చేవు నీవు

రేకు: 0196-5 బౌళి సంపుటం: 07-571

పల్లవి: దీనికేమి దోసమా తగిన గేస్తురాలవు
నేను నిన్ననేమనేను నీకేలే సిగ్గులు

చ. 1: కొండవంటి దొర నిన్ను కొంగువట్టి తీసితేను
వొండేమీననలేక వొద్దికైతివే
అండనుండి సారెసారె నాతఁడే పిలువఁగాను
బందుబందు గాలేక పలికితివే

చ. 2: చక్కని జాణఁడు నీ జవ్వనము దడవఁగ
గక్కన విడువలేక కైకొంటివే
వెక్కసానఁ గమ్మటిని వీడె మాతఁడియ్యఁగాను
అక్కరఁ దోయలేక అందుకొంటివే

చ. 3: శ్రీవెంకటేశ్వరుఁడు చెక్కు నిన్ను నొక్కఁగాను
కైవశమై అంతలోనఁ గరఁగితివే
యీవేళ నన్నేలి వచ్చి నిద్దరి సవతులఁగా
కావించి నవ్వితి నిట్టే కదిసితివే

రేకు: 0196-6 ముఖారి సంపుటం: 07-572

పల్లవి: చెప్పవద్దు నీలాగు చెలులెఱఁగనిదా
ముప్పిరి నీవు వెనకముందెంచేవాఁడవా

చ. 1: వూరటగానందరిని వొకరొకరినే పట్టి
పొరుదీరఁ బొద్దునను భోగించితివి
యీరీతి నెవ్వతెవద్దకేఁగవలశో కాక
పొరసతులపై నింత బత్తిగలవాఁడవా

చ. 2: వొగ్గి నీవే పిలిపించి వూరివారినెల్లాను
సిగ్గుదేర లోలోనే చెనకితివి
యెగ్గులేక యవ్వెతె నీయింటికి రాఁగానో కాక
నిగ్గుల నింత మోహము నించేటివాఁడవా

చ. 3: యిల్లిల్లు దప్పక చొచ్చి యింతియైన దానినెల్లా
కొల్లదీర నొక్కమాటే కూడితివి
యిల్లిదె నన్ను శ్రీ వెంకటేశ కూడేకొరకుఁగా
యెల్లవారిమేకులకు నింత చిక్కేవాఁడవా

రేకు: 0197-1 సామంతం సంపుటం: 07-573

పల్లవి: నంటున నీ చేఁతలకు నవ్వే నేను
వెంట వెంట నీగుణాలు వెల్లవిరి ఆయను

చ. 1: పిలిచి నీవు నాతోఁ బెనఁగి బాఁతిపడఁగ
నెలమి నే మారుత్తరమియ్యఁ గాక
కలసిన నీసతుల కాలిగోరఁ బోలుదునా
నిలిపిన నీమహిమ నీవే యెరుఁగుదువు

చ. 2: పక్కన నీవు నాపైఁ జెయ్యి వేయఁగాను
చిక్కిలోనై నీసేవ సేసేఁ గాక
చక్కని నీయింతులతో సరిపెనఁగఁ గలనా
మిక్కిలి నీచెల్లుబడి మెరయించేవిప్పుడు

చ. 3: కందువఁ గూడిననన్ను కాఁగలించుకొనఁగాను
పొంది నిన్నునన్నిటా బోగించేఁ గాక
సందడి శ్రీ వెంకటేశ సమరతికర్తమా
యెందు నీమన్ననలనింత సేసేఁ గాక

రేకు: 0197-2 కన్నడగౌళ సంపుటం: 07-574

పల్లవి: కానుక నీకిచ్చితిమి కాచుకున్నారము నేము
ఆనేరుపులికమీఁద నడుగము

చ. 1: వేవేలు చెలిభావాలు విన్నవించితిమి నేఁడు
దేవరచిత్తమెట్టో తెలియదు
చేవమీరె విరహము చెమరించెనింతిమేను
యేవేళఁ గరుణించేవో యెరఁగము

చ. 2: పచ్చిదోఁచెనాకెమేలు పైకొని నీవే ఆడకు
విచ్చేసినయందాఁక వేగిరించము
నిచ్చలు నీచేఁతలెట్టో నీవేగతి మరిలేరు
చెచ్చెరనేమి సేసేవో చిమ్మిరేఁచము

చ. 3: కన్నులెదుట నిద్దరిఁ గదియించితిమి నేఁడు
మన్నించితివింతికిఁగా మండాడము
యెన్నికెఁ శ్రీ వెంకటేశ యీపె నీవునొక్కటే
మిన్నకయైనా సారె మెచ్చుకిట్టే మానము

రేకు: 0197-3 సాళంగనాట సంపుటం: 07-575

పల్లవి: వచ్చినవారమిదివో వాకిటనె వున్నారము
నెచ్చెలి యెదురుచూచీ నీచిత్తమికను

చ. 1: నవ్వుల పండుగలాయ ననుపులెండుగలాయ
యివ్వల చెలితో పొందులికనెన్నఁడు
రవ్వలాయ నీచేతలు రాజసమే నెరపఁగా
దివ్వెలెత్తుఁబొద్దులకు తిరమాయఁ బనులు

చ. 2: మాటలివే విందులాయ మంతనాలే సందులాయ
యీటున కాంతతో మేలమికనెన్నఁడు
మూటలాయ నేర్పులు మోచుకవున్నారమిదే
మేటిశింగారాల వేగీ మిగిలె చీఁకట్లు

చ. 3: వీడెములే వొడినిండె వేడుకలు పంటవండె
యీడ వచ్చున్నది చెలియ యిఁకనెన్నఁడు
పాడితో శ్రీ వెంకటేశ పడఁతిఁ గూడితివిట్టె
యేదుమద్యాన్నములెక్కె యెట్టి రహస్యములో

రేకు: 0197-4 గుండక్రియ సంపుటం: 07-576

పల్లవి: పడఁతిరో నీవేల బత్తి గొట్టానఁ బెట్టేవే భూమి
పొడమి సతులతల పూరిగట్టునేఁటికే

చ. 1: పుట్టిపడఁ దేనెలెంత పూరిపడ మాటాడిన
మట్టులేక భ్రమసీనా మగవాఁడు
చుట్టురికాలెంత సూటిపడఁ జెప్పినాను
కట్టుకొనునా మెడఁ గమ్మర నిన్నతఁడు

చ. 2: కన్నుసన్నల నీవెంత కప్పురాలు చల్లినాను
యెన్నికలేక మెచ్చీనా యింతవాఁడు
పన్ని నీమచ్చికచూపి పాదాలెంత పిసికినా
చెన్నుమీర నన్ను నరచేతఁబెట్టుకుండునా

చ. 3: సిగ్గువడకాతనిపై చేతులెంత చాఁచినాను
వెగ్గళించుమనీనా శ్రీ వెంకటేశుఁడు
అగ్గమై నన్నిటుగూడెనట్టె నీవూఁ గొసరితే
నిగ్గులపూజగా నిన్ను నెత్తిఁ బెట్టుకొనునా

రేకు: 0197-5 గౌళ సంపుటం: 07-577

పల్లవి: ఆయము నీచేతనున్నదన్నిటికిని
పాయముపదను వచ్చెఁ బైకొనవయ్యా

చ. 1: అలిగినదానివలెనంటక వున్నది గాని
నిలువెల్లాఁ దమకమే నీమీఁదను
బలిమేపాటిసేసిన పైపైనున్నది చెలి
చెలులఁ జూపక నీవే చేయి చాఁచవయ్యా

చ. 2: యెనయనిదానివలె నెక్కడో చూచీఁ గాని
తనువెల్లనాసలే తగులమికి
చెనకితేఁ జాలుఁగాని చేతిలోనున్నది యింతి
పెనఁగదు పిలిచితేఁ బేరుకొనవయ్యా

చ. 3: సిగ్గువడ్డదానివలె శిరసు వంచీఁ గాని
అగ్గలికెల్లా నీసొమ్మై ఆముకొన్నది
అగ్గమై శ్రీ వెంకటాధిప నిన్నుఁ గూడెను
యెగ్గులేదు మీలోన నిట్టే వుండవయ్యా

రేకు: 0139-5 రామక్రియ సంపుటం: 07-578

పల్లవి: మండాటమింతటిమీఁద మరిలేదు
అండనుండేవారమింతే అదివో నీచిత్తము

చ. 1: పంతానకెక్కినమాట పాయానకెక్కినమాట
కాంత నీతోనాడినది కలదొక్కటే
చింతలోని దాఁపిరయు సేయఁగల కాఁపిరము
వింతలుగ నేముసేసే విన్నపములోనివే

చ. 2: కందువనెలల వాఁత కమ్మలలోపలి వాఁత
యిందుముఖి నీసందికిది యొక్కటే
యిందమన్న కానికలు యెంచుకొన్న పూనికలు
ముందు నీకిందరము మొక్కిన మొక్కులవే

చ. 3: కనుఁగొన్నట్టి వేడుక కాఁగిటిలోని వేడుక
పనివడి సతిభాగ్యఫలమొక్కటే
ననిచె శ్రీవెంకటేశ నయములుఁ బ్రియములు
చనవు మెరసిన మా సమ్మతాలలోనివే

రేకు: 0198-1 శంకరాభరణం సంపుటం: 07-579

పల్లవి: చెప్పఁగనేఁటికి చెలి మనతోడ
కప్పెఁ జింతలవె కానఁగరాదా

చ. 1: తలఁపులోపలి తమకమెల్లాను
సెలవినవ్వులఁ జిందీఁ గదే
కొలఁది మీరిన కోరికలప్పటి
మొలకపులక మొత్తములాయ

చ. 2: వినుకలి తన విరహమెల్లాను
కనుఁగొనలనే కమ్మీఁ గదే
చనవుల తన సరసమప్పటి
ననుపుమాటల నటనలాయ

చ. 3: గక్కనఁ గూడిన కందువలెల్లాను
మిక్కిలి మోవిపై మించెఁ గదే
యెక్కువ శ్రీ వేంకటేశు మేలప్పటి
వొక్కటై పాయని వొద్దికలాయ

రేకు: 0198-2 వరాళి సంపుటం: 07-580

పల్లవి: పట్టిన చలములేలే పైపైనాతనితోడ
వొట్టుక పంతమిప్పించె వువిదచేఁ జాలదా

చ. 1: వెంగెము లాడకువే విభుఁడు నీసవతైన
అంగననీడకుఁ దెచ్చె నదిచాలదా
కంగువెట్టుకోకువే కమ్మనిపూవులచెండు
కుంగరాల వేళ్ళచేత నొగ్గింపించెఁ జాలదా

చ. 2: చలము సాదించకువే సవతిని నాయకుఁడు
అలరి నీచేతి కిచ్చె నదిచాలదా
బలిమి సేయకువే ప్రాణేశ్వరుఁడు ఆపెఁ
గొలువులోఁ బెట్టి నినుఁ గొసరించెఁ జాలదా

చ. 3: చేపట్టి బిగియకువే శ్రీ వెంకటేశుఁడు నిన్ను
ఆపెచేతఁ బొగడించె నదిచాలదా
రాఁపులీఁకఁ జేయకువే రతికేలిలోపలను
మోపుగట్టించె వలపు ముదితచేఁ జాలదా

రేకు: 0198-3 నాదరామక్రియ సంపుటం: 07-581

పల్లవి: మరిఁగించ మరి లేవా మాటలు మాపుదాఁక
పొరుగు పొంతల నీకుఁ బొద్దు వోదా

చ. 1: వంచనతో నీవు నాకు వలచినవలపెల్ల
కంచపుమోవియందే కానవచ్చెను
చంచులనిందరిలోన సతమేమి నెరపేవు
పొంచి పొంచి నీకదేమి పొద్దువోదా

చ. 2: తలఁచిన నీలోని తలపోఁతలెల్లాను
పిలిచిన పిలుపులోఁ బెనగొనెను
మలశి యెప్పటినెడమాటలేమాడించేవు
పులిమేవు నవ్వులేమి పొద్దువోదా

చ. 3: జాడల నీ నా సంది సరసములెల్లాను
కూడినకూటమిలోనే గురులాయను
యీడనె శ్రీ వెంకటేశ యెంతకెంత సేసేవు
ప్రోడవౌదువు నీకింకఁ బొద్దువోదా

రేకు: 0198-4 సామంతం సంపుటం: 07-582

పల్లవి: కొలమునొకటిగాదు గుణమునొకటిగాదు
శెలిమి శేయవచ్చిని శెనకకుమనవే

చ. 1: యిల్లిదివో మమ్ము సూడు యేనుగవంటి నడపు
సల్లని తేటసూపులే సక్కదనాలు
సెల్లఁబో సూడుమనవే శింయ్యమువంటి నడుము
గొల్లనికి శెంచెతకు కూటము సెల్లునా

చ. 2: నిచ్చలు మాసెంపలపై నెమిలివంటిది కొప్పు
పచ్చులవంటివి మాబలు సన్నులు
కుచ్చుల పారిటాకులు గిరిగింజ సరుములు
అచ్చపుటూరవాఁడు మాయడవినుండీనా

చ. 3: వసుముగాని శిలుకవంటిదివో మామాట
పసని తేనెల మోవి పశిమివొల్లు
యెసగ శ్రీ వెంకటేశుఁడేటవెట్టి నన్నుఁగూడె
రసికుఁడు దాను నేను రాశిపాటదాననే

రేకు: 0198-5 లలిత సంపుటం: 07-583

పల్లవి: ఏమిటికాసపడేవు యెందుకైనాను
సాముసేసినట్టి నీతో సాటివచ్చేమా

చ. 1: తచ్చి చూడ నీకునిది దట్టిగట్టు నౌనేమో
పచ్చనాకు మాకొంగు పట్టేవు నీవు
యిచ్చ మాకాకిపైఁడిబొట్టేమి చూచేవింతలోనే
బచ్చెన నీపైఁడిచీర పాటిదయ్యీనా

చ. 2: యెంచుకో నీ సొమ్ములలో యిది దాఁచవచ్చునేమో
పంచెపు మాగురిగింజపేరడిగేవు
దించనట్టి మావింటిదిక్కేమి చూచేవు
సంచపు నీ చుట్టుఁగత్తి సరివచ్చీనా

చ. 3: యిప్పుడే తెలుసుకో నీకిది గూడయ్యీనేమో
నెప్పున మామోవితేనె నీవు గోరేవు
ముప్పిరి శ్రీ వెంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
యెప్పుడూనురముకాంత కెనవచ్చీ నా

రేకు: 0198-6 బౌళి సంపుటం: 07-584

పల్లవి: చేసిన తనచేఁతలు చెప్పరాదు
యీ సటలవానితోడ నేమిసేతునే

చ. 1: వలపు గలవారికి వాసులు పనికిరావు
పిలిచితేఁ బలుకక బిగియరాదు
చలపట్టి వేఁడుకొంటే సమ్మతించకుండరాదు
యెలయించీనిదె తాను యేమిసేతునే

చ. 2: మన్ననగలవారికి మంకులు చూపరాదు
సన్నలేమి సేసినాను సాదించరాదు
కన్నులనే నవ్వినాను కాఁతాళము చూపరాదు
యిన్నేసి ప్రియాలు చెప్పీ నేమిసేతునే

చ. 3: కూటమిగలవారికి కోపగించు కొనరాదు
పాటించి మేలమాడఁగఁ బదరరాదు
గాఁటమై శ్రీ వేంకటఘనుఁడిట్టె నన్నుఁగూడె
యీటువెట్టెఁ దనతోడ నేమిసేతునే

రేకు: 0199-1 సాళంగనాట సంపుటం: 07-585

పల్లవి: అంకెకు రానిపనులై నపాటి చాలును
మంకులు చెల్లవు నిన్ను మరిగినదానను

చ. 1: పచరించి నీకు విన్నపములు సేసేవారి
వచనాలలోనే కానవచ్చె వలపు
రచనలు నేరుతుము రాజసాలు నేరుతుము
వుచితముగాకుండఁగా వూరకున్నదానను

చ. 2: సగము మొగము వంచి సన్నలు సేసేవారి
నగవందే అంతా వున్నది నిజము
పగటు నెరుఁగుదుము పంతమూనెరుగుదుము
జగడాలు చేరీనంటా సమ్మతించుకొంటిని

చ. 3: ఆయములు చూపి మోపి అప్పణలిచ్చేవారి
కాయకపు మొక్కులకే కలిగె మేలు
యీయెడ శ్రీ వెంకటేశ యిటు నిన్నుఁ గూడితిని
చేయి మీఁదై నవ్వులకు సెలవు పెట్టితిని

రేకు: 0199-2 దేసాళం సంపుటం: 07-586

పల్లవి: గుట్టుననుండఁగరాదా కొంతకొంతైనా
అట్టులు సేయఁబోతే నాఱడిఁ బడుఁ బనులు

చ. 1: ఆమనికాలము డొల్లే ఆయాలు పైపైనున్నవి
చేముట్టి సరసాలేలే చెల్లఁబో నీకు
గామిడివాఁడాతఁడు కప్పురపుమోవి నీది
వేమారు మాటాడఁబోతే వెల్లవిరౌఁబనులు

చ. 2: సిగ్గులకాలము దొల్లే చెక్కులు చేతనున్నవి
దగ్గరియాకతాలేలే తరుణి నీకు
బగ్గడికాఁడాతఁడ పంతకత్తెవు నీవైతే
వెగ్గళించఁ జూచితేను వింతదోఁచుఁ బనులు

చ. 3: ముచ్చటకాలము దొల్లే మోహము లోననున్నది
పచ్చిదేర నవ్వనేలే పదరి నీకు
యిచ్చట శ్రీ వెంకటేశుఁడీతఁడిట్టె నిన్నుఁగూడె
యెచ్చరికె లేకుంటే యేమౌనో పనులు

రేకు: 0199-3 పాడి సంపుటం: 07-587

పల్లవి: రమణులము నేమింత రవ్వకోపేమా
చెమరించీని మొకము చేరి విసరినాను

చ. 1: మచ్చిక మీఁదఁ గల మగువలకెల్లాను
యిచ్చకమే సేయవలె నెక్కడా నీకు
యెచ్చుకుందులైన మాటలేమీనాడఁగరాదు
పచ్చిదేరీని పనులు భావించి చూచినను

చ. 2: పెట్టిన శాసల నీ ప్రియురాండ్రెల్లాను
గుట్టుతోడనుండవలెఁ గోరి నీవద్ద
చిట్టకాలు సేయరాదు చింతతోనుండఁగరాదు
వొట్టుకొనె వానలెల్లా వొరసిచూచినను

చ. 3: కూడిన నీకూటములకోమలులకెల్లాను
తోడునీడై యుండవలె తొరలి నీకు
జాడతో నన్నుఁగూడితి సాదించరాదు నిన్ను
వోడక శ్రీ వెంకటేశ వొద్దికైతివిపుడు

రేకు: 0199-4 ఆహిరి సంపుటం: 07-588

పల్లవి: ఈయెడనేమిసేసినా నేమనే నీచిత్తము
కాయకపుఁ జేఁతలెల్లఁ గప్పు వచ్చేనా

చ. 1: యెగసక్యాలకు నీవు యేమని పొగడినాను
జగడాలకు వచ్చేనా సారె నీతోను
తగవులు దప్పి నీవు తమకించి మొక్కి తేను
తెగడి నిన్నిఁక వేరే తిట్టవచ్చేనా

చ. 2: నాటకాలనూరకే నవ్వులెంత నవ్వినాను
ఆటకానఁ గన్నుల నిన్నదలించేనా
జూటరితనాల నన్ను సుద్దులెన్నియడిగినా
మాటలు వెలుచుకొని మచ్చరించేనా

చ. 3: వేసాలకు నీవెంత వేడుకఁ గాఁగలించినా
ఆసపడి నిన్ను నేను ఆయాలంటేనా
రాసికెక్క శ్రీ వెంకటరమణ నన్నుఁ గూడితి
బాసదప్పెనంటా నిన్నుఁ బచ్చిసేసేనా

రేకు: 0199-5 నాదరామక్రియ సంపుటం: 07-589

పల్లవి: ఎచ్చరిక మఱవకు మిన్నిటానమ్మ
విచ్చనవిడాయ నీకు వేడుకలమ్మా

చ. 1: మితిమీరి సోబనాలమీఁద నీవు నడవఁగ
నతఁడు కైలాగిచ్చీ నదిగోవమ్మా
రతిసేసి అలసిన రమణివి తొలుతనే
చతురునికిని నీకు జతనమమ్మ

చ. 2: మేడయెక్కి అలసి నీమేను చెమరించఁగాను
ఆడ సురటి విసరీ నదిగోవమ్మా
వాడుదేరె వదనము వనితవందుకుఁ దోడు
యీడుజోడయ్యీనది మీకు నెడపరాకమ్మ

చ. 3: చప్పరమాళిగెలోన సరిఁ బవళించే నీకు
నప్పుడే తాఁ దొడచాఁచీ నదిగోవమ్మా
కప్పి శ్రీ వెంకటేశుఁడు కలసె నివ్వెరగైతి
రెప్పుడు మరవకుఁడీయెన్నికలోయమ్మా

రేకు: 0199-6 రామక్రియ సంపుటం: 07-590

పల్లవి: మేలు మేలు రాఁగా రాఁగా మేటివైతివి
వాలుఁజూపులఁ జూచితే వచ్చెఁగా పని

చ. 1: చెంతనాతఁడు నీచెలిసేవలకు మెచ్చితేను
యింతమాట యెంతసేసేవిదిగో నీవు
సంతతమునాపె గన సరసములాడితేను
వంతులకు నీచెత వచ్చెఁగా పని

చ. 2: నీవు పిలువనంపిన నెలఁతకు సొమ్ములిచ్చే
యీవిలోనే వావిగట్టేవిదిగో నీవు
కావలెననుచు నాపె కాఁగిలించుకొంటే గన
వావాత నీచేతనే వచ్చెఁగా పని

చ. 3: పాదాలొత్తే పడఁతిపై పచ్చడముకొంగువడె
నాదరించి కూడెననేవంతలో నీవు
యీదెస శ్రీ వెంకటేశుఁడెనని నిన్నిఁక నాపె
వాదొద్దని మొక్కించెను వచ్చెఁగా పని

రేకు: 0200-1 మంగళకౌశిక సంపుటం: 07-591

పల్లవి: ఏల నీవు దాఁచేవు యింతలో మాకు
తాలిమినిలుచునందు తగులములున్నవి

చ. 1: అంచల మూఁకలలోనున్న అతివపై నీవు గొంత
ముంచిన నవ్వులలోన మోహమున్నది
తుంచి తుంచి తామెరల తూండ్లు నీవు వేయఁగ
వంచిన యాపెచూపుల వలపులునున్నవి

చ. 2: ఆసపడి నీవిప్పుడు అండనుండి యేమేమో
సేసిన చేఁతలలోన సిగ్గులున్నవి
సేసవెట్టి పువ్వులను చిమ్మిరేఁగ నన్నులను
వాసిన యాపెవ్రాలలో వాడికెల్లానున్నది

చ. 3: తోడనె శ్రీ వెంకటేశ దొరసి మీరిద్దరును
కూడిన కూటమిలోన గురులున్నవి
వాడుదేర నేఁడాపె వంకలొత్తి నీచేతికి
వీడెమిచ్చినందులోనే వేడుకెల్లానున్నది

రేకు: 0200-2 శుద్ధవసంతం సంపుటం: 07-592

పల్లవి: ఊరకున్నవారితోడ నూరెల్లానోపునటే
వోరపోరల తోడను వూరకున్నఁ జాలదా

చ. 1: చెలిమి సేసినచోట సిగ్గులనెగ్గులూలేవు
అలుగఁగఁ దగునటే ఆతనితోను
పెలుచమాటలుగదే బెట్టికోపాలురేఁచీని
వొలిసి మోనముతోడ వూరకున్నఁ జాలదా

చ. 2: చనవులిచ్చినచోట సాదించఁబనిలేదు
పెనఁగి వేసరింతురా ప్రియునినింత
చెనకులింతే కదే జిగిరేసు వుట్టించు
వొనర నవ్వులు నవ్వి వూరకున్నఁ జాలదా

చ. 3: గక్కనఁ గూడినచోట కాఁతాళించ మరివొద్దు
కక్కసములేలే శ్రీ వేంకటపతితో
వొక్కటైనదిందే కదే వొగి మందెమేళమాయ
వుక్కుమీరి లోలోఁజొక్కి వూరకున్నఁ జాలదా

రేకు: 0200-3 బౌళి సంపుటం: 07-593

పల్లవి: మానరే ఆతనినేల మండాడేరు
కానుక మామొక్కులివి కడ్డాయము గాదు

చ. 1: తనకే సెలవయ్యిన తరుణి నేను
వనితలు పెక్కుగలవాఁడాతఁడు
యెనసిన మాపొందులేడకునేడ
మొనసి నేఁజేసే బత్తి మొగచాటే కాదా

చ. 2: వొక్కచో తానే గతై వుండుదు నేను
పెక్కుచోట్ల మెట్టేటి ప్రియుఁడాతఁడు
మక్కళించి మామాటలు మరియింకానా
వుక్కుమీరితే వలపు వుంగిటే కాదా

చ. 3: కందువఁ దన్నుఁ గూడిన కాంతను నేను
యిందరిలో శ్రీ వేంకటేశుఁడాతఁడు
ముందు వెనకల మేలు మోపులాయను
విందుమీఁద విందులైతే వెగటులే కావా

రేకు: 0200-4 ఆహిరి సంపుటం: 07-594

పల్లవి: ఎక్కడికెక్కడి ఆస యేమి సేసేనే
యిక్కడ నాతో నవ్వే నిది యంత చాలదా

చ. 1: కాయమంటిన నన్నునేలే కాఁగలించవలెనా
చాయల నన్నుఁ జూచినచాలదా యింత
మాయల వలపులేల మాపుదాఁకా జోలియాల
వేయిటికొక్కటే నన్ను విడువఁడు చాలదా

చ. 2: వొంటినున్న నన్నుఁజేరి వొడియంటవలెనా
జంటయై మాటలాడినఁ జాలదా యింత
పెంటల సరసమేల బేసబెల్లితనమేల
తొంటిపొందే వొకలక్ష తోయలేఁడు చాలదా

చ. 3: పలుమారు నాకునింత బాససేయవలెనా
అలపు దీరఁగఁ గూడెనంత చాలదా
చెలఁగి శ్రీ వెంకటేశుచేఁతలఁ బడఁగనేల
పలికినదే పంతము పచ్చిసేసెఁ జాలదా

రేకు: 0200-5 తెలుఁగుకాంబోది సంపుటం: 07-595

పల్లవి: అదె తాఁదానే కదవే అంగన వీఁడు
వెదకి యెందు చూచిన వీఁడేవాఁడు

చ. 1: కలలో వచ్చినవాఁడు కప్పురమిచ్చినవాఁడు
చెలఁగేటి పురముపై చెలియవాఁడు
తెలిసి మేలుకొంటేను దేవరవలెనున్నాఁడు
వెలుపలఁ దానె య్యై వీఁడేవాఁడు

చ. 2: నిక్కిచూచినట్టివాఁడు నిన్నటిమొన్నటివాఁడు
తక్కక తులసిపెద్దదండలవాఁడు
పక్కనఁ బేరుకొంటేను పలికీ నిప్పుడే వీఁడు
వెక్కసపు నవ్వులతో వీఁడేవాఁడు

చ. 3: అడుగనంపినవాఁడు ఆయములంటినవాఁడు
కడలేని శ్రీ వెంకటప్పవాఁడు
అడియాలముగఁ గూడెనంతలోనిప్పుడు వీఁడు
విడువని మహిమల వీఁడేవాఁడు

రేకు: 0200-6 ముఖారి సంపుటం: 07-596

పల్లవి: నాకుఁ దెలియదు నీనాటకములు
దాకొంటి విప్పుడెందలివాఁడవో

చ. 1: నగవు నాతోఁగొంత నవ్వుతానే ఆవలఁ
బగటు మరియుఁగొంత పచరింతువు
మొగిచి నీమనసు యిరుమొనసూదియ్యైయిపుడు
తగిలీని నీవు యెందలివాఁడవో

చ. 2: పలుకులొకకొన్ని నాపైఁ జల్లుతా నవల
వలపులొకకొన్ని నివ్వటిలింతువు
తొలఁగకిటు రెండుచేతుల వెలంకాయలై
తళుకొత్తెఁ జేఁతలెందలివాఁడవో

చ. 3: యిప్పుడిన్నిట నన్నునెనసి యెమ్మెలు నవల
చెప్పికొన్నిట నన్నుఁ జింతింతువు
చిప్పి లుచునిందుకే శ్రీ వెంకటేశ్వరుఁడ
దప్పిదేరెదవు యెందలివాఁడవో